# కాలచక్రము

రచయిత:

కవిశేఖర, భోగరాజు నారాయణమూర్తిగారు.



వాణీ గ్రంథమండలి,

రాజమహేంద్రవరము.

శ్రీ జి. వరదరావుగారు
మోడరన్ హిందూహోటల్. రాజమండ్రి

శ్రీ జిల్లా సుబ్బారావుగారు
ప్రొప్రయిటర్ వెల్‌కం హోటలు. (మునిసిపల్ కవున్సలర్)

శ్రీ డాక్టర్ కోరుకొండ బుచ్చిరాజుగారు
ఎం. బి. బి. యస్; రాజమండ్రి

శ్రీ నూలు నాగేశ్వరరావుగారు
రాజమండ్రి

శ్రీ బచ్చు శ్రీ రామచంద్రమూర్తి అండ్, బ్రదర్సువారి
వడ్డెగూడెం

శ్రీ కోరంగి వీర్రాజుగారు
మర్చంటు; రాజమండ్రి

శ్రీ గోకవరపు వెంకట సోమరాజుగారు
మర్చంటు, రాజమండ్రి

శ్రీ వత్సవాయి తిరుపతిరాజుగారు
కాట్రావులపల్లి

శ్రీ బాలనాగు రామ్మోహనరావు అండ్, బ్రదర్సువారు
జనరల్ మర్చంట్సు, రాజమండ్రి

శ్రీ వి. యన్. మూర్తిగారు
యినస్పెక్టరు ఎంపైర్ ఆవ్ యిండియా లైఫినూ్సరెన్సు కంపెనీ

శ్రీ నాళంరాజారావుగారు
బ్యాంకర్సు, రాజమండ్రి

శ్రీ గోనుగుంట్ల అంకారావుగారు
మర్చంటు వినుకొండ

శ్రీ పబ్బిశెట్టి లక్ష్మన్నారాయణ అండ్ పరుచూరు వెంకటేశ్వర్లుగార్లు
కాయిదావ ర్తకం రాజమండ్రి

# కాలచక్రము

రచయిత:

కవిశేఖర, భోగరాజు నారాయణమూర్తి గారు.



వాణీగ్రంథమండలి,

రాజమహేంద్రవరము.

రెండున్నర రూపాయలు

# పీ ఠి క.

కీ॥ శే॥ భోగరాజు నారాయణమూర్తిగారి పద్య గద్య కావ్యములు ఆంధ్రులు చదివి ఆనందించినది మనకు మరపురాని విషయం. వారి 'విమలాదేవి' ప్రచురింపబడినవెంటనే వారియొక్క రచనామాధుర్యము ఆంధ్రులు రుచిచూడగలిగిరి. తరువాత వారు రచించిన గ్రంథములు 'కవితాకల్పలతా' గ్రంథమాల ప్రచురణ ములలో హెచ్చుగా నేను ప్రకటించితిని. 'కాలచక్రము' కూడ ప్రచురింపనెంచితిని, గాని రాజకీయములలో హెచ్చుకాలము నేను గడుపుచుండుటచేత మిత్రులు శ్రీధనరాజుగారు కోరినందున వారు ప్రచురించుటకు నేను అంగీకరించి వారికి నాకుగల సర్వహక్కుల పొందునటుల చేసితిని. శ్రీనారాయణమూర్తిగారి గ్రంథముల గురించి వేరుగ వ్రాయనవసరములేదు. ఆంధ్రలోకమునకు శ్రీ నారాయణమూర్తిగారిగ్రంథము మరియొకటి అందజేయగలభాగ్యము మాకు కలిగినదని సంతసించు చున్నాము. వారి గ్రంథములకు పూర్వము ఎటువంటి ఆదరము చూపితిరో అట్టిఆదరము ఈగ్రంథ మునకుకూడ చూపవలసినదని ఆంధ్రసోదర సోదరీమణులకు విన్న వించుచున్నాను.

విజయనగరం,
18—5—49.

పసుమర్తి వీరభద్రస్వామి.

# ఉపోద్ఘాతము.

"అహరహ మస్మదీయహృద యాంచిత కాంచనపీఠిపై శుభా
వహమగు త్వన్నిజాకృతిని భద్రముగా నెలకొల్పి భక్తిమై
బహుగతులన్ నుతింతు నెడఁబాయక న న్గరుణించి భారతీ
తుహినకరాననా! యెటుల దోడ్పడెదో నవకావ్యకల్పనన్."

1. నేటి యాంధ్రులజీవితము నందలి యార్థిక, సాంఘిక, రాజకీయాది వివిధవిశేషములను సూచించుటకే కథ కల్పింపఁబడినది.

2. ఇందలి యితివృత్త మాద్యంతము స్వతంత్రముగఁ గల్పింపఁబడినదియేగాని యొక గ్రంథమున కనువాదముగాని భాషాంతరీకరణముగాని కాదు.

3. ఈ నవలయందు గ్రంథకర్త భాష కేవలము గ్రాంథికము. సంభాషణలయందుమాత్రము స్వభావసిద్ధముగ నుండుటకుఁ బాత్రోచితముగా వ్యవహారభాష యుపయోగింపబడినది.

4. వాడుకలో మామ—ఏమిటి—సోమన్న—మున్నగు శబ్దములయందలి మకారము కేవలము 'మ' కారముగాఁగాక—మకారవకారములకు మధ్యగా నుచ్చరింపఁబడును గావున, నట్టి యుచ్చారణ సూచించుటకై యట్టిపదములు. మాఁవ—ఏఁవిటి సోఁవన్న—యని వ్రాయబడినవి.

ఇట్లు,
గ్రంథకర్త

శ్రీ

# కాలచక్రము

## మొదటి ప్రకరణము

### ఐకెన్ విన్ దీ గేమ్



శ్రీనివాసవిలాస్ కాఫీక్లబ్బులోఁ గూర్చుండి లక్ష్మీకాంతము తన మిత్రుఁడైన వసంతరావుతో నుపాహారములు పుచ్చుకొనుచు సంభాషించుచుండెను. అది యుదయము వేళ యగుటచే నా కాఫీ దేవాలయము తద్భక్తులతో మిక్కిలి క్రిక్కిఱిసియుండెను. విజయనగర మహాబాలగోపాలమును బ్రణతార్థయ్యారుదోసెలకుదోసిలియొగ్గుచుందురు. ఉదయ మాఱుగంటలనుండియు దుకాణదారులు నొంటెద్దుబండ్లవాండ్రు, విద్యార్థులు, నుపాధ్యాయులు, గుమస్తాలు మున్నగువారా క్లబ్బు నలంకరించుచుందురు. దేవలోకమునుండి భూలోకమునకు గంగా ప్రవాహమును బ్రవహింపఁ జేసిన భగీరథునివంటి యయ్యరు లనేకులు నడుముకట్టి పనిచేసినంగాని పెక్కువందలమైళ్ళ దూరముననున్న చెన్నపట్టణమున విఖ్యాతిగాంచిన కాఫీపానీయ మాంధ్ర దేశమునకుఁ బ్రవహింప లేకపోయినది. ఇప్పుడూరూర, నింటింట 'నిందుఁగలఁ డందు లేఁడను సందేహమువల' దనునట్లు విశ్వరూపమును దాల్చి కాఫీదేవత యాంధ్రులను గృతార్థులను జేయుచున్నది.

కాఫీ యలవాటులేనివాఁ డీనాడు నాగరకుఁడే కాఁడు. ఎవ్వరును జూడకుండ నింటఁద్రాగువానికంటె కాఫీక్లబ్బునకువచ్చి పుచ్చుకొనువాఁ డెక్కుడు నాగరికుఁడు. ముస్తాబులైన చిన్నపిల్లలంగూడ వెంటఁగొనివచ్చువాఁడు నాగరికాగ్రగణ్యుడు. ఇట్లు తండ్రులమూలమునఁ బిల్లలకుఁ బిల్లలమూలమునఁ దల్లులకుఁ దల్లులమూలమున నింటియందలి తక్కిన స్త్రీలకును కాఫీవ్యసన మలవడి, రోగము దుర్భలులంబోలె, సామాన్య సంసారులఁ బీల్చి పిప్పిచేయుచున్నది. నెలకుఁ బదునైదు రూకల వేతనముగల యల్పోద్యోగుల యిండ్లయందు గూడ నుదయమగుసరికి కాఫీనీరు సలసలఁ గ్రాగుచున్నది. దినమంతయుఁగష్టపడి, యాఱణా లార్జించిన కూలివాఁడుఁగూడ, నర్ధణా యిచ్చి యరకప్పెడు కాఫీత్రాగియే తన పల్లెకుఁ బోవుచున్నాడు.. కాఫీ కషాయమునందిట్టి యపూర్వాకర్షణ శక్తియున్నప్పుడు విజయనగరములోని కాఫీ మహాలయ స్థాపనాచార్యుఁడగు ప్రణతార్థయ్యరు నలువదివేలు సంపాదించెనని పుట్టిన వదంతి యసత్యమై యుండదు.

పట్టణమునకు నట్టనడుమ నడిబజారులో నయ్యరుక్లబ్బుపెట్టిన యిల్లు మహాభవనముగాక పోయినను మూఁడు నాలుగు కుటుంబములకు స్వేచ్ఛగా నివసించుటకుఁ దగినంత విశాలమైనది. అది సంతపేట యగుటయేగాక, యా యింటికిఁగల సముద్రమువంటి పెద్దచావడియు, నా చావడి కిరువైపులంగల విశాలమైన గదులు నయ్యరు నాకర్షించి నెలకు డెబ్బది రూపాయిలద్దె యిచ్చుటకుఁ బ్రోత్సహించినవి. ఆ చావడిలో నేఁబదిమంది కూర్చుండుటకుఁ దగినవసతి కలదు. చావడియందును దాని కిరువంకలంగల గదులయందునుగూడఁ దెల్లని నెలరాల పలక లమర్పఁబడిన బల్లలువరుసగా వేయఁబడినవి. వానిలో నొక్కొక్క బల్లకడఁ జేతులులేని గుండ్రనియినుపతీవ కుర్చీలు నాలు

జేసి కలవు. వీధిలోనివారి కగపడునట్లు వీధిద్వారమున కెదురుగ నాచావడిలో నెత్తైనయద్దాల టేకుబీరువాయును దానికిరువంకల బంగరురంగు చిత్రములుగల నిలువుటద్దములు నమర్చఁబడినవి. ఆ బీరువాయందొక పళ్లెరమున దేవాలయ గోపురాకారముగఁ బేర్చఁబడిన లాడూయుండలును, మఱియొక పళ్లెరమున సోపానక్రమమునఁ బేర్చిన మైసూరుపాకు ముక్కలును, మఱికొన్ని పళ్లెరములయందు మఱికొన్ని యుపాహార పదార్థములును, జిహ్వాచాపల్యముగల చూపరుల నిత్యము నాహ్వానించు చుండును.

బీరువాకుఁ జేరువగాఁగల మేజాబల్లముందు, మెత్తని దిండుగల బెత్తుకుర్చీయందు, నల్లనిస్థూలకాయుఁడును లంబోదరుఁడునునగు నయ్యరు, నిండారఁగట్టిన గుండారుపై నొక్కబనియను మాత్రమే తొడిగి, కన్నుల సులోచనములతోడను నుదుట విభూతిరేఖలతోడను, సుఖాసీనుండై, సంపూర్ణశుద్ధిలేని యుచ్ఛిష్ట పాత్రలతో కాఫీయను మధురపానీయమును విక్రయించుచుఁ దన్నిమిత్తమున గుమిగూడుచుండు వందలకొలఁది జనులలో నంటురోగములకు గొప్ప ప్రచారకుఁ డగుచుండును. నిత్యము విరామములేకుండ నానాజాతుల మూతులయందును జరించుచుండు నచ్చటి కాఫీపాత్రలయందలి కాఫీ జిడ్డు, పాపకర్మల విడువని పాపఫలమువలెఁ దత్పాత్రల నంటియే యుండును. ముఖరోగములు హృదయరోగములు చర్మవ్యాధులు మున్నగు జాడ్యములుగలవారి మేని దుర్వాసనలు చెంతనున్నవారికి సోకి రోతపుట్టింపకుండ నయ్యరు గంట గంటకుఁ బట్టె డగరువత్తులు ముట్టించి యా చావడి యంతయుఁ బరిమళింపఁ జేయుచుండును. ఒకబల్లకడ జూదగాండ్ర చతుర్ముఖ పురాణ ప్రసంగములు, నొకబల్లకడ విటుల వేశ్యావాటికా ప్రసంగములు, నొకబల్లకడ వర్తకుల వ్యవహార ప్రసంగములు, నొకబల్లకడ ప్లీడరుగుమస్తాల వ్యాజ్యప్ర

సంగములు, నొకబల్లకడ విద్యార్థుల నిజోపాధ్యాయబోధనా తార తమ్య ప్రసంగిములును మిన్నుముట్టుచుండ నయ్యరు కాఫీక్లబ్బునిత్య మును బర్వదినమునాటి మహాసముద్రమువలె ఘూర్ణిల్లుచుండును. మిక్కిలి చురుకుఁదనముతోఁ బనిచేయుచుండిన యరవబాలురు దోసెలు నిడ్లెనలు కాఫీ మున్నగువానిని వచ్చినవారికెల్ల వలసినట్లు చకచక నందిచ్చుచు, "ఒరణా— ఒంద్రణా— రెండణా" అని గంభీ రధ్వనులతో, భోక్తలు చెల్లింపవలసిన డబ్బులవివరము లయ్యరున కెఱింగించుచుండ, వారాడబ్బులను నిర్లక్ష్యముగా నయ్యరుముందు మేజా బల్లపైఁ బార వేసి, మీసాల కంటుకొనిన కాఫీయందలి పాల తునకలను నిలువుటద్దములోఁజూచి తుడుచుకొనుచుఁ, బ్రేవని తేన్చుచు చుట్టో సిగరెట్టో ముట్టించి తమ దారినేగుచుందురు.

వచ్చిన వారెవ్వరును దమకుఁగావలసిన పదార్థముల నయ్య రునడుగవలసిన యవసరములేదు. ఆ చావడిలోఁ గాలుపెట్టుటయే తడవుగ నచ్చటిబాలురు రేచుకుక్కలవలె మీఁదఁబడి, "దోసే— ఇడ్లీ— ఉప్మా— పెసరట్— పూరీ— పొటెటో— కాఫీ— కోకో—టీ—" అని ఘంటాపథముగా నేకరువుపెట్టుచుందురు. అందుచే భోక్తలు చెల్లించు డబ్బులు పుచ్చుకొనుచుండుటతప్ప సాధారణముగ నయ్యరి కెవ్వరితోడను మాటాడవలసిన యవసరముండదు. ధూమపత్ర చర్వణముచే నోరంతయు నిష్ఠీవనపూరిత మైయుండుటచేఁ దఱచుగా మాటాడుచుండుటకు వానికవకాశముకూడలేదు. స్యానిటరీ యిన్స్పె క్టర్లు వచ్చినప్పుడుమాత్ర మయ్యరు సులోచనములనుండి వెడలు చూపులతోడను, ముఖవికాసముతోడను, హస్తాభినయముతోడను గౌరవించి, నోటనున్న నిష్ఠీవనమును బ్రక్కనున్న పీక్దానాపాత్ర మున బుడుంగున నుమిసి, "గణేశా! ఒణ్ణు దోశాముర గల్" అనఁగా

బాగా కాలిన యొక దోసె తెమ్మని స్వయముగనే యాజ్ఞాపించు చుండును.

లక్ష్మీకాంతము తనమిత్రుఁడైన వసంతరావుతో సంభాషించు చుండిన యానాటి యుదయమునమాత్ర మా కాఫీక్లబ్బులో నన్ని వైపులయందును "మ్యునిసిపల్ కౌన్సిలర్‌వోట్సు" ప్రసంగములే తఱచుగా జరుగుచుండెను. పురపారిశుద్ధ్యసంఘ సభ్యత్వమునకై యభ్యర్థులై నిలిచినవారిలో నెవ్వరు గెలుపొందెదరో యెవ్వరోడ్పోదురో యనుచర్చలు తీవ్రముగా సాగుచుండెను. ఆ వోట్లసంభాషణమును వినుటయందు లక్ష్మీకాంత వసంతరావులకుమాత్రము లేశము నుత్సాహము లేదు. ఆయాప్తమిత్రులిరువురుఁ దమలోఁదాము ప్రసంగించుకొనుటయందే యత్యాతురులై యుండిరి. "నీవోటెవరిది వసంతం?" అని నడుమ నడుమ తన్నడుగుచుండిన వారితో వసంతరావు "నావోటెవరికో నేనింకా నిశ్చయించుకోలేదు. అప్పటికి నేనుచెన్నపట్టంలోనే వుంటానేమో" అని ప్రత్యుత్తర మిచ్చుచుండెను. వారు వచ్చుసరికా చావడియంతయు జనసమ్మర్దముచేఁ గిటకిటలాడుచు నెంగిలాకులతోడను నెంగిలి ప్లేట్లతోడను, గోట్లకొలఁది జుమ్మని మూగుచుండిన యీగలతోడను భీభత్సరసభూయిష్ఠమై యుండుటచే వారుకుడివైపునన్న గదిలోఁ బ్రవేశించి యందొక బల్లముందు సుఖాసీనులై ప్రసంగించుకొనుచుండిరి.

"కాంతం! ఇంతప్రయత్నంచేసినా వుద్యోగం దొరక్కపోవడం వింతగా వుఁదోయ్! చెన్నపట్టంలో ఈ మూడునెల్లూ ప్రతిరోజూ నీలెటరుకోసంచూస్తూ వుండేవాణ్ణి. ఇంతకూ రోజులుకలిసిరాలేదు."
"నరసయ్యసెట్టి పదిరోజులు తిప్పి వేరుసెనగధర తగ్గిపోయిందని పొమ్మన్నాడు. అతనికొడుకు కనకరాజు తానుంచుకొన్న వేశ్యకు

ఇంగ్లీషుచెప్తే నెలకైదు రూపాయిలిస్తానన్నాడు కాని యీ వుద్యోగానికి మీయింట్లోకాని మాయింట్లోకాని యెవరూయిష్టపడ లేదు''

''హుజూరాఫీసు మేనేజరు యాజులుపంతుల్ని చూశావా?''

''చూశాను. చూసి యవస్థంతా చెప్పుకుంటే సావకాశంగా విన్నాడు. ఆ సిండంచేత యేదేనా వుద్యోగం యిస్తాడనే అనుకున్నాను కాని, అంతావిని నిట్టూర్పువిడిచి ''నీదేశాఖ''ని అడిగేడు. నియోగినని చెప్పాను. చెప్పీచెప్పడంలో మొహం చిట్లించుకొని ''వున్న వుద్యోగాలే వుంటాయో వూడుతాయోఅన్న అవస్థలో నీకిప్పుడు కొత్త వుద్యోగం యెవరిస్తారని చప్పునలేచి గదిలోకి వెళిపోయాడు.''

''ఔను. ఇదో యపూర్వ జాడ్యం కొత్తగా మనప్రాంతం ప్రవేశించింది.''

''పిమ్మట—శిరస్థదారు మనవాడేకదా అని అతణ్ణికూడా చూశాను. వుద్యోగాలు కావలసినవాళ్లు అతనిభార్య ద్వారాప్రయత్నించాలన్నసంగతి నాకు తెలిసిందికాదు. భార్యాద్వారా కొంత ముడుపుచెల్లించాలన్న రహస్యం తెలియగానే యాప్రయత్నం విడిచి, నాయుడు తన డిపోలో వోగుమస్తాని వేసుకుంటాడని గంటస్తంభం దగ్గిరవిని, అతణ్ణిచూసేసరికి ''బాపనోడి కుద్దేగం యేటయ్యా యెల్లెల్లు'' ని కసిరేశాడు.''

వసంతరావు మాఊపలుకక పెదవికడ నుంచుకొనిన కాఫీపాత్ర యక్లేయుంచి ఔప్ప వేయక యేమో యాలోచించుచు,

''కాంతం! భ్రమరానికి వివాహమని విన్నాను. అదెప్పుడు?''

''ఇవాళ మధ్యాహ్నం మూడుగంటలకి నిశ్చయ తాంబూలాలు పుచ్చుకోడానికి యేర్పాటు జరిగింది. వసంతం! ఉద్యోగం దొరకక—దినం గడవక—దినందీర్ఘాయువై వుంటూన్న మాదురవస్థకు

తోడు మాయింట వివాహంకూడా తటస్థించింది. పెత్తనమంతా మాతల్లిది మాఅన్నగారిది. మా మేనత్త ఉభయఖర్చులూపెట్టి పెళ్ళిచేస్తారు. ఒక మేనత్త కొడుక్కి భ్రమరాన్నిస్తే మరోమేనత్త కూతుర్ని నాకివ్వడాని కేర్పాటు. ఈసంబంధం నాకుకాని భ్రమరానికికానీ యెంతమాత్రం యిష్టంలేదు. అయినా యీదరిద్ర సంసారంలో భ్రమరం పడుతూవున్న బాధలుచూడలేక, కడుపునిండా ఇంతన్నం తిని బతుకుతుందన్న ఆశచేమాత్రం యీవివాహాని కిష్టపడవలసివచ్చింది."

"అయితే యీనిశ్చయతాంబూలాలు తప్పించడానికివీల్లేదా?"

"బ్రహ్మకూడా తప్పించలేరు. ఈవిషయంలో మాతల్లీ మాఅన్నగారూ మామేనత్తలు అంతా యేకీభవించారు. మాటవరసకేనా నాతోఆలోచించలేదు సరికదా యీడువచ్చినపిల్ల భ్రమరాన్నికూడా అడగలేదు. ఇప్పుడేకాదు. మొదటినుండీ ఆజట్టంతా వోకటి. నేనూ భ్రమరం వోకటి."

"కాంతం! నిశ్చయ తాంబూలం యిచ్చినంతమాత్రాన్ని పెళ్ళికావాలని శాస్త్రంలేదు. పీటలమీద పెళ్ళిళ్లుకూడా తప్పిపోతున్నాయి. అదాలావుంచి నామాటవిను. ఈవాళ నువ్వుతప్పకుండా వోపిటిషన్ రాసి బాబుగారి దర్శనానికి వెళ్లాలి. తనకి వోటివ్వడానికి రావలసిందని నాకు వారంరోజులుకిందటే చెన్నపట్టంరాశాడు. నిన్న మెయిలు దిగేసరికే ప్లాటుఫారంమీద కనబడ్డాడు. ఇద్దరం కొంతసేపు ప్రసంగించాం—"

"వోట్లను గూర్చేనా?"

"ఔను. పెద్దపట్టుతలతో ప్రయత్నిస్తున్నాట్ట! ఎన్నివేలేనా ఖర్చుపెట్టడానికే నిశ్చయం చేశాట్ట? అసందర్భంలో నీగురించి మాటాడేను. నాచేతిలో నాలుగైదు వోట్లున్నాయన్న సంగతి అతనికి తెలుసును. అందుచేత నువ్వు దరఖాస్తుపట్టుకొని వెళ్లు."

"పిటిషను తెనుగుతో రాసీదా? ఇంగ్లీషులో రాసీదా?"

"ఇంగ్లీషు రాకపోయినా ఇంగ్లీషు మాటాడ్డం అతనికిచాలా సరదా అందుచేత— ఇంగ్లీషుతోరాసి పట్టుకెళ్లు. కాని మఱోమాట. పిటిషన్ నిచ్చి కష్టసుఖాలు చెప్పుకొనేటప్పుడుమాత్రం నువ్వు పొరపాటుతోనైనా "మీరు" అన్నమాట వుపయోగించకూడదు—"

"మరేమి టనాలి?"

"ఎంతసేపు మాటాడినా శ్రీవారు— బాబుగారు—"

"బాగుంది. అలాగే మాటాడతాను కాని యీ వోట్ల వసరం తీరిపోయిన తరువాత పొమ్మండుకద?"

"అప్పటిమాట చూసుకుందాం. మొదట ప్రవేశంజరగనీ. ఒకవేళ అతడు కౌన్సిలరుగా స్టేండయితే యింతవాడి వంతవాడివని పొగుడుతూ నాలుగు పద్యాలు తగిలించు. పొంగిపోతాడు. స్తోత్రప్రియుడు— డాంబికుడు—"

"అలాగా? దెన్ ఐ కేన్ విన్ దీగేమ్.



# 2 వ ప్రకరణము

## " సంశయంలేదు. "



లక్ష్మీకాంత వసంతరావులు కాఫీ మండపము నిర్గమించి వెలుపలికి వచ్చిరి. చీరయుఁ జాపును గొని పెమ్మని తన మేనత్త తన చేతికిఁ బదిరూపాయిలిచ్చెననియుఁ దాను బజారుపైపు పోవలసియున్నదనియు లక్ష్మీకాంతము చెప్పఁగా వసంతరావు తనజేబులోనున్న మూఁడు రూపాయలను దీసి వాని కిచ్చి యిట్లనియె.

"కాంతం! స్వరాజ్యం తనకో ఫౌంటెన్ పెన్ కొని పెమ్మని నాకు వ్రాసింది. నేను మరచిపోయాను. మరచిపోయానంటే దెబ్బలాడుతుంది. నీ వో పెన్ కొని రహస్యంగా తెచ్చిపెట్టు.

"అలాగే తెస్తాను కాని నిన్నసాయంకాలం నువ్వు మెయిలు దిగినప్పటినుండీ అడుగుదా మనుకొని మరిచిపోతున్నాను. ఇప్పుడు స్వరాజ్యంఅంటే జ్ఞాపకంవచ్చింది. మనసోమశేఖర ప్రవృత్తి అలాగే వుందా? ఏమేనా మార్గంలోకి వచ్చిందా?"

"వాఁడు వట్టి నిర్భాగ్యుడు. మళ్లా పెళ్లిచేసుకునే ప్రయత్నంలో వున్నాడు. ఇహమీద వాడాశ విడిచిపెట్టుకొని, మనకర్తవ్యం మనం చూసుకోవలసిందే. ఈవిషయం మనం సావకాశంగా ఆలోచిద్దాం"

అని లక్ష్మీకాంతమును బజారునకుఁ బోవఁబంచి వసంతరావు తాను గృహాభిముఖుం డయ్యెను. ఆ బజారువీధిదాఁటి దానికిఁ బడమరగానున్న మసీదువీధిలోఁ బ్రవేశించి యావీధికి నడుమనే తూర్పు

వైపుననున్న గోపులసాలవీధిలోఁ బ్రవేశించునెడల నవ్వీధినడుమనే నూఱు గజములదూరములో లక్ష్మీకాంత వసంతరావుల గృహము లున్నవి. గృహాభిముఖుఁడై వచ్చుచుండిన వసంతరావు మసీదువీధి లోఁ బ్రవేశించుసరికి వాని యెడమకన్నదరినది. అది నష్టదాయక మనియెఱింగియుఁ బరధ్యానవిమగ్నుఁడై నడచుచు వసంతరావు లక్ష్యపెట్టలేదు. ఆకాశమున నందందుఁ జిఱుమబ్బులావరించి యొకప్పు డెండయు నొకప్పుడు నీడయుఁ గల్పించుచుండెను. ఆ చిఱుమబ్బులు నేల నడచుచున్న వసంతునితో సమముగా నాతఁడు పోవుచున్నవై పునకే గమనము సాగించుచున్నవి.

ఇట్లు నేలపై వసంతుఁడు నింగిపై మేఘశకలములును గొంత వఱకు సమగమనము సాగించినంతనే "నీ నిదానగమనము మాని వడిగాఁ బోవలసి యున్నది సుమా" యని వసంతునకు సూచించు నట్టులా చిఱుమబ్బులు తమ గమనవేగమును మఱింత యధికము చేసినవి. ఇంతలో నతఁడు మసీదువీధినడుమనున్న తనవీధిముఖమునఁ గాలుపెట్టినంతనే యతనికుడికన్నదరినది. ఎడమకన్నదరుట పాటి సేయని వసంతుఁ డిప్పుడు కుడికన్నదరినంతనే లాభము నాశించెను. ఇది మానవప్రకృతి. శుభము రాఁగోరుటయందు మనసునకుఁ జొరవ మెండు. వామదక్షిణ నేత్రస్పందనముల వలనఁ దనకేదో కీడుగలుగు ననియు నాకీడులోనే మేలుగూడఁ జేకూఱుననియు వసంతుఁ డనుకొనుచుండఁ గోటలో ఘంటావాఁడు ఠంగున నెనిమిది గంటలు కొట్ట నారంభించెను.

ఆగోపుల సాలవీధిలో నతఁడు పదిబారలదూరము నడచుసరికి, వీధికి నట్టనడుమ నొకయింటివద్ద వందలకొలఁది జనులు గుంపులుగాఁగూడి యుండుట వారికంటఁబడినది. ప్రథమ వీక్షణముచేతనే యాగుంపు లక్ష్మీకాంతము గృహముముందరఁగూడియుండి నట్లతఁడు

తెలిసికొని శుభము జరుగనున్న దనుకొనుటకు బదులుగ నశుభమేమైన జరిగెనేమోయని యనుమానించెను. కాని యాజన సముదాయము నకుఁ గారణము పిచ్చిగాంధ్రపు బాటసారి గాని శివాంధ్రపు దాటుటయో కాఁగూడదా యని యంతలోనె మరల సమాధానపడకొనెను. పెల్లయిన మనసున కాందోళనము గలుగఁగనే రక్తము గమనవేగమును హెచ్చించి సమీపించుచుండ నావంకనుండి వినవచ్చు చుండిన కేక లును, గనవచ్చుచుండిన పెఱుఁగులును వానిహృదయమున నొకకంపన ముద యింపఁజేసినవి. విషయమెఱుంగని మహాందోళనముతోడను, గార ణము తెలియని కలవర పాటుతోడను వసంతుఁడా గుంపులోఁ బ్రవేశించెను.

ఇరుగుపొరుగులయరుఁగులమీఁదఁ జంటిపాపలనెత్తుకొని కంట నీరు వెట్టుచుండిన యమ్మలక్కల సంభాషణములలో భ్రమరమను మాట తఱచుగావినవచ్చుచుండుటచే వసంతుఁడు భ్రమరమునకేదో ప్రాణాపాయ మయ్యెనని శంకించుచుండ, గృహాంతర్భాగమునుండి వినవచ్చుచుండిన రోదనధ్వను లాసంశయమును స్థిరపరుపనాగెను. ఇంతలోఁద్రాళ్లు నిచ్చెనలుబట్టి లోనికిఁబరు వెత్తుచుండినవారిని జూచి, భ్రమరము నూతిలోఁబడినదని వసంతుఁడు చప్పునగ్రహించి, గ్రహిం చుటయే తడవుగ నామూఁకం ద్రోసికొనుచు నత్యంతజవంబున లోనికింబరువెత్తెను. చావడియుఁజిన్నవడివాకిలియుఁబెరటిల్లుమున్నగు తద్గృహాంతర్భాగములన్నియు నప్పుడు యాతాయాత జనంబులచేఁ గిటకిటలాడుచుండ, వసంతుఁ డతికష్టముతోఁ ద్రోవచేసికొనుచుఁ దరంగముల కెదురీది సముద్రమున నుఱికినట్లు పెరటిలో నుఱికి నంతనే, పాతికేండ్లవాఁడగు లక్ష్మీకాంతుని యన్నగారు, అక్క డక్కడఁగుట్టిన చిరుగులుగల ప్రాతచొక్కాతోడను, చాకలివాని మొగమేనాఁడు నెఱుఁగని కడుమాసిన కట్టుబట్టతోడను దారిద్ర్య

దేవతకు భక్తురాలై, మూర్తీభవించిన శోకదేవతయుంబోలె గోలుగోలున రోదనము సేయుచు, "వసంతంబాబూ! భ్రమరం వెళిపోతున్నా" దని మరింత యాక్రందనము గావించెను.

పంద్రెండు గజముల నలుచదరమై చుట్టును మండిగోడలు నొకప్రక్క జీర్ణమైన తాటాకుల పాకయు, నట్టనడుమనం దలనూయియుంగల యాపెరటిలోఁగాలిడుట కెడములేకుండ మనుష్యులు నిండియుండిరి. "వొదిలేస్తున్నాది. తాడు వొదిలేస్తున్నాది. నిచ్చెన పట్టుకోకుండా వుంది. దిగాలి! దిగాలి! యెవరేనా సాహసించిదిగాలి!" అను కేకలు కుంఠిత కంఠస్వరముతో వెడలుచు వినువారి గుండెలు బ్రద్దలు సేయుచుండెను. "అంతా అయిపోతే యిహానేం పట్టుకుంటుంది. మరిలాభం లేదు-మరిలాభం లేదు" అను నిరాశోక్తులచ్చటి వారిచే 'రామ! రామ!' యని రామస్మరణ సేయింపసాగెను. లక్ష్మికాంతము తల్లి దుర్భర గర్భశోకమును భరింపలేక నూతిలో నుఱుక నుంకించుచుండఁ గాఁబోవు వియ్యపురాండ్రగు సుమారు నలువదియేఁబదియేండ్ల విధవ లిరువురు సూరమ్మను బట్టుకొని తాటాకు సాలలోఁ గూర్చుండఁబెట్టి యోదార్చుచుండిరి. సూరమ్మ "నీకెక్కడి చావొచ్చిందే తల్లీ! పదమూడేళ్లూ పెంచి నిన్నునూతికప్పగించేశానే కూఁతురా! అమ్మా! అన్నంలేక యీకటికుప్పోషాలు నేను చెయ్యలేనూ నాగతి నేను చూసుకుంటానని నువ్వంటూవుంటే యదేవిటో అనుకున్నానే తల్లీ! యింతసాహసం చేస్తావని తెలిసిందికాదేమామ్మా! అయ్యయ్యో! నీప్రాణంకంటె ప్రాణం-నీదేవుఁడు-నీచిన్నన్నయ్య వేళకింట్లో లేకపోయాఁడే కూతుఁరా! ఆ దిక్కుమాలిన పంచల్చాపులిహానేం చేసుకోమన్నావే మాయమ్మా" అని గుండెలు బాదుకొని పెద్దపెట్టున నేడ్చుచుండెను. దిక్కుమాలిన పంచలచాపులను మాట విన్నంతనే బలాత్కారమరణమునుండి సూరమ్మను వారించుచుండిన

వియ్యపురాండ్రు మొగములు చిట్లించుకొనుచు నామెను విడిచి, యాపాకలోనింకొకప్రక్కఁ దన పిల్లలతోఁగూర్చుండిన యామెకోడలు పేరమ్మకడకుఁ బోయి యామెతో గుసగుసలు మొదలుపెట్టిరి.

ఇట్టి స్థితియందుండిన యాపెరటిలోఁ బ్రవేశించిన వసంతరావున కచ్చటినాదనము లేవియుఁ జెవికెక్కలేదు. పెరటిగుమ్మములోఁగాలిడినంతనే "ఇంకేంపట్టుకుంటుంది? ఇహ లాభంలేదు—ఇహ లాభంలేదు" అనుమాటలు హృదయపుట భేదన మొనర్చుచుండ నతడు నిమిషమాత్రములో నందలనూతిని సమీపించెను. ఆనూతి చుట్టును గుమిగూడి వారిలో ముఖ్లువేసినత్రాళ్లు కొందరును, త్రాళ్లు కట్టిన నిచ్చెనలు కొందరును లోనికి దింపి మీలను వేటాడు జాలరుల వలె నీటివంక నత్యాతురతతోఁజూచుచుండిరేగాని లోనికురుక నెవ్వరును సాహసింపరైరి. అప్పుడానూతిని సమీపించిన వసంతరావొక్కసారి తన మహాసాహస వీక్షణమును నీటివంకఁ బ్రసరింపఁజేసి, నిట్టూర్పులు విడుచుచు, గట్టుబట్ట నెగఁగట్టుకొని, జేబులోనున్న రెండురూపాయిలును గొన్ని చిల్లరడబ్బులును ఘల్లునఁద్రుళ్ళిపడునట్లు చొక్కావిప్పి పారవైచి, చొక్కాలోఁదొడుగుకొనిన యల్లిక బనియను మాత్రమట్లే యుంచుకొని, యుత్తరీయముగాఁదాల్చిన ఖద్దరు తువ్వాలు నడుమునకు బిగియగట్టుకొని, నేలమట్టమునుండి గజమెత్తుననున్న నందపై కెక్కి "శబాసునయ్యా! శబాసునయ్యా! అదీసాహసం! ఎందరుంటేనేం?" అని యచ్చటి వారాడుచుండిన మెచ్చుమాటలచే మఱింత హెచ్చరిక వహించి, వ్రేలాడుచున్న త్రోకుతాళ్లనూతగాగొని పాదములనందలకుఁదన్నునెట్టుకొని దిగుచుఁబదియడుగుల మేరలోనున్న నీటిమట్టమును నాలుగైదు కాలిబారలతో సమీపించి, తటాలున నీటిలోనుఱికి యప్పుడే తేలి మరల లోనికాకర్షింపఁబడుచుండిన భ్రమరకన్యకను క్షణములో నడుగీతతోడాసి, గ్రక్కునఁ దనకుడి

చేతి కందుకొనవచ్చిన యామె దక్షిణపాణి పల్లవమును గ్రహించి పట్టి యతఁడు నీటిపైకిఁ దేలెను.

ఒడ్డుననుండి తదేకదృష్టితోఁ జూచుచుండిన ప్రేక్షకులు నీటిపైఁ దేలిన వసంత భ్రమరములనుజూచి కెవ్వునఁ గేకలిడసాగిరి. ఆమె కూపిరి యాడుచున్నదాయని కొందరు ప్రశ్నించిరి. ఆ ప్రశ్నలుసరిగా దనకు వినరాకయో, యూపిరి పరిశీలించుట కవకాశము లేకయో వారికి వసంతుఁడెట్టి ప్రత్యుత్తరము నీయలేదు. నీటిపైఁ దేలినంతనే యతఁడు తనచేరువనే వ్రేలాడుచున్న నిచ్చెన కఱ్ఱలలో వామహస్తమును బాహుమూల పర్యంతమును జొనిపి, యూఁతగాఁ జేసికొని, యొకపాదమును నూతియంచునకుఁ దన్నువెట్టి, తనయవయవముల నించుక సవరించుకొని, సదుపాయమైన వసతి కుదుర్చుకొని, భ్రమరమును మఱింత పైకెత్తి, యామె ముఖము తనభుజముపైఁ జేరునట్లు వైచుకొని కుడిచేత బిగ్గరగాఁ గౌఁగిలించి పట్టెను.

భ్రమర కన్యక నట్టులదిమి పట్టుకొనినపిమ్మట వసంతుఁడింకఁ గర్తవ్యమేమను భావమును సూచించుచు మొగమెత్తి మీఁదికిఁ జూచెను. చూచినంతనే త్రాళ్లతోఁ గట్టఁబడిన యొకతట్ట నూతిలోనికి వచ్చుచుండుట వానికి దృష్టిగోచర మయ్యెను. అందులో భ్రమరమును భద్రముగాఁ జేర్చుటకుఁ దగినసదుపాయమున నతఁడు చూచు కొనుచుండ నయ్యది క్షణములోజాఱివచ్చి వానికట్టెదుట నాఁగెను. ఉట్టివలెఁ గట్టబడిన మోకుత్రాళ్ళయం దమర్పఁబడిన యాతట్ట, యరగజము లోతును మిక్కిలివైశాల్యమునుగలిగి భ్రమరమునందుఁ జేర్చుటకనుకూలముగా నుండెను. కుడిచేతితోఁ బట్టినపట్టు విడువక, వసంతుఁడువంగి, నిచ్చెనలో దూర్చిన యెడమచేయి నీటిలోనికిఁ జాఁచి, నీటిలో వ్రేలాడుచుండిన యామె మోకాళ్లక్రిందదూర్చి మెల్లఁగాఁబైకెత్తి, తనచెక్కులతో నామెచెక్కులు రాపాడునట్టు

తనభుజముపై నుండి యామెముఖమును దప్పించి, రెండుచేతులతో నామెశరీరమును దట్టిలోఁజేర్చి పైకిఁ ద్రేలాడకుండఁ గాలుసేతులు ముడిచి సవరించెను. ఇట్లు సవరింపఁబడిన భ్రమర మా గంపలోఁ గాలుసేతులు ముడుచుకొని యొత్తిగిలి పరుండియుండెను. అప్పుడు నాసికా రంధ్రములకడ వ్రేలుంచియుఁ జేతితో నామె కడుపును బ్రక్కలును దాఁకిచూచియు వసంతుఁడు కొంతపరీక్షించెనుగాని, యిట్టివిషయము లయం దనుభవజ్ఞానము లేనివాఁడగుటచే నామె జీవితమునుగూర్చి యాతఁడేమియుఁ దెలిసికొనలేక పోయెను.

ఇంతలో నీటిపైనున్న యాగంపకుఁ జలనము కలిగినది. ఒడ్డుననున్నవారు దానిని మెల్లఁగా మీఁదికి లాగుచుండ, వసంతుఁడు దాని వెంటనే త్రాళ్ళపై నెగఁబ్రాకసాగెను. నూతియొడ్డింకను బారెడుదూరమున నుండఁగనే "ప్రాణభయంలేదుకదా? వూపిరున్నాది కదా' అను నిట్టి ప్రశ్నలు వందలకొలఁది వానికి వినవచ్చినవి. లక్ష్మీకాంతునియన్న "వసంతంబాబూ! మాటాడవేం? ఏమేనా ఆశ వుందా?" అని గద్గదస్వరముతో నడుగుచుండెను. వసంతుఁడొడ్డు నందుకొని నేలపైకిదుమికి, కట్టుబట్ట పిడుచుకొనుచు నిట్టూర్పులు విడుచుచు వానిం జూచి, యిట్లు మాటాడెను—

"సుబ్బారావుగారూ! నేనిప్పుడేఁవీ చెప్పలేను. మీరు పరుగెత్తి వెళ్లి డాక్టర్ నాయుణ్ణి తీసుకురండి!"

"అతడు గొప్పడాక్టరు— మాయింటికి వస్తాడా?"

"ఆలాగనకండి. అతడు చాలాయోగ్యుడు. తప్పకుండా వస్తాడు— సంశయంలేదు"



## ౩ వ ప్రకరణము

### పూర్వ చరిత్రము.



లక్ష్మీకాంతము నియోగి బ్రాహ్మణుఁడు. వసంతరావు వెలనాటి బ్రాహ్మణ కుమారుఁడు. ఆదినుండియు నీరెండు కుటుంబములవారి కిని గాఢమైన యనుబంధము కలదు. లక్ష్మీకాంతము తండ్రియైనదిమ్మ రాజుపంతులు, విజయనగర సంస్థానములోఁ జేరిన గజపతినగరము తాలూకాలోని కోటపల్లిమునకు సముద్దారుగా ముప్పదియేండ్లు పనిచేసి మనకథాకాలమునాటికి మూఁడేండ్లక్రిందట మరణించెను. వసంతరావు తండ్రియైన రామావధాని గ్రామపురోహిత వృత్తితోఁ గోటపల్లి యందే నివసించుచుఁ దిమ్మరాజుగారికిఁ బురోహితుఁడు మాత్రమే గాక యాప్తమిత్రుఁడునై యుండెను. ఆకాలమందతనికి భూగృహాదిక వసతులేమియు లేవు. ఈరెండు కుటుంబములవారును గోటపల్లియం దగ్రహారపు వీధియం దిక్కెలి చేరువగానే నివసించుచుండిరి. ఆబ్రా హ్మణవీధిలోని చిరకాలనివాస బ్రాహ్మణ కుటుంబములలో 'కప్ప గంతుల' వారు తమకెట్టిజీవనోపాధియు లేక కుటుంబముతోఁ గాశీ నివాసమునకుఁబోవుచుఁ దమసొంత తాటియాకుటిల్లు విక్రయమునకుఁ జూపఁగాఁ దిమ్మరాజుపంతులు రామావధానికొఱకు గ్రామములోని వారివద్ద చందాలు సేకరించి నూటయేఁబదిరూపాయిలు ప్రోవుచేసి వానికాయిల్లు కొనియిచ్చెను. అప్పటినుండియు రామావధాని స్వగృ హమున నివసించుచు, నిలువనీడ యిచ్చి మాకుటుంబమును గాపాడిరని పంతులుగారిని దఱచుగా స్తోత్రము చేయుచుండును.

తిమ్మరాజుపంతులు స్తోత్రప్రియుఁడు. నెలకు నేను పాతికరూపాయిలే నైనను బళ్లెటూరినివాస మగుటచేతను పలుకుబడిగల యుద్యోగ మగుటచేతను, పండు — కాయ — పాలు — పెరుగు, కూర — నార మున్నగు మామూలు గ్రామస్థులైన రయితులనుండి యథోచితముగనే వానికి లభించుచుండెను. తనయనంతరమునఁ దనకుటుంబమున కేదైన స్థిరజీవనోపాధి కలిగింపవలయు ననుసంకల్పమే ఆదినములలోఁ దిమ్మరాజుపంతులుకుఁ గలిగియుండినయెడల, నాముప్పదియేండ్ల యుద్యోగకాలమును పొదుపుగ సంసారము చేసికొని యతఁడు పదివేలయినను మిగిల్చియుండును. అందు మనలెక్కకొంత నైదువేలరూపాయిల కధికారియై యుండును. కాని పెనుకుటుంబమునకుఁ గటికపేదఱిక మనుభవింపవలసిన వ్రాత యుండుటచే నాకాలములోఁ దిమ్మరాజుగారి కట్టిసంకల్ప ముదయింప లేదు. అనుదినము రాత్రులయందుఁ బంతులుగారిచావడిలో రామావధానిగారి పురాణపఠనము జరుగుచుండెను. పురాణము వినుటకు వచ్చు కరణము సర్వయ్య, మునసబు వెంకునాయుడు మున్నగు పెత్తనదారులకును, జంగము పోతన్న — సాతాని చిన్నన్న — రవ్వా వెంకన్నసెట్టి — దేవర శంబులింగము మున్నగుపెద్దమనుష్యులకును, సముద్రాడుగా రారంగవక్కలతో విజయనగరము పంపుటాకుల తాంబూలము లిప్పించుచుండిరి.

అట్టిపురాణపఠనమునఁ బట్టాభిషేకాదిఘట్టములు తటస్థించునెడలఁ దిమ్మరాజుగారు గ్రామసంతర్పణములను గావించుచుండిరి. “ఆహాహా! అన్నదానం అంటే నియోగిప్రభువులకే చెల్లింది! ఏం కూరలు? ఏం పచ్చళ్లు? ఏంపిండివంటలు? మహాప్రశస్తంగా వున్నాయ్!” అని భోజనప్రియులు గావించు స్తోత్రవాక్యములు విని, స్తోత్రప్రియులైన సముద్రాడుగారు మహానందభరితు లగుచుండిరి. పౌరాణికుఁడగు

రామావధాని యదృష్టము మంచిదగుటచే, నట్టిపట్టాభిషేకఘట్టములు చదువునప్పుడు పంతులుగారి సిఫారసుమీఁద 'గ్రామపెద్దలు' తమశక్తి కొలఁది వానికిఁ గట్నములు చదివించుచుండిరి. జీతము తక్కువైనను నధికారము పెద్దది యగుటచే సముద్రాలుమాత్రము రామావధాని కేఁబది రూపాయిలకుఁ దక్కువకట్న మెప్పుడును జెల్లించలేదు.

ఇట్లు తనయుద్యోగకాలములో మితవ్యయముచేసి ధనము కూడఁబెట్టుసంకల్పము లేశము లేకపోవుటయేగాక, యాదాయము నకు మించిన వ్యయము గావించుచుండుటచే సముద్రాలుగారియదృష్ట ము సౌధము నవరోహించుచుండ, నవధానిగారి యదృష్టము సౌధారో హణము నొనర్చుచుండెను. శ్రౌతము, స్మార్తము, సిద్ధాంతము, జ్యోతి షము నామూలాగ్రముగ నెఱిఁగినవాఁడుమాత్రమేగాక రామావధాని సంస్కృతమున నైషధాంత పాండిత్యముకలవాఁడు. ఒక్క కోటపల్లి యందేగాక యాచుట్టుప్రక్కలఁగల గజపతినగరము, విజయనగరము, మెంటాడ, చామలవలస, రైంద్రాము మున్నగు పెక్కుగ్రామముల యందు వానికిఁ బౌరోహిత్య ముండెను. తిమ్మరాజుపంతులు కప్పగం తులవారియిల్లు రామావధాని కిప్పించుటయే యాతని యదృష్టసౌధ మునకు శంకుస్థాపన మైనది. కాపువాఁడు తనపొలములో విత్తనము లు చల్లుకొనుటకును, మహారాజు తన కుమారునకుఁ బట్టాభిషేకము చేయుటకునుగూడ రామావధానియే ముహూర్తములు నిర్ణయింప వలయును. అందుచే నచిరకాలముననే యతఁడు వేలసంపన్నుఁడు డాఁగలిగెను.

తిమ్మరాజుపంతులు తనకుఁ బుట్టిన యిరువురు పుత్రులకు రామావధానిచే జాతకములను వ్రాయించెను. అతఁడు సంతానవంతుఁ డగుచుండిన కాలమునందే రామావధానికిఁగూడ నొక కుమారుఁడు నొక కుమారియు జన్మించిరి. పంతులుగారి కుమారులలో రెండవ

వాఁడగు లక్ష్మీకాంతముకంటె నవధాని కుమారుఁడైన నరసింహాప్ప పదునైదుదినములు మాత్రమే పెద్ద. వీరిరువురు సంతానవంతు లగుచున్నారు కాఁబట్టి యింక సంతర్పణాలు సమారాధనలును గట్టిపెట్టి సంసారము పొదుపు చేసికొనవలయునని భార్యయును సూరమ్మయు రామావధానియుఁగూడఁ దివారాత్రములు బోధించిరి. భార్యయందనురాగంబె నవధానియం దెక్కుడు గౌరవముగల సముద్రుఁడు వానిచెప్పిన చొప్పున నాడంబరము లెల్లఁ గట్టిపెట్టి యొకసంవత్సరముమాత్రము పొదుపుగాఁ గాలక్షేపము చేయఁగాఁ నమ్మఁడుచటఁ బోదు పంతులుగారి చెల్లెండ్రలోఁ బెద్దది విధివశమునఁ దలచెడి యప్పటికిఁ బండ్రెండేండ్ల వాఁడయిన తనకొడుకు సోమరాజుతో నాతని నాశ్రయించి "అన్నయ్యా! వీఁడికి మైనార్టీ తీరి కరిణీకం స్థిరపడేదాకా నువ్వే యింత వణ్ణం పెట్టి పోషించాలి" అని గృహప్రవేశమును గావించెను. ఆ సంవత్సరముననే పంతులుగారి కొకకుమారికయు జన్మించినది. తనకు మేనగోడలు పుట్టినదను సంతోషమును బట్టలేక పంతులుచెల్లెలు రంగమ్మ కెవ్వునఁ గేరుచు, "నా బాబుకి పెళ్ళాం పుట్టింది. నా వెర్రితండ్రికి పెళ్ళాం పుట్టింది" అని కొడుకును ముద్దులాడుచు, "నీమేనల్లుడు నీయింట్లో ప్రవేశించినముహూర్తం మంచిదంటావా కాదంటావా?" అని వదినగారిని నిలువఁబెట్టి యడుగుచు, నప్పటినుండియుఁ బెండ్లికి బేరము లాడసాగెను. ప్రాతికపుల్లంత పనియైన ముట్టక యన్నగారిని గట్నములనుగూర్చి ఖండించుచు వియ్యపురాలిచెక్కు లభినయించుటలో మూఁడుమాసములవఱకు రంగమ్మ మిక్కిలి ప్రయాస పడవలసివచ్చినది. ఆపుట్టినపిల్ల మూఁడవమాసాంతమునఁ దల్లితండ్రుల కడుపునఁ జిచ్చుపెట్టి గతించుటచే మఱల రెండుసంవత్సరములవఱకు నామె కట్టిశ్రమ కలుగలేదు.

రెండేండ్లయినతరువాత సముద్రారుగారికి మఱలఁ గూఁతురు కలిగినది. ఈయాఁడుశిశువైన నాకుఁ దక్కునా యని యతఁడు రామావధానిని జాతకఫలములను జెప్పఁగోరెను. అవధాని చక్రము వేసి గణించి చూచి, యాబాలికకుఁ బదునాలుగేండ్లు వచ్చువరకు వివాహయోగము లేకపోవుట యొక్కటితప్పఁ దక్కినయంశము లన్నియు బాగున్నవని చెప్పెను. అందుచేతనే తిమ్మరాజపంతులు తాను బ్రతికియున్నంతకాలము భ్రమరముపెండ్లినిగూర్చి యెట్టిప్రయత్నమును జేయలేదు. జాతకములో లేని దెంత యత్నించినను జరుగదనియే యాతనినమ్మకము. భ్రమరముపుట్టినంతనే రంగమ్మ యథాక్రమముగా వియ్యపురాలితనమును జూపుచుఁ బెండ్లిమాటలకు మొదలుపెట్టఁగా నీసారి సూరమ్మ సహింపలేక, "ఓవిడా! క్షమిస్తే వోమాటంటాను. ఇహమీఁద మీకూ మాకూ మరిసంబంధం జతపడదు. మా దేశిరాజవారికి విజయరమిల్లివారిసంబంధం అచ్చొచ్చింది కాదు. నీకొడుక్కి పిల్లనివ్వడానికి నేనూ మీఅన్నయ్యా నిశ్చయించుకొనేసరికి, పనసపండులాంటిపిల్ల ఫడీమని చచ్చూరుకుంది. అందుచేత ఆప్రసంగం మరెత్తకు" అని కఠినముగాఁ బ్రత్యుత్తర మిచ్చెను. అది మొదలుకొని కంచుకంఠములుగల సూరమ్మ రంగమ్మలకు నిత్యమును జగడములు జరుగుచు నొక్కొక్కప్పు డిరుగుపొరుగులవా రెంత వారించినను వారింపఁబడకుండెను. ఐరోపా మహాయుద్ధదినములలోఁ బుట్టిన భ్రమరము పుట్టుక యిట్లు కుటుంబయుద్ధమునకుఁ గారణమైనది.

భ్రమరాంబ పుట్టుసరికి లక్ష్మీకాంతవసంతరావు లేడేండ్లబాలురు. లక్ష్మీకాంతమన్న సుబ్బారావునకుఁ బదివయేడు. వసంతరావుచెల్లెలైన రాజ్యాంబ నాలుగేండ్లబాలిక. సంసారవ్యయము పొదుపు చేసికొనవలయునని తిమ్మరాజు తలంచిన వేళావిశేష మెట్టిదియో కాని,

తలచెడ్డ చెల్లెలిని జెల్లెలికుమారుని బోషింపవలసిన భారము మీఁదఁ బడుటయేగాక, పాప మా బ్రాహ్మణుఁడు పిల్లతల్లియగు మఱియొక చెల్లెలినిగూడ భరింపవలసివచ్చినది. ఆచెల్లెలిభర్త తనయన్నదమ్ములు వలదని యెంత వారించినను వినక, యప్పటికిఁ గ్రొత్తగా జరిగిన పంజాబు దురంతములను గూర్చి యుపన్యసించుచు నూటనలువది నాలవచట్టము నతిక్రమించి, సురాపాన, విదేశవస్త్ర విక్రయనిరోధము నందును సహాయనిరాకరణోద్యమము నందును బనిచేయుచు, రాజద్రోహనేరముక్రిందఁ గారాగారశిక్ష విధింపఁబడి, నెల్లూరుజైలులో వ్యాధిగ్రస్తుఁడై మరణించుటచే, సముద్రాడుపంతు లాచెల్లెలిని బోషించుటయేగాక, యామెమనోవృత్తికొఱకు బావమఱదులపై వ్యాజ్యమునుగూడఁ దేవలసినవాఁ డయ్యెను. సూరమ్మనోటికిఁ జాలలేక తఱచుగాఁ బరాజయ మొందుచుండిన రంగమ్మ, తనవలెనే తల చెడి వచ్చిన తనచెల్లెలు రమణమ్మసాయముతో దిన దిన యుద్ధములలో సూరమ్మను బ్రతిఘటించి నిలువఁ గలుగుచుండెను. రమణమ్మ తన సంతానమైన పండ్రెండునెలల యాఁడుశిశువును లక్ష్మికాంతమునకుఁ బెండ్లిమాట లాడుసందర్భమున సూరమ్మతో విరోధమును దెచ్చుకొనినది. అప్పుడప్పుడు వచ్చి తొంగిచూచి పోవుచుండిన దారిద్ర్యదేవత యాయింటఁ బుట్టినపోరుచూచి, కొలఁదికాలములోనే తన కాకుటుంబమున వసతి యేర్పడునని సంతసించుచుండెను.

పాపము తిమ్మరాజుపంతులు జలోదరమువలెఁ బెరిగిపోవుచున్న తనకుటుంబమును జూచి గుండె బాదుకొనుచు, గ్రామమెల్లఁ జెప్పుకొనుచుండినతనగృహకలహములకు సిగ్గుపడుచు, దాగడములో వెలగవలెఁ గొట్టుకొనుచుండిన యవస్థయందే తనకొడుకుల విద్యాభ్యాసమునుగూర్చి యాలోచింప వలసినవాఁ డయ్యెను. సుబ్బారావు లక్ష్మికాంత వసంతరావులు మువ్వురును, గోటపల్లియందలి ప్రాథమికపాఠ

శాలలోఁ జదివి, గజపతినగరమందలి లోవరు సెకండరీస్కూలులో మూఁడుఫారములు ముగించి, యున్నతపాఠశాలలోఁ జదువవలసిన వారైరి. రంగమ్మకొడుకు సోమరాజుమాత్రము తానుజేయుచున్న కరణీకపుటుద్యోగమునకుఁ బ్రైమరీకంటెఁ బెద్దచదు వవసరము లేదని, మఱి శ్రమపడక చదువు చాలించి గ్రామకరణముల కుండ వలసిన తక్కినవిద్యలనుమాత్రము శ్రద్ధగా నేర్చుకొనుచుండెను. తన కుమారులను విజయనగరము పంపి యచ్చటయున్నతపాఠశాలలోఁ జదివించుటకుఁ బంతులుగారిపరిస్థితి సరిపడి యుండలేదు. అందుచేత రెండేండ్లవఱకుఁ జదువులేక సుబ్బారావు లక్ష్మీకాంతములు కోటపల్లి యందే యుండవలసినవారైరి. రామావధానికి మొదటినుండియు నింగ్లీషువిద్యయం దిష్టములేదు. తిమ్మరాజు ప్రోత్సాహముచేతనే యతఁడు తనకుమారు నింగ్లీషుచదువులోఁ బ్రవేశపెట్టెను. ఆది నుండియుఁ దిమ్మరాజుమాట వానికి గురువాక్యము. అందుచేఁ దాను ధనవంతుఁడై యుండియు సుబ్బారావు లక్ష్మీకాంతములతోఁబాటు వసంతరావునుగూడ నారెండేండ్లును జదువునకుఁ బంపక రామావధాని వారికి సంస్కృతవిద్య నభ్యసింపఁజేసెను.

కుమారులకుఁ జదువులేదని విచారించుచుండిన తిమ్మరాజు పంతులారెండేడులును గడచినతరువాత, రామావధానితో నాలోచించి, పెద్దకుమారుని ప్రాథమికపాఠశాలోపాధ్యాయత్వమునకు ట్రెయినింగునకుఁ బంపుటకును, లక్ష్మీకాంతమునుమాత్రము విజయ నగరములోఁ జదివించుటకును నిశ్చయించెను. అతని సలహాపై రామావధాని తనకొడుకు వసంతరావునుగూడ లక్ష్మీకాంతముతోఁ జదివించుటకు సమ్మతించెను. కుమారుల విద్యాభ్యాసమునకై సము ద్రాలుగారు తమయింటనున్న వెండిసామానులను రహస్యముగా విక్ర యింపవలసినవారైరి. రామావధాని లక్ష్మీకాంత వసంతరావులతో

విజయనగరము వచ్చి గోవులసాలవీధిలో నొకచిన్నయిల్లు మూఁడు రూపాయిల కద్దెకుఁ బుచ్చుకొని యందు వారిని బ్రవేశపెట్టెను. సముద్ధారుగారు తనచెల్లెలు రంగమ్మను వారిసంరక్షణము కొఱకు విజయనగరము పంపిరి. సుముహూర్తమున రామావధాని పిల్లల నిరువురఁ బాఠశాలలోఁ బ్రవేశపెట్టెను. సుబ్బారావు భీమునిపట్టణమున ట్రెయినింగుస్కూలులోఁ బ్రవేశించెను.

లక్ష్మీకాంతవసంతరావులు నాలుగైదు ఫారములు చదివి ప్యాసై స్కూలుఫైనలుతరగతికి వచ్చిరి. సుబ్బారావు ట్రెయినింగు పరీక్షలో నుత్తీర్ణుడయ్యెను. రామావధాని మ్యునిసిపల్ ఛెయిరుమేన్‌గారితోఁ బౌరోహిత్యపరిచయ మున్నవాఁడగుటచే సిఫారసు చేసి సుబ్బారావునకు మ్యునిసిపల్ ప్రాథమికపాఠశాలలోఁ బంద్రెండు రూపాయిల యుపాధ్యాయపదవి నిప్పించెను. కొలఁదికాలములోనే సుబ్బారావునకు వివాహసంబంధముకూడ వచ్చినది. తిమ్మరాజు పంతులు నిర్ధనుఁడై విచారించుచుండ, రామావధాని పత్రమైన వ్రాయించుకొనక నైదువందలరూపాయిలు ఋణమిచ్చి సుబ్బారావు పెండ్లి చేయించెను. ఆదిలో నిరాధారుడై యుండిన తాను తిమ్మరాజుసాయముననే వృద్ధిలోకి రాఁగలిగిన విశ్వాసము, తిమ్మరాజునందును, వానియనంతరము వానికుటుంబమునందును రామావధాని తనజీవితాంతమును జూపుచునే వచ్చెను. సుబ్బారావునకు వివాహమైన సంవత్సరముననే రామావధాని తనకూఁతురు రాజ్యాంబ నోరుగంటివారిచిన్నవాని కిచ్చి యతిబాల్యవివాహమును జేసెను.

లక్ష్మీకాంత వసంతరావులు స్కూలుఫైనలు పరీక్షప్యాసయిన సంవత్సర మాంధ్రదేశరాజ్యాంగచరిత్రమునందు మిక్కిలి గణింపఁ దగినది. స్వరాజ్యసౌధారోహణమునకై తాను నిర్మించుచున్న సోపానములలో నొక్కటియగు సహాయనిరాకరణమును మెట్టుపై దేశీయు

తెల్లదు నొక్కపెట్టునఁ గాలు పెట్టవలయునని మహాత్ముఁడు తన యనుచరులతో భారతవర్షమునం దంతట నుపన్యసింప సాగెను. న్యాయాధిపతులు, న్యాయవాదులు, నుపాధ్యాయులు మున్నగు సకల విధశాఖోద్యోగస్థులునుగూడఁ దమతమ యుద్యోగములఁ బరిత్యజింప వలయుననియుఁ జదువు లేక పాఠశాలలుఁ గళాశాలలు నొక్క సంవత్సరము మూయఁబడవలయుననియు, మహాత్మునియాజ్ఞపై నాయకులు రోదోంతరాళమునిండ ఘోషింపుచుండిరి. ఆసంవత్సరమునఁ దనయాంధ్రదేశసంచారములో మహాత్ముఁడు విజయనగరము వచ్చి పార్కుమైదానములో వేలకొలది ప్రజలలో ఖద్దరుధారణమును గూర్చియు సహాయనిరాకరణమునుగూర్చియు నొసంగిన గంభీరోపన్యాసము మనలక్ష్మీకాంత వసంతరావుల స్వరాజ్యావేశ పరులఁ గావించి విద్యావిసర్జనమునకుఁ బ్రోత్సహించినది. మఱిమూఁడేండ్ల వఱకు వసంతరావు కళాశాలలోఁ బ్రవేశింపలేదు. లక్ష్మీకాంతమునకుమాత్ర మావిద్యావిసర్జనము శాశ్వతవిద్యాభంగమే యైనది. వసంతరా వప్పటినుండియుఁ దనచెల్లెలైన రాజ్యమును స్వరాజ్యమని పిలువసాగెను.

ఈమూఁడేండ్లలో లక్ష్మీకాంతము కుటుంబమునకు భరింపరాని కష్టములు తటస్థించినవి. తిమ్మరాజుపంతులు దస్తావేజుల్లో కొంత యశ్రద్ధచేసి తనయధికారులచేఁ బట్టువడెను. మఱివారము దినములకే నీసర్వీసు ముగిసినందున నీ వింక విశ్రాంతి పొందవలయుననియు, నీయుపకారవేతనమునుగూర్చి క్రమముగా నాలోచింపఁబడుననియు వాని కాజ్ఞాపత్రము వచ్చినది. తిమ్మరాజుపంతులు క్రొత్తసముద్ధారునకు ఛార్జీ యప్పగించి, వ్యాజ్యములో మఱుఁదులతో రాజీపడిన రమణమ్మను వారికడకు బంపివేసి, యింటియందలి పాత్రాదిసామగ్రులను విక్రయించి గ్రామఋణములను దీర్చి, భార్య

తోడను భ్రమరముతోడను బండియెక్కి కట్టుబట్టలతో విజయనగరము విచ్చేసెను. అదివఱకే సోమరాజునకుఁ గర్భశోకము స్థిరపడుటచేత రంగమ్మయుఁ గుమారునొద్దకుఁ బోయెను.

వ్యవహారములు చక్కఁబడి చెల్లెండ్రు వారియిండ్లకు వారు వెడలిపోవుటవలనఁ దనకుటుంబభారము చులకఁబడుననియు, దారిద్ర్యకారణమగు కుటుంబకలహ మింక లేకుండుననియుఁ దిమ్మరాజుపంతులు మొదట మిక్కిలి సంతోషించెను. కాని దారిద్ర్యదేవత కూడఁ దనతోడనే విజయనగరము కాపురమునకు వచ్చినదని పాప మా బ్రాహ్మణుఁ డెఱుఁగఁడు. పెద్దకుమారుఁడు సుబ్బారావు సంతానవంతుఁ డగుచుండుటచే నాతఁ డనుకొనినట్లు కుటుంబభారము తగ్గలేదు. పెక్కేండ్లనుండి మూఁడుపడుచులతోఁ గయ్యమాడుటయందలవాటుపడిన వానిభార్యయగు సూరమ్మ తనకోడలు వీరమ్మతో జగడము మొదలుపెట్టుటచేఁ గుటుంబకలహము తొలఁగిపోలేదు. తిమ్మరాజుపంతులు విజయనగరము వచ్చినతరువాత నుపకారవేతనమునకై యొకసంవత్సరము ప్రయత్నించెను. కడ కుపకారవేతనము లేకపోవుటయుఁ గుటుంబకలహము మానకపోవుటకు, సుబ్బారావు నెలజీతము పండ్రెండు రూపాయలతో దినము గడవకుండుటయు మున్నగువిచారములెల్లఁ దిమ్మరాజపంతులుగారి నాఱుమాసములు దీర్ఘవిచారముతో మంచము పట్టించెను. కోటపల్లిలో నుద్యోగములో నుండినప్పుడు తాను బాల్యమునుండియుఁ బాలు నేయి పెరుగును బోసి గారాబమునఁ బెంచిన తనపిల్ల లిప్పు డొక్కపూటమాత్ర మింతయన్నము తిని రెండవపూట నకనకలాడు కడుపులతోఁ బరుండుట, తనకంటఁ జూచి భరింపలేక, తనవంతు విస్తరియన్నమును దనపిల్లలకే విడిచి పాప మా బ్రాహ్మణుఁడు స్వర్గస్థుఁ డయ్యెను.

తిమ్మరాజు మరణించినతరువాత రంగమ్మ యప్పుడప్పుడు వచ్చి సోమరాజునకు భ్రమరము నిమ్మని సూరమ్మ నడుగుచుఁ బోవుచుండెను. సూరమ్మయు నాఘోరదరిద్రావస్థలోఁ బదుమూఁడేండ్లభ్రమరాంబకుఁ బెండ్లి సేయుటకు వేఱొక గతిలేక, వ్యయమంతయు రంగమ్మ తానే భరించెదనని చెప్పుటచేత, నాసంబంధమున కిష్టపడి యానాఁడు నిశ్చయతాంబూల మిచ్చుటకు ముహూర్తమును బెట్టించెను. ఆ ముహూర్తమునాఁడు నూతిలోఁ బడిన భ్రమర మేమయ్యెనో చదువరులు మీఁదిప్రకరణమునఁ దెలిసికొనఁ గలరు.

## 4 వ ప్రకరణము

### •వసంతుని యుపచారములు•

పంచలచాపుల కేగిన లక్ష్మీకాంతము పదిగంటలైన నింటికి రాలేదు. రంగమ్మ వీధిగుమ్మములో నిలువఁబడి యెఱ్ఱవారిన ముఖముతోఁ బ్రతిక్షణము వానికొఱ కెదురుచూచుచుండెను. లక్ష్మీకాంతము వచ్చుమార్గమువంక మాటిమాటికి వంగివంగి చూచుచుఁ దానెఱిఁగిన పెద్దమనుష్యు లెవరైన నాదారి నేగునప్పుడు చప్పున ముసుఁగు సవరించుకొని స్తంభముచాటునకుఁ బోవుచు లక్ష్మీకాంతముతోఁ జదువుకొనిన స్కూలుపిల్లలలోఁ దా నెఱిఁగినవారు కంటఁబడినప్పుడు, ''నాయనా! మాలక్ష్మీకాంతం కనబడితే పంచల్చాపు

లక్షల్లేదా మీయత్త రూపాయిలే తెచ్చి తగలెట్టమన్నాడని చెప్పు బాబూ! చచ్చి నీకడుపున పుడతాను'' అని దీనముగా బ్రతిమాలుకొనుచుండెను. వీధిలోనివా రెవరైన వచ్చి, ''భ్రమరాని కెలా వుందండీ? ప్రాణభయం వుండదని నాయుడు చెప్పేడా? తెలివొచ్చిందా? పిలిస్తే పలుకుతుందా?'' అని తన్నడుగుచుండ, రంగమ్మ వారిపైఁ జికాకుపడుచు, ''నన్నడక్కండి. అభిమానం వున్నవాళ్లెవళ్లో లోపలికెళ్లి కనుక్కోండి'' అని మొగము ముణుఁచుకొని విసవిసలాడుచుఁ బ్రత్యుత్తరము లిచ్చుచుండెను.

ఇట్లెంతసే పెదురుచూచుచుండినను లక్ష్మీకాంతము రానందున రంగమ్మ విసిగికొనుచు, నప్పుడప్పుడు చావడివంకఁ దిరిగి ''సోంబాబూ! సోంబాబూ!'' అని తొట్రుపాటుకంఠముతోఁ బిలుచుచు, ఆపిలువఁబడిన వ్యక్తి లోపలినుండి ప్రత్యుత్తర మిచ్చుటగాని, వెలుపలికి వచ్చుటగాని జరుపనందునఁ గోపించి, ''సోంబాబూ కాదు— ఎందుకూ పనికిరాని వెధవబాబు— వో తెలివా? తేటా? ఏ— వల్లకాదూ లేదు. నిప్పులు పూచ్చేస్తే యిలాంటివెధవలు పుడతారు.'' అని సణుగుకొనుచుండెను. ఆసణుఁగులోనే మిక్కిలి లావుగల యొక నల్లనివికారాకారము లోపలినుండి వెలుపలికివచ్చెను. బనియనుగాని చొక్కాగాని తొడిగికొనక కేవలము కట్టుబట్టతోడనే వెలుపలికి వచ్చిన పెండ్లికొడుకగు సోమరాజు రూపరేఖలు చూడఁ గోరువారి కదియే సమయము. తెక్కలచేఁ బక్షియు, దంతములచే జంతువు నగుచున్న గబ్బిలమువలె, సోమరాజుముందరిక్రాఫింగుచేఁ బట్టణవాసియు, వెనుకనున్న పట్టెడుజుట్టుముడిచేఁ బల్లెటూరివాఁడునుగూడ నగుచున్నాఁడు. బాల్యమునుండియుఁ దనయవయవము లన్నిటిలో నొక్కకడుపునకుమాత్రమే శ్రద్ధతో వ్యాయామము చేయుచుండినట్టు లాతని పొట్టమిక్కిలి యుబ్బెత్తుగాఁ గన్పట్టుచుండెను. వాని శరీరమం

తయు నీటిబుంగ యగుటచే నతఁడేమాత్రము కదలినను వానియవయవములకుఁ గూడఁ జలనము కలుగుచుండును. ఇరువంకల నెత్తుగా బెరిగిన బుగ్గల నాక్రమించుచున్న చిక్కనిమీసములును, తిరుపతిక్రొముక్కున్నవానికింబోలె దట్టముగ మాసినగడ్డమును మాత్రమేగాక, వక్షోభాగమును నుదరమునఁ గొంతభాగమునుగూడ నతఁడు సోమరాజనుపేరుకంటె రోమరాజనుపేరున కెక్కుడు తగినవాఁడని చాటుచున్నవి. సోమరాజు వీధిగుమ్మములోనికివచ్చి మాసినగడ్డము నెడమచేత నిమురుకొనుచు, "అయితే అమ్మా! ఇవాళ క్షవరం చేయించుకోవా లంటావా? అక్కర్లేదంటావా?" అని యడిగెను. రంగమ్మ వానిముఖముమీఁద నూరకత్తులవంటిచూపులఁ బఱపుచు,

"నీబ్రతుకే క్షవరం అయింది. ఇహ వేరే క్షవరం యెందుకు? ఉత్తదరిద్రగొట్టువి. దరిద్రగొట్టా అంటే వోయని పలుకుతున్నావు. ఏంజన్మం యెత్తేవో కానీ—ఇదంతా నీఖర్మం- నాఖర్మం- అయిందేదో అయింది. ఆపదిరూపాయిలేనా దండుక్కోకుండా దక్కుతాయేమో అంటే పోతులా గిల్లు కదలవు. ఎవళ్లని బతిమాలుకుంటే యెవళ్లు వెళతారు? యీపాటి క్కొనీసి తెస్తానే వుంటాడు. మీసూరమ్మత్తన్నట్లు ఆదిక్కుమాలిన పంచల్చావు లేంచేసుకుంటాం ? "

అని యాయుపన్యాస మింకను గొనసాగించుచునే యుండెను గాని యింతలో సోమరాజుదృష్టి యాయింటివైపునకే వచ్చుచుండిన యొకయువతీమణివంకఁ బోవుటచే నతఁడు తల్లిమాటల కేమియుఁ బ్రత్యుత్తర మీయలేదు.

సోమరాజుదృష్టిపథమునఁ బడి యాయింటివైపునకు వచ్చుచుండిన యాయువతీమణి, ధనాఢ్యుల బిడ్డయనియేగాక వైశ్వర్యవంతుల కోడలనికూడ నామె ధరించిన యమూల్యాభరణవిశేషముల

వలనఁ దెలియుచున్నది. పదునేఁడేండ్లుదాటని యాలేజవ్వని ధరించిన పొందూరు నేఁతచీరకు నలువదిరూపాయిల తక్కువవెల యుండదు. ఆచీరకు రెండంగుళములవెడల్పున నొకవైపున నెఱ్ఱపట్టుతోడను, మఱియొకవైపున నాకుపచ్చనిపట్టుతోడను, నేసిన యంచులందుఁ బసుపుపచ్చని మేల్మిజరీదారముతోఁ జిత్రవిచిత్రములగు శాఖోపశాఖలుగా రచించిన నేఁతగాని చేతికౌశలము చూపరులకు శ్లాఘనీయమై— "పదునేనులక్షలు వెచ్చించిన గుజరాతుదేశముకంటె నేఁతపరిశ్రమయం దాంధ్రదేశమే కీర్తి గాంచె" నన్న మహాత్ముని వాక్యము సత్యమని వేనోళ్లఁ జాటుచుండెను. ఇట్లు తళతళలాడు పట్టుజరీయంచులతో నుల్లసిల్లు నాతెల్లని సన్నచీరకుఁ దోడుగ నామె దాల్చిన నల్లనిజిగిబిగి ఖద్దరురైకపైఁ దత్కాంతాభరణకాంతులు వినీలమేఘమాలికను వెలువడు మెఱుపులతళుకుల ననుకరించుచుండెను. ఆమెశరీరచ్ఛాయ కోమలశ్యామలమైన మెఱుఁగుచామనచాయ. ఆయెలజవ్వనిచక్కఁదనము తమభార్యలు మిక్కిలి చక్కనివారని గర్వించు భర్తలకు గర్వభంగము గావించుచుండెను. వంకరలు వాఱిన ముంగురులు, నెన్నుదురు ముద్దాడు తెఱంగున దువ్విన ప్రక్కపాపటయు, పట్టుపేలికతో వాలుజడయందుఁ బుష్పాకారముగఁ గీలుకొల్పిన రిబ్బను, తలలో నాగరముక్రిందఁ బొందుపఱచిన మరువమునకు మురుపుగొలుపు గులాబిపువ్వును, నయ్యంగనామణిని నేఁటినవనాగరకాంగనలయందే చేర్చుచున్నవి. కాని యామెనడక తీరుమాత్రము నేటినాగరకమునకుఁ దగినదిగా లేదు. మెడయం దట్టియమూల్యాభరణములు ధరించినందుకు, మొలయం దట్టిమువ్వలవొడ్డాణము పెట్టినందుకు, చేతులకు బంగరుగాజులజతలు, వ్రేళ్లకు రవలయుంగరములు— చెవులకు వజ్రంపుఁబోళ్ల తమ్మంటులు నున్నందుకు— మఱియొక నవనాగరకాంగనయే యైనయెడల టక్కు

టెక్కులతో నిక్కి నీల్గుచుఁ దన నడకయం దెన్ని యొయ్యారము లైనఁ జూపించియుండును. పూర్వనాగరకప్రపంచమునందలి కామినులు సామాన్యముగ హంసయానలు గజయానలుమాత్రమే కాని, యిప్పటినవనాగరకయువతులలో బహువిధమ్ముగపక్షియాన లనేకులు గలరు.

జ్వరపరిమాణమును దెల్పు థర్మామీటరను గాజుగొట్టము నొకచేతను, యూక్లిప్టస్‌నూనెగల సీసా నొకచేతను బట్టి, యా మందయాన యాయింటిగుమ్మమును సమీపించి, ద్వారమునకు సరిపడ నడ్డముగా నిలువఁబడియున్న సోమరాజును చూచి, లోనికిఁ బోవ నుద్యమింపక తటాలున నిలిచిపోయెను. తన్ను సమీపించుకొలఁది కుదురైన యామె యవయవముల సౌష్టవమును దదేకదృష్టితో నీక్షించుచు మతి పోయియున్న సోమరాజున కామెకుఁ ద్రోవ యీవలయునను జ్ఞానము కలుగలేదు. "కళ్లు కనపడవట్రా? కదలవేం పోతులాగ?" అని రంగమ్మ హెచ్చరించినంతనే యతఁడు గుమ్మము నుండి ప్రక్కయరుగుమీఁదికిఁ దొలంగిపోవ నాకురంగాక్షి భీతకురంగి వలె ఛంగుఛంగున రెండడుగులలో లోనికురికి, యెడమవైపుననున్న చావడిగదిలోఁ బ్రవేశించెను.

మన్ను మెత్తిన యరుగులును, సున్నపుఁబూత యెఱుఁగని గోడలును, గచ్చులు పెచ్చులూడ గాతలువడిన చిన్నచావడియుఁ గలయాజీర్ణగృహమున కెల్ల నాచావడిలోనున్న దొక్కటియే గది. ఆయింట వసించువారికిఁ దఱచుగ వంటయు భోజనములు నుండవని యెఱిఁగియే కాఁబోలు గృహయజమాను లాయింటికి వంటయిల్లు కట్టింపనందున లక్ష్మీకాంతముకుటుంబమువారు తాటాకులతో నొకగదిపట్టున సాల వేసికొని కలిగిననాఁ డందు వంట చేసికొనుచుండిరి. బుడ్డిదీపముచేఁ గ్రమ్మిన బూజులతోడను, ఎఱ్ఱమంటి నీటిచార

లుగల గోడలతోడను, గచ్చూడిన గాతలతోడను, చెదలుపట్టిన వాసాలతోడను, ఆచావడిగది యాయింటివారిదైశ్వర్య మిట్టిదని చాటుచుండెను.

దుర్భరదారిద్ర్యసూచకమైన యాగదిలో నొకమూల నొక రాట్నమును దానిప్రక్కనే గోడకుఁ దగిలింపఁబడిన నొడికిన నూలుబిండయుఁ గలవు. ఆచేరువనే గోడవార మూఁతలేని దేవదారు పెట్టిలోఁ గుదురుగఁ బేర్చిన పుస్తకములదొంతిపైఁ బురాతనపుటచ్చు గల సాతానిప్రతిభారతము తెల్లనికాగితముతో నట్ట వేయఁబడి యుండెను. ఆయట్టపై "ఆంధ్రమహాభారతము" అనియు, దానిక్రింద, 'ఆదిపంచకము' అనియు, దానిక్రింద, " ఈపుస్తకము దేశిరాజు— భ్రమరాంబది" అనియు, దానిక్రింద, " దీని నెవ్వరును దీయఁగూడదు. " అనియు ముత్యాలవంటి ముద్దులు మూటగట్టు చక్కని యక్షరములతో నాలుగువరుసలు వ్రాయఁబడినవి. ఆవాక్యములను బట్టి భ్రమరాంబ యచ్సంధులు, హల్సంధులు. కళలు, ద్రుతప్రకృతికములు మున్నగు వ్యాకరణాంశము లెఱింగి తప్పులు లేకుండ వాక్యరచన గావింపఁ గలదనియు— భారతము చదువుచుండుటచేఁ దత్పూర్వము మఱికొన్నిగ్రంథములను జదివి గ్రంథపఠనమునందుఁ గొంత పరిశ్రమ చేసినదియే యనియు సాహితీవేత్తలైన చదువరు లెఱుఁగఁ గలరు.

ఆగదిలో నట్టనడుమ వేయఁబడిన నులకమంచమునందలి మాసికలబొంతపై నాపాదకంఠమును దెల్లనివస్త్రముచేఁ గప్పఁబడి వెల్లకిలఁ బరుండి భ్రమరాంబ శరీరముపై స్పృహ తప్పియుండెను. ఆమంచమునకుఁ బ్రక్కనే తాటాకుచాపపైఁ గూర్చుండి, మోమున మసూచికపుమచ్చలును వామనేత్రమున మెల్లయుఁగల బాలిక యొక్కతె చేత నొకకాఫీపాత్ర నెత్తి పట్టుకొనియుండ, మంచముపైఁ

గూర్చుండిన వసంతరావు చేతనున్న చెమ్చాతో నాపాత్రయందలి కాఫీ కొంచెము కొంచెము తీసి భ్రమరమునోటిలోఁ బోయుచు నామెచేఁ ద్రావించుచుండెను. ఆత్రాగించుటలో నోటికెలంకులనుండి చెక్కులపైఁ గారుచుండిన కాఫీధారలను దలవైపున నేలఁ గూర్చుండిన సుబ్బారావు చేతనున్నగుడ్డతో మెల్లఁగ నొత్తుచుండెను. కాఫీ పాత్ర ధరించియుండిన యామెల్లకంటిపిల్లయే భ్రమరాంబా సోమరాజుల వివాహానంతరమున లక్ష్మీకాంతమునకు నిశ్చయింపఁబడిన పెండ్లికూతుఁరు. గుణసంపదలయందును విద్యావిశేషములయందును రూపలావణ్యాతిశయములయందును ప్రశంసనీయులగు భ్రమరాంబాలక్ష్మీకాంతములకు వారిదురవస్థనుబట్టి యట్టికురూపసంబంధములను విధి నిర్ణయించుటలో నాశ్చర్యములేదు. కాని యానాఁడు నిశ్చయతాంబూల మాఁగిపోవుటచేత నాసంబంధములు విధవానిర్ణయములే కాని విధినిర్ణయములు కా వనవచ్చును.

అంతటి లేమియందుఁగూడ భాగ్యరేఖ లొలుకుచుండిన నెన్నుదురు, బంగరుకాంతు లీనుచున్న నునుజెక్కులు, ముకుళించిన చెంగల్వలంబోలు నిమీలితనేత్రములును, వసంతుఁడు తనియదీర నీక్షించుచు భ్రమరముచేఁ గాఫీ త్రావించుచుఁ దా నామెవదనలావణ్యామృతమును గ్రోలుచుండెను. మేనిపై స్మృతి లేకయున్న భ్రమరము నాలుగైదుసారులుమాత్రము కాఫీగుటకలు మ్రింగి, మఱిత్రాగనందున వసంతుఁడు చేతనున్న చెమ్చా నేలఁ బడవైచెను. ఇంతలో ధర్మామీటరు గొనివచ్చిన సుందరీమణి యాగదిలోఁ బ్రవేశింప వసంతుఁ డామెను జూచి,

"ఇంతసేపైందేం?"

"ధర్మామీటరు దొరక్క ఆలస్యం అయింది. కాఫీ తాగిందా?"

"కొంచెం తాగింది. శరీరంమీద జ్ఞానం లేదు. జ్వరం తీవ్రం గావుంది. మరికొంచెంసేపుండి ధర్మామీటరు చూదాం"

"అన్నయ్యా! ఈనూనె పాదాలకి రాయనా?"

"పాదాలకే కాదు. మోకాళ్ళదాకాకూడా రాయి"

అని సంభాషించుచుండ భ్రమరము "చిన్నన్న'య్యా" అని పలవరించెను. అప్పుడు సుబ్బారావు "పలవరిస్తున్నాది. డాక్టరుతో చెప్పి రానా?" అని వసంతరావు నడిగెను. అతఁడు వానికి బ్రత్యుత్తర మీయక భ్రమరమువంకకే ఱెప్ప వేయక చూచుచుండెను. ఇంతలో భ్రమరము మఱల బలవరించినది. అచ్చటివారందఱు నిశ్శబ్దముగ నామెను జూడసాగిరి. ఇంటివారందఱు నామె చుట్టును మూఁగవలదనియు గట్టిగ మాటాడవలదనియు నాయుఁడు చెప్పి పోవుటచేత నవసరమైనవారుమాత్రమే యచ్చటనుండి మిగిలినవారు పెరటింటిలోనికిఁ బోయిరి. భ్రమరము నూతిలోనుండి తీయఁబడినవెంటనే కడుపును బ్రక్కలు నొక్కి త్రాగిననీరు గ్రక్కించియు, తడిసిన బట్టలు విప్పి పొడిబట్టలు గట్టించియుఁ దలయందలి తడి యొత్తియు నొడలెల్లఁ గణకణలాడు నిప్పులం గాచియుఁ గొన్ని యుపచారములు డాక్టరు వచ్చులోపుననే కావింపఁబడుటచే మురహరిరావునాయుఁడు వచ్చి యీమెను బరీక్షించి తానును జేయవలసిన యుపచారములఁ జేసి యీయవలసిన యౌషధముల నిచ్చి ప్రాణభయము లేదని చెప్పి వెడలిపోయెను. నాయుఁడు చూచి పోయి నకొంచెముసేపునకే భ్రమరమునకుఁ జలికుదుపుతో జ్వరము రాఁగా సుబ్బారావు వెంటనే పఱువెత్తి యీసంగతి వాని కెఱింగింపఁ బ్రాణము మిక్కిలి యాయాసపడినయులజడిచే జ్వరము రావచ్చునని పలికి మూఁడేసిగంటల కొక్కొక్కమా ఱిచ్చుచుండుట కౌషధము

నాసంగి వేఁడివేఁడికాఫీగాని జావగాని యప్పుడప్పు డిచ్చుచుండవల యునని చెప్పెను.

వసంతుఁడు స్వరాజ్యముచేతిలోనున్న ధర్మామిట రందుకొని యాజ్వరమును బరిశీలింప నూటనాలుగుడిగ్రీ లున్నట్లు వానికిఁ దెలిసినది. ఆతీవ్రజ్వరములో నామె తఱచు చిన్నన్ననే పలవరించు చుండుటచేత, నచ్చటివారు లక్ష్మీకాంతము వచ్చిన బాగుండు ననియు నింతవఱకు రాకుండుటకుఁ గారణమేమనియుఁ దమలో గుస గుస లాడుకొనసాగిరి. అంతవఱకు రాకుండుటచే నాఘోరవార్త లక్ష్మీకాంతమునకుఁ దెలిసియుండదనియే వారు నిశ్చయించుకొనిరి. అప్పుడు సుబ్బారావు "వసంతంబాబూ! పలవరింత లెక్కు వవుతు న్నాయి. జ్వరంకూడా యెక్కువయినట్టే వుంది. ఓమారు నాయుడి దగ్గిరికి వెళ్ళిరానా" యని యడుగుచుండ, డాక్టరుకడకు వెళ్లవలసిన యవసర మున్నదా లేదాయని వసంతుఁ డాలోచించుచు, వాని కేమియో ప్రత్యుత్తరము చెప్పఁబోవుచుండ, వీధిలోనున్న రంగమ్మ 'వసంతం! సుబ్బా!' అని వీధిలోనుండియే బిగ్గరగాఁ బిలుచుచు నా గదిగుమ్మముకడకు వచ్చి, "లక్ష్మీకాంతం పోలీసుస్టేషనులో యేదో జట్టీపడుతున్నాట్ట! జనం అంతా మూగేరట! దర్భావారివిన్నీడు చూసి వొచ్చేట్ట! ఏంజట్టీరా అంటే మరిమాటాడకుండా గుంట కక్కుగట్టు తుప్పూ తుప్పూ తూల్తూ పారిపోయేడు. ఏంవిటీరాత? ఈ కుటుంబానికి భగవంతు డేఁవిటి రాశాడో తెలియదు. యెవరేనా వెళ్లి కనుక్కుంటేనేకాని యేందారి? " అని దీనస్వరముతోఁ జెప్ప సుబ్బారావు వసంతరావులు నిశ్చేష్టితులై నిట్టూర్పులు విడిచిరి.

## 5 వ ప్రకరణము

### —• ఒక యుత్తరము •—

“చిరంజీవికి—

ఆశీర్వాదములు—తరువాత—

నువ్వు రాసినప్రకారం ఈరోజున 40 రూపాయిలు మనియార్డరుద్వారా పంపించినాను. అందినవైనం వెంటనే వ్రాయవలయును. పన్నెండురూపాయిలతో ఇంటికి రావలసినవాడవు 40 రూపాయిలు పంపమని రాయడం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. ఏనెల కానెలకే నీహాస్టేలు ఖర్చులు కాలేజీజీతం మొదలైనవి నేను పంపుతూవుండగా నువ్వు ఋణాలు చెయ్యవలసిన యగత్యం నాకేమీ కనబడదు. ఆచదువేదో విజయనగరములో వెలిగించమని నే నెంతదూరం చెప్పినా వినక చెన్నపట్టం పరుగెత్తి నన్ను ఋణాల పాలు చేసినావు. నీయింగ్లీషు చదువుక్రిందయిన ఋణంతీర్చడానికి రేగభూమి విక్రయించేస్తున్నాను. ఇకమీద నువ్వు చేసే ఋణాలు నే నెంతమాత్రం తీర్చలేను.

ఈమాసంలో కార్యం చేసుకోక తప్పదని నీయత్తవారు నాకు కఠినంగా రాస్తున్నారు. ఎదిగినపిల్లని సంవత్సరాలకొద్దీ విడిచి పెట్టడం మనకికాని వారికికాని క్షేమం కాదు. కాబట్టి నీమొండి పట్టు విడిచిపెట్టి యీసెలవుల్లో కార్యం చేసుకొని మరీ చెన్నపట్టం వెళ్లవలెను. వచ్చేటప్పుడు విజయనగరంలో దిగి నీయత్తవారింట్లో

రెండుపూటలుండి మరీ రావలెను. ఒకపౌను ద్రాక్షపళ్లూ, రెండు ఖర్జూరపుచాపలు కొని తేవలెను.

గ్రహించవలెను.

ఓరుగంటి-రామశాస్త్రి.

అని యప్పుడే తపాలావా డిచ్చిన యుత్తరమును జదువుకొనుచు మదరాసునందలి తిరువళిక్కేణిలోని నల్లతంబివీథియందలి యొకయింటిమేడపై ముందరివరండాలో వాలుగుర్చీయందు యువకుఁడొక్కఁడు కూర్చుండెను. ఆకుర్చీకి ప్రక్కనే పడియున్న పుస్తకములును వానిసమీపమున గోడకు నిలువఁబెట్టిన టెన్నిసుబ్యాటు నా యువకుఁ డొకవిద్యార్థియని తెలుపుచున్నవి. పేర్చిన దొంతర ప్రక్కకు దిరుగఁబడుటచేత నట్టలపైఁ గానవచ్చుచుండిన యయ్యాంగ్ల గ్రంథముల నామములంబట్టి యతఁడు పట్టపరీక్షకుఁ జదువుచుండిన విద్యార్థియని స్పష్ట మగుచున్నది. సీమలో నచ్చు వేయఁబడి రంగు రంగుల క్యాలికో అట్టలతోఁ దళతళలాడుచుండిన యాపాఠ్యగ్రంథములు మాయుటగాని, నలుగుటగాని లేక క్రొన్నవి క్రొన్నట్లే కానవచ్చుచుండెను. గాలి కెగురుచుండిన నోటుపుస్తకములయందలి తెల్ల కాగితములు గూడ నతఁడు కాలేజీలో నుపన్యాసకులు (Lecturers) చెప్పువిషయముల నేనాఁడును వ్రాసికొను నలవాటు కలవాఁడు కాఁడని సాక్ష్య మిచ్చుచున్నవి. పుస్తకములును బ్యాటునుమాత్రమే గాక, ఒకట్రింకుపెట్టియు, నొకపరుపుచుట్టయు, హరికెన్‌లాంతరు, వెండితొడిగల సన్నని చేతిబెత్తము సగముసగము వాడిన నాలుగైదు రకముల వాసననూనెసీసాలు, రెండు మూఁడు సబ్బుబిళ్లలపెట్టెలు మున్నగునాతనిసామాను లన్నియు స్థానౌచిత్యములేక యిటునటుఁ

బడియుండెను. అందువలన నత డప్పుడే తనబస నెచ్చటినుండియో యా మేడలోనికి మార్చియుండె నని యనుకొనవచ్చును.

ఆయుత్తరము నితరులు చూడఁగూడ దనుసంకల్పముచేతనో, వ్రాసినతండ్రిపైఁ గలకోపముచేతనో యాయువకుఁడు చదివినవెంటనే చించి పారవేసెను. అతఁడు కూర్చుండిన వాలుకుర్చీకి వెనుక నొక కొనను నల్లనిసర్జికోటును, రెండవకొనను గులాబిరంగు పట్టునెక్టైతోఁ గూడఁ దెల్లని యింగ్లీషుట్విల్లుషర్టును వ్రేలాడుచుండెను. ఆ కోటును షర్టునుమాత్రమే గాక, యాతఁ డప్పుడు తొడుగుకొని యుండిన జపానుదేశపుగుండీలబనియను, కట్టుకొనిన గ్లాసుగోమల్లు పంచయునుగూడ వాని కీజన్మములో మఱిఖద్దరుబట్టలపైఁ బ్రీతి పుట్టదని స్ఫురింపఁజేయుచున్నవి. విలాసలాలసులగు వేషధారులకును ఖద్దరుధారణమునకును సరిపడదు. పాతికయేండ్లకు లోపువాఁడగు నాయువకుఁడు దబ్బపండువంటి శరీరచ్ఛాయతో, నుంగరాలవలెఁ జుట్టుకొనిన ముంగురులతో, రెండుచెక్కలుగా నిటునటు విఱిచి దువ్విన ప్రక్కపాపటతో, లోచనములం దాల్చిన బంగరుసులోచనములతోఁ, జక్కనినూఁగుమీసముతో, మిక్కిలి యందకాఁ డనం దగియే యుండెను. కాఱుచీఁకటులు గ్రమ్ముచుండిన యాయుంగరాలముంగురులకుఁ దోడుగ నుదుటఁ బెట్టిన నల్లనియంగారుచుక్క వానిముఖమునకు మఱింత చక్కఁదనము నాపాదించుచుండెను. కాని తండ్రి వ్రాసినయుత్తరమును బట్టి యామందభాగ్యుఁడు భార్య నొల్లనివాఁడని తెలియుచుండుటచే నడవివెన్నెలంబోలిన యాతని చక్కఁదనము మనకుఁ బ్రశంసింపఁ దగినది కాదు. ఆవిలాసపురుషుఁడు దుర్వ్యయపరుఁడని యుత్తరములోని యంశములతో వాని

దుస్తులును సుగంధతైలాదికములును జతగా సమన్వయింపఁ బడు చున్నవి.

అది పదిగంటలవేళ. మఱియొకగంటకుఁగాని మనియార్డర్ల నిచ్చుటపాలావాఁడు రాఁడు. ఉత్తరము ముగించి చించినప్పటి నుండియు నాయువకునిదృష్టి కట్టెదుటనున్న మేడయందే తఱచుగ విహరింప సాగెను. ఇరువంకల రెండుకిటికీలతో వీథివైపున కొక్కగది మాత్రమే గలయామేడ మిక్కిలి చిన్నది. ఆయువకునిదృష్టిపథ మున నామేడతలుపులు చాలసేపువఱకు మూయఁబడియే యుండెను. కొంతసేపునకు వానితీక్ష్ణమైన చూపుతూపులచే భేదింపఁబడెనోయన నొకగవాక్షముమాత్రము తెఱవఁబడినది. తోడనే వాలుగుర్చీ యందుఁ చేరఁబడిన యావిద్యార్థి తటాలున ముందునకు లేచి కూర్చుండెను. కూర్చుండుటయె తడవుగ నొకయువతి జడ విప్పి కొనినతలకు రెండుచేతుల నూనె రాసికొనుచు నాగవాక్షముకడఁ బ్రత్యక్షమై వానింజూచి యొక్కమందహాసమును గావించెను. నిఱు పేదయైన కవికి రసజ్ఞుఁడైన ప్రభువిచ్చు వేయినూటపదాఱులకం టెను, మనయువకున కాచిఱునవ్వుకాన్క మిక్కిలి విలువయైనది. తా నొక్కచిఱునవ్వుతోడమాత్రమేగాక కరసంజ్ఞలతోఁగూడ నా పట్టపరీక్షావిద్యార్థి యామెచిఱునవ్వునకుఁ బ్రత్యుత్తర మొసంగెను. తైలసంస్కారము ముగిసినంతనే దువ్వెనయు నద్దముం గొనితేర నాజవ్వని యదృశ్యయైన యొక్కనిముసము నాతని కొకయుగ మైనది. అద్దమును గిటికీయందుంచి, దువ్వెనతోఁ బ్రక్కపాపట తీర్చుకొనుచు నాయువతియు; వాలుగుర్చీయందుఁ గూర్చుండి కత్తెర మార్కుసిగరెట్టు కాల్చుచు నాయువకుఁడును, మందహాసాదికసంజ్ఞ లతోఁ దమయనురాగములను గొంతసేపు ప్రకటించుకొనిరి. ఆశిరః కంపనములే— ఆహస్తసంజ్ఞలే— ఆరుచిరహాసములే— ఆప్రియుల

కప్పుడు దూతికలు. ఆపెదవికొఱికికొనుటలో నేమి యర్థము కలదో— ఆ మొగ మెగురవేయుటలో నెంత భావ మిమిడియున్నదో— మాటి మాటికి నొడలు విఱుచుకొనుచుండుటలో నేమి వ్యంగ్యమున్నది యో- ఎడతెగని యయ్యన్యోన్యముఖావలోకనముల నెంత యానంద మున్నదో— అన్యులకు మిక్కిలి దురవగాహము. ఆపరిచయ మా నా[illegible]మాత్రముగాక, కొన్నిదినములనుండియు వచ్చుచుండినదియే యయ్యు నాప్రియు లింకను సంజ్ఞాప్రకరణమునందే యుండిరి.

కట్టెదుటిమేడపైఁ గిటికీకడ నిలిచిన తనమనోహారిణి నీక్షిం చుచు శృంగారభావతరంగముల నుయ్యాలలూఁగుచుండిన యా బి. ఏ. విద్యార్థి యొక్కటపాలావానిందక్కఁ దక్కినప్రపంచమును మఱచె ననియే చెప్పవచ్చును. కాంతాకనకములు రెండును సమానములే. ఇం దేదియు విస్మరింపఁబడునది కాదు. మీఁదిపాపట సవరించు కొనుట కాజవ్వని తనమొగమును మిక్కిలి వంచుకొనినప్పుడెల్ల నతఁడు తనదృష్టుల వ్యర్థపుచ్చక పోస్టువానికొఱకు పోనిచ్చుచుండెను. తపాలావాఁ డిచ్చురూపాయిలను దనప్రియురాలు చూచుచుండ ఘల్లు ఘల్లున లెక్కించి పుచ్చుకొనవలయునని వానిముచ్చట కాఁబోలు! కాని నూతనప్రియుల శృంగారోద్యమములు ప్రారంభమునఁ బ్రతి క్షణాంతరాయము లగుటచేఁ బాపము వానిముచ్చట తీరలేదు. తన వా రెవ్వరో వచ్చుటచేతనో పిలుచుటచేతనో యాయువతి తటా లునఁ గిటికీతలుపులు మూసికొని మాయమైనది. సుందరీముఖశూన్య మైన యాగవాక్షమును జూచి చూచి యొక్కనిట్టూర్పు విడిచి, యావిద్యార్థి తనదృష్టుల నించుక మార్చినంతనే వానికి టపాలా వాఁడు కంటఁబడెను. తోడనే లేచి ముందుకుఁబోయి చప్పట్లు చఱచి, "సాహేబ్! వచ్చిందా?" అని యడిగి రమ్మని సంజ్ఞచేసి యతఁడు మఱలఁ గుర్చీయందుఁ గూర్చుండెను. రెండునిముస

ములలోనే పాదవిన్యాసములచేఁ గజ్జెమ్రోఁత ధ్వనించుచుండ పోస్టు సాహేబు మేడమీఁదకు వచ్చి కట్టెదుట నిలిచి "సలామ్ మహా రాజ్" అని కుర్చీయొద్దఁ జతికిలఁబడెను. ఆవిద్యార్థి గవాక్షముదెస నప్పుడప్పుడు తెప్ప లెత్తుచుఁ గట్ట విప్పుచున్న పోస్టువానితో నిట్లు ప్రసంగించెను.

"సాహేబ్! అయ్యరడిగేడాఁ? చెప్పలేదుకద?"

"నాదీ పీకా పోయినా సెప్తాన్ సామీ! మనియార్డర్ వస్తే కొంచెం సెప్పూ భాయ్ అని అయ్యర్ నాదీపాసం పీకేశింది"

"వాడికి రెండు నెల్లింటద్దె యివ్వాలి. అసలే వేపుస్తు న్నాడు. అందులో చెప్పకుండా ఇవాళ గది ఖాళీ చేశేశాను. ఇఫ్లా మరీ వేదుస్తాడు."

అని పలుకుచు సాహేబిచ్చిన మనియార్డరుఫారముమీఁద 'ఓ- సోమశేఖరరావు' అని యింగ్లీషుతో సంతకము చేసెను. సాహేబు రూపాయిలు లెక్కపెట్టుచు,

"నాకీ సెప్పకుండా మెందుక్కా యిల్లూ ఖాళీసెయ్యాలా అని అయ్యర్ పెద్దనోరూ సేసిందీ సామీ!"

"నోరు చెయ్యనీ! ఇప్పుడు నావల్ల కాదు. మొట్టమొదట పాల్ఘాట్ వాడికి కిస్తేనే కాని కాఫీ కల్లరి పెడుతున్నాడు."

అని చెప్పుచు సొమ్ము పుచ్చుకొని లెక్కచూచుకొని యా విద్యార్థి టపాలావానికి నాలుగణాలు బహుమానముగా నిచ్చెను. పోస్టుసాహేబా బహుమానమును రెండుచేతుల మిక్కిలి భక్తితో నందుకొని, లేచి సలాముచేసి సెలవుపుచ్చుకొనుటకు సిద్ధముగానుండ నతఁడు మఱల వానితో నిట్లనియె.

"సాహేబ్! ఈమొదటిమే డెవరిది?"

"ఒక తెల్గూ ప్లీడర్ పంతుల్ బాడాకూ తీశింది సామీ!"

"అలాగా? పంతులుకి పిల్ల లున్నారా?"

"కొడుకూవుంది— కూతుర్ వుంది."

"కూతురు మొగు డిక్కడే వున్నాడా?"

"ఇంకా పెళ్లి అయిందిలేదు సామీ! ఆపిల్లా గర్ల్సు హైస్కూల్లో సదుగూ సేస్తున్నాయ్"

"కొడు కేంచేస్తున్నాడు?"

"ఎగ్రికల్చర్ కాలేజ్లో సద్దరాన్కి కోయంబత్తూర్ పోడిసింది"

తనప్రియురాలి కింకను బెండ్లి కాలేదని యెఱిఁగి యాయువకుఁ డత్యాశ్చర్యచేతస్కుఁడై, చేరఁబడినవాఁడు ముందుకు లేచి కూర్చుండి, "ఇంకా పెళ్లి కాలేదా? నిజమేనా?" అని సాహేబును బ్రశ్నించుచు, నాయువతి వివాహిత యనుకొని, యామెస్నేహభాగ్యమనుభవింపఁ గోరుచుండినవాఁ డగుటచే, ఆమె యవివాహిత యని యిప్పు డాకస్మికముగఁ దెలియుటవలనఁ దనప్రణయరథము నింక మీఁద నెట్లు నడపింపవలయునో యని దీర్ఘాలోచనమున మునింగెను. ఆతన్మయత్వములో సాహేబు సలాముచేసి సెలవుపుచ్చుకొనుట యాతఁ డెఱుఁగనే యెఱుఁగఁడు. ఇట్లు పది పదునైదునిముసములవఱకు నతఁడు ప్రణయభావనాసమాధియందుండిన తరువాత నాయువకునకు, "బాబూ! ఉత్తరం" అనుమాటలు కర్ణగోచరములై మేనిపై స్పృహ కలిగించినవి. తోడనే యతఁడు మెట్లవైపు తిరిగిచూడ నచ్చట నొకముసలిది చేత నొకయుత్తరముతో వేచియుండి యాతఁడు తన్నుఁ జూచినంతనే వాని కాయుత్తరము నందిచ్చి తక్షణ మచ్చటనుండి నిష్క్రమించెను.

# ౬ వ ప్రకరణము

## — ఉత్సాహ భంగము —

"పదిహేనురోజుల్నుండి మీరు నన్ను రోజూ చూస్తున్నారు. నేనుకూడా మిమ్మల్ని చూస్తున్నాను. నన్ను మేరేజీ చేసుకోవడం మీ కిష్టఁవైతే మాఫాదరుతో చెప్తాను. ఆయనకన్సెంటు తీసుకొని మనం మేరేజి చేసుకోవచ్చును. నే నిప్పుడు స్కూలుఫైనలుక్లాసు చదువుతున్నాను. ఈసంవత్సరం ష్యూరుగా ప్యాసుకాగలనని అనుకుంటున్నాను. మీజవాబుకొరకు ఎదురుచూస్తున్నాను.

ఇట్లు,

హేమలత—

అని వ్రాయఁబడిన యుత్తరమును సోమశేఖరము చదువుకొనెను. ఆయుత్తరమునుబట్టి ఆమెపేరు హేమలతయనియు నతఁడు తెలిసికొనఁ గలిగెను. పెన్నిధి లభించిన పేదవిధమున నధికానంద భరితుఁడై యతఁ డాప్రియలేఖ నెన్నియోమాఱులు చదువుకొనెను. పోస్టుసాహేబువలన విన్నదియు నిప్పు డాయుత్తరమువలన గ్రహించినదియుఁ దప్ప నింతవఱకుఁ దాను ప్రేమించుచున్న ప్రియురాలింగూర్చి యతఁడు లేశము నెఱుఁగడు. మనసు నచ్చిన మచ్చకంటి కంటఁబడునెడ నాజవ్వని యెవ్వరను విచక్షణ మవసరము లేకయే, ముఖవికారములచేఁ దమమనోభీష్టమును నెల్లడించుచుండుట కాముకు లగువారియాచారము. కాముకుఁడైన సోమశేఖర మాయాచారము ననుసరించియే ప్లీడరుపంతులుకూఁతును ప్రేమిం

చుచుండెను. ఉత్తరము చూచినంతనే యాతనిప్రణయభావపరంపర లిట్లు వెల్లి వాఱఁజొచ్చెను.

"ఫాదర్ శాస్త్రి గొప్పప్లీడరు. తాను స్కూలుఫైనలు క్లాసు చదువుతున్నాది. ఎక్సలెంటుబ్యూటీ! వై షుడ్ ఐ నాట్ మేరీ హెర్ ? ఇన్నింటికంటే ఫైన్‌గావుంది ఆ హేమలతన్న పేరు. అది పేరు కాదు. రియల్లీ దటీజ్ ఎ డైమండ్ క్రౌను టు హెర్! ఓల్డు ఆర్థడాక్సుబర్డ్సుకాక ఫాదరు మాంచిరిఫైండుప్యూసున్న అప్‌టు డేట్ మేనై యుంటాడు. డవుటెందుకు? ఎంత గొప్పరిఫార్మరు కాకపోతే కూతురికి పోస్టుప్యూబర్టీ మేరీజి చేస్తాడు? సుబ్బమ్మట! సూరమ్మట! రాజమ్మట! వాజమ్మట! నేస్టీనేమ్సు!........అయ్యో పాపం! రాజ్యంఅంటే నాగుండె నీరై పోతుంది. షీ ఈజ్ ది మోస్టు అన్‌ఫార్చునేట్ క్రీచర్ ఆన్ ది ఫేస్ ఆఫ్ ది ఎర్త్! నే నేంచెయ్యఁగలను? దానితండ్రీ మాతండ్రీ యిద్దరూ కలసి దాని గొంతు కోసేశారు. ఆపాపం వాళ్లదేకాని నాది కాదు. పెళ్లిలో చూసిన దానిరూపం యిప్పటికి నా కంటికి కట్టినట్టే వుంది. ఆరూపం తల్చుకున్నప్పుడు పల్లెటూళ్లలో అమ్మకొనే వాళ్లాడించే పేరంటాలుబొమ్మ నాకు జ్ఞాపకం వస్తుంది. ఆస్ఫోటకం మచ్చలు—అరచెయ్యిదళసర్ని మొహానిండా పూసిన ఆపసుపూ ఆ పల్లెటూరినగలు—పసుపులో ముంచి చుట్టబెట్టిన ఆ పెద్దమధుపర్కం కుంకంతో పెట్టిన ఆబత్తెబొట్టూ— వోరూపా? రేఖా? నాజూకా?— దీ ఫస్ట్ సైట్ ఇట్సెల్ఫు ఈజ్ క్వైట్ టాక్వర్డ్ ఫర్ మీ! అయితే అప్పుడేం చెయ్యగలను? గుంటణ్ణి! లవ్వన్నా బ్యూటీఅన్నా అప్పుడు నాకేం తెలుస్తుంది. ఇదంతా ఎర్లీ మేరేజివల్ల వచ్చిన రిజల్టు?... ..............ఈమెద్రాసులో ఈనాలుగైదేళ్లలో నాలవ్ ఎఫేర్సన్నీ ఫేలయి పోయినా మఱి నాకు విచారం లేదు. బ్యూటీ అంటే హేమ

లతదే బ్యూటీ! ఆపొట్టివిగ్రహంలో వున్న ఎట్రాక్షన్ ఇంతాఅంతా కాదు. అది పక్షి పండిన గుజ్జుమామిడిచెట్టు! ఆయవయవాలన్నిటిలో యౌవనం నాట్యమని పలుకుతూంది! ఆగుండ్రనిముఖం! ఆ కాటుకకళ్లూ! ఆనాపులూ— ఆఛెస్టూ— ఆస్ట్రిక్చరే వేరు. అయితే నామెడని చుట్టుకున్న ఆ అన్ సివిలైజ్డు విలేజిబీస్టు నెలా వదుల్చుకోవడం? ............ఆపసుపుముద్దా! ఆముతకోక— ఆదెయ్యబొట్టూ? టూ అగ్లీ టు టోల్ రేటు! బ్యూటీవిషయంలో నాటెస్టు నాఫ్రెండ్సూ యెలాగో కనిపెట్టి మెచ్చ్యారైనప్పటినుండి దాన్ని విజయనగరములోవుంచి పట్టవాసపుమస్తాబు చేయిస్తున్నారట! ఐ సింప్లీ లాఫ్ ఎట్ దేర్ రిన్నోసెన్సు! ఎన్నిపుటాలుపెట్టినా ఇత్తడి ఇత్తడే. యస్ సిగ కలవాటుపడ్డదానికి వాల్జడా సిల్కురిబ్బన్ అడుక్కుతిన్నట్టే వుంటాయి. దుక్కరవిక తొడుక్కునేదానికి రోల్డుగోల్డు పైటపిన్ను వెక్కిరించినట్లే వుంటుంది. పసుపుతో పండిపోయిన మొహానికి జాస్మిన్ ఫేస్ పౌడరు యేడిచినట్లే వుంటుంది.

* * * * నేను హేమలతను మేరేజి చేసుకుంటే నాట్ విల్ బి ది కాన్సిక్వెన్సు? ఫాదరింట్లో కాలుపెట్టనివ్వడు— స్వార్జితం చాకదమ్మిడీయేనా నాకివ్వడు. బి. ఏ ప్యాసై వుద్యోగంలో ప్రవేశించేదాకా? హౌ కెన్ ఐ గెటాన్? పాదరికాలా పెద్దప్లీడరుకదా డౌరీ యేంవేనా యిస్తాడా? పల్లెటూరివాడైనా ఘస్తుమామగారే యిచ్చాడు వెయ్యిన్నూటపదహార్లు! ఇతను మూడువేలేనా యివ్వడా? డిటేల్సు ఏమైనా అడుగుదామంటే ఆ ముసిలిముండ వుత్తరం యిచ్చి నిలబడకుండా పోయింది. అయితేనేం? క్యాంపెయిన్ ఓపెన్ చేశాను కదా—యింక కరస్పాండెన్సులో పెట్టొచ్చు! నే ననుకున్నట్టు మూడు వేలూ నామొహాన్ని పారేస్తే నాఫాదర్నికాని అతనిప్రోపర్టీనికాని నేను కేర్ చెయ్యవలసిన పనిలేదు. బహుశా ప్రోపర్టీ కోడలికిచ్చేస్తాడేమో మాఫాదరు?ఆకోడలంటే చాలాప్రేమ! కాని—యిందు

లో చిన్న మజా వుంది. దానన్నగారు గొప్పరిఫార్మరు. నేను మేరేజి చేసుకున్నసంగతి తెలియగానే దానికి రిమేరేజి చేశేస్తాడు. అప్పుడు మాఫాదరు దానికి ప్రోపర్టీ యివ్వడు-ఇచ్చినా చెల్లదు. ఇంతకీ ఫాద రిన్‌లా హైకోర్టు ప్లీడరు. దావా పడేంచేస్తాను. నాకు రావలసిన మా మొదటి ఫాదరిన్‌లా యిచ్చిన వెయ్యినూటపదహార్లుకూడా కలుపుతాను. లీగల్‌పోయింట్సు చాలావున్నాయి* * * * *ఫాద రుతో విరోధం కుటుంబకలహా— కుటుంబాలు వేరయిపోవడం— దావాలు— ధనవ్యయం— అల్లర్లూ— చికాకులూ— హేమలతకోసం ఇన్నింటికీ సిద్ధపడాలి. వాటిఫ్? ఒక్కసత్యంకొఱకు హరిశ్చంద్రు డెన్నికష్టాలు పడ్డాడుకాడూ? అలాగే వొక్కలవ్‌కొఱకు నేనూ అన్ని కష్టాలూ పడాలి. మొట్టమొదట రిప్లైరాసి సిద్ధంగా వుంచుతాను. ముసల్ది కనబడగానే పిల్చి యిచ్చీవొచ్చు"

అని సోమశేఖరము వెనుకకుఁ దిరిగి కోటుజేబులోనున్న ఫౌన్‌టెన్ పెన్ తీసి, యచ్చటఁ గ్రిందఁబడియున్న పుస్తకములలోఁ జేతి కందుకొనివచ్చిన యొకనోటుబుక్కందుకొని, దానిలో నొక తెల్లనికాగితము చించి, "మై బిలవ్డ హేమలత!" అని వ్రాయు సరికి మెట్లమైపునుండి పెద్దతుమ్ము వానికి వినవచ్చెను. ఆయుపశకున మున కతఁడు మొగము చిట్లించుకొని, యాతుమ్మినవా రెవరోయని యటు విలోకించుచుండ మెట్లపై టప్పుటప్పున జోడుచప్పుడులతో నల్లనిసూటు తొడిగిన యొక తెల్లని దీర్ఘకాయుఁడు దొరటోపీ చంక యం దిమిడ్చుకొని మేడమీఁదికి వచ్చి "వొచ్చేసినావ్? సరే వొస్తు న్నాను. నీతో కొంచెం మాటాడాలి" అని సోమశేఖరముతోఁ బలుకుచు నేలఁ బడియున్న యచ్చటిసామానులను దాటుకొని, యా వరండాలోనుండి చావడిలోనికిఁబోయి చావడిగదితాళమును దీసి లోనఁ బ్రవేశించెను. సోమశేఖరము 'మై బిలవ్డ్ హేమలత' అని

వ్రాసిన కాగితమును మడిచి కోటుజేబులో నుంచి, వానితోం బ్రసంగమునకు సిద్ధమగుచుండ, ఆనూతనపురుషుఁడు కోటును టోపీ యనుమాత్రము లోన విడిచివచ్చి యచ్చటనున్న ట్రంకుపెట్టెపైం గూర్చుండి యిట్లు ప్రసంగించెను.

"శేఖరం! మనం ఫ్రెండ్సుం కాబట్టి నీమాట తోసిలేక నా రూము నీ కిస్తున్నాను. యూ నో దట్ ది సీ జవర్ నాన్ బ్రాహ్మిన్ లాడ్జ్! నిన్ను ఎలా చేశానని తెలుస్తే మావాళ్లు నన్ను చివాట్లు పెడతారు. అందుచేత మళ్లా మావాళ్ళందరూ వూళ్ళనుండి దిగబడకుండానే నువ్వు మరో లాడ్జి చూచుకో! ఈదసరా వెకేషనంతా ను వ్విక్కడే వుంటా వన్నమాట."

"ఇక్కడే వుంటాను. ఇంటికి వెళితే టయిము వేస్టవుతుం దోయ్! హిస్టరీనోట్సు కంప్లీటుగా రాసుకోవాలి. నీహిస్టరీనోట్సిచ్చావంటే నువ్వొచ్చేసరికి కాపీ చేశేసుకుంటాను. ఇంగ్లీషొకటి మస్తుగా చదవాలి. తాను చెప్పిన యెస్సేసు రాశానుకానని సామినాథప్పిళ్లే యేడుస్తున్నాడు. ఈసెలవుల్లో అవికూడా రాసేసి కాలేజీ పెట్టేసరికి వాడిమొహాన్ని పారేయాలి. ఇంటికి వెళ్లేనంటే హోప్ లెస్! ఏపనీ జరగదు. ఐ థేంక్ యు వెరీ మచ్! మీవాళ్లెవళ్లూ రాకుండానే మరోలాడ్జి చూసుకొని నీరూము ఖాళీ చేసేస్తాను. నువ్వు చెప్పినట్లే హోటల్ కీపరికి తాళం యిచ్చేస్తాను."

"నోట్సుకేం యిస్తానుకాని— నువ్వనుకుంటున్న దేదీకూడా యీసెలవుల్లో చెయ్యలేవు. క్లాసులెక్చర ర్సందర్నీ ఆశ్రయించి కాండక్టు సర్టిఫికట్సు సంపాదించి, రికమండేషన్సు చేయించుకొని, డిస్మిస్ కాకుండా చేసుకోడానికే నీకీ వెకేషనంతా పడుతుంది. నీ మీద బ్రహ్మాండంఅంత కేసు వచ్చింది. ప్రిన్సిపల్ మండిపడిపోతున్నాడు నీమీద." "వాట్? కేస్!"

అని యత్యాశ్చర్యముతోఁ జేరఁబడియుండినవాఁడు ముందున కుబికి కూర్చుండి—

"ఎవరుచెప్పేరోయ్ నీకూ! నాన్సెన్సు నామీఁద కేసేంవిటి?"

ఇవాళ మోర్నింగున సెవెన్ అయేసరికి ప్రిన్సిపలింటికి వెళ్లేను. నేనూ ప్రిన్సిపలూ మాటాడుతూండగా— లూసీయట! వుమన్సు కాలేజీలో చదువుతున్నాదిట— పాతికేళ్లుంటాయి— సన్నంగా పొడూగ్గా వుంటుంది. ఇహ నలుపేంవిటనుకున్నావ్! మహాప్రభో అది నలుపుసంసారంకాదు. తాహ కిరసనాయిలుమసీ రెంటూ మెదాయించినా అంత నలుపు రాదు. ప్రిన్సిపల్‌దగ్గిరకొచ్చి నీమీఁద వో కంప్లేయింటు పారేసింది."

"ఆముండని నే నెరుగుదును. మాలాడ్జిపక్క—నే దాని లాడ్జి. దానికి నాకూ పరిచయమేనా లేదు. కంప్లయింటేఁవిటి? ఏఁవిటా కంప్లేంటు."

"నువ్వు దానికి 'చంద్రవదన' అని పేరు పెట్టేవట."

"నాన్సెన్సు. ఆలాడ్జిలో నేను ప్రవేశించేసరికే దాని కాపేరుంది. ఎవరు పెట్టేరో నాకేం తెలుసును? ఇదేనా కంప్లెయింటు?"

"మూఁడురోజులుకిందట రాత్రి 11 గంటలప్పుడు కొంతమంది దానితలుపులు కొట్టి దాన్నేఁవో అల్లరి పెట్టేరట. ఆజట్టులో నువ్వొకడి విట."

"సింప్లీ అప్సర్డు. దానిక్యారక్టరు ఆవీధిలో అందరికీ తెలుసును. దానికూతలన్నీ నమ్మి ప్రిన్సిపల్ నన్ను పనిష్‌చేస్తే మీరంతా వూరుకుంటారా? కాలేజీ అంతా స్ట్రయిక్!"

"ఘ్యాచరెలావుంటుదో నేను గెస్ చెయ్యలేనుగాని దొరమాత్రం నామొహం చూస్తూ నీమీఁదో లెక్చరు బాదీశాడు. బహుశా—"

అని యింక నేమో చెప్పఁబోవుచుండ వీధిలోనుండి తన్నెవ్వరో పిల్చుచున్న ట్లగుటచే సోమశేఖరము లేచి మేడక్రిందకుఁ జూడఁగా నిరువురు వ్యక్తులు వానికంటఁ బడిరి. వారిలో నొకఁడు కళాశాలాధ్యక్షుని సేవకుఁ డగుటయు, మఱియొకఁడు తా నద్దె బాకీ యుండిన యింటియయ్య రగుటయు నతఁడు తెలిసికొని వెలవెలఁ బోవుచు నివ్వెరపాటు నొందెను.

## 7 వ ప్రకరణము

'నానూ ఇక్కాడే వుంతాను.'

మధ్యాహ్నము నాలుగు గంటలకుఁ గళాశాలామందిరమునఁ దన్నత్యవసరముగాఁ గలిసికొనవలయునని కళాశాలాధ్యక్షుని యాజ్ఞయైనట్లు సేవకుఁడు మేడక్రిందనుండియే సోమశేఖరమున కెఱింగించి తనదారి నేగెను. అయ్యరుమాత్రము క్రిందనుండి మాటాడి పోవక; రాత్రి నేనే వచ్చి మీతో మాటాడెదనని సోమశేఖరము చెప్పుచున్నను వినక, మేడమీదకు వచ్చి తనకు రావలసిన యద్దెసొమ్ము చెల్లింపవలయునని వానిని నిర్బంధింపసాగెను. అప్పుడు పుట్టిన వాగ్వాదమునఁ గ్రమముగా వారిరువురు మర్యాద నతిక్రమించి, యసభ్యప్రలాపములకుఁ గడంగి, తుద కొండొరులపైఁ గరచరణాయుధములను బ్రయోగింప సిద్ధపడిరి.

అప్పు డచ్చటనున్న సోమశేఖరమిత్రుఁడు సోమశేఖరమును వెనుకకు లాగి, యయ్యరును ముందుకుఁ ద్రోసి సమాధానపఱచి, యప్పటికిఁ బ్రమాదము లేకుండఁ దప్పించెను. అయ్యరు ముడివీడిన జుట్టును బిగి సడలిన గుండాలను సవరించుకొనుచుఁ గోపాతిశయమునఁ బెదవులు కంపించుచుండ నఱవ తెనుఁగున సోమశేఖరమును నేమేమో తూలనాడుచు, నొడలు తెలియని యావేశముతో, సోమశేఖరమును మ్రింగివేయునంత యాగ్రహముతో, మెట్లపైనుండి జాఱిపడునంత వేగముతో మేడఁ దిగిపోయెను.

అయ్యరుతో వివాదపడుచున్న దురవస్థలోఁ దనప్రియురాలి కంటఁ బడవలసివచ్చునేమో యనుభయమున సోమశేఖరము వాని కేకలకు మాఱుకేకలు వేయక మొదటఁ గొంత శాంతముగానే ప్రసంగించెను. కాని యంతకంత కయ్యరుధాటి యధిక మగుచున్న కొలఁది నతఁడు కోపము నాఁపుకొన లేకపోయెను. వానితోఁ గయ్య మాడ వలసివచ్చినందుకు సోమశేఖరము విచారించియు, నాసమయ మునఁ గట్టెదుటిమేడతలుపులు తెఱవఁబడనందుకు మాత్రము గ్రుడ్డిలో మెల్లగాఁ సంతసించెను.

ఆదినమంతయుఁ దనప్రియురాలికిఁ బ్రత్యుత్తరము వ్రాయునవ కాశము సోమశేఖరమునకు లేకపోయినది. మధ్యాహ్నము మూఁడు గంటలవఱకు నతఁడు తనమిత్రునితోడనే గడపి, పిమ్మట బకింగు హామ్‌క్లబ్బునకుఁ బోయి కాఫీత్రాగి, యచ్చటనుండి కళాశాలకుఁ బోయి తదధ్యక్షునిఁ గానక కొంతవఱకు వేచియుండి, యాతఁ డేదియో యుపాహారవిందున కాహ్వానింపఁబడెనని యచ్చటివారు చెప్పఁగా నారింటి కింటఁ జేరుకొనెను. తనకు గది యిచ్చిన మిత్రుఁడు నాటిరాత్రి యెనిమిదిగంటలమెయిలులో స్వగ్రామమగు తెనాలి

ప్రయాణమగుచుండుటచే సోమశేఖర మేడుగంటలకే భోజనముచేసి, మోమోటముచే దానును స్టేషనుకుఁబోయి వానిని రైలెక్కించెను.

రాత్రి తొమ్మిదిగంటలకు సోమశేఖరము సావకాశముగఁ గూర్చుండి తనకు వచ్చిన ప్రణయలేఖకుఁ బ్రత్యుత్తరమును వ్రాసి యామఱునాడుదయమున ముదుసలిదానిం బిలిచి దానిచేతి కిచ్చి పంపెను. అదిమొదలుగ వానికిని ప్లీడరుపంతులుకూతుఁనకును కొన్ని దినములవఱకు నుత్తరప్రత్యుత్తరము లవిచ్ఛిన్నముగా జరిగినవి. కాంతయందుంబోలెఁ గనకమునందుఁగూడ సోమశేఖరము లుబ్ధుం డగుటచే నేదే నొకయుత్తరమున 'నీతండ్రి మూఁడువేలు కట్నమిచ్చునా' యని వ్రాయనెంచెనుగాని, యట్లు వ్రాసినయెడల హేమలత తన్ను ధనప్రధానునిగా నెంచుననియుఁ దనయనురాగమును సంశయించుననియు భావించి మానివేసెను. కాని ముసలిది వచ్చినప్పుడుమాత్రము సావకాశముగాఁ గూర్చుండబెట్టి వరకట్నములను గూర్చి హేమలత తల్లిదండ్రులయుద్దేశము నడుగవలయునని నిశ్చయించుకొనెను. తాను బ్రేమించిన కన్య తన్ను వరించెనన్న యానందము లేశమును బొందనీయక, కలాశాలాధ్యక్షునివలనిభయము వానిని మిక్కిలి బాధించుచుండెను. తనతరగతితో సంబంధించిన యుపన్యాసకుల నందఱిని సందర్శించి, తనపై వచ్చిన నేరమును వారికి నివేదించి, వారినుండి యోగ్యతాపత్రికలను సంపాదించి, వానిని ప్రిన్సిపలునకు సమర్పించి, తనతప్పు తప్పించుకొనవలయునని సోమశేఖరము నిశ్చయము. కాని హేమలతాప్రేమలతాబద్ధుఁ డగుటచే నామెకంటఁ బడునప్పుడెల్ల గంటలకొలఁదిఁ దదీయసౌందర్యాలోకనోద్యమమున మునుఁగుచుండువాఁ డగుటచే మేడ విడిచి పోవుటకే వానికిఁ దీరిక లేకయుండెను.

ఇట్లుండ నొకనాటియుత్తరములో హేమలత యేమేమో కారణములు వ్రాయుచు, రేపుసాయంకాలము నాలుగుగంటలవఱకు మేడమీఁదకు రాఁజాలననియు, సంజెవఱకు మన మొండొరులఁ జూచుకొనుట తటస్థింపదనియు వ్రాయుటచేత, సోమశేఖర మా దినము హేమలతాముఖావలోకనోద్యోగమునకు సెలవుదినముగాఁ జేసికొని తనయుపన్యాసకులకడకు బయలుదేఱెను. కాని యాతని కెవ్వరు లిఖితరూపకములైన యోగ్యతాపత్రికల నీయక, సమయము వచ్చినప్పుడు కలాశాలాధ్యక్షునితో మాటాడెదమనిమాత్రము చెప్పి పంపివేసిరి.

ఉపాహారవిందున కాహ్వానింపఁబడిన కారణమున ప్రిన్సిపలు గారి దర్శనము తనకు లభింపనందున, వానియొద్దనుండి మఱలఁ దన కెప్పుడు పిలుపువచ్చునోయని, సోమశేఖరము మూఁడు నాలుగు దినములవఱకు నిరీక్షించెనుగాని వాని కట్టికబురు రాలేదు. అందుచే నతఁ డొకనాటియుదయమునఁ గళాశాలాకార్యస్థానమునకుఁ బోయి ప్రధానవిలేఖరిని గలసికొనఁగా, వారి కిరువురకు నింగ్లీషుభాషలో నీక్రిందిభావములుగల సంభాషణము జరిగినది.

"ఆవేళ నేను వచ్చినట్లు ప్రిన్సిపలుగారితో చెప్పేరా?"

"నిన్ననే చెప్పేను. నిన్నటివరకు ఆయన ఆఫీసుకు రాలేదు."

"చెప్తే యేఁవి టన్నారు?"

"ఊరుకున్నారు."

"మళ్లా నే నెప్పుడు రావాలో అడిగేరా?"

"అడిగేను. మీారు మరి రానవసరం లే దన్నారు."

ఈసంభాషణమువలన సోమశేఖరమునకుఁ గ్రొత్తధైర్యమును గ్రొత్తసంతోషమును గలుగ వానిభయమంతయుఁ దొలఁగిపోయినది. లూసీకన్యశీలము మంచిది కాదని ప్రిన్సిపలున కెట్లో తెలిసిన

దనియు, నందుపై నామె తనపై మోపిననేరము వట్టి యసత్యమని యాతఁడు గ్రహింపఁగలిగెననియు, ఆకారణముచేతనే తాను మఱి శా నవసరము లేదని ప్రిధానవిలేఖరితోఁ బలికెననియు, సోమశేఖ గము సమన్వయించుకొని గండము గడచిన ట్లువ్పొంగుచు, మార్గ మధ్యమున మఱియొకసారి కాఫీక్లబ్బునఁ బ్రవేశించి, రెట్టించిన ప్రియంబున సిగరెట్టు ముట్టించి పదిగంటల కింటఁ జేరుకొనెను. అది సోమశేఖరమునకు మిక్కిలి సంతోషదినము. హేమలతను బ్రేమిం చుట తనకు శుభప్రద మయ్యెనని వానికి స్ఫురించినది. ఆనాటి వాని హెచ్చరిక వానిచకచక వాని కూనిరాగములును గనువారును వినువారును లేకపోయిరి. ఉత్సాహాతిశయమున సోమశేఖర మూ గాడు, చిటికెలు వేసి పాటలు పాడుచు, అద్దమును జూచి క్రాపింగు సిద్దుకొనుచు, కస్త్రెరమార్కుసిగరెట్టు ముట్టించి పొగ విడుచుచు, గదినుండి వరండాలోనికిని, వరండానుండి గదిలోనికిని బచారు సేయుచు వాలుగుర్చియందుఁ గూలఁబడి తటాలున లేచుచుఁ, గొంత వఱకు మతిభ్రష్టునివలెనే సంచరించెను.

నాటిమధ్యాహ్నము రెండుగంటలకు సోమశేఖరము బకింగు హాంక్లబ్బు నలంకరించి కాఫీ త్రాగుచుండ వాని కొకక్రొత్తయాలో చనము స్ఫురించినది. బాహ్యాచర్యచే నతఁడు కాఫీ త్రాగుచుండి నను జిత్తము దీర్ఘాలోచనాయత్తమై యుండుటచేఁ జేతియందలి కాఫీ పాత్ర పదేసినిముసముల కొకసారి వానిపెదవికడకుఁ బోవుచుండెను.

"హేమలత ముద్దులమూట! ఈముద్దులమూటతో కూడా మూడువేల కట్నంమూటకూడా దొరుకుతే ఐ కెన్ ఈజ్లీ స్యాటి స్ఫై మై ఫాదర్! హేమలతనుచూసేసరికే కళ్లు జిగేల్ మంటాయి. ఆకోడలికీ ఈకోడలికీ తారతమ్యం అతనికే బోధపడుతుంది. తపస్సు చేసినా ఇలాంటికోడలు నీకు దొరుకుతుందా అని వ్రాళ్లోవాళ్లుకూడా

మందలిస్తారు. ఆమీద మూడువేలరూపాయిలూ మూటవిప్పి ముందర ఘస్లీన గుమ్మరించానంటే గేము గెల్చా నన్నమాటే! కాని శాఖకూడా వెలనాటి శేఖే వైవుంటే మామజాగా వుండును. ఏ శాఖో తెలియదు. ఎవరి నడిగినా తేలకుండా వుంది. ఈదిక్కుమాలిన చెన్నపట్టంలో సంవత్సరాలకొద్దీ యిరుగూపొరుగూ నివస్తూవున్నవాళ్లకికూడా వీళ్లసంగతి వాళ్లకీ వాళ్లసంగతి వీళ్లకీ తెలియదు. ముసిలాణ్ణి సేటిస్‌ఫై చెయ్యడానికిగాని యీశాఖాగీఖా యెవడి క్కావాలి? ఐ వాంట్ ఓన్లీ ఎ బ్రాహ్మిన్ గరల్! ఎండ్ షీ ఈజ్ ఎ బ్రాహ్మిన్ గరల్. ఫినిష్! అంతగా పీకమీదికొస్తే యేదో యింటిపేరు పెట్టి వెలనాటిదే అంటాను. కొంతకాలం గడిచిపోతుందికదా? ముసిలా డెంతకాలం బతకాలి? బైఛాన్స్ వెలనాటిదే అయితే యేబాధా లేదు. ఏసంగతి కనుక్కోడానికేనా— దేనికి ప్రియత్నించడానికేనా లూసీముండ నాకు తోచనిచ్చింది కాదు. నౌ అయామ్ వెరీ ఫ్రీ ఫ్రమ్ దీ ఏంగ్జైటీ! ఇహమీద వృత్తరాలమూలంగానో ముసిలిదానిమూలంగానో భోగాట్టాలన్నీ లాగాలి. కట్నంగురించి బ్రిసంగిచేముందు హేమలతకోమారు భుజాలు పొంగించాలి........ ...”

ఈయాలోచనములతోఁ దనపని ముగించుకొని బయలుదేఱి, సోమశేఖరము ట్రాముబండి నెక్కి, చైనాబజారునకుఁబోయి, ఒక 'వైటురోజు సబ్బుబిళ్ల' ఒక 'ఈకో సెంటుబోటిల్' ఒక 'కామినీ' తలనూనెసీసా ఒక 'జాస్మిన్ ఫేస్‌పౌడరు' డబ్బా— ఒక 'రోజు కలర్ సిల్కురిబ్బన్'— చిత్రమైన యొక 'రోల్డుగోల్డు సేఫ్టీపిన్'— కొని, యీవస్తువు లన్నింటిని బొందికగా నమర్చిపెట్టుటకుఁ దగిన చక్కని యొకయట్టపెట్టె నావర్తకు నడిగి పుచ్చుకొని, వానినందులో సవరించి, యింటికి మఱలెను. నాటియుదయమునుండియు

హేమలతాసందర్శనభాగ్య మొక్కమాఱయినఁ దనకు లభింపనం దున నాతఁ డెంత యాతురతతో నింటికి వచ్చెనో యంతసిద్ధముగానే వాని కాభాగ్యము లభించినది. ఒక్క దొరటోపీతప్ప సంపూర్ణ మైన దొరవేషమును ధరించిన సోమశేఖరము, మెడలోని గులాబి రంగుపట్టునెక్టయ్ గాలి కల్లలాడుచుండ మేడమీఁదకు వచ్చి, కట్టె దుటి మేడవరండాలోఁ దనకొఱ కెదురుచూచుచుండిన హేమలతను సందర్శించెను. ఒండొరులఁ జూచుకొనుట కత్యాతురులై యుండిన యాప్రియు లిరువురుఁ బరస్పరసందర్శనానందపారవశ్యమున నై దాఱునిముసములవఱకు నట్లే యుండి పోయిరి. ఆపారవశ్యమునఁ దమశృంగారవాంఛలను మనస్సులచేతనే యనుభవించుకొనిరి.

అది సుమారై దుగంటలవేళ. తెల్లని లేసుకుట్టిన యాకాశ వర్ణముచీర ధరించి, పటకాచేతుల నల్లరవిక తొడిగి, తలదువ్వి వాలుజెడ వేసికొని చేతంగల స్కూలుఫైనలు తరగతియాంగ్లేయ పాఠ్యగ్రంథముతోఁ, జిఱునవ్వులు నవ్వుచుండిన సుందరవిముఖ ముతో, హేమలత సోమశేఖరమునకు మిక్కిలి దర్శనీయమై యుం డెను. నేటికాంతలకు నవీననాగరకాభరణములగు తలపిన్నులు పైట పిన్నులు రంగుపేలికలు ఊలుముక్కలు మున్నగునవిదక్క హేమ లతకుఁ బేరునందున్న హేమము శరీరమునం దంతగాఁ గానరాదు. వరండాముందరి పిట్టగోడపై నున్నస్తంభమును బుస్తకమున్న చేతి తోఁ గౌఁగిలించుకొని, యొకచెక్క స్తంభమున కాని నిలిచి తన్నుఁ దదేకదృష్టితోఁ జూచుచుండిన ప్రియురాలిం జూచి, సోమశేఖరము మందస్మితాననముతో రెండుచేతులు దూరముగాఁ జాచి, యేదో శృంగారభావ మభినయింప నయ్యభినయభావ మాసుందరి గ్రహించి నదికాఁబోలు హాసలజ్జావనతవదనమై క్షణముమాత్రము తనముఖ మునకు స్తంభము చాటుచేసికొని మఱల వానికిఁ బ్రత్యక్షము

గావించెను. అంత సోమశేఖరము తనచేతనున్న యట్టపెట్టె నామె కుం జూపి, యిది నీకొఱకే యనియు ముసలిదానిం బంపుమనియు సంజ్ఞలతో నెఱిఁగింప, హేమలతయందలియర్థమును గ్రహించి, వెంటనే లోనికింబోయి మఱల నైదునిముషములకు వరండాలోనికి వచ్చుటయుఁ క్రిందనున్న చావడితలుపులు తటాలునఁ దెఱచి ముసలిది వీధిలోనికి వచ్చుటయు నొక్కమాఱే వానికంటఁ బడినవి. అతఁడు చూచు చుండఁగనే యావృద్ధదూతిక, రాకపోకలు సలుపుమోటారు బండ్లఁ కాఁగుచు, గుఱ్ఱపుబండ్లనుఁ దప్పించుకొనుచు, జనసమూహముల కొత్తిగిలుచు, మెల్లఁగా వీధిగుమ్మము సమీపించి, వీధియరుఁగుపై నున్నమెట్లెక్కి మేడమీఁదకు వచ్చెను. తోడనే సోమశేఖరము—

"అవ్వా! యిప్పెట్టిచ్చిసి జవాబిస్తే పట్రా!"

ముసలి దాయట్టపెట్టె నందుకొని,

"మరి నా నెల్తాను."

"వెళతావుకాని నీతో వోఘంట మాటాడాలి."

"పంతులొచ్చే యాలయింది. మరిప్పుడు కూకో నేను."

"ఇప్పటిమాటకాదు. రేపేనా సరే—వోఘంటమాటాడాలి."

"రెండేసీసరి కొస్తాను. నాలుగేసిందాకా కూకుంతాను."

"తప్పకుండా రావాలి. ఇదిగో ఈఅణా తీసుకొని చుట్టలు కొనుక్కో."

అని జేబులోఁ జేయి వెట్టుచుండఁగా నాముసలిది వ్యధికరణభావముతో నవ్వుచు, బుగ్గలు నొక్కుకొని మూతి మూఁడువంకలుగాఁ దిప్పి—

"అణా పుచ్చుకోవడానికి నాను దాసీముండ ననుకొన్నావా యేటి."

అని పలుక సోమశేఖరము తెల్లబోయి నొచ్చుకొని—

“అవ్వా! నువ్వెవరో నాకు తెలియదు. తెలియకన్నాను. కోపం తెచ్చుకోకుమీ’’

“ఛా! కోపం తెచ్చుకుంటానా? ఏంతమాట? యింతవస్త్రం పెట్టి నువ్వే నన్ను పోషించాలికదా? పిల్ల విడిచిపెట్ట నేను. నానూ నీకాడే వుంటాను.’’

# ౬వ ప్రకరణము

## ఆశాభంగములు

“ప్లీడరుమామ యిచ్చేకట్నంమాట తేలకపోయినా యీ ముసిలిదాన్ని పోషించడంమాత్రంతప్పనట్లు తేలింది. పిల్లని విడిచి పెట్టి వుండలేదట! దీన్నిపట్టి ఆదినుండీ యిల్లు కనిపెట్టుకొని వున్న దానిలాగ తోస్తూంది. అందుకే అణాడబ్బులియ్యబోతే దాసీముండ ననుకున్నావా అని చెప్పుతుంది. ఇది పిల్లని విడిచిపెట్ట లేనప్పుడు పిల్లమాత్రం దీన్ని విడిచిపెట్టి వుంటుందా? ముసిల్ది మనదగ్గరే వుండా లని హేమలత ఆర్డరు ప్యాస్ చేసిందట్టే, ఐ మస్టు అంబ్లీ ఓబే హెర్ ఆర్డర్స్. సరే! ఇదీ బాగానే వుంది. హేమలతా నేనూ నాటకాలికీ బయస్కోపులకీ షికార్లకీ వెళ్లేటప్పుడల్లా యీముండ యిల్లు కనిపెట్టుకుండడానికి పనికొస్తుంది. తెచ్చినవుత్తరం యివ్వడం—యిచ్చిన ప్రత్యుత్తరం పట్టుకెళ్ళడంతప్ప దీనిమాట—ఎప్పుడూ ఎరగను.

ఇవాళిదే మొదటిప్రసంగం! ఈ మొదటిప్రసంగంలోనే నన్ను "నువ్వా నువ్వా' అని ప్రారంభించింది. క్రమంగా 'ఒరే ఒరే' అనికూడా అంటుంది కాబోలు! హేమలతను నేను లవ్ చేసి నియర్లీ వన్ మంతవుతోంది. అప్పటినుండి యిప్పటివరకూ యెప్పుడు నాకంటబడ్డా హేమలతో ముసిల్దోతప్ప మరోఫిమేలీయింట్లో వున్నట్లు నాకు తోచలేదు. మొదటిఉత్తరంలో ఫాదరుతో కన్సల్టు చేస్తానని వ్రాసిందికాని ఫాదరుతోటీ మదరుతోటీ అని రాయలేదు. బహుశా మదరు లేదేమో? మదరు లేకపోతే హేమలతకి సంరక్షకులెవరు? ఇంట్లో వంట యెవరు? మేల్‌కుక్కుగాని ఫిమేల్‌కుక్కుగాని వున్నట్లుకూడా కనబడదు. మాలప్పూర్లో మంగళాష్టకాలని యిచ్చెన్నపట్టంలో జాతీ నీతీయేవిటి? ఈముసల్ది వండిపెట్టేస్తున్నాదేమో? అదే నిజమైతేమాత్రం ఐ రియల్లీ హేట్ దెమ్. నేనుకూడా వీళ్ల తలమీద ఎగిరిపోయే పెద్దరిఫార్మర్నికాని శూద్రిదానిచేత తిండమన్నా శూద్రిదాన్ని పెళ్లాడమన్నా ఐ సే దటీజ్ సింప్లీ హేట్. ఎంత అభిమానంగా వండిపెట్టినా ముసిల్ది తనకడుపు కాల్చుకోదు కద. వారానికోమాటైనా యేచాటునో యింతమాంసం వండుకొని తినకుండా వుండదు. అలాంటిదానిచేత తిండి తినడంకంటె మరి నేస్టీ లేదు... ... ...ఐ థింక్ దట్ దిసీజ్ ఆల్ మై ఫూలిష్ ఇమేజినేషన్. పెద్దప్లీడరు పనిచేస్తూ యిలాంటిఛండాలాని కొప్పుకోంటాడా? వెధవాళ్లో ముసలాళ్లో యింట్లో వుండేవుంటారు. వాళ్లెప్పుడూ నాకంట పడకపోవడంచేత నేనే రాంగ్‌నోషన్‌లో పడవలసి వచ్చింది. తొందరెందుకూ? తెల్లవారుతుందికదా? ఐ కెన్ క్లియర్ ఆల్ మై డవుట్సు ... ... ”

ఇట్టియాలోచనములతో సోమశేఖరమున కానాటిరాత్రి లేశ
మును నిద్ర పట్టలేదు. లేచుచుఁ గూర్చుండుచు నాలోచనలపై నా
లోచనలు చేయుచు సిగరెట్లు ముట్టించుచు కిల్లీలు నములుచు వరం
డాలో పచారు సేయుచు, దీపమును పెద్దదిచేసి హేమలత తనకు
వ్రాసిన యుత్తరములన్నియు నొకమారు చదివి యేయే యుత్తర
మునకుఁ దా నేమేమి జవాబులు వ్రాసెనో జ్ఞాపకము తెచ్చుకొ
నుచు, తెల్లవారుజామున మూఁడుగంటలవరకు నతఁడు కంటిపై
రెప్ప వేయలేదు. మూఁడుగంటలకు నిద్రించినవాఁడగుటచే సోమ
శేఖర ముదయ మేడుగంటలకు లేచి కాల్యములు నిర్వర్తించుకొని
యెప్పుడు రెండుగంటలగునాయని నిరీక్షించుచుండెను. అంతవఱకు
నెట్లు కాలము పుచ్చవలయునో వానికిఁ దోచలేదు. ఒంటిగంటనుండి
యుఁగూడ నతఁడు మేడవరండాలో వాలుకుర్చీయందుఁ గూర్చుండి,
తనచేతివాచీయందలిని ముసములుసైతము లెక్కించుచు వృద్ధదూతి
రాగమనము నత్యాసక్తితో నిరీక్షించుచుండెను. సోమశేఖరము
చేతివాచీలో రెండయినది. కాని ముసలిది తెరచుకొని రావలసిన
వీధిచావడి తలుపు లెంతకును దెఱవఁబడవయ్యె. రెండుగంటలపై
నొకపావుగంటయుఁ గ్రమముగా నరగంట యుఁగూడ నైనది.
తోడనే వాని కొక విధమైన సంశయముకూడఁ గలిగినది. ముసలిది
తనకుఁ జేసినవాగ్దానము మఱచెనాయనియు మూఁడుగంటలవఱకుఁ
జూచి యప్పుడూ రానియెడలఁ దాను బోయి తలుపుకొట్టి పిలుచుట
సాహసమగునాయనియు నాతఁ డాలోచించెను. కాని యట్టిసాహస
మతఁడు చేయవలసిన యవసరము లేకయే యింతలోఁ జావడితలు
పులలో నొకటి తెఱవఁబడినది. విస్తరి మూసిన వెండిపళ్లెర మొక
చేత నుంచుకొని ముసలిది వీధిగుమ్మములోఁ గాలుపెట్టినంతనే యా

మెవెనుకనే వచ్చిన హేమలత యామెతో నేమో కొంచెముసేపు మాటాడి తలుపులు మూసి లోనికిఁ బోయెను.

సోమశేఖర మీదృశ్యమును జూచి, శంకావ్యాకులత్వము లను విడిచి, నిర్భరానందభరితుఁ డగుచు, లేచి నిలువఁబడి చూపుల తోడనే యువ్వ నాహ్వానింపసాగెను. తొలినాఁడు తాను బంపిన కానుకకు బదులు కానుకగా నుపాహార మేదియో హేమలత తనకుఁ బంపెనని, వెండిపళ్లెముతో వచ్చుచుండిన యువ్వను జూచి సోమశేఖరము తలంచుచుండ నాతనితలఁపులలోనే యామెయు మేడమీఁదికి వచ్చినది. నూనె రాసి మెగదువ్వుకొనిన పంపుజుట్టు వీఁపున వ్రేలాడునట్లు ముడివేసికొనిన, చలువచేసిన తెల్లనిసన్నబట్టకట్టి మెడలోని యెఱ్ఱపగడాలపేరు చేతిలోని వెండిపళ్లెరముపైఁగల విస్తరిని దాఁచుచుండఁ దనయెదుటఁ బ్రత్యక్షమైన మూర్తికం గాంచి, సోమశేఖరము నవ్వుచు,

"ఇంతసేపు చేసావేమీ? ఆపళ్లెం విస్తరీ యేఁమిటి?"

"నీకోసం పలారం వొట్టుకొచ్చానాను."

"ఏఁవిటా ఫలహారం? ఇప్పుడు పుచ్చుకోలేను. తరవాత చూదాం"

"నువ్వానాగంతే పిల్లొప్పుకోదు. నీకోసంప్రత్యేకంసేయించింది'

"తప్పకుండా పుచ్చుకుంటాను. ఇప్పుడే కాఫీ తాగేను. ఆకల్లేదు. ఆపళ్లెం అలావుంచి కూచో! నీతో మాటాడాలనేవుందికాని తిండిమీద నాకంత దృష్టి లేదు."

"అనాగన్నావా? పిల్లకూడా అనాగే అంతాది."

అని పలుకుచుఁ బళ్లెరమును సోమశేఖరము కూర్చుండిన కుర్చీక్రిందఁబెట్టి యామె వానికట్టెదుటనే పిట్టగోడకుఁ జేరబడి కూర్చుండెను. అంత సోమశేఖరము—

"మీపిల్లక్కూడా తిండిమీద దృష్టి లేదనా చెపుతున్నావు?"

"మా కేటి? నువ్వొన్నాగైతే మాటాడాలని తొందర పడుతున్నావో అదికూడా ఆనాగే తొందర పడిపోతున్నాది. అతగాడూనానూ మొకమొకాలు సూసుకున్నయాల యెలాంటిదో మనస్సులిసి కేకున్నాం గాని అతడెవరో నాకు తెల్దూ నా నెవరో అతగాడికి తెల్దూ యెల్లే యెల్లే మాటాడిరాయే మాటాడిరాయే అని రోజూ పానాలు తినేస్తున్నాది."

"అయితే మరిన్నాళ్లూ యెందుకు వచ్చావు కావూ?"

"తీరుబడి నేక! మరేటి రావాలి– కూకోవాలి. కష్టం—సుకం మాటాడాలి. పంతులు కోర్టు కెలిపోతేనే తీరుబడుండదు. అందులో పదిరోజులు కాణ్ణించి యేదో సుస్తీఅనో జొరంఅనో కోర్టు కెల్లక వుండేపోతున్నాడు. వుండిపోయాడంటే నానో కూతురో తన కాడే కూకోవాల."

"పంతులు కేపాటి రాబడుంటుంది?"

"ఆవూసు తలుసుకుంటే పానం వుసూరుమంటాది. కొడుకేదో పెద్దపరీచ్చ సదువుతున్నాడని నెలనెలా నెలనెలా యాభై యేసీ యాభై యేసీ యూడీయెదాన్ని పోసేస్తున్నాడు. ఆదిక్కుచూలిన సదువుకీ వొందలూ యేలూకూడా సాలకుండా వున్నాయి. యిల్లు గుల్లైపోయింది. పంతులికి పణం పడిపోయింది. దోసిళ్ళకొద్ది దోసుకునే రోజు లెలిపోయాయి. మరికూతురి కేటెడతాడో యెలా పెల్లి సేస్తాడో తెల్దు. దానితల్లే బతికుంటే యీడాటలు సాగనిస్తాదా?"

"అయితే అవ్వా! హేమలతతల్లి చచ్చిపోయిం దన్నమాట. అంతేనా?"

"మరేటి సచ్చిపోబట్టే అనబగించడం అంతా ఆడిదై పోతున్నాది."

''కొడుకూ కూతురూ సవితిపిల్లలు కాబోలు?''

''సవితైవారంకాబట్టే సంసారం యిలా తగలబడి పోతు న్నాది.''

''కూతురిపెళ్ళిలో అల్లుడి కేఁవేనా కట్నం యిచ్చే వుద్దేశం పంతులి కున్నదా?''

''ఉత్తి యెత్తిమొకానివి. ఆడేఁటిస్తాఁడు? కొఱకరాని కొయ్య అల్లుడేటేనా యిస్తే పుచ్చుకుంటాడు. ఇవ్వడాని కేటేనా వుంటేనా? గాజులబేరం బోజనానికే సరి. సెనగలు తినేసి సెయ్యి కడిగేసుకుం తున్నాడు. నీలాంటిమూరా జాడిపెట్టుకీ పోతకీ ఆశ పడతాఁడాయేటి? ఆపిల్లే లచ్చదనం— దానిరూపే లచ్చదనం— దానికళ్లే లచ్చదనం—''

అని పళ్లెమువంకఁ జూచి, దీనముగా—

''పలారం సల్లారిపోతున్నాది. కసింతుచ్చుకోవా?''

అని ప్రార్థించెను. తన కింకఁ గట్నమునుగూర్చి యెట్టియాశ లేదని సోమశేఖరము మనసు చిన్నపుచ్చుకొని, మనోవికారమును లేశమును వెలుపలికిఁ దోపనీయక—

''అవ్వా! పుచ్చుకుంటానుకానీ— పిల్లచక్కఁందే కావచ్చు. నామాట కాదనుసుమీ! సంగతి చెప్తున్నాను. ఈకాలంలో వేలకొద్దీ దిమ్మరిస్తేనేకాని యెవడూ పెళ్లాడ్డు.''

''నాకెరిక. అందులోనూ యీగోరం బాపనోళ్ళలో మరీ వుంది. తల్లిబతికుంతే యెన్ని యేలేనా పోయించీసును. అది సచ్చి పోయింది. యేఁటి సెయ్యడం?''

''సచ్చిపోయి యెంతకాలం అయింది? నువ్వెంతకాలంనుండీ పంతులుదగ్గి రున్నావు?''

''చచ్చిపోయి రెండు చంవచ్చరా లయింది. పిల్లకి పానంమీఁ దికొచ్చిందని కెలిగ్గాపిస్తే పా రొచ్చినాను.''

"పిల్లకంటే? ఏపిలకి?"

"నాకూతురికే పానం మీదికొచ్చిందంతే పారొచ్చినాను."

"ఇందులో నీకూతు రెవరు?"

"పెద్దసదువు సదువుతున్నావేమో యేటలా గడుగుతావు? నాకూతురే పంతులుభార్య."

"నీకూతుర్ని పంతు లెలాగ పెళ్లాడేడు?'

"పెళ్లంటే పెళ్లా మేటి? వుంచుకున్నాడు.'

'అలాగా? అయితే యిప్పుడు బోధపడ్డాది. అవ్వా! నీకూతురు హేమలతకి కన్నతల్లా? పెంచిన తల్లా?'

'కన్నతల్లే! కన్నతల్లి కనకనే తల్లి సచ్చిపోయినపిల్లని పేగు పీగుతూంటే వొగ్గనేక యీపంతులుకాడ పడిగాపులు పడుతున్నాను. ఇతగాడికి మరిశాకిరీ సెయ్యనేను. నీలాంటిమారాజు పిల్లని పెళ్లాడితే నాకేటి నోపం?'

సోమశేఖరమున కామాట లేమియుఁ జెవి కెక్కలేదు. తన కట్నపుటాశ నిష్ఫలమైనందుకే సంతాపపడుచున్నా వానిహృదయయమునకు, హేమలత శూద్రగర్భసంజాత యనువార్త గోరుచుట్టుపై రోకటిపోటయినది. మితిమీరిన హృదయపరితాపముచేఁ గలిగిన మనోవికారమును ముఖమునఁ దోపనీయక. యతఁడు లోలోననే యుస్సురనుచు నాలుగైదు నిముసము లేమియు మాటాడక మిన్నకుండెను. అప్పు డవ్వ నవ్వుమొగముతో—

"అవ్వను పోసించాలంతే మనవఁడు మరిమాటాడ్డు. పోనీ అప్పటిమాట సూసుకుందాం. కసింతపలారం పుచ్చుకో! సల్లారిపోతూంది'

అని కుర్చీక్రిందనున్న పళ్లె మందుకొని, పైనున్న విస్తరి తీసివైచి వాని కందీయబోఁగా, సోమశేఖర మా యుపాహారమును

జూచి, యట్టి దెన్నఁడు నెఱుంగనివానివలెఁ గనుబొమలు ముడిచి,

''ఏఁవిటీ ఫలహారం? ఇది నా కిష్టఁవుంటుందో వుండదో''

''ఇష్టఁవైననోళ్ళిస్తే యెందు కిష్టం కాదు? పత్తేకం నీకోసం సేయించింది పిల్ల! కసింతుచ్చుకో! నేకపోతే సిన్నపుచ్చుకుంతాది.'

''పుచ్చికుంటానుకాని దీనిపే రేఁవిటి?'

''పులావ్''

''ఇది దేంతోటి చేస్తారు?''

'సన్నపాటిబియ్యం నేత్తో వుడికించి చేస్తారు.'

'ఇందులో వేఁవిటో ముక్కల్లాగున్నాయి. ఏఁవిటవి?'

'మాంసంముక్కలు! మరేటుంతాయి? బాపనోళ్లయితే వుల్లిపాయ లేసుకుంతారు.'

'నేను మాంసం తింటానని మీ రెలా గనుకున్నారు?'

'తినకపోడానికి నువ్వు బాపనోడివా యేటి?'

'నేను బాపనోణ్ణయితే మీపిల్ల నన్ను పెళ్లాడదుకాఁబోలు?'

'సిసీ! బాపనోణ్ణి పెళ్ళాడ్డానికి దాని కేం గాశారం? నాకూతురు బాపనోణ్ణెట్టుకొని అంత సుకపడ్డాది. ఇక నామనఁవరాలు కూడా సుకపడిపోతాది.'

'నేను బ్రాహ్మణ్ణికానని నీకూతురి కెవరు చెప్పేరు? దాని కెలా తెలిసింది'

'అదేటో ఎనాగ తెల్సిందో? ఆపోద్దూ— తొలీత నీ కుత్తరం యిచ్చిన్నాడు నన్ను పిలిసీ, నాయుళ్లు కుఱ్ఱోళ్ళంతా యెలిపోయారూ— వొక్కడే వుండిపోయాడు. రోజూ నాకాసి సూస్తావుంతాడు. నాకోసఁవే వుండిపోయా డనుకుంతున్నాను. ఈవుత్తరం తీసికెల్లిచ్చీమ్యే అంతే తెచ్చి నీ కిచ్చినాను.?

అని చెప్పి రెండునిముసములుమాత్ర మూరకుండి, మాఱు

మొగము పెట్టుకొని నిశ్చేష్టితుఁడై కూర్చుండిన సోమశేఖరమును జూచి,

'యేటనా కూకుంతావు? వొక్కసంగ తెడుగు తాను సెప్పమిరా

అని యేమో యడుగ నుద్యమించుచుండ నింతలోఁ గళాశాల సేవకుండొకఁడు వచ్చి సోమశేఖరమున కొకయుత్తర మిచ్చి పోయెను. అతఁ డాకవరు చించుచు, 'అవ్వా! మరోనాడు వసే మాటాడొచ్చు. ఇవాళకి వెళ్లు' అని యామెను బల్తిరముతోఁ గూడఁ బంపివేసి, యుత్తరము చదివి, నీప్రవర్తనము తృప్తికరముగా లేనందున నీ వీకాలేజి విడిచి మఱియొక కాలేజిలో చదువుకొనుటకు, దరఖాస్తు పెట్టి నీట్రాన్సుఫరు సర్టిఫికెట్టు పుచ్చుకొనవలయునని తనకు ప్రిన్సిపలు వ్రాసినయాజ్ఞగాఁ దెలిసికొని కళాహీనమైన మొగముతోఁ జింతాక్రాంతచిత్తుఁ డయ్యెను. ఆనాటిజాతకచర్యలోఁ బాపము సోమశేఖరమున కన్నియు నాశాభంగములే!

## 8 వ ప్రకరణము

## —• తథాస్తు •—

''కమలా! పాఠం వచ్చింది కాదు. ఇప్పుడు చదివి అప్పచెప్పి మరీవెళ్లు. మాణిక్యం! నీ కాటమీదున్న సరదా చదువుమీద లేదన్మా! వేగిరం లెక్క చెయ్యి! ఆన్సరు తప్పు రాకుండను—

సీతమ్మా! ని న్నెందుకు వచ్చావు కావూ? ఏఁవేనా అంటే సంగీతం మేష్టరు విడిచిపెట్టలే డంటావు. సుబ్బా! నీయిష్టంవచ్చినట్లూ రాస్తే నేను వరవడిపెట్టడం యెందుకు? శాంతా! ఇంగ్లీషుపేష్లూ రాశావు కావు. పద్యంకూడా వచ్చిందికాదు. మాఅమ్మ తమ్ముణ్ణెత్తుకొని ఆడించమంటుంది యెలా పాఠం చదవడం అంటావు! మళ్లా నీకు సంగీతం— పద్యాలు— పాఠాలు— ఇంగ్లీషు— లెక్కలు, అన్నీనొక్క-మారే రావా లంటారు మీఅమ్మగారు............''

అని బాలికల మందలించి పాఠములు చెప్పుచు, లక్ష్మీకాంతము ఎనిమిదిగంటలకు వసంతరావుగారి యింటిచావడిలోఁ గూర్చుండెను. పిల్లల కండఱకు ఆయిల్లు మిక్కిలి చేరువగా నుండుట చేతను, ఆయింటిచావడి మిక్కిలి విశాలమైన దగుటచేతను లక్ష్మీకాంతము మొదటినుండియు నచ్చటనే 'ట్యూషన్లు' చెప్పుచుండెను. నున్నని గచ్చుగోడలు చక్కని గచ్చునేలయు, ఆకుపచ్చని వార్నీసు పూసిన బల్లసరంబీయును, పలువిధములగు రవివర్మపటములు, నట్టనడుమ వ్రేలాడుచున్న పదునాలుగు క్రొవ్వొత్తుల హేంగింగు లాంతరు, అక్కడక్కడ గోడలకు వేయఁబడిన రంగురంగులబొమ్మల క్యాలండర్లు, ఆచావడి కలంకారములై తద్గృహస్థులు ధనవంతులని సూచించుచుండెను. మూఁడు నాలుగు కుర్చీలుమాత్రము నిరుద్యోగులవలె మూలమూలలఁ బడియుండఁ జావడినడుమ వేయఁబడిన ఖర్జూరపుఁజాపలపై బాలికలు కూర్చుండిరి. వారికిఁ గట్టెదురుగా గోడకుఁ జేరఁబడి లక్ష్మీకాంతమును, వానికుడివైపున వాలుగుర్చీయందు హిందూపత్రిక చదువుకొనుచు వసంతరావును సుఖాసీనులై యుండిరి. పిల్లలెవరైనఁ బద్యము తప్పుజెప్పినప్పుడుమాత్రము వసంతరావు పత్రిక చదువుటమాని వారిముఖములను నవ్వుముఖ

ముతో వీక్షించుచుండెను. బాలికలచే బద్యములు చదివించుట యందు వానికి మక్కువ యెక్కువ. అతఁడు కూర్చుండిన వాలు కుర్చీపై నొకచే యిడుకొని, తనయొడిలో నుంచుకొనిన భాస్కర రామాయణములోని తనపాఠ్యభాగమగు సీతానుసూయాసంభాషణ ఘట్టమునం దా నప్పు డప్పుడెప్పవలసిన పద్యములను స్వారాజ్యము చూచుకొనుచుండెను. లక్ష్మీకాంతమున కెడమవైపున భ్రమరాంబ యవనతముఖియై కూర్చుండి, తనముం దుంచుకొనిన సాతాని భారతప్రతి చూచుచుఁ బ్రక్కనున్న నోటుపుస్తకములో నేమో వ్రాయుచుండెను.

తీవ్రమైన జ్వరముచే నీరసించిన లక్షణము లింకను భ్రమరాంబ ముఖమునందుఁ గానవచ్చుచునే యున్నవి. సంపూర్ణజవసత్వము లింకను నామెకుఁ గలుగలేదు. నూతిలోఁ బడినయలజడిచే నామెకు రెండుదినములుమాత్రమే జ్వరముకాచి విడిచినది. జ్వరము విడిచి వారముదినములు గడిచినను నారెండుదినములజ్వరమే పాప మామెను మిక్కిలి నీరసింపఁజేయుటచే, నింకను నాలుగైదునాళ్ళ వఱకుఁ బుస్తకము చేతఁ బట్టవలదనియు నిల్లు కదలవలదనియు లక్ష్మీకాంత వసంతరావు లెంత బోధించినను భ్రమరము వినలేదు. మొదలే యాదరిద్రగృహమన్న నామెకు నరకప్రాయము. అందుపై వదినగారును బెద్దన్నయుఁ దల్లియుఁ దమకు జ్ఞాపకము వచ్చి నప్పుడెల్ల సోమరాజును బెండ్లాడుమని బోధించుచుండుట యామెకుఁ నరకముకంటెను గష్టతరముగా నుండెను. ఇన్నింటికంటె నామెకుఁ గష్టతమమైనది సోమరాజింటనే యుండుట. పెండ్లియత్నములు భంగమై వచ్చిన బంధుపులు వెడలిపోయినను సోమరాజుమాత్రము కదల లేదు. పంచలచాపులకొఱ కిచ్చిన పదిరూపాయిలును, లక్ష్మీకాంతము తన కిచ్చివేయునందున నాసొమ్ము వసూలు చేయుటకుఁ దన

కుమారునుంచి వియ్యపురాలైన రంగమ్మ యత్యాగ్రహముతో వెడలిపోయెను.

లక్ష్మీకాంత మానాడు పదిరూపాయీలతో నొకబట్టలయం గడికిఁ బోయి యచ్చటఁ గుమిగూడియుండిన పలువురు బేరగాం డ్రలోఁ గూర్చుండి, వారిలో నొకఁడు తాను గొనఁదలచుకొన్నట్టివే రెండుచాపులను బదిరూపాయిలకు బేరమాడి పుచ్చుకొనుటచేతఁ దా నింక బేరమాడవలసిన పనిలేదని తనకుఁగూడ నట్టిచాపు లొకజత యిమ్మని వర్తకు నడుగుచు జేబులోనున్న నోటుతీసి వాని కిచ్చెను. అతఁడు నోటిచ్చినమాట యాకోమటి బేరముసందడిలో మఱచుటచే, నిచ్చితినని లక్ష్మీకాంతము, నీయలేదని వర్తకుఁడును దగవులాడు కొనఁ జొచ్చిరి. ఆతగవులాటలో నచ్చటివారు వర్తకునిపక్షముననే మాటాడుటచే లక్ష్మీకాంత మింకఁ జేయున దేమియులేక, చేరువనే యున్న పోలీసుకార్యస్థానమునకుఁబోయి యచ్చటి రక్షకభటాధి కారితోఁ జెప్పుకొనఁగా నయ్యధికారి వెంటనే వర్తకునకుఁ గబురంపి రప్పించి, వారినేరమును విచారించి, నీకు సాక్షు లెవరని లక్ష్మీకాం తము నడుగఁగా, నెఱ్ఱపూవుల తెల్లపట్టుగుడ్డ కొనవచ్చిన యేఁబది యేండ్ల వృద్ధుఁ డొకఁడు తాను నోటిచ్చుచుండఁగాఁ జూచినాఁ డనియుఁ గాని యాతఁ డెవరో పేరేమో యిల్లెక్కడో తనకుఁ దెలియదనియు మఱలఁ జెప్పుకొనెను. తెలియనియెడలఁ దెలిసికొని సాక్ష్యము తెచ్చుకొమ్మని, యాయధికారి లక్ష్మీకాంతమును బొమ్మన నతఁడు చేయున దేమియులేక చిన్నవోయిన మొగముతో నింటికి మఱలవలసినవాఁ డయ్యెను. ఈవిధముగాఁ గోలుపోయిన పదిరూపా యిలును దాను చెల్లించువఱకును హరిశ్చంద్రుఁడు నక్షత్రకుని వెం బోలె లక్ష్మీకాంతము సోమరాజును భరింపవలసినదే.

ఆ నాఁడట్లు వసంతునియింటిచావడిలో లక్ష్మీకాంతము బాలికలకు విద్య నేర్పుచుండ, వానిప్రక్కనే కూర్చుండిన భ్రమరము కొంతసేపువరకుఁ దనవ్రాఁత ముగించి, ‘పద్యానికి దండాన్వయం రాశాను. చదవనా’ అని వాని నడిగెను. వెంటనే యతఁడు చదువుమనుటయు నామె తన వ్రాతపుస్తకము నెత్తి పట్టుకొని, ‘సూర్యుని కాంతివంటి కాంతికలవాఁడా!—.........’ అని చదువఁబోవుచుండ లక్ష్మీకాంతము వారించి, ‘అర్థంకాని దండాన్వయంకాని చెప్పేటప్పుడు పద్యం మొదట చదివి మరీ చెప్పాలి’ అని చెప్ప భ్రమర మీక్రిందిపద్యమును జదివెను.

“ఉ॥ నిగ్రహ మేది నన్నుఁ ధరణిప్రభ! కూపము వెల్వరించు నా
డుగ్రమయూఖుసాక్షిగ మహోన్నతదక్షిణపాణిఁ జేసి భూ
పాగ్రణి! నాదుదక్షిణకరాబ్జము పట్టితిగాన మున్నె పా
ణిగ్రహణంబుఁ జేసి తది నీమది విస్మృతి నొందఁ బాడియే.”

పద్యము చదువుమని లక్ష్మీకాంతము చెప్పినప్పుడే వసంతుని విలోకనభ్రమరములు భ్రమరము ముఖపద్మముపై వ్రాలినవి. పద్యము చదువుటలో భ్రమరమునకుఁగల నేర్పచ్చటిబాలికలలో నెవ్వరికి నలవడలేదు. ఆమెత్తుబడి—స్ఫుటమైన యాయుచ్చారణము—అర్థస్ఫూర్తి కనువైన యావిఱుపులు— ఆముగింపు— ఇన్నిటికిని వన్నె వెట్టు మనోహరమైన యాకంఠస్వరమును భ్రమరమునకు లక్ష్మీకాంతమునుండియే యలవడినవి. స్కూలుఫైనలు ప్యాసై చదువు మానినతరువాత లక్ష్మీకాంతము విజయనగరమునందలి ధర్మప్రదర్శకనాటకసమాజములో నెలకుఁ బదునైదురూపాయిల జీతముపై నొకసంవత్సరము పనిచేసి నారదపాత్ర నభినయించుటయందును బద్యమును జక్కఁగాఁ జదువుటయందును మిక్కిలి ప్రసిద్ధుఁడయ్యెను. లక్ష్మీకాంతము పద్యము చదువుట నిత్యము వినుచుండిన దగుటచే

భ్రమరమున కాతనివదనయు నాశైలియు సూక్ష్మముగా నలువడినవి. పద్యము చదివినప్పుడేగాక దానికి దండాన్వయము చదివినప్పుడుం గూడ వసంతునిచూపు లామెయందే యుండెను. ఆచూపులు గూఢ భావభరితములై— పద్యములు చదువునప్పు డితరబాలికలఁ జూచి నట్టి చూపులలో లేనినూతనత్వమును సూచించుచుండెను.

వ్రాసిన దండన్వయము విన్నంతనే లక్ష్మీకాంతము భ్రమ రమును జూచి, "ఈపద్యానికి తాత్పర్యంకూడా చెప్పు. తరవాత కొత్తపద్యం చెప్తాను." అని పలుక నాబాలిక యించుకసే పాలో చించి, "ఓయయాతిమహారాజా! ఆనాడు నూతిలోఁ బడిననన్ను నీవు వెలుపలికి తీసినప్పుడు సూర్యభగవానుఁడు సాక్షిగా నాదక్షిణ హస్తము నీదక్షిణహస్తముతోఁ బట్టుకొంటివి. కావున నప్పుడే మనకుఁ బాణిగ్రహణము జరిగినది. దీనిని నీవు మఱువవచ్చునా అని తాత్పర్యము" అని చెప్పెను.

కడపటిపలుకు లామెనోటనుండి వెలువడుచుండ, నప్రయ త్నముగ నామెదృష్టు లొక్కక్షణము మాత్రమే వసంతుని ముఖ ముపైఁ బ్రసరించి, యాక్షణమునందే మఱియొకవంకకు మాఱి పోయినవి. ఆయొక్కక్షణము చూపు నామె ముఖము నపూర్వ భావసూచకముగాఁ గావించినది. అప్పటి కాచావడిలోఁ గూర్చుండి యుండిన గంటసేపులో భ్రమరముదృష్టు లెన్నియో సారులు వసంతు నిపైఁ బ్రసరించెనేకాని, యేకారణముననో యాయేకక్షణవీక్షణము వలన నామెముఖమునకుఁ గలిగిన విలక్షణము తత్పూర్వవీక్షణముల వలన కలుగలేదు. ప్రస్తుతపాఠమగు పద్యమునందలి యర్థవిశేష మునుబట్టి నూతిలోఁ బడినతన్ను వసంతుఁ డుద్ధరించుట యామె కాకస్మికముగ జ్ఞప్తికి వచ్చియుండవచ్చును. దేవయాని ప్రార్థన వాక్యముల వసంతుఁడు తన్నుఁ జూచి నవ్వుచుండఁ దననోటఁ దా

నుచ్చరించుట యామెకు లజ్జ వొడమించి యుండును. లజ్జ వొడముటచేతనే కాఁబోలు తరువాతిపద్యమును జదువుమని లక్ష్మీకాంత మడిగినంతనే భ్రమరము నేటికి మఱిచదువలేననియు శరీరములో నీరసముగా నున్నదనియుఁ జెప్పి లజ్జావనతవదనయై మౌనము దాల్చెను. ఎట్టులైన నాదినుండియు వసంతునివంకఁ బ్రవహించు చుండిన స్వచ్ఛమైన యామెస్నేహప్రవాహ మాక్షణము నుండియు లజ్జాపంకసంకుల మయ్యెనని చెప్పక తప్పదు.

భ్రమరమును మఱిపద్యము చదువుమనక లక్ష్మీకాంతము స్వారాజ్యమువంక దృష్టి సారించి, 'నువ్వు చెప్పవలసిన రెండుపద్యాలుకదూ?'' అని యడుగ 'ఔను— చిన్నవని రెండుపద్యాలు చదవమన్నారు' అని పలుకుచు నామెపుస్తకమును మూసి మొగమెత్తి—

''గీ॥ ఒక్కమన్ననతో నున్న నొల్లకున్నఁ
గరము నెయ్యుఁడై యున్నను గాకయున్న''

అని రెండుచరణములు మాత్రమే యప్పగించుసరికి, వీధిగుమ్మములోనుండి—

''మగఁడు ప్రియతముఁ డనియుండు మానవతికి
నెల్లలోకసుఖంబులు నెదురు వచ్చు.''

అని తక్కిన రెండుచరణములును జదువుచుఁ బచ్చనిశరీరచ్ఛాయగల యొకవృద్ధబ్రాహ్మణుఁడు నవ్వుమొగముతో నాచావడిలోఁ బ్రవేశించెను. వానిం జూచినతోడనే స్వారాజ్యము తటాలున లేచి తొట్రుపాటుతో వెనుక కడుగులు వేయుచుఁ జేరువనున్నగోడకుఁ జేరఁబడి మొగము వంచుకొని నిలిచియుండెను. వసంతరావు వాలుకుర్చీనుండి లేచి నవ్వుమొగముతో నమస్కరించి, 'ఇలా దయచెయ్యండి! ఇదేనా రావడం!' అని పలుకరింప నాబ్రాహ్మణుఁడు, 'ఆహా! యిదే రావడం! ఇప్పుడే బస్సు దిగేను.' అని

చెప్పుచు వసంతుని సమీపింప నతఁడు వాలుకుర్చీ చూపుచు 'ఇలా దయచేయండి' అని గౌరవించెను. ఆవృద్ధుఁడు నవ్వుచు, 'పల్లెటూరివాళ్ళం మా కీకుర్చీ లెందుకోయ్. ఇందులో కూర్చుంటే నాకు నూతిలో పడ్డట్టుంటుంది.' అని నేలనే చతికిలఁబడి, తనతోఁ గూడ నేలనే కూర్చుండిన వసంతరావును జూచి 'అంతా క్షేమమేనా? నాన్నగారీమధ్య దయచేసినట్టు కనబడదు.' అని యడుగుచు వానిప్రత్యుత్తరము వినకయే వెనుకకుఁ దిరిగి 'అమ్మా! రాజ్యం! ఇలారా! ఏదీ ఇందాకటిపద్యం?' అని పిలువ స్వరాజ్యము నవ్వుచు మాఱుపలుకక నేల బొటనవ్రేల రాయుచు నట్లేయుండెను. 'వెఱ్ఱిదానివి కాని నాదగ్గిర సిగ్గెందు కమ్మా! ఇలారా! తప్పు లేదిలారా!' అని యాబ్రాహ్మణుఁడు మఱల నిర్బంధించుటయు, లక్ష్మీకాంతవసంతరావులుఁగూడఁ దన్నుఁ బ్రోత్సహించుటయు, స్వరాజ్యము మెల్లఁగా వచ్చి యవనతవదనయై వానిప్రక్కనే కూర్చుండ, వృద్ధుఁడామెతలపైఁ జేయిడి, వంచిన మొగమును బైకెత్తి నవ్వుమొగముతో, 'ఏదీ ఇందాకటిపద్యం?' అని పలుకుచుఁ బురాణపఠనమం దారితేరిన కంఠస్వరముతో, 'ఒక్కమన్ననతోనున్న నొల్లకున్న' అను మొదటిచరణమును జదివి, 'చదువమ్మా! చదువు! వింటాను.' అని బ్రతిమాలసాగెను. 'ఆయనదగ్గిర సిగ్గెందుకమ్మా? మామూలుగానే పద్యాలప్పచెప్పు' అని లక్ష్మీకాంతము పలికినంతనే స్వరాజ్యము చేలాంచలము సవరించుకొనుచు మొగము వంచుకొని యీక్రిందిపద్యములను జదివెను.

"సీ॥ ఒక్కమన్ననతోనున్న నొల్లకున్న,
కరము నెయ్యుఁడై యున్నను గాకయున్న
మగఁడు ప్రియతముఁ డనియుంట మానవతికి
నెల్లలోకసుఖంబులు నెనయ వచ్చు॥

క॥ నడవడి యొప్పక యుండినఁ
గడునిర్ధనుఁడైనఁ బతియె గతియును విను మొ
క్కఁడు బంధుండును బ్రియుఁడున్
బడతులకుం బరమగురుఁడుఁ బరదేవతయున్''

ఆపద్యములు విని యాబ్రాహ్మణుఁడు పట్టరాని యానంద ముతో నామెవీపుపైఁ దట్టుచు, 'శబాస్! బాగా చదివేవమ్మా! ఈవాక్యాలెవ రెవరితో చెప్పినవో తెలుసునా?' అని ప్రశ్నింప 'అనసూయ సీతతోఁ జెప్పిన పతివ్రతాధర్మా' లని యామె బదులు చెప్పెను. ఆవృద్ధుఁ డంతతో నూరకుండక, యాపద్యములతో సం బంధించిన ప్రశ్న లింక నేమేమియో యడుగుచు, అన్నింటికిని దగిన సమాధానములను బడసి మఱింత సంతసించి, 'రాజ్యం! నీతండ్రి గారు గొప్పపండితులు! నీయన్న పెద్దపరీక్ష చదువుతున్నాడు. మీ కుటుంబంలో చదువురాని వాళ్లెవళ్లు? నువ్వు విద్యావతివి కావడంలో యేఁవీ ఆశ్చర్యం లేదు. ఓమారు నిన్ను చూడాలని బుద్ధి పుట్టి యిలా వచ్చాను. నాన్నగారికీ అన్నయ్యకీ నామీ దెంత కోపం వున్నా నిన్ను చూడకుండా వుండలే నమ్మా! పెద్దకాలం అయి పోయింది. ఇహ నెంతో కాలం బతకను. ఏదో యీనాలుగునాళ్లూ అప్పుడప్పుడు వచ్చి నిన్ను చూస్తూవుంటాను.'

అని పలుకుచుండ వసంతరావు మందహాసముతో,

'నాకు కాని నాన్నగారికి కాని మీమీద కోపం యెందుకు? అలా సెలవియ్యడం న్యాయం కాదు.'

'కోపం లేకపోతే సంతోషమే. కోపం వున్నప్పటికీ నేను రావడం మానలేరు— పిల్లని చూడ్డానికి—'

'అప్పుడప్పుడు వచ్చి చూస్తూ వుండడమేకాని, కోడలిని యెప్పుడూ చూస్తూవుండే యేర్పాటు మీరింకా చెయ్యదలచుకో లేదు.'

'పిల్లవాడిచదువు పూర్తయేదాకా.'

'క్షమించండి మామగారూ! చదువుకీ కార్యం చేసుకోవడానికీ సంబంధ మేమిటండీ?'

'ఆసంగతి నీతో సావకాశంగా మాటాడాలనే వచ్చాను. అతను యీవిజయదశమికి వస్తాడు. రమ్మని రాశాను. సలభైరూపాయలు మనియార్డరుకూడా పంపించాను. వాడు రాగానే—'

'మీసత్తికాలంకాని ఇంకా వస్తాడనే యింకా పడుతున్నారా? రావలసినవాడైతే యిదివరకే వచ్చును. కొడుకుమాటలు నమ్మకొని మీరు మోసపోయి మమ్మల్ని మోసపుచ్చుతున్నారు. మూడు నాలుగేళ్లయింది. ఇకమీద ఇదిమిద్దమని మీ రేదో తేల్చేస్తే మాకర్తవ్యం మేం చూసుకుంటాం.'

'వసంతం! కర్తవ్యంగురించి నీతోమాటాడాలనే వచ్చాను. ఒకగంట మాటాడాలి. ఎప్పుడు? ఎక్కడ?'

'ఇప్పుడే దయచేశారుకదా తొందరెందుకు? సావకాశంగా మాటాడదాం. ఏదో ప్రసంగం వచ్చిందని అన్నానుగాని, వచ్చి రావడంలో అడిగేడానికి నేను మూర్ఖుణ్ణి కాను.'

అని స్వరాజ్యము ముఖము చూచి,

'మామయ్యగారు వచ్చారని అమ్మ కింకా చెప్పలేదూ? వెళ్లి చెప్పరా!'

అని పలుకి నామె వెంటనే లోనికిఁ బోయినది. ఇంతలో వీధిలోనుండి, 'లక్ష్మీకాంతంగారూ! లక్ష్మీకాంతంగారూ!' అని యెవరివో పిలుపుచావడిలోనున్నవారి కందఱికి నాకస్మికముగ విన వచ్చెను. లక్ష్మీకాంతము సంభ్రమముతో నాపిలుచువా రెవరో యని లేచి చూడఁబోవ నుద్యమించుచుండ మేన వ్రేలాడుచున్న

యెఱ్ఱని డవాలితో నొకసేవకుఁడువచ్చి పొడవైన యొకకవరు వాని కందిచ్చెను. 'బాబుగారు పంపిన ఆర్డరు కాబోలోయ్' అని వసంతము పల్కుచుండఁ లక్ష్మీకాంత మాతురతతోఁ గవరువిప్పి చూచి, యానందమున వికసించినమోముతో 'ఔను. ఆర్డరే! సేలరీ ఫిఫ్టీన్ రుపీసట!' అని కవరు వాని కందీయ వసంతరావు చూచి సంతోషము పట్టలేక. 'స్వరాజ్యం కాంతంబావ కుద్యోగంవైందని అమ్మతో చెప్పు' అని చావడిలోనుండియే పెద్దకేక వేసెను. కవరు తెచ్చిన నౌఖరు లక్ష్మీకాంతమును జూచి, 'ప్రొప్రియిటరుబాబుగారు మిమ్మల్ని యెంటనే రమ్మన్నారు,' అని చెప్పి నిష్క్రమించుటయు వసంతము భ్రమరమును జూచి, 'భ్రమరం! గదిలోకి వెళ్లి—బీరువాతలుపులు తీసేవున్నాయి. ఒకపట్టు వోకవోణీ తెచ్చి అన్నయ్యకియ్యి' అని చెప్పినంతనే తననీరసమంతయు నేమైనదోయన నాబాలికామణి మూఁడునాలుగు గంతులలో లోనికిఁ బఱువెత్తెను. అప్పుడు నలువదియేండ్లకు మించిన వయసుగల వసంతునితల్లి పచ్చనిపసుపు మొగముపై నెఱ్ఱనికుంకుమబొట్టు పెట్టుకొని తడిచేతులు పైట కొంగుతోఁ దుడుచుకొనుచు, వచ్చి 'బాబూ వచ్చారా?' అని వియ్యంకుని బలుకరించి, 'కాంతం! నాకు చాలాసంతోషంగా వుంది. వేగిరం వెళ్ళి అమ్మతో చెప్పు? కష్టా లెల్లకాలం వుండిపోతాయా నాయనా! యేదో పడవలసినంతకాలం పడాలి!' అని హెచ్చరించెను. చదువు చెప్పుట చాలించి లక్ష్మీకాంత మచ్చటి బాలికలను వారి వారియిండ్లకుఁ బంపివేయుచుండఁ జలువచేసిన రెండుచాకిమడతల నొకచేతం గొని భ్రమరమును స్వరాజ్యము నొండొరులభుజములపైఁ జేతు లిడుకొని కలకలలాడు మొగములతోఁ గిలకిల నవ్వుచుఁ జావడిలోనికి వచ్చుటయు, వేంకటశాస్త్రి భ్రమరమును జూచి వసంతరావుతో,

'వసంతం! ఈఅమ్మాయి తిమ్మరాజుపంతులుగారి కుమార్తని యిప్పుడు పోల్చాను. ఆదినుండీ మీకుటుంబానికీ, వారికుటుంబానికీ, వెలనాట్లూ నియ్యోగులూ అన్న అరమరాభ్యంతరంలేని అవినాభావసంబంధం నాకు తెలుసును.'

అని పలుక వసంతుఁడు భ్రమరముముఖము చూచి నవ్వుచు,

'ఇక ముందుకూడా మాసంబంధాని కేయరమరాభ్యంతరం లేకుండా మీ రాశీర్వదించాలి.'

'సందేహ మెందుకు? తప్పకుండా దీవిస్తాను. తథాస్తు!'

## 10 వ ప్రకరణము

—* గంగాధర ప్రసాదరావు బహద్దరువారు. *—

లక్ష్మీకాంతమున కుద్యోగ పత్రిక పంపిన బాబుగారగు గంగాధర ప్రసాదరావుపంతులు బహద్దరువారు తమదివాణమునందలి కచేరీచావడిలోఁ గూర్చుండి, తన కభిమానవ్యసనమగు 'త్రికాసిల్సు' సిగరెట్లు కాల్చుచు, నాంతరంగికమిత్రుఁడు నాంతరంగిక కార్యదర్శియు నాశ్రితాగ్రగణ్యుడునగు వేంకటశాస్త్రితో మున్సిఫల్ వోట్సునుగురించి తీవ్రముగా నాలోచించుచుండిరి. "బాబుగారు' 'ప్రొప్రయిటరుబాబుగారు' అనునవి యాతనిసంకుచిత వ్యవహారనామములు. వీనితండ్రియైన విస్సన్న 'రాంపురము' ఎస్టేటుగాౘిమములు కొన్న తరువాత 'విశ్వనాథప్రసాదరావుపంతులు బహద్దరువా' రయినట్లే,

గంగాధరముకూడఁ దండ్రిమరణానంతరమున నెస్టేటధికారము పొంది నప్పటినుండియు గంగాధరప్రసాదరావుపంతులు బహద్దరువారయ్యెను.

విస్సన్న మొదట గంజాంమండలమునందలి బరంపురములో నొకప్లీడరుగారియింట వంటలవాఁడై పనిచేయుచుండి, యాయింట నొకప్పు డొకరజతపాత్ర నపహరింప నుద్యోగము పోవుటచేతను, వానియుంపుడుకత్తె మరణించుటచేతను, ఆపట్టణముపై విరక్తినొంది విజయనగరము చేరుకొనెను. నిరుద్యోగుల కాలవాలమగు విజయనగరములో నెంత యత్నించినను సుస్థిరోద్యోగ మేదియు లభింపనందున విస్సన్న వాహకత్వ శ్రాద్ధభోక్తృత్వాది తాత్కాలికోద్యోగముల తోడనే చిరకాలము గడపవలసినవాఁ డయ్యెను. విస్సన్ననుదుట 'కించిద్భోగం భవిష్యతే' యనువాక్యము వ్రాయఁబడి యుండుటచేత వాని విజయనగరము విడిచి చీపురుపల్లి పోవుబుద్ధి పుట్టినది. విస్సన్న యదృష్టము పొగబండియై వాని వానినెక్కించుకొని చీపురుపల్లి తీసికొనిపోయినది. చీపురుపల్లి రైలుస్టేషనులోఁ జిరకాలమునుండి పెసరట్లు పాలముంజెలు విక్రయించుచు వేలకొలఁది నార్జించిన వాని మేనమామ, నిరాధారుఁడై వచ్చినవిస్సన్న నాదరించి, స్టేషనువెనుకఁ దాను వేసికొనిన తాటాకులపాకలోని పెసరట్లపెనముకడఁ గూర్చుండఁ బెట్టెను. వ్యాపారమునందేగాక కష్టసుఖములయందుఁగూడఁ గోడుపడుచు విస్సన్న తనమేనమామను మంచిచేసికొనగా వానికతఁడు వచ్చిన రెండేండ్లలోనే మరణ మాసన్నమైనది. కుటుంబశూన్యుఁడైన యాతఁడు తనయవసానమున దన కున్నరొక్క మంతయు విస్సన్నకే యిచ్చివేసెను. ఇట్లు ధనమునకేగాక పెసరట్లపెనమునకుఁగూడ విస్సన్న యధికారియై, యావ్యాపారమునే సాగించుచుఁ దనబంధువులలో నొకకుటుంబమువారికిఁ బదునాలువందలరొక్కము తినివేయుట కిచ్చి వారిపిల్లను వివాహము చేసికొనెను. వేకువజామున

నాలుగుగంటలకు వేసిన పెనము రాత్రి పండ్రెండుగంటలవఱకుగాలు చుండ, నాలుగువేళలయందును తదితరవేళలయందు వేలకొలఁది పెస రట్లు పాలముంజెలతోఁగూడ విక్రయించుచు నతఁడు నాలుగైదేం డ్లలో మఱికొన్ని వేలుకూడ సంపాదింపఁ గలిగెను. ఈకాలమునందే యాతనిభార్యయగు పేరమ్మ కాపురమునకు రాఁగా నాదంపతుల కొకకుమారుఁడు జనించెను. గంగాధరుఁ డనుపేరుగల తనతండ్రిని గౌరవించుటకో లేక చిరకాలమునుండియుఁ దనకులవృత్తియైన గంగా ధరత్వమును గౌరవించుటకో విస్సన్న తనకుమారునకు గంగాధరుఁ డని నామకరణము చేసెను.

మూలధనము పెఱుగుచున్నకొలఁది ధనార్జనాసక్తియుఁబెఱుగు చుండుటచేఁ బేరమ్మను బెసరట్లపెనముకడఁ గూర్చుండఁబెట్టి విక్రి యించుట కొకని నేర్పాటుచేసి, విస్సన్న వేరుసెనగధాన్యములవ్యాపా రమునందును వడ్డీవ్యాపారమునందును బ్రవేశించెను. ఇంతకు విస్సన్న కది పట్టినదెల్ల బంగారమగు నున్నదశ. లక్ష్మి తాను వరించువాని విద్యాగుణరూపశీలాదులను లేశమును బాటింపదు. సంవత్సరము నకు ముప్పదివేలకుఁ దక్కువకానిలాభము పడయుచు, విస్సన్న యీ వ్యవహారమును నిరాఘాటముగాఁ గొన్నిసంవత్సరములవఱకు సాగిం చెను. పిమ్మట నతఁడు రెండుధాన్యపుయంత్రములను గూడఁ బెట్టించి వానివలనఁగూడఁ బెక్కువేలు రొక్కము వడయుచుఁ బదిపండ్రెండు సంవత్సరములలోఁగొన్నిలక్షల కధికారికాఁగలిగెను. ఇంతలో ఋణా క్రాంతమై రాంపురమెస్టేటు వేలములో విక్రయమునకు వచ్చినదని విని, విస్సన్న మఱి పెసరట్లపెనము కాలవేయవలదని భార్యతోఁ జెప్పి తనయొద్దనున్న రొక్కమునకుఁ దోడుగ నొకయేఁబదివేలు మాత్రమే ఋణముచేసి యతఁ డాప్రొప్రియిటరీ గ్రామములను బుచ్చుకొనెను. ఇట్లు ప్రాప్తించిన నూతనైశ్వర్యముతో విశ్వానాథ

ప్రసాదరావు బహద్దరువారను నూతననామమును గూడ ధరించి విస్సన్న యెస్టేటును బరిపాలించుచుండెను.

విస్సన్న మరణించుసరికి గంగాధరము పాతికేండ్లవాఁడు. చదువులేక విద్యార్థిదశయంతయు నతఁడు దుష్టసహవాసముతోడనే గడపెను. తండ్రి యింటలేని సమయమున గంగాధరము వానిపెట్టెలోని ధనమును రెండుసారులు తస్కరించి తనదుష్టమిత్రులతోఁగూడ నొకమా రుత్తరహిందూదేశమున నొకమారు దక్షిణహిందూదేశమున సంచారములుచేసెను. అతఁడు మూఁడవఫారములోఁ బ్రవేశించుసరికి వానివయసు పదునెనిమిదేండ్లు. విద్యార్థిదశయందును దానియనంతరమందును గూడ గంగాధరము శ్రద్ధగా నభ్యసించినవిద్య చతుర్ముఖపురాణము. అందు 'రన్ మోర్' అనుపేర నద్భుతమైన యొకఘట్టము కలదు. ఆఘట్టమున గంగాధరము గొప్పఘటకుఁడని పేరు వడసెను. మహాపండితులకుఁగాని వ్యాసఘట్ట మన్వయించనియట్లు గొప్ప ధనవంతులకేగాని యీ 'రన్ మోరు' ఘట్టము సాధ్యము కాదు. తండ్రి మరణానంతరమునఁజీపురుపల్లియందుఁగాని తన ప్రొప్రయిటరీ గ్రామమగు రాంపురమునందుఁగాని యుండక గంగాధరము విజయనగరనివాస మేర్పరచుకొనుటకుఁ గారణము రన్ మోరే. ఈయపూర్వమైన పేకాటకు విజయనగరము మిక్కిలి ప్రసిద్ధి కెక్కిన స్థలము.

ధనలక్ష్యములేని మహాదాతయనియు గొప్పపండితుఁడనియుఁ బ్రజలకు భ్రాంతిపుట్టించి దిగంతవిశ్రాంతకీర్తిపొందవలయునను దురాశయముతో ప్రొప్రయిటరుబాబు విజయనగరనివాసమును బ్రారంభించి మనకథాకాలమునాటి కేడెనిమిదేండ్లయినది. ప్రతివిద్యయందును బ్రతివిషయమునందును దనకుఁ బ్రవేశమున్నట్లు నటించుచుఁ బ్రసంగించుటలో నతఁడుమంచి నిపుణుఁడు. వడుగులనియుఁ బెండ్లిండ్లనియు దైవకార్యములనియు ధర్మసత్రములనియు నేవో పేరులు

పెట్టుకొని వచ్చువారి కాతఁడు చేయుక్రియాపదానములు మిక్కిలి తక్కువయే యైనను, వానివిపరీతవాస్తానములకు మాత్రి మాయాచకులు సంతోషపరవశులై కృతార్థులైనట్లే తలంచి పోవుచుందురు. తప్పు చేసినవారిని శిక్షించుటలో నతఁ డతిక్రూరుఁ డగుటచే ముప్వరు గుమస్తాలును నలుపురు నౌఖరులును, నిఱువదియేండ్లకు లోపువయసుగల యాఱువురు పనికత్తెలును నొకవంటబ్రాహ్మణుఁ డునుగల యాతనిపరివార మంతయు నాతనిని మహావ్యాఘ్రమును జూచినట్లే చూచుచుందురు.

ప్రిప్రియిటరుబాబు కొలువున్న కచేరీచావడి యాఱుగజముల వెడల్పుతోఁ బదునాలుగుగజముల పొడవుతో మిక్కిలి విశాలమైనది. ఆచావడి కంతకు సరిపడ నొక్కఁడేరత్నకంబళి చిత్రవిచిత్రములగు రంగులతో నలరారుచుఁ గాలువెట్టిన ఘూళిపట్టునాయను శంకపుట్టునట్టిది వేయఁబడినది. అమూల్యమైన యారత్నకంబళికిఁ దోడుగ నపూర్వములైన కుర్చీలును బీరువాలును జూచువారికిఁ జూచుకొలఁదిఁ జూడవేడుక నొడమించుచుండెను. మహారాజుల యంతఃపురములో నుండఁదగిన పెద్దనిలువు టద్దములు నాలుగు, నాలుగు పాలసముద్రములవలె నలువైపుల శోభిల్లుచుండెను. ఆకొలువుకూటమునఁ జుట్టును వేయఁబడిన చిత్రపట్టములలో ననేకములు శృంగారరసావిష్కరణములే! మిక్కిలి పొడవైన యాచావడికి రెండువైపుల రెండుగదులు గలవు. కుడివైపున నున్నగదిలో ముప్వరు గుమస్తాలు డసుకుపెట్టెలముందుఁ గూర్చుండి యెస్టేటులెక్కలు మున్నగునవి వ్రాయుచుండిరి. ఎడమవైపుగదికి మూయబడిన తలుపులపై రంగురంగుల పూవులగుడ్డ పటకవాటమై (Door Curtain) వ్రేలాడుచుండెను. పెక్కురంగుల గాజుగొట్టములతోఁ బట్టుదారములఁ జిత్రముగాఁ గూర్చిన తోరణ మాగదిగుమ్మమున కలం

కారమై రాజిలుచుండెను. అది గంగాధరమునకు రహస్యాలోచన గృహము (Private Room)

ఆరహస్యమందిరద్వారమునకు సమీపముననే యాచావడిలో సింహాసనాకృతి నొప్పుచుండిన ముఖమల్ పరుపుల కుషన్‌కుర్చీపై బాబుగారు సుఖాసీనులై మెచ్చఁదగిన దంతపుఁబనితనముగల ముందరి మేజాబల్లపైఁ జేతు లానికొనియుండి యానాడు వేంకటశాస్త్రితో మాటాడుచుండిరి. తెల్లని గ్లాసుమల్లు పాయిజమాయును ఆజానులంబమానమగు తెల్లని చీనాపట్టు పంజాబులాల్చీయును ధరించి యెఱ్ఱ మఖమలుపై జరీపూవులుగల స్లిప్పరుజోడు తొడిగి, కుచ్చులుఁ వ్రేల నాకాశవర్ణముగల పట్టుపగిడీ చుట్టి, మిక్కిలి యెత్తైన బుగ్గలపై నొప్పుచిక్కని మీసములచే గంభీరమైన ముఖమండలముగల ప్రొప్రయిటరుగారి విగ్రహము దర్శనీయమైనది. అతఁడు మిక్కిలి పొడవరి. ఆనల్లనిపొడవుమేనికిఁ దగినలావును వానికిఁ గలదు. ఆతనియాసనమునకుఁ జేరువనే బెత్తుకుర్చీపై బ్రిక్కపేరిప్పు ఱ చప్పికాడలు సగము నెరసినతలయు గడ్డమును, మితిమీరిన ముసాలాచర్వణమునః గారుక్కిన పొడవైన ముందరిదంతములును గల వేంకటశాస్త్రి యొకు పచ్చనిశాలువ కప్పుకొని కూర్చుండి బాబుగారికి సలహా చెప్పుచుండెను. రెండవవైపునఁ గాకీరంగు ఛెడ్డీయు గాకీరంగు లాల్చీ యెఱ్ఱని తలపాగయుఁగల పండ్రెండేండ్ల బాలసేవకుఁడు చేతులు కట్టుకొని నిలిచియుండెను. బాబుగారు తనవంకఁ జూచినప్పుడెల్ల మేజాబల్లపైగల త్రిక్యాసిల్సు సిగరెట్టుపెట్టెనుండి యొకసిగరెట్టు తీసి, వారిపెదవులకుఁ దగిలించి యగ్గిపుల్ల వెలిగించి ముట్టించుమంమటయే యాబాలసేవకుని కచ్చటియుద్యోగము. మధ్యమధ్యఁ దన్నుఁ దర్శింప వచ్చుచుండిన మిత్రుల కేవియో సమాధానములు చెప్పియు నాశ్రితుల కేవియో వాగ్దానములు చేసియుఁ బంపివేయుచు నానాడు

ప్రొప్రయిటరుబాబు వేంకటశాస్త్రితో నెడతెగని దీర్ఘసంభాషణమున మునిగియుండెను.

"మద్దెలవీధి వోట్లెన్నున్నాయి శాస్త్రీ!"

"చిత్తం. ఆడా మగా అన్నీ కలిసి డెబ్బై రెండు."

"మా రాజరత్నం- మీ చకోరాక్షి- ఈ రెండూ కలిపేనా?"

"ఈ రెండూ కలిపే డెబ్భై రెండూ"

ఈ రెండూ మనకొచ్చే వోట్లే! తక్కిన డెబ్భైమాటా ఆలోచించండి"

"ఆలోచించటానికి బాబుగారికి తెలియం దేముంది? ఆ వోట్లన్నీ డాక్టర్ నాయుణ్ణే వరిస్తున్నాయి. అభేద్యమైన వ్యూహం మనం పన్నితేనేకాని సామాన్యంగా ఆవోట్లు మనకి రావు."

"నే ననేమాటా అదే! ఆవ్యూహం మీరే పన్నాలికాని మరొకరికి సాధ్యంకాదు. ఆవీధిలో మీ కున్న గౌరవం- మీకున్న పరిచయం మరొకరికి లేదు. ఆ డెబ్భైలో సగంవోట్లు మనప్రక్క తిప్పించేశారంటే నాయుణ్ణే గెల్చేశాం అన్నమాటే!"

"ఆవీధిలో నా కున్న చెలామణీ నాయుడికి లేనిమాట నిజమే! కాని నాయుడికో పెద్దద న్నున్నాది. అది వూడపీకడం కష్టం!"

"ఏమిటా దన్ను చెప్పండి! ఆలోచిద్దాం!"

'సూర్యకాంతం వాళ్లలోకల్లా కాస్త పెద్దది. అనగా కుల పెద్ద. ఆటా పాటా దాందగ్గిరే వీళ్లంతా నేర్చుకుంటారు. ఆసూర్యకాంతం పెద్దకూతుర్ని నాయు డుంచుకున్నాడు. సూర్యకాంతం ఎలా చెప్తే తక్కినవాళ్ళంతా అలాగే చేస్తారు. అందుచేత నాలుగైదేళ్లాయి ఆవోట్లన్నీ నాయుడికే వెళుతున్నాయి. ఇదీ సందర్భం. ఈసందర్భంలో నాయుడికీ సూర్యకాంతానికీ భేదం పెట్టాలి లేదా

వాళ్ళలో వాళ్ళకే విరోధం పుట్టించి మనం రెండో పార్టీ నొకటిలేవ దియ్యాలి.

'ఈ రెండింటిలో యేది సాధ్యంవవుతుందో చూడండి అదే చేద్దాం'

'ఇందులో మొదటిది మనకు సాధ్యం కాదు. ఇప్పట్లో మరీ సాధ్యం కాదు. సూర్యకాంతం రెండో కూతురు సరసీరుహం యిప్పుడు కన్నెరకాని కొచ్చింది. అందుచేత నాయుడు సాయం వాళ్ళకత్యవసరం.'

'ఆసాయం యేవిషయంలో శాస్త్రీజీ! కార్యానికి సంబంధం కుదర్చడం లోనా? డబ్బు పెట్టడం లోనా?'

'రెండింటిలోనూ కూడా అవసరమే.'

'అయితే వొకసంగతి చెప్తాను వినండి——'

అని బాబుగా రిటు నటుం జూచి వానివైపునంగ శాస్త్రీ చెవి యొద్దకు మూతి సారించిం యేమో గుసగుసలాడి——

'ఇహ నేంవంటారు? ఇప్పుడు సాధ్యంవవుతుందా సూర్యకాంతం మనకి'

అని యడుగం గా అక్కిన పండ్లు మఱింత బయలుపడునట్లు దాకవంటినోరు తెఱచి, వికారముగా నొకనవ్వు నవ్వి శ్లాఘనాసూచకముగా శిర మెగురవేయుచు——

'ఇహ సాధ్యం కాకేం? ఈదెబ్బతో సహాం వోట్లు మనపక్షం తిరిగిపోతాయి. దీంతో నాయుడిపణం పడిపోతుంది. నామీందవుండే అభిమానంచేత నన్నాలోచించమని సెలవిస్తున్నా రుకాని, బుద్ధినిశేషంలో బాబుగారికి బాబుగారే సాటి! ఈవుపాయం పాశుపతం లాంటిది. మహ బాగావుంది. మహ బాగావుంది.'

'మేఁమెప్పుడూ రాజ్యాలూ వ్యవహారాలూ పీట్లో మునిగి తేల్తూవుంటాం చూడండీ! అందుచేత పెద్దపెద్దవిషయాల్లోనే మా కాలోచన వెళుతుందికాని యిలాంటి సామాన్యవిషయాలంటే తల నొప్పి'

అని శాస్త్రిగారు హాగర్తచేత నుప్పొంగిన ముఖమును బాలసేవకుని వంకఁ ద్రిప్పినంతనే యతఁడు తటాలున నొకసిగరెట్టు తీసి వాని పెద వులకుఁ దగిలించి, యగ్గిపుల్ల వెలిగించి ముట్టించెను. నోటనుండియు నాసికారంధ్రముల నుండియు విచిత్రాకృతులతో ధూమరేఖలు విడు చుచు— ప్రారంభయిటరుబాబు—

'శాస్త్రీజీ! ఇందువల్ల రాజరత్నానికి కోపం రాదుకదా?'

'కోపఁవెందుకు? కష్టం సుఖం దానికి నచ్చచెప్పి దాంతో కూడా ఆలోచించే చేదాం. అదీ బుద్ధిమంతురాలేకాని మరోహాటి కాదు.'

'అంతగా వస్తే వోనోటు దానిమొహంమీద పారేదాం దాంతో దానినోరు కట్టి పోతుంది.'

'ఆవోట్లు రాకపోతాయనే విచారం నా కెప్పుడూ లేదు కాని— బాబుగారిచేత వోకానీయేనా ఖర్చు పెట్టించకుండా— ఆవీధి వోట్లన్నీ సంపాదించాలని ప్రతిజ్ఞ చేసుకున్నాను. ఆప్రతిజ్ఞ సాగలే దనిమాత్రం విచారంగా వుంది.'

'అహ్హా—హ్హా—హ్హా! శాస్త్రీజీ! మీరుత్తమాయకులండీ! ఈరో జుల్లో డబ్బుపెట్టకుండా కార్యా లవుతాయా? మీసత్తెకాలంకాని! అయితే మాప్రతిజ్ఞకూడా వినండి! మునిసిపల్ కౌన్సిల్‌గా స్టేండిం గుకావడానికి— ఆరేళ్లాయి ప్రయత్నిస్తూ సంవత్సరానికి పదేసివేల చొప్పున అరవై వే లప్పుడే మేం ఖర్చుపెట్టేం! తక్కిన నలభై వేలూకూడా యీసంవత్సరం ఖర్చుపెట్టేనా కార్యం సాధించడానికే

మాప్రతిజ్ఞ! మీ రీపిచ్చాలోచన్లు మానేసి సూర్యకాంతం దగ్గిరకి వెళ్ళి మాటాడి వ్యవహారం రైట్ చేసుకుని రండి!'

'బాబుగా రిలాంటిఘోరప్రతిజ్ఞలు పడితే ఇహమాప్రతిజ్ఞ లేం సాగుతాయి! మీసెల వెలగో అలా నడుచుకోవలసిందే.'

ఇంతలో మాసినపంచయుఁ డెల్లలాల్చియును జలువచేసిన యుత్తరీయమును ధరించిఁ లక్ష్మీకాంత మాచావడిలోఁ బ్రవేశింప వారిదృష్టు లాతనివంకఁ బ్రసరించినవి. ప్రొప్రయిటరుబాబు వానిని సాదరదృష్టి నీక్షించి వానినమస్కార మందుకొని—

'నీపేరు లక్ష్మీకాంతం కదూ? సరే వెళ్ళు! ఆఫీసురూములో ఎటెండెన్సు రిజస్ట్రీలో ఈడేటున జాయినింగయినట్లు సంతకం పెట్టి హెడ్‌గుమస్తా నడిగి వన్‌రుపీ పుచ్చుకొని, మునిసిపల్ ఆఫీసుకు వెళ్లి వోటర్లలిస్టులు రెండు కాపీలు కొని, అక్కడనుండి సంతపేటలో వేరుసెనగవర్తకుడు నరసయ్యసెట్టి కీవుత్తరం యిచ్చేసి, జవాబు పుచ్చుకొని, గోల్డుమర్చంటు తుకారామ్ వూరినుండి వచ్చాడో లేదో కనుక్కొనిరా! పో! మాదగ్గిర బుద్ధిగా పనిచేసుకుంటే నువ్వుమంచి వృద్ధిలోకి వస్తావని నీకు వార్నింగిస్తున్నాం.' అని యాజ్ఞాపించెను.



# 11 వ ప్రకరణము

## —. ఆనాటి లక్ష్మీకాంతము. —

'వార్నింగ్' అనుపదమునకు ప్రొప్రయిటరుగారియర్థమును దెలియక తా నుద్యోగములోఁ గాలుపెట్టుసరికే యట్టిమాట వినవలసివచ్చినందుకు లక్ష్మీకాంతము మనసు మిక్కిలి కలఁతపడినది. ఆపదమునకు సలహాయని బాబుగారి యభిప్రాయము. మ్యునిసిపల్ కౌన్సిల రగుట వేలకొలఁది వెచ్చించుచు నపజయ మొందుచుండిన బాబుగా రొకసంవత్సరము కలక్టరున కుత్తరము వ్రాయుచు నీవు నాకొఱకు క్యాన్వాస్ చేయవలసినదనియు నీయుపకారము మఱచిపోననియుఁ బ్రార్థింపఁగా జిల్లాకలక్ట రాగ్రహించి యిట్టి యసందర్భపువ్రాతలు వ్రాయకుమని వాని కొకవార్నింగు వ్రాసి పంపెను. గుమాస్తా లాకవరువిప్పి బాబుగారికిఁ జదివి చెప్పుటలో 'వార్నింగను పదమునకు పునర్దోషాసహిష్ణుతాసూచకమని చెప్పుటకు భయపడి యీరీతిగా మీకు కలక్టరుగారు సలహా యిచ్చుచున్నారని యెఱిఁగించిరి. నాటినుండియు వార్నింగుపదమునకు సలహాయనియే ప్రొప్రయిటరుగారి దృఢవిశ్వాసము.

బాబుగారి యద్భుతపురాణగాథలోని యీయుపాఖ్యానమును లక్ష్మీకాంత మెఱుంగనివాఁడుకావున నాపదము విన్నంతనే వాని కుద్యోగానందముకొంత డిందుపడినది. ప్రొప్రయిటరుగారి మందిరము విడిచి మ్యునిసిపల్ ఆఫీసునకు నడచుచున్నంతసేపు లక్ష్మీకాంతముచిత్తమును వార్నింగుపదము మిక్కిలి బాధించుచునేయుండెను. గోరుచుట్టుపై రోకటిపోటువలె నావిచారమునకుఁ దోడుగ నానాడింట బియ్యమున్నవో లేవో యనుసంగతి వానికి జ్ఞప్తికివచ్చి యుద్యో

గానందము లేశమును బొందకుండ జేయసాగెను. జ్వరముపడి లేచిన భర్తమరము ప్రౌఢ్దక్కిన నుండలేదు. చుట్టమైన సోమరాజును బస్తువెట్టుట కూడదు. అన్నగారి సంతానములోఁ బెద్దదియైన శ్యామల కష్టసుఖము లెఱుఁగని మైదేండ్లపసిబాల. తక్కినవారి మాట యెటులున్న నీముగ్వురికి సరిపడు బియ్యమైన నింట లేవేమో యని లక్ష్మీకాంతము మిక్కిలి తహతహపడఁ జొచ్చెను. ఇంటిలోని స్థితిగతు లడిగి తెలిసికొనుటకు నాటియుదయమున వాని కవకాశము లేకపోయినది. బాలికలకు జదువు చెప్పుట ముగించి యెనిమిది గంటల కింటికివచ్చి బియ్యముసంగతి కనుఁగొనుచుండుట వాని యాచారము. ఆనా డుద్యోగమైన యానందముచేతఁ బాపము వాని కాదృష్టియే లేకపోయినది. ఎలిమెంటరీస్కూలు మేస్టరైన యన్నగారు పదిగంటలైనఁగాని యింటికి రాడు. ఆపూటకు సరిపడు బియ్యము తల్లిగాని వదినగారుగాని యిరుగుపొరుగిండ్ల నప్పు దెచ్చెదరను ధైర్యముకూడ వానికి లేదు. తొలినాటిరాత్రియే తల్లి తనకు వడ్డించుచు బియ్యము పప్పులు నుప్పులు మున్నగునవి యా వీధిలో నేయేకుటుంబమువారి కెన్నెన్ని యప్పు తీర్చవలసియున్నవో తనకడ వరుసగా నేకరువుపెట్టి యింక మనకీవీధిలో నప్పుపుట్టదని విసుగుకొనుట లక్ష్మీకాంతమునకు మాటిమాటికి స్మరణకు వచ్చుచుండెను.

అడిగిన యప్పు లేదనకుండ, నిచ్చినయప్పు మఱల నడుగకుండ, నడిగినప్పుడెల్ల విసుగుకొనకుండ నాకుటుంబమున కిచ్చుచుండువా రావీధిలో నొక్కవసంతుని కుటుంబమువారుమాత్రమే. కాని సంవత్సరములనుండియు నాకుటుంబమునుండి యప్పులని పేరుపెట్టి తెచ్చుకొనుచుండిన బియ్యము పప్పులు మున్నగునవి యొకప్పుడు గాక యొకప్పుడైనను గొంతలోఁ గొంతయైనను దీర్చుటయున్నది

బొత్తిగా లేకపోవుటచేత, నాకుటుంబమువా రందఱు నెంతయు మోమోటపడి మిక్కిలి విసవిసలాడి శుష్కోపవాసము చేయవలసి వచ్చినను గూడ నింక నాకుంబమువారినిమాత్ర మేదియు నడిగి తేఁగూడదని యొకవిధమైన ప్రతిజ్ఞ చేసికొనిరి. ఇంట వంటలేని నాఁడు కాకతాళీయముగ స్వరాజ్యము భ్రమరముతో నాడుకొనుటకో చదువుకొనుటకో వచ్చుట తటస్థించునెడఁ నామె యాదురవస్థ కనిపెట్టి తనతోఁ జెప్పకున్నందుకు భ్రమరమును నిష్ఠురములాడి, తక్షణ మింటికేగి తల్లికిఁ జెప్పి యుప్పుతో నాలుగువస్తువులు నా పూటకేగాక మఱియొకటిరెండుపూటలకుఁగూడ సరిపడునన్ని తెచ్చి వారి కిచ్చుచుండును. ఇంట వంటలేని యొకనాటిమధ్యాహ్నమున భ్రమరము తన కేమియుఁ దోఁచక కాలక్షేపముకొఱకు స్వరాజ్యముకడకుఁ బోఁగా నామె యాముఖమునందలి యభోజనలక్షణములను గనిపెట్టి, తనతో భోజనమునకు రమ్మని నిర్బంధింపసాగెను. పాపము భ్రమరాంబ విధిలేక విస్తరిముందుఁ గూర్చుండెనేకాని పసిపిల్లయగు శ్యామల యాకలిచే నకనక లాడుచుండుటచే నా డామె నోటి కొక్కకడియన్నమైనఁ బోలేదు. అప్పటినుండియు నట్టివిపరీతస్థితి కలిగినప్పుడెల్ల భ్రమరము స్వరాజ్యముకొఱకు వెళ్ళుట మానివేయుచుండెను.

ప్రాథమికపాఠశాలోపాధ్యాయుల వేతనములకును, ఉన్నత పాఠశాలల యందలి యాంధ్రోపాధ్యాయులవేతనములకును గనుబొమ్మలమీఁది వెండ్రుకలకువలె నేనాటికి నెడుగు బొడుగు నుండదు. ఎన్నేండ్లనుండి పనిచేయుచుండినను సుబ్బారావుజీతము పండ్రెండు రూపాయిలే. ఆ పండ్రెండు రూపాయిలైనను బ్రతిమాసాంతమునందు విధిగా దొరకు నాచారములేక రెండేసి మూడేసి నెలలకొక్కొక నెలజీత మందుచుండును. లక్ష్మీకాంతముకడఁ జదువుకొనుచుండిన

బాలికలలో ముప్పురొక్కొకరూపాయి చొప్పున నలువురు రెండేసి చొప్పున నిచ్చుచుండుటకు నిర్ణయము. ఈపనులొకటియుహాకలును లక్ష్మీకాంతమునకు మొత్తముగా నొక్కరూకయు ముట్టినట్టివి కావు. లక్ష్మీకాంత మరుగఁబోయినప్పు డెల్ల నాపిల్లల తల్లులేవియో సాకులుచెప్పి త్రిప్పుచుందురు. గృహము నిస్తంభులమైననాఁడు సూరమ్మ యొకవైపు కోడలగు వీరమ్మయొకవైపు నాపిగలో నప్పు కొలకు బయలుదేరుచుందురు. వారి కప్పుపుట్టని యెడఁ బదిగంటల కింటికి వచ్చినయన్నగారిని లక్ష్మీకాంతము నేస్నేహితులమేష్టర్లలో నెవరియొద్దనైన నైదారణాలుకాని బియ్యముకాని బదులుచేసి తెమ్మని పంపుచుండును. ఆప్రయత్నముకూడ వ్యర్థమైనప్పుడు తానే బయలుదేరి తనయొద్దఁ జదువుకొను బాలికల యిండ్లకుఁబోయి జీతము నుండి యొకరూపాయిగాని యొకయర్ధరూపాయిగాని యిమ్మని యడుగుచుండును. అదియును ఫలింపనప్పు డింటికివచ్చి యింటిలోని యొకముంతయో గిన్నెయో బట్టచాటుగాఁ బెట్టుకొని యంగడిఁ బోయి విక్రయించుచుండును. పండ్రెండుగంటలకో రెండుగంటలకో సాయంకాలము నాలుగుగంటలకో యాపూటభోజనమునకేనాఁ డెన్నిగంటల కన్నపూర్ణాదేవి ప్రత్యక్ష మగుచుండునో వానికే తెలియదు. ఆకలి కేడ్చెడు శ్యామలకుఁగూడ నాలుగు మెతుకులు లేకుండఁజేసి యాకుటుంబమును నొక్కొక్కనాడు దీర్ఘోపవాసమున నుంచి పరమేశ్వరుఁడు తనహృదయకాఠిన్యమును వెల్లడించుకొనుచుండును.

ఆనాఁడు లక్ష్మీకాంతము శ్యామలను భ్రమరాంబను సోమరాజును దలఁచుకొనుచుఁ దనయింటి మహాదుర్భిక్షముతో సామాజికమాసమువలెఁ బ్రవేశించిన యాదుర్దశను విచారించుచు, మున్సిపలాఫీసునకుఁ బోయి యచ్చటిపని నెరవేర్చుకొని, సరసన్యాస్త్రీకుత్తర

మిచ్చి ప్రత్యుత్తరము పుచ్చుకొని, తుకారామ్ వచ్చినదియు లేనిదియుఁ గనుఁగొని, పనిలోఁ బనిగా నొక్కసారి తనయింటి యవస్థ యెట్లున్నదో చూచి పోవలయునని బుద్ధిపుట్టి తిన్నగ మన మావంకకుఁ దిరిగెను. ఆలస్య మగునేమో యనుజంకుతో లక్ష్మీకాంతము వడివడిగా నడచుచు, రెండుమూఁడుపేటలు గడచి తన వీధిలోఁ బ్రవేశించి, తనగృహమును సమీపించినంతనే, నొసట బొట్టుతోడను, నోటఁజుట్టతోడను, అప్పుడే భోజనముచేసిన కడుపు సవరించుకొనుచుఁ బ్రేవని త్రేన్చుచు సవిచారముగా నరుగుపైఁ గూర్చుండిన సోమరాజు విగ్రహమును జూచినంతనే యింట నంట జరిగినదని లక్ష్మీకాంతమునకుఁ గొంతధైర్యము కలిగినది. అందుచే నతఁ డామార్గముననే దివాణమునకుఁ బోవలయునని యనుకొనెను గాని పెరటింటినుండి తనతల్లియు వదినయు నొండొరులపైఁ గేకలు వేసికొనుచుండుట విని గుమ్మమెక్కి చావడిలోఁ బ్రవేశించినంతనే, చావడిగదిలో నిరసముగాఁ బండుకొనియుండిన భ్రమరము వానిం జూచి లేచి,

'అన్నయ్యా! వెళిపోవచ్చావేం? మరి వెళ్ళక్కర్లేదూ? మళ్ళా మధ్యాహ్నం యెన్నిగంటలకు వెళ్ళాలి?'

'ఇప్పుడే వెళిపోవాలి కాని, అమ్మా— వదినా— ఆ కేక లెందుకు?'

'అమ్మెక్కడో అద్దసేరుబియ్యం తెచ్చి వండింది— ఆవండిందంతా సోమరాజుబావొక్కడే వూదేశాడు. శ్యామల కన్నం లేక పోయింది. అప్పుడమ్మ బావవిస్తర్లో వుండిపోయిన యెంగిలన్నం చారు కలిపి శ్యామలకు పెట్టింది. తిండిలేక చస్తే చస్తుందికాని

ఎంగిలన్నం నాకూతురి కెందుకు పెట్టాలని వదిన లంకించుకొంది. అవీ ఆ కేకలు—'

'అమ్మ మొదట శ్యామలకే పెట్టకపోయిందా అన్నం?'

'మొదట శ్యామలకే పెట్టాలనుకుంది. కాని ఆ నెత్తిముండ ఎక్కడికో ఆడుకోడానికి పోయింది. చల్లన్నంకూడా తినలేదని బావ అమ్మని నిలవనిచ్చాడుకాడు వడ్డించిందాకా'

'సరే శ్యామలసంగతే ఆలాగయినప్పుడు మరి నీమాట అడగేటట్లేదు. అన్నయ్య వచ్చే వేళయింది. వస్తే నేనుకూడా ఓగంటలో వస్తానేమో. అన్నయ్య రాగానే వీధిలోకి వెళ్ళమని చెప్పు.'

అని మఱియచ్చట నిలువక, లక్ష్మీకాంతము మఱల బయలుదేరి గుమ్మము దిగుచుండఁగాఁ దన్నుఁ జూచి, 'బావా! చుట్టలయిపోయాయి, ఓఅర్ధణావి తెచ్చిపెట్టాలి' అని పలికిన సోమరాజు పలుకులకుఁ బ్రత్యుత్తర మీయక, యతిత్వరితగతితోఁ బోయి, తనయింటి కొకయరమైలుదూరములో నున్న రాంపురదివాణమును బది నిముసములలో సమీపించి, ధూళిధూసరితములైన పాదముల నాగుమ్మముకడ నున్నగోనెకంబళిపై రాసి శుభ్రపరచుకొని, మొగమునఁ గ్రమ్మిన చెమటబిందువుల నుత్తరీయముకొంగుతో నొత్తుకొని లోనఁ బ్రవేశింపఁబోవ, నంతవఱకు ప్రొప్రయిటరుగారితోఁ బ్రసంగించి యప్పుడే సెలవు పుచ్చుకొనిన యొకపురుషుఁడు, 'లక్ష్మీపతిగారూ! మీరు లేశం భయపడకండి! ఆ అయిదువేలూ చాలకపోతే మరో నైదువేలు మేం మీకు సాయంచేస్తాం! మీరుమాత్రం మాపనిలో కాస్త శ్రద్ధతీసుకొని పనిచెయ్యండి' అను బాబుగారికడపటిమాటలకుఁ జిత్తము, చిత్తమని ప్రత్యుత్తర మిచ్చుచు వానికి ద్వారముకడ నెదురయ్యెను. లక్ష్మీకాంతము వానిని జూచినంతనే యెఱ్ఱపూవుల

తెల్లపట్టుగుడ్డ కొనుటకు వచ్చియున్నాఁడు. తాను వర్తకునకుఁ బది రూపాయిలనోటిచ్చుచుండఁ జూచినవాఁ డాతఁడేయని గుర్తింపఁ గలిగెను. మఱియు వానిపేరు లక్ష్మీపతియనికూడ నతఁడు తెలిసి కొనఁ గలిగెను. కాని వానితో మాటాడుటకుమాత్ర మది తగిన సమయము కాదయ్యె. అందుచే లక్ష్మీకాంత మాతలంపు విడిచి లోనఁ బ్రవేశించి యొంటరిగాఁ గూర్చుండిన బాబుగారిని దర్శించి నమస్కరించి నరసయసెట్టి యిచ్చిన ప్రత్యుత్తరమును సమర్పించెను— గంగాధర మాయుత్తరమును జదివి తనవంకఁ జూచినంతనే లక్ష్మీకాంతము తాను గొన్నవోటర్లలిస్టులు రెండును వినయముతో మేజాబల్లపైఁ బెట్టి బంగారువర్తకుఁడు తుకారాం స్వగ్రామము నుండి యింకను రాలేదని మనవి చేసికొనెను. ఆమాటయందు లేశమును దృష్టిలేక, మనస్సంతయుఁ జేతనున్న యుత్తరమునందే యుండుటచేత నాయుత్తరమును మఱియొకమాఱు చూచి నాలుగైదునిముసము లాలోచించి—

'అబ్బాయ్! మిఠాయి చేయించగలవ్ ఫస్టుక్లాసయింది?'

'బాబుగారిసెలవైతే తప్పకుండా చేయిస్తాను.'

'మధ్యాహ్నం రెండుగంటలకు నరసయసెట్టి మాదర్శనానికి వస్తాట్ట! అతనికి టీపార్టీ యివ్వాలి. ఫస్టుక్లాసయిన నేత్తో రెండు రూపాయిల లాడూ, రెండురూపాయిల పకోడీ నువ్వు దగ్గిరుండి చేయించి వొంటిగంటన్నరకల్లా పట్టించుకు రావాలి. ఫ్రూట్సు కొనక్ఖర్లేదు. మాదగ్గిర రడీగానేవున్నాయి.'

'చిత్తం! కాఫీమాట?'

'కాఫీ యిక్కడ మేం స్వయంగానే చేయిస్తాం. నీభోజనం మాట?'

'బాబుగారికార్యం జయప్రదంగా జరగడఁవే నాకు ముఖ్యం

కాని, నా భోజనం నా కంత ముఖ్యంకాదు. టైముంటే యింటికి వెళ్ళి భోజనం చేస్తాను. లేకపోతే మానేస్తాను.'

'మానీవద్దు. దగ్గిరగా హోటేళ్ళుంటాయి. వెళ్ళొచ్చి భోజనం చెయ్యి.'

అని చెప్పి ప్రొప్రయిటరు తనకట్టెదుటనున్న గదివంకఁ జూచి, 'హెడ్‌క్లార్క్!' అని వికారమైన యధికారకంఠస్వరమునఁ బిలచి, విశ్వనాథ మాఫీసుగదినుండియే చిత్తము, చిత్తమని చేతులు జోడించుకొని రాఁగా వానికి లక్ష్మీకాంతమును జూపుచు, 'యూ మస్టు పే హిమ్ ఫైవ్ రుపీస్' అని యాజ్ఞాపించెను. విశ్వనాథము వెంటనే యాఫీసులోనికిఁ బోయి యైదురూపాయిలు తెచ్చి లక్ష్మీకాంతమున కిచ్చెను. ఆసొమ్మందుకొని యతఁడు బాబుగారిముఖము చూచుచుండ నాయన,

'నీకు హోటల్‌ఖర్చుకూడా శాంక్షన్ చేశాం. వెంటనే వెళ్ళు. ఒంటిగంటన్నరయేసరికి నువ్విక్కడుండాలి!'

అని యాజ్ఞాపింప లక్ష్మీకాంతము నమస్కారపురస్సరముగ సెలవు పుచ్చుకొని చావడిదాటి వెలుపలికి వచ్చి, యెండలో నడచి వచ్చిన యాయాస మింకను దీరనందున నాదివాణము నరుగుమీఁద నొకస్తంభమునకుఁ జేరఁబడి కూర్చుండి కొంతసేపు విశ్రమించెను. వర్షాగమనసూచకమగు నానాటి తీవ్రమైనయెండలో వానిబంగరు మే నంతయుఁ జెమట పట్టినది. ముఖసౌందర్యమంతయు మాసిపోయినది. వదనలావణ్యము ప్రవహించు కాలువయోయనఁ దీర్చి దిద్దిన ప్రక్కపాపట చెదరి ముంగురులు విశాలఫాలమున నల్లాడసాగెను. చెమ్మగిల్లినమొగము నొత్తుకొనుచు, నుస్సురనుచుఁ జావడిలోని గడియారము గొట్టుచుండిన పదునొకండుగంటలు లెక్కించుచుఁ బ్రభుకార్యతత్పరత తన్నుఁ దొందరపెట్టుచుండ లక్ష్మీకాంతము

మఱల బయలుదేరెను. అప్పుడు చుట్టుత్రోవయగు తనయింటి మార్గమునఁబోక చేరువదారినే పెద్దబజారున కేగి విజయనగరమునఁ బ్రసిద్ధుఁడైన యొకహిందూస్థానీ మిఠాయివర్తకుని యంగడిలోఁ బ్రవేశించెను. ఆవర్తకుఁడు తొలినాటిప్రాతమిఠాయి యంతయుఁ బ్రొద్దుననుండియు విక్రయించి, మధ్యాహ్నవిక్రయమునకుఁ గ్రొత్త మిఠాయి చేయుట కప్పుడే కళాయి వేసికొనెను. ఆ సమయమున లక్ష్మీకాంతము వానితో మాటాడి వలసినవస్తువులు చెప్పి బేరము కుదుర్చుకొని నేయి పరీక్షించి తనకన్నియుఁ దృప్తికరముగా నున్నందున నొకరూపాయి ముందుగా వానిచేతిలో వేసెను. ఆవర్తకుఁడు తాను గళాయి వేసినంతనే తనకు నాలుగురూపాయిలబేర మిచ్చిన లక్ష్మీకాంతమును మెచ్చుకొనుచు వెంటనే మిఠాయి చేయుటకుఁ బ్రారంభించెను.

ఆ దుకాణమునందు లక్ష్మీకాంత మొకముక్కాలిపీటపైఁ గూర్చుండి తాను భోజనమునుమాని యాడబ్బు లింటి కిచ్చివేయుట కదివరకే నిశ్చయించుకొన్నవాఁడుగావునఁ దా నింటి కేగివచ్చులోపల వర్తకుఁడు తనపని వెనుకఁబెట్టికాని నేతిలోఁ గొంతనూనె కలిపికాని యేదైన మోసము చేయునేమోయని సంశయించి యాలోచించుచుఁ గూర్చుండెను. తనయన్నగారింటికి వచ్చి యాపూట కెట్టి యేర్పాటైనఁ జేసెనో లేదోయనియుఁ జేయనియెడల భ్రమరమెంత నీరసించియుండునో యనియు దృష్టియంతయు వాని కప్పుడింటిమీఁదనే యుండెను. ఈయాలోచనములలో సోమరాజు జ్ఞప్తికి రాఁగానే పిల్లలకైనఁ బిడికెడు మెతుకులు విడువని వాని తిండిపోతుఁదనమునకును నిర్దాక్షిణ్యమునకును లోలోనననవ్వుకొనెను. తనచేతిలోఁ బదిరూపాయిలుండుట యెప్పుడు? సోమరాజుఋణమును దీర్పగలుగుట యెప్పుడు? వానిబాధ తనకుఁ దప్పుట యెప్పుడను చింత వానిచిత్తమును గొంత

కలత వెట్టినది. బట్టలవర్తకునికడఁ గోలుపోయిన పదిరూపాయిలును మఱలఁ దనకు వచ్చునను నాశ లేశమును లేకపోయినను, వర్తకునకు సొమ్మిచ్చుచుండఁగాఁ జూచినవానిని దాను గుర్తించుటయేగాక వానిపేరు లక్ష్మింపతియనికూడఁ దెలియవచ్చుటచే వానితో మాటాడి పోలీసువారియొద్ద సాక్ష్యము చెప్పనేమో యగుగవలయునని యతఁడనుకొనెను,

ఇట్టితలంపులతో లక్ష్మీకాంత మామిఠాయిదుకాణమునందలి ముక్కాలిపీటపైఁ గూర్చుండి ఘుమ్ముమనఁ గ్రమ్ముచుండిన నచ్చటి కమ్మనివాసనల నాఘ్రాణించుమాత్రముననే కృతార్థుఁ డగుచుండ నింతలో బండ్రెఁ డయినది. అప్పటి కామిఠాయివర్తకుఁడు లాడూకొఱకుఁ బూసకొట్టి పాకము పట్టి, యుండఁ గట్టుటకుఁ దనమనుష్యునింకొకని నియమించి సలసలఁ గ్రాగుచుండిన నేతికళాయిలో మొదటి వాయగాఁ బకోడీలపిండి వేసెను. అది చూచి లక్ష్మీకాంతము తానింటికిఁబోయి రావచ్చుననియు, మఱి యనుమానింపవలసిన యవసరము లేదనియుఁ దలంచి యొక్కయరగంటలో వచ్చెదనని వర్తకునితోఁ జెప్పి పోవలయునని లేచెను. అతఁడు లేచునరి కుదయమున దివాణములో వానికంటఁబడిన లక్ష్మింపతి ధుమధుమలాడు మొగముతో నాదుకాణమునఁ బ్రవేశించి, "వెధవపెత్తనం! బోడిపెత్తనం! చిన్నముండా వొకటే, పెద్దముండా వొకటే! ఈముండలికి నేనునొఖరివాణ్ణి! మొగుడుచచ్చినముండమూలపడుండక పుట్టినరోజట ముద్దులూముచ్చట్లూనట! నేను ముద్దకు చేరిన వెధవని. నాపెత్తనం చెల్లదు. లణిచేస్తాను అణిచేస్తాను వీళ్ళసంకటాలణిచేస్తాను.' అని యెవ్వరినో నిందించుచు వర్తకుని జూచి, "పదిరూపాయిల మిఠాయి కావాలి. సాయంత్రం నాలుగ్గంటల కొస్తాను. ఇదిగో ఎడ్వాన్సు నాలుగురూపాయిలు' అని రూపాయి లిచ్చినంతనే యావర్తకుఁడు సొమ్మందుకొని,

వేగినపకోడీ చట్రాముతోఁ గ్రిందనున్న పళ్లెములోనికిఁ దీయుచుఁ దాను సిద్ధము చేయవలసిన మిఠాయి లేవేవియని వాని నడగెను. లక్ష్మీం పతి చికాకుతో "ఏవో నీకు తోచినవి నాలుగూ తగలెయ్యమూ' అని విసుగుతో జవాబుచెప్పి 'ఆడదాని చేతి అర్థం అన్నసామెత వుండనే వుంది. ఎలా తగలెట్టినా వొక్కటే'' అని తనలో గొణుగు కొనుచు నందుండి వెడలిపోయెను. అప్పుడు లక్ష్మీంపతి మిక్కిలి కోప ముతో నున్నట్లూహించి వానితో మాటాడ నది సమయము కాదని లక్ష్మీకాంత మూరకుండెను. మఱియు వానిసణుగుమాటలు విన్నవాఁ డగుటచే, లక్ష్మీంపతి యిరువురిస్త్రీలయొద్ద నున్నట్లును, ఆస్త్రీలు మిక్కిలి ధనవంతురాం డ్రైయినట్లును, తనపెత్తన మాస్త్రీలకడ సాగకున్నందున నతఁడు వారిపైఁ బగ దీర్చుకొనఁ జూచుచున్నట్లును లక్ష్మీకాంత మూహించెను.

లక్ష్మీంపతి వెడలిపోయినంతనే లక్ష్మీకాంతము వర్తకునితో నొక్కయరగంటలో వచ్చెదనని చెప్పఁగా నతఁడు నవ్వుచు, 'పంతులూ! నీసెయ్యి సాలా మంచిది. మిఠాయి యిస్తాం భోంచేయ్!' అని యొడఁగట్టని పట్టెడుబూందియును, బట్టెడు పకోడీలును రెండు పొట్లములుగాఁ గట్టి వాని కిచ్చెను. లక్ష్మీకాంతము వాని నందుకొని తా నింటి కేగుసరికి వంట కాకున్నయెడల నంటయగువఱకు నయ్యావి శ్యామలాభ్రమరముల కాధారమగునని సంతసించి, తీవ్రముగా నెండగాయుచున్న యాయపరాహ్ణసమయమునఁ దనకుఁ గొంచెము మొగము తిరిగిన ట్లగుటచేతఁ బ్రక్కనున్న కాఫీహోటేలున కేగి, తనభోజనముసొమ్మైయిన యాఱణాలలో నర్ధణాయిచ్చి యరకప్పెడు కాఫీ పుచ్చుకొని, సోమరాజుకొఱకొకయర్ధణా చుట్టలు కొని, చేత నున్న పొట్లములు గానరాకుండ నుత్తరీయము గప్పి యాయెండలో పెద్దబజారునుండి వడివడిగా నడచుచు వీథులన్నియుఁ గడచి గోవుల

సాలవీధిలోనున్న తనయింటికి వచ్చెను. అయ్యింటియరుగుపైఁ గల చాపపై నంతవఱకు గాఢముగా నిద్రించి యప్పుడే మేల్కాని, సోమరాజు గుమ్మమెక్కుచున్న లక్ష్మీకాంతమును జూచి, లేచి కూర్చుండి 'బావా! చుట్టలమాట ఏంచేశావ్?' అని యడిగెను. లక్ష్మీకాంతము జేబులోఁ జేయిపెట్టి చుట్టలను దీసి వాని కీయఁబోవుచుండఁగా నుత్తరీయముచాటుననున్న యొకపొట్లము జారి నేలఁబడి నంతనే సోమరాజు వాయువేగమున దాని నందుకొని విప్పి పిడికెడు పకోడీల నోట వేసికొనెను. లక్ష్మీకాంతము నోట మాటలేక తెల్లపోయి చూచుచు, నతఁడు తనదెయ్యపుఁజేతితో రెండవపిడికిలి కూడఁ బట్టినంతనే, 'బావా! శ్యామలకీ భ్రమరానికీ కొంచెంపుంచి మరీతిను' అని దీనముగా వేఁడుకొనెను. సోమరాజు నవ్వుచు, 'మహా ప్రశస్తంగా వుంటుంది విజయనగరంపకోడీ! ఈగరగరా, ఈఘుమఘుమా మాపల్లెటూరిపకోడీల కుండదు. ఇందులో మరడక్కు లోపలికి వెళ్తున్నావేమో కొంచెం మంచినీళ్ళు తెచ్చిపెట్టు' అని పలుకుటయు లక్ష్మీకాంత మాయాశ విడిచి లోనికిఁబోయి పెరటింటిలో గుసగుస లాడుచుండిన తల్లిని నన్నగారిని సమీపించి, తనయొద్దనున్న వైదణాలును సుబ్బారావునకిచ్చి, పాత్రతో మంచినీరు గొనిపోయి సోమరాజుముందరఁ బెట్టి, తాను జావడిగదిలోఁ బ్రవేశించెను. ఆ గదిలో నులకమంచముపై భ్రమరము కళాహీనమై మిక్కిలి వాడిన మొగముతో గాఢనిద్రయం దుండెను. లక్ష్మీకాంత మామెప్రక్కనే కూర్చుండి మూఁడునాలుగుసారులు లేపెనుగాని యామె లేవలేదు. వేళపట్టునఁ గడుపునిండ నింత యన్నము తిని యుండినయెడలఁ దనతోడిబాలికలతో నాడుకొనుచునో చదువుకొనుచునో చకచక లాడుచుండవలసిన తనచెల్లెలు— తిండిలేక యట్లు సొమ్మసిలి పడియున్నందుకు లక్ష్మీకాంతము కంట నీరుపెట్టుకొని

యామెను మఱల లేపెను. భ్రమరము మేల్కొని లేవలేక లేచినం తనే లక్ష్మికాంత మామె చేతిలోఁ దనయొద్దనున్న పొట్లమును బెట్టి 'అమ్మ యిప్పుడే వండేస్తుంది. అందాకా యిది తిని మంచినీళ్ళు తాగు!' అని చెప్పెను. భ్రమర మాపొట్లమును విప్పిచూచి యందలి వస్తువుపైఁ దనయనిష్టమును జూపులతోడనే సూచించుచు,

'అన్నయ్యా! కారం యిష్టమైనట్లు నాకు తీపి యిష్టం లేదు. శ్యామల కిచ్చేస్తాను.'

'కొంచెం తినవమ్మా! ఆకలితో వున్నావు. తిని మంచినీళ్లు తాగితే వంటయిందాకా ధైర్యంగా వుంటుంది.'

'అయితే యిదిగో ఈవంతు నాదీ-ఈవంతు శ్యామలదీ'

అని పలుకుచు భ్రమరము తనవంతు దాను తీసికొని శ్యామలవంతు శ్యామల కిచ్చుటకు లేచివెళ్ళినంతనే లక్ష్మికాంతమును లేచి గదివిడిచి తనపనిమీఁదఁ బోయెను.



## 12 వ ప్రకరణము

### వేంకటశాస్త్రి కుతంత్రము.

'సోఁవన్నా! సెట్టిగారిపల్లెంలో పకోడీ ప్లేచు పట్రా'

'అమ్మనాయనో అమ్మనాయనో మఱచ్చుకోలేను. మఱచ్చుకోలేను.

‘పోనీ రెండు లాడూలు తెచ్చి వొడ్డించు’

‘అమ్మనాయనో’

‘అయితే కొంచెం ప్రశ్నా శ్సనా పుచ్చుకోండి’

‘అమ్మనాయనో’

‘సోవన్నా! కలక్టరుగారి టీపార్టీకోసం మనం కలకత్తానుండి తెప్పించిన బిస్కట్లు సెట్టిగారు చూస్తారు పట్రా!’

‘పబులోళ్ళకి కలకటేరుతో పరిశయం వుందేటి?’

‘మాంశాగా అడిగేరు. కలక్టరూ నేనూ మోస్టు ధిక్ ఫ్రండ్సు. అప్పుడప్పుడు మాకు వార్నింగ్సు కూడా యిస్తా వుంటాడు’

‘కిందటిపాలి వోట్లేయించినప్పుడు కొట్టుకోడం తిట్టుకోడం కుమ్ముకోడం గుద్దుకోడం అంతా గోలుమాలయిపోయిందనీ— యీ పాలి కలకటేరు సొంతంగా అక్కడకూకొనే వోట్లేయిస్తాట్ట’

‘ఇహ మనపార్టీ గెల్చిం దన్నమాటే. అయితే చెప్పేమన్నా రేవిటి యిందులో వున్నమర్మం? కలక్టరు మనకోసం రహస్యంగా క్యాన్వాసు చేస్తున్నాడు. ఎవరితో టీమాత్రం అనకండి’

‘శా— శా— ఎందు కంతాను? నాకు బుద్ధిలేదా యేటి? మరో టీ మరోటీనా? గవరుమెంటుతో యవారం.’

‘గవర్నమెంటు మాకు వెనకదన్నుండబట్టే యీమారు జయం మందేయని ధైర్యంగా చెప్పగలం’

‘అభ్యంతరంవేటి? పబులోళ్ళలాంటోరుంటేనే గౌరుం! మీలాంటోళ్ళుంటేనేం! లేకపోతేనేం? రెండుచంవచ్చరాల్నుంచీ నేను మున్సిపల్ నంబరుగా వున్నాను నాకేటి తెల్సింది? ఏటో గోడ. మీ టింగులో కెల్లి కూకుంతే కంకర కంకరని తినేస్తారు. మరి మెట్లంగి వ్రాసేన్నుండదు.’

'సోవన్నా! సెట్టిగారేం పుచ్చుకో లేదు. కాఫీపే గా కాస్త సుభ్రంగా చేసి పట్రా!'

'పుచ్చుకోలేదా? పుచ్చుకోపోతే వొడ్డించిందంతా గోట యింది?'

'చక్కని వెండిపళ్ళెములోని చిత్రిపైన వెండిగిన్నెయందుఁ బొగ లెగయుచున్న కాఫీని జక్కెర చక్కఁగా మిళిత మగునట్లు వెండి చెమ్చాతో గిరగిరఁ ద్రిప్పుచుఁ దెచ్చి వంటబ్రాహ్మణుఁడైన సోవన్న సెట్టిగారిముందుఁ బెట్టెను. బాబుగారు తమయాసనమం దాసీనులై యుండ వారిప్రక్కనే సెట్టిగారు కుర్చీపైఁ గూర్చుండిరి. వారియిరువురి యుచ్ఛిష్టపాత్రలును గూడ నామేజాబల్లపై నటునిటుఁ బడియుండెను. మువ్వురు గుమస్తాలును, లక్ష్మీకాంతమును బాబుగారి యెడమవైపు గోడచేరువగాఁ దివాసీపైఁ గూర్చుండి విస్తరాకులలోని యుపాహారములను బుచ్చుకొనుచుండిరి. లక్ష్మీకాంతమున కాదినమున కాయుపాహారమే భోజనప్రాయమైనది. భ్రమర మీసరికి విస్తరిముందుఁ గూర్చుండెనో లేదో యని యనుకొనుచు నతఁడు విస్తరిముందుఁ గూర్చుండి తదేకధ్యానముతోడనే భక్ష్యములను బుచ్చుకొనెను. ఉపాహారభక్షణ, కాఫీపానాదికములు పూర్తియైనంతనే తాంబూలము వేసికొనుచున్న సెట్టిగారితో బాబుగారు తమ గుమస్తాలలో నొక్కరొక్కరి గుణవిశేషములను గూర్చి చెప్పుచు, లక్ష్మీగాంతమును గూర్చి—

''ఈయనగారింకా కొత్త—ఇవాళే ప్రవేశించాడు. ఎలా తయారవుతాడో చెప్పలేం. కాని రాకట చూస్తేమాత్రం బుద్ధిమంతుడులాగే కనిపిస్తున్నాడు.'

'బుద్ధిమంతుడే నాకెరికే. వుద్దేగంకోసం నాకాడికో పాలొచ్చినాడు. నామీద కవికూడా సెప్పినాడు— యవారాలున్నాయా

నాభాలున్నాయా? ఏఁటిచ్చీదుద్దేగం! నా మొకం. కవి సెప్పినాడు కదాఅని రెండుచేత్తులబియ్యం కోపావలాయిచ్చి యెలిపోమన్నాను. పాపం అప్పూటకు తేసోడు. ఇలాంటోణ్ణి పోసించడం పబువోరికి మా గొప్పయిశేసం! ఈపాలి తప్ప గెల్చేస్తారు.'

'మీరు మాట యిస్తే తప్పకుండా గెలుస్తాం. సాయం చేస్తారా చెయ్యరా మొహమాటం లేకుండా చెప్పేయండి'

'పబువోరు కాస్త ముందుగా సెలవిచ్చింటే నిలబడకే పోదును. మద్దెరంగంలో మానీమండం దరమఁవేనా? అప్పుడే మా సిన్నోడు మూఁ వేలు ఖర్చెట్టేసినాడు వోట్లుకోసం'

'ఆమూడువేలూ మీకు మేం యిచ్చేస్తాం, ఆవోట్లన్నీ మా పక్క తిప్పించేయండి.'

'ఆమాట సెలవిచ్చారుకాబట్టి యిప్పుడే యింటికెల్తాను. మాసిన్నోణ్ణే మాపెద్దోణ్ణే పిలిపిస్తాను. కూకోబెడతాను. పబువోర బ్రామ్మదవల్లాలా! ఆరెలా సెప్తే మనం అలా యినుకోవాలని బోదసేస్తాను. ఆళ్ళమా టుచ్చుకోని పబువోరితో మనవి చేసుకుంటాను'

'మీమాటంటే వాళ్ళు కాదంటారటండీ మీవెఱ్ఱిగాని— మీకుటుంబం మీమర్యాదా మాకు తెలుసును. సంతపేట్లో మీకున్న గౌరవం మరొకరికి లేదు. మాకు కౌన్సిల్‌గా సక్సెడ్ వొచ్చిందీ అంటే వెంటనే ఛైరుమే నవుతాం. మేం ఛైయిరుమేన్‌గా వుండాలని ప్రజలంతా యెలా ఘోష పెడుతున్నారో మీరుకూడా వినే వుంటారు.'

'ఇక నేం? సంతపేటంతా అదేగోస!'

'మేం ఛైయిరుమేనే కాగానే మిమ్మల్నికూడా కౌన్సిల్‌గా వేయించేస్తాం. కలక్టరుతో మీగురించి యీయన చాలా లార్జిమేననిన్నీ గుడ్ మేననిన్నీ చెప్తాం. చెప్పడఁవే కాదు, స్వయంగామిమ్మల్ని

మాకార్లో కూర్చోపెట్టి తీసుకువెళతాం. మీకున్న యిన్‌కం టేక్సూ గిన్‌కం టేక్సూ అన్నీ దకోబస్తూ తగ్గించేస్తాం.'

'ఈకలకటే రెలిపోతాట్ట?'

'వెళ్ళనీయండి వెళిపోతేనేం? మరేకలక్టరొచ్చినా మీయిన్కం టేక్సెక్కువ చెయ్యడానికి వీల్లేకుండా ఆర్డరు రాయించేసి ఆఫీసులో ఫయిల్ చేయించేస్తే సరికదూ? దూరంఆలోచించండి. ఇప్పుడే రాజీనామా రాసీయండి. చెక్కురాసిచ్చేస్తాం.'

'పబువ్వొరింతదూరం సెలవిస్తూంటే నే నేటంటాను? రేపు యీయాలప్పుడొచ్చి రాసిచ్చేస్తాను. సెక్కు రాయించి వుంపించండి'

'ఇవాళెందు కూడదూ? మీయనుమానం దేనికో చెప్పండి'

'శా! అనుమానఁవేటి? పబువ్వొరికాడ? మాయిరకాడొహడు నామీద పుల్లెడాశతో వున్నాడు. ఆడికూట్లో బుగ్గొడిపోతే నామీద మా యేడుస్తాడని భయప్పడి పోతున్నాను.'

'మీవీరకాడి కొచ్చిన ప్రమాదం యేమిటో చెప్పండి. ఆలోచిస్తాం. యెవరికే యేప్రమాదం లేకుండా చెయ్యడానికేకదూ మరి మేం ఛెయిరుమేను కావడం?'

'దరమప్పబువులు. దరమప్పబువులు. నే నెరగనా యేటి? పట్నఁవంతా అదేగోస! పట్నఁవంతా అదే గోస. పచ్చంవచ్చరాలై మాయీరకడు బట్టలెవారం సేసుకుంతున్నాడు. సూసినారా? సేసుకుంతుంతే యీగాంధీయాపారంలో— ఆడోళ్లూ మొగోళ్లూ దుకాణాలకాడకొచ్చి యిదేశబట్టలు కొనొద్దని యరుస్తూవుంతారు. దానికేటో పేరుంది మరిసిపోయినాను.

'పికింగండీ సెట్టిగారూ పికింగ్'

'సూసినారా! బాబుగారు సిటంలో సెప్పేసినారు. నాకేటి సదువా? సందే? ఆ పిక్కింగులో మాయీరకాడి యవారఁవంతా

సిక్కిపోయింది. బేరం సారం లేక మా రువాడీవర్తకుడికి రెండేలు బాకీ పడిపోయినాడు. మనకి పోటీగా వున్న డాకయేరు నాయణ్ణి మా యీరకా డీమద్దె రెండేలప్పుడుగుతే నీకప్పు యిస్తాను. మీనరసయ్య సెట్టిఖర్చెట్టిన మూణేలూయిచ్చేస్తాను. వోట్లునాపక్కకి తిప్పించేస్తావా అన్నాట్ట! మాయీరకా డీపూటాయాపూటవచ్చి వొప్పుకోవొప్పుకో అని నన్ను సావగొట్టేస్తున్నాడు. ఈయవారంలో యిన్నిసిక్కులుండ బట్టే బాబుగారికి రేపు మనవి సేసుకుంతానని మొత్తైడుతున్నాను.'

'చిక్కులేఁవిటండీ! ఇప్పుడు మీరు చెప్పిందాన్లో మాకేం చిక్కులున్నట్టు కనపడలేదు. కాదూ పోదూ అంటే ఆరెండువేలూ మేఁవే అప్పిస్తాం. అయివేజు యేఁవేనా యిస్తాడా మీవీరకాడు?'

'దుకాణఁవే మరేటి? నలభై యాభై వేలరూపాయిల బట్ట లున్నాయి.'

'అయితే యిహనేం? దస్తావేజు రాయించండి'

'ఈరెండె వారాలూ బాబుగారు ఖాయం సేసీసినట్టేనా?'

'సందేహం కూడానా? రేపీపాటివేళకు మీరూ మీవీరకాడూ కూడా రండి! మీరాజీనామాపత్రం దస్తావేజూ రడీగా రాయించేసే పట్రండి. మీరొచ్చీసరికి మేం సొమ్ము సిద్ధంగా వుంచుతాం.'

'సిత్తం! మరిశెట్టికి సెల విప్పించండి.'

'మంచిది. చాలా సంతోషం.'

నరసయ్యశెట్టి కుడిచేతి చేతికఱ్ఱ నానుకొని లేచినంతనే ప్రొప్రయిటరుకూడా లేచెను. వెంటనే గుమస్తాలును లేచి నిలువఁబడిరి. నరసయ్యశెట్టి కెడమకాలు పొడవును గుడికాలు పొట్టియు నగుట చేత నడచునప్పుడు వానియెడమభుజ మెగురుచుండును; కుడిభుజము క్రుంగుచుండును. శెట్టి చావడిగుమ్మము సమీపించువఱకు గంగాధరము గౌరవార్థము వానివెనుకనేయుండెను. అప్పుడు శెట్టి కట్టెదుట

వీక్షించుచు 'బాబుగారికాడకే కావోసు! శాస్త్రుల్లు వూయిసురుమీా దొస్తున్నాడు. ఈవొంగముండాకొడుకుఎంతటోణ్ణైనాటోపీ యేసేస్తాడు' అని పలికెను. శాస్త్రి వచ్చుచున్నాడను మొదటివాక్యము తనచెవిని బడినంతనే పారిపరియిటరు తటాలునఁ దనగుమస్తాలవంకఁ దిరిగి వారితో నేమోమాటాడఁ బోడఁగుటచే శెట్టి పలికిన రెండవవాక్యము వానిచెవిని బడలేదు. శెట్టి మఱియొకమారు సెలవుపుచ్చుకొని తానెక్కివచ్చిన బండినెక్కి వెడలిపోయెను. గుమస్తాలును దమపనుల మీఁద నాఫీసుగదిలోనికిఁ బోయిరి. గంగాధరము వికసించిన ముఖముతో నెదురుగ వచ్చుచున్న శాస్త్రినిజూచి—

శాస్త్రీజీ! ఇహ సంతపేటంతా మందే''

"చిత్తం! ఇహ సానివీధంతా మందే''

"బస్! ఇహనేం? జయించీశాఁవన్నమాటే! రండి కూర్చుని మాటాడదాం'' అని యిరువురుఁ దమయాసనములఁ గూర్చుండి నంతనే బాబుగారు,

"వ్యవహారఁవంతా రైటయిపోయినట్టేనా శాస్త్రీజీ! మరేఁవేనా సందేహం వుందా?

"పిసరంత సందేహం లేదు. అంతా రైటయిపోయింది. ఆరు వందల రూపాయిల కేర్పాటు చేశాను.''

"బాగానే వుంది. సూర్యకాంతానికి మొహం విడ్డాదికదా?''

"విడ్డం యేఁమిటి? పొంగిపోయింది ముండాకూతురు! సరోరుహాన్ని బుగ్గలు ముద్దెట్టుకొని నీయదృష్టఁవే నీయదృష్టఁవే అని వోమారు కాకలించుకొంది. అక్కడున్న జట్టంతాకూడా వోమారు సరోరుహాన్ని పొగిడీశారు,''

"ఎవ రెవ రాజట్టు!''

"దాందగ్గిర ఆటా పాటా నేర్చుకునే గుంటలు- చంద్రముఖా నాగామణీ- హైమాన్ రాణీ- పరాంకుశం- అప్పలకొండ- చిరంజీవి_ నాన్ కతాయి- తారుపీపా- నరహరి అంతా అక్కడే వున్నారు. సూర్యకాంతం నన్ను రహస్యంగా పిలిచి నలబైవోట్లు రడీగా మం చేతులోనే వున్నాయి. తక్కిన ముప్ఫయింటికీమాత్రం బుర్రకో పెద్ద కాసుచొప్పున యిస్తే బాగుంటుందని బాబుగారితో మనవి చెయ్య మంది. నాయుడు బుర్రకి పదిరూపాయిలు కంటే యెక్కువ యివ్వాలే నన్నాట?

"పెద్దకాసిప్పు డేధరలో వుంది శాస్త్రిజీ!"

"పదహార్రూపాయీల చిల్లర- మూడణాలో పావలో జ్ఞాపకం లేదు."

"సరే! అముప్ఫైకాసులూ పారేదాం! అయితే పాపం యిందులో యేమీ ముట్టకుండా వుండిపోయేది మీ చకోరాక్షి. వొక్కత్తే కదూ!"

చకోరాక్షి నాసొంతమనిషి. అది పుచ్చుకుందీ అంటే నేను పుచ్చుకున్నా నన్నమాటే ఎంతమాట? నాపీక పోయినా అలాంటిపని కొప్పుకుంటానా? బాబుగారి స్నేహమాత్రం అది పుచ్చుకుంటుందా! గ్రహచారం చాలక- విధిలేక- సహించచ్చి- బాబుగారిచేత యీసొమ్ము ఖర్చుపెట్టించవలసివచ్చింది. ఇది తల్చుకున్నప్పుడల్లా నాతల తీసేసి నట్టే వుంటుంది. నిజం మనవి చేస్తున్నాను. అయితే యేం చెయ్యను? నాయుడి పోటీ అలావుంది."

ఆమాటలకు బాబుగారు పకపక నవ్వి—

"మీరీకాలంలో వుండవలసిన మనుషులు కారండీ శాస్త్రుల్లు గారూ! సరేలెండి! చకోరాక్షిసంగతి సావకాశంగా ఆలోచిద్దాం! తొందరెందుకు?

వీరిసంభాషణ మిట్లు జరుగుచుండ ఘంటారావము మాటిమాటికి వెలుపలినుండి చావడిలోనికిఁ దొంగితొంగి చూడ నారంభించెను. మేజాపైనున్న గంటచప్పుడు వినకుండ సేవకులు చావడిలోనికిఁ బోఁగూడదను శాసన మెఱింగిన యాద్వారపాలకుఁడు బాబుగారు తనవంకఁజూచినప్పు డేదో మనవి చేసికొనవలయునని తొందరపడుచుండెను. కొంతసేపునకు గంగాధర మావంక విలోకించి, రావచ్చునను సూచనతో గంట నొక్కినంతనే యాసేవకుఁడు తటాలున లోనఁ బ్రవేశించి, వేంకటశాస్త్రి కొకయుత్తర మిచ్చి "వకోరొచ్చి తమ్ముట్టి! వోకుజ్జోడు తెచ్చిచ్చినాడు," అని చెప్పిపోయెను. శాస్త్రి యాయుత్తర మందుకొని చదువుచుండ వానిమాపులందును ముఖమునందునుగూడ లక్షణములు మాఱిపోవుచుండుట ప్రొప్రయిటరు కనిపెట్టుచుండెను. ఉత్తరము పూర్తి కాగానే మేజాపైఁ బడవేసి నోట మాటలేక మొగము వ్రేలవేసి వేంకటశాస్త్రి నిట్టూర్పులు విడుచుచు భయవిషాదము లభినయింప సాగెను. ఏమి యుపద్రవము జరిగినదోయని బాబుగారు—

"శాస్త్రీ! ఏఁవి టలాపున్నారు? చకోరాత్రికి ప్రాణం మీదికి రాలేదుకదా!

"లేదు నాప్రాణంమీదికే వొచ్చింది. ఈవుత్తరం చిత్తగించండి"

అని కన్నీరు తుడుచుకొనుచు నిట్టూర్పులు విడుచుచుఁ బలుక గంగాధర మాయుత్తర మందుకొని,

"వేంకటశాస్త్రిగారికి—

మీమీద ఎరస్టువారంటు వచ్చింది. కోర్టుబంట్రోతులు మీకోసం తిరుగుతున్నారు. మీరు దొరక్క చీకటి పడ్డదాకా యెక్క—

చేనా వుండి పోండి. రాత్రి యిక్కడికి వెళిపోవలరాసింది. ఇట్లు చకో రాక్షి.'' అని చదివి విచారించుచున్న వేంకటశాస్త్రిని జూచి—

''చెప్పండి! చెప్పండి! శాస్త్రీజీ! దేనికీయెరస్టు వారంటు?''

''ఇది నాయుడిదెబ్బ! మొత్తానికి నాయుడు నామీద పగ తీర్చుకున్నాడు. నేనో షావుకారి కైదువందలు బాకీ వున్నాను. ఆ నాయుడూ ఆషావుకారూ స్నేహితులు—''

''మీ రెందుకు బాకీ పడ్డారు?''

'నాభార్య ఆరుమాసాలు మంచంపట్టి చనిపోయింది. ఆ ఆరు మాసాలూ పత్యం పానం మందూ మాకూ— చివరకి దినవారాలూ వీటన్నింటికి నా కైదువందలు ఋణం అయింది.''

'' ఇంత పీకమీదికొచ్చిందాకా యీసంగతి నా కెందుకు చెప్పేరు కారూ? మీరింత మొహమాటం పడితే యెలా బాగు పడతారు?''

''ఏదో వెనుకనుండి సర్దుకుందాం అన్నఆలోచనమీదే వున్నాను కాని నాయుడిలా కుట్ర చేస్తాడని తోచింది కాదు.''

వెధవకుట్ర! కుట్రేమిటి? ఇప్పుడే పారపోసేదాం ఆరూపా యిలు! ఇహ వాడు మిమ్మల్నేం చెయ్యగల్డు?

అని సెలవిచ్చి బాబుగా రప్పుడే హెడ్ క్లార్కును రావించి యైదువందలకు చెక్కు వ్రాయించి సంతకముపెట్టి శాస్త్రికొసంగిరి.



# 13 వ ప్రకరణము

## రామశాస్త్రి—వసంతరావు

క్షీరాన్నము— పూరీ— చద్ది— రెండు కూరలు— రెండుపచ్చళ్ళు— పప్పు— దప్పళము మున్నగు పదార్థములతోఁ గామేశ్వరమ్మ యానాఁడు వియ్యంకునకు విందు గావించినది. జ్వరముపడి లేచిన భ్రమరమునుమాత్రము మాని, లక్ష్మీకాంతమును భోజనమునకుఁ బిలువవలయునని వసంతరా వనుకొనెను గాని, దివాణమునుండి యాతఁ డెప్పుడు వచ్చునో తా నెంతవఱకు వేచియుండవలయునో యని యూరక సంశయింపసాగెను. 'అన్నయ్యా! వంటయింది. అమ్మ స్నానంచెయ్యమంటున్నాది' అని స్వరాజ్యము వచ్చి చెప్పినప్పుడు వసంతరావు చేతిగడియారము చూచుకొని, పదునొకండు గంటల ముప్పదినిముసము లగుటచే నీపాటికైన లక్ష్మీకాంతము వచ్చియుండఁడా యని యొకమాఱు వీధిగుమ్మములోనికి వచ్చి మూఁడునాలు గిండ్లదూరములోనున్న లక్ష్మీకాంత మింటివైపు చూడసాగెను. అప్పుడు సోమరాజు తిన్న యెంగిలివిస్తరి పారవేయుటకు వచ్చిన సూరమ్మ వానికంటఁ బడినంతనే యతఁడు 'కాంతం వచ్చాడా' అని గుమ్మములోనుండియే యడుగ 'వచ్చి వెళిపోయాడు' అని యామె యరుగుమీఁదనుండియే ప్రత్యుత్తరమీయ, లక్ష్మీకాంతము వచ్చి భోజనముచేసియే వెడలిపోయెనని వసంతుఁ డూహించి యాతలంపు విడిచి లోనికిఁ బోయెను.

మామగారు వచ్చినకారణమున స్వరాజ్యమున కా దినము ప్రతిదినముకంటెను మిక్కిలి సంతోషమైన దినము. వంటకుఁ గావలసిన వానినెల్ల కోరినతక్షణమే వంటింటిలోని తల్లి కందించుచు,

నంగపంచాయగల బరంపురపుఁ బట్టుపంచను దడిపి యారవేయుమని తల్లికిచ్చి, ఇనుపెట్టెలోనున్న తనతండ్రిగారి వెండిహరివాణము వెండియుద్ధరణి, నట్టింటగోడ కొయ్యకు వ్రేలాడుచున్న విబూది పండు రుద్రాక్షతావళము, కడిగినపీట మున్నగు జపసాధనముల నెల్ల మామగారి జపమునకై సిద్ధపఱచి, నా డాయువతీమణి యింటిపనుల యందు బొంగరమువలె గిరగిరఁ దిగరుసాగెను. భర్తమరముతో మాటాడువేళయు, లక్ష్మీకాంతము చదువుచెప్పువేళయుఁ దక్కఁ దక్కినవేళ లన్నియు నామె కనుదినమును విచారవేళలే. ఒక్కొక్కప్పు డామె తనలోఁదానే తనభర్త తన కెన్నఁడైన వశుఁడగునా యని ప్రశ్నించుకొనుచుండును. పతికొల్లని తన జీవితమును దానే గర్హించుకొనుచుండును. విద్యార్థిదశ విడిచి యుద్యోగములోఁ బ్రవేశించిన తరువాత మగనిచిత్తమునకు మార్పుకలుగవచ్చునని యాశించుచుండును. అప్పుడుఁ గూడఁ దన్ను మన్నింపనియెడ మూర్ఖపుఁ బట్టుపట్టి వాని యిల్లు విడిచిపెట్టకుండుటకే నిశ్చయించుకొనుచుండెను. చెన్నపట్టణములో సోమశేఖర మొకబోగముదాని నుంచుకొనెననియు, నొకయఱవదానిం బెండ్లాడెననియు, నొకబంగాళీదానితో లేచిపోయెననియుఁ బెక్కుతెఱఁగుల నిరుగుపొరుగుల యమ్మలక్కలు తమ యనల్పకల్పనా చాతుర్యమునఁ జెప్పుకొనుచుండు నుబుసుపోని మాటలు విని గ్రుడ్ల నీరు గ్రమ్మఁ దనగదిలోనికిఁ బోయి మంచముపైఁ బోరగిలఁ బరుండి వెక్కివెక్కి యేడ్చుచుండును. తనభర్త విజయదశమికి వచ్చునని రామశాస్త్రి మాటలవలన నుప్పొంగిన యామె హృదయతరంగము, రాఁడని పలికిన వసంతుని పలుకులచే నుప్పొంగిన క్షణమునందే నఱలఁ గ్రుంగిపోయెను.

కోడలిని దన పంక్తినే భుజింపుమని రామశాస్త్రి నిర్బంధింపఁగా వసంతమును గామేశ్వరమ్మయు నట్లేచేయుమని హెచ్చరింపఁగా,

స్వరాజ్యము నాఁటిమధ్యాహ్నమున వారితోడనే భోజనముచేసినది. భోజనానంతరమున రామశాస్త్రి వసంతరావులు చావడిలోనికి వచ్చి రెండుకుర్చీలను జేరువగా నీడ్చుకొని యాసీనులై యుండ స్వరాజ్యము నేలపైఁ గూర్చుండి వారికిఁ దమలపాకులుచుట్టి యిచ్చుచుండెను. దంతపటుత్వముచెడని రామశాస్త్రి యారంగవక్కలు పటపట నమలుచుఁ దాంబూలము వేసికొనుచుండె వసంతము వానిం జూచి, 'ఈ కిటికీదగ్గిర చల్లగా గాలివేస్తుంది. ఇక్కడ మంచం పరుపూ వేయించనా' యని యడుగ నతఁడు తనకుఁ బగలు నిద్రపోవు నభ్యాసము లేదని చెప్పెను. తోడనే వసతంరావు వానిని ముఖ్యప్రసంగములోనికిఁ దింపవలయునని యనుకొనుచుండఁగా నింతలో నొక గొంబెద్దుబండి యాయింటి ముందర నిలుచుటచేత వాని దృష్టి యావంకకుఁ బోయినది. స్వరాజ్యముకూడ నాబండి యెవరిదోయని లేచి ముందుకుఁ బోయి చూచుచుచుండఁగా, నొకముత్తయిదువ యాబండిదిగి లోనికివచ్చి, చేతనున్న వెండిబరణినుండి కుంకుమము తీసి, స్వరాజ్యమునకు బొట్టుపెట్టి, 'అమ్మాయీ! ఇవాళ సుందరమ్మగారి పుట్టినరోజు, నాలుగ్గంటలకి తప్పకుండా రావాలని చెప్పమన్నారు' అని పలికెను. అంత స్వరాజ్యము 'ఏవిటండీ చేస్తారు?'

'కాఫీలు ఫలారాలూ యిస్తారు. పాటలు పాడిస్తారు. అమ్మగారు మడితో వున్నారా?'

'అమ్మతో నేం చెప్తానులెండి మడిగట్టుకొంది. ఏపాటిమందిని పిలవదల్చుకున్నారు?'

'అబ్బే! లేదమ్మా! యీరెండు వీధులే! దీనికేవాళ్ళ పింతండ్రి పురెట్టేసుకుంటున్నాడు తన సొమ్ము పెట్టేస్తున్నట్టు. దరిద్రగొట్టు ముండాకొడుకు సంభవించాడు వాళ్ళ పాలింటికి. వెళతాను. ఇంకా వెళ్ళవలసిన యిళ్ళున్నాయి. తప్పకుండా రండేం?'

'మంచిదమ్మా! అలాగే వస్తాను.'

అని ప్రసంగించి ముత్తైదువ వెడలిపోయినంతనే యామె యథాస్థానము నాక్రమించి, వంచిన నవ్వుమొగముతో,

'అన్నయ్యా! సుందరమ్మగారిని యెప్పుడూ చూడలేదు. ఇవాళ వెళ్ళనా?'

'ఎందుకమ్మా! మనకి పరిచయం వుందా? బంధుత్వం వుందా? నువ్వు బయలుదేరితే భ్రమరంకూడా బయలుదేరుతుంది. అక్కడికి వెళ్ళి అదీ యిదీ తిన్నాదంటే మళ్ళా మంచం వెక్కుతుంది.'

'కాఫీకి, ఫలహారాలకి మొహంవాచున్నాంవా యేవిటి? ఆవిణ్ణోమారు చూడాలని— మరేంకాదు. వొక్కరగంటే వుండి తాంబూలంపుచ్చుకొని యిద్దరం వెళ్ళిపోవస్తాం.'

'సరే! చూదాంలే! సాయంత్రంకదా!'

అప్పుడు రామశాస్త్రి వసంతరావును జూచి,

'వసంతం! కాలంవంతా మారిపోయిందోయ్! ప్రతివిషయము లోనూ మా చిన్నతనానికీ యిప్పటికీ బ్రహ్మాండంవంతభేదం కనిపిస్తూంది. పసుపూ కుంకానికీ వాయినానికీ రమ్మని పిలుపే లేదు. ఆడవాళ్ళుకూడా కాఫీల్లోనూ వుప్మాల్లోనూ ప్రవేశించీశారు. బాగానే వుంది కాని, యెవరోయ్ ఆసుందరమ్మ?'

'ఆవిణ్ణిగురించి నాకూ తెలియదు. కిందటి సంవత్సరం ఆవిడ స్త్రీలకై ప్రత్యేకంగా వొకలైబ్రరీ పెట్టించవలసిందని మ్యునిసిపాలిటీవారికి వెయ్యిరూపాయలిచ్చింది. ఆ సందర్భంలో ఆవిడపేరు విన్నాను. ఆవిడేమో యరమిల్లి లక్ష్మణరావుపంతులుగారి కుమార్తెట.'

ఆ మాటలకు రామశాస్త్రి యత్యాశ్చర్యముతో,

'ఏవిటీ? ఏవిటీ? లక్ష్మణరావుపంతులుగారి కుమార్తా ఆసుం

దరమ్మ? లక్ష్మణరావుపంతులుగారంటే యెవరో తెలుసునా? మా కుటుంబాన్ని మైదు వేళ్లా వుద్ధరించిన మహాదాత. వారిలోగిట్లో నేను పన్నెండేళ్ళు పురాణంచదివేను. నాకున్న మడిచెక్కల్లో వొకటి యాయన యిప్పించిందే. నియోగప్రభువంటే యాయనకే చెల్లింది. ప్లీడరీ అన్నా ఆయనకే చెల్లింది. అందరూ ప్లీడర్లా? ఆయనపార్టీ లంతా జమీందార్లే! ఏ కేసు పట్టినా పదేసివేలూ, పదిహేనేసి వేలూ ఫీజు. ఆయనసంతానం వొక్కకుమార్తే. నేను రెల్లివలస కాప రానికి వెళిపోయేసరికి ఆ పిల్ల కేవలం చిన్నపిల్ల. ఇప్పుడేనా పదహా రు పదిహేడేళ్ళకంటె యెక్కువ వయస్సుండదు. చనిపోయేసరికి లక్ష్మణరావుపంతులు రెండులక్షలార్జించినట్టు వదంతి. ఇప్పు డేపా టుందో?'

'వెయ్యిరూపాయిలు మ్యునిసిపాలిటీకి దానంచేసిందీ అంటే సామాన్యవిషయం కాదు. ఆస్తిబాగానే వుండుంటింది. ఆస్తిమాట కేంగాని మీారు చెప్పిన వయస్సుపట్టి ఆ పిల్ల కింత చిన్నతనంలోనే యిలాంటి యౌదార్యం కలగడం చాలా గొప్పసంగతి.'

'తండ్రియంశ యెక్కడికి పోతుంది? లక్ష్మణరావుపంతులుచే తికి యెముకే లేదు. మహా గొప్పదాత.'

ఇంతలోఁ గామేశ్వరమ్మయు భోజనముచేసివచ్చి యా చావడి గుమ్మములోఁ దలుపునకుఁ జేరఁబడి కూర్చుండి, నోట వేసికొనిన చెక్కముక్క నములుచుఁ, జేతంగల తాటాకుపీవనతో విసరికొ నుచు—

'వసంతం! నువ్వయ్యగారు నోగడిదు పడుకుంటారేమో కనుక్కున్నావా?' అని యడుగ, రామశాస్త్రి యా మొవంకఁ దిరిగి 'లేదమ్మా! లేదు పడుకోడం నా కాభ్యాసంలేదు' అని ప్రత్యుత్తర మిచ్చెను. అంత వసంతునితల్లి 'అయితే బాబూ! మా రాజ్యాన్ని

గురించి యేఁవి టాలోచించారు? మీరు గట్టిగా చివాట్లుపెట్టి అబ్బాయికి మెడలు వంచాలి కాని, యిలా యెంతకాలం వూరుకుంటారు?' అని ప్రశ్నించెను. వసంతరావుకూడ నీ విషయమునే ప్రసంగింపవలయునని మనసులో ననుకొనుచు, ఆప్రసంగ మెత్తుటకుఁ దగిన సందర్భము కొఱకుఁ బ్రియత్నించుచుండెను. కామేశ్వరమ్మ యట్టి ప్రియత్న మవసరములేకయే, వచ్చిన క్షణమునందే రామశాస్త్రిని ముఖ్యప్రసంగములోనికి దింపివేసెను. అంత యాకస్మికముగా వచ్చిన యాప్రశ్నకు నేమిసమాధానము చెప్పవలయునో యని రామశాస్త్రి తటపటాయించుచుండ, వసంతరావు 'మాఁవయ్యగారూ! కొంత కాలం నేనూ, బావాకూడా చెన్నపట్టంలో వొక్కలాడ్జిలోనే వుండే వాళ్ళం. ఇప్పు డొక్కలాడ్జిలో వుండడంలేదు సరేకదా నే నున్న వీధిలోకూడా వుండఁడు. మా మీద ఆయనగారి కెంత అసహ్యాం పుట్టిందో చిత్తగించండి' అని పలికెను. ఆమాటలకుఁగూడ సమాధానము తోచక రామశాస్త్రి క్రిందుఁజూచుచు, మీదఁజూచుచు, జన్నిదము సవరించుకొనుచు, వెఱ్ఱినవ్వులు నవ్వుచు నవస్థపడుచుండఁ గామేశ్వరమ్మ—'బాబూ! అబ్బాయిని చూచి మూడు నాలుగేళ్లై యుంటుంది. మరి మాకంట పడలేదు. కళ్లు కాయలు కాశాయి. మా పిల్లమీదే యిష్టంలేదో, మేఁవిచ్చిన కట్నాల్లోనూ, కానుకల్లోనూ యేదేనా లోపం జరిగిందో తెలియకుండా వుంది' అని నిష్ఠురముగాఁ బలికెను. ములుకులవంటి వారిపలుకు లన్నియు నావృష్టాంకు యుద్ధరంగమునందలి భీష్మునివలె సహించుచు, 'వసంతం!' అని పిలిచి వానితోఁ బ్రసంగింపఁబోవుచుండ, స్వరాజ్యము లేచి తన తల్లియొద్దకుఁ బోయి యామెప్రక్కనే కూర్చుండెను. అప్పుడు రామశాస్త్రి,

'ఈ విషయంతో మీ అందరికంటే కూడా నా మనస్సు చాలా కష్టపడుతూంది. నువ్వూ, నాన్నగారూ, అమ్మగారూ, కూడా నా పెళ్లి వుపేక్ష జరుగుతూం దని అనుకోడం న్యాయం కాదు. ఇదిగో, అదిగో అని మిమ్మల్ని ఆశపెడుతూ నేను రాసినవుత్తరాలూ, నేను పెట్టిన ముహూర్తాలూ అన్నీ అబద్ధం అయిపోవడంవల్ల మీరా కేవన్నా నేను పడకతప్పదు. త్వరలో కార్యం చేసేసుకోని కోడల్ని దగ్గర పెట్టుకుందామని నేనెంత తాపత్రయపడ్డానో ఆ పరమేశ్వరుడికే తెలుసును. అయితే నేం లాభం? మా సోమశేఖరం పుత్తి పరమ మూర్ఖుడైపోయాడు. కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుంది.'

'ఆమాట మీనోటంట వస్తుందో రాదో అనే చూస్తున్నాను. బావసంగతి ఇంత చిత్రంగా మారుతుం దని నే నెప్పుడూ అనుకోలేదు.'

'నేనూ ఎప్పుడూ అనుకోలేదు. మీ యందరితో కలిసి ఇస్కూలు ఫైను పాసయిందాకా వాడిచదువు, వాడిశ్రద్ధా, వాడిబుద్ధి మీకందరికీ తెలియంది కాదు. ఈ దిక్కుమాలిన చెన్నపట్టపు చదువు ఎక్కడ దాపరించిందో కాని వాణ్ణి చరిచీసింది. నన్ను మాపేసింది.

ఆ మాటలకు కామేశ్వరమ్మ విచారముతో,

'మా వసంతానికీ చెన్నపట్టపుచదువు రావడానికి మీవాడే కారణం. 'బావతో వెళతాను, బావతో వెళతాను' అని వాళ్ల నాన్నగారిని నిలవనిచ్చాడు కాదు. మహారాజుల్లాగ ఇద్దరూ ఇక్కడే చదువుతుంటే ఇంతడబ్బూ కాకపోను. ఈపాటికి కార్యం కూడా జరిగిపోను. మా రాత ఇలా వుండగా—'

అని ఇంకను నేమియో చెప్పబోవుచుండ వసంతరావు,

'మామయ్యగారూ! కార్యంచేసుకోమంటే బావ నేమి

టుంటాడు? ఇప్పుడూ, అప్పుడూ అంటాడా? కేవలం నా కక్కరే లే డెంటాడా?'

'వసంతం! ఆ సంగతులు మరడక్క, పోయిన వేసంగి సెలవుల కొచ్చినప్పుడు మొహం వాచేటట్టు రోజూ చీవాట్లు పెడుతూ వుండే వాణ్ణి. వాడి ప్రకృతంతా మారిపోయింది.'

'ప్రకృతి మారిపోయిందన్న సంగతి మీరు నాకు చెప్పనక్కర్లేదు. మీ కిప్పుడు బోధపడ్డాది కాని, నాకు తెలిసి చాలా కాలం వయింది.'

'ఔను, నాకంటె నీకే బాగా తెలుసుంటుంది. అక్కడ వాడి తిరుగుళ్లూ, వాడి వ్యవహారాలూ నాకెలా తెలుస్తాయి?'

'ఎన్నోమార్లు మీతో చెప్పాలని యనుకున్నాను గాని, మీరు నమ్మరేమో అన్న సంశయంతో వూరుకున్నాను. ఎప్పుడో మీకు శుభ రేఖ వస్తుంది పెళ్లికి రమ్మని—'

'మళ్లా పెళ్ళి చేసుకుంటాడా యేమిటి? పెళ్లాం వుండగా వీడికి పిల్ల నిచ్చేవా ళ్లెవళ్లు?'

'స్నేహితు లందరితోటీ చెప్తూవుంటాడు తన కెక్కడేనా తగిన పిల్లవుంటె చూడవలసిందని—'

'ఇలాంటి వెధవ్వేషాలు వేశాడంటే వొక్కమడిచెక్కకూడా వీడికివ్వను. నా కున్నదంతా నా స్వార్జితం కాని, వీడి తాతగడించిన దేమీ లేదు. ఇదా వాడి వ్యవహారం? బాగానే వుంది.'

'ఇ దొక్కటే కాదు. ఇది మీవాడు చేస్తూన్న పెద్దవ్యవహారం. ఇంక చిల్లరవ్యవహారాలకి లెక్కా జమా కూడా లేదు. రెండు మూడు చోట్ల దేహశుద్ధి కావలసిందే కాని, తప్పిపోయింది. బియ్యే చదువుకుంటున్న వొక క్రిష్టియన్ దానికోసం మీవాడీమధ్య చాలా తాపత్రయం పడ్డాడు. ఆ ముండని—'

'ఇహ నెందుకు చెప్పడం? నేను మరి విన్నేను. ఒక్క సంగతడుగుతాను చెప్పు. నువ్వు బుద్ధిమంతుడవు కాబట్టి—వీడి పునర్వర్తనం కట్టించడానికి యేదేనా సాధనం వుందంటావా, లేదంటావా? లేదంటావా? ఇహ చదువు చెప్పించలేను కాబట్టి, మానేసి వెళిపో రావలసిందని వుత్తరం రాశేస్తాను. హాఫ్కాసినేనా పంపించడం మానేస్తాను. జీతం కట్టకపోవడంచేత పేరు తీసేస్తే వాడే చదువు మానేస్తాడు. తల్లిలేని పిల్లడని చిన్నప్పట్నుంచీ మహాముద్దుగా పెంచాను, నేను చేసిన తపస్సంతా ఆఖరికి యిలా పరిణమించింది. యాభైయేళ్లు దాటి నా కిప్పు డరవయ్యో పడి. ఈ నిర్భాగ్యుఁడు తిలలూ, దర్భలూ పట్టి పుడిసెడునీళ్ళుకూడా నాకు విడుస్తా డన్న ఆశ మరిలేదు. వసంతం! నాకు ప్రాణంమీద కొచ్చిం దని తెలిస్తే పిచ్చి వోమారు రప్పిస్తాను. నలుగురం కలిసి—'

అని చెప్పుచుండఁగాఁ గామేశ్వరమ్మ గద్గదస్వరముతో,

'అలా అనకండి బాబూ అలా అనకండి! ఇదంతా నేఁ జేసుకున్నఖర్మం. మీ రేం చేస్తారు? మా పిల్ల మాకు గుండెమీద కుంపటయిపోయింది. బతికున్నంతకాలం—'

అని స్త్రీస్వభావమైన దుఃఖవేగమున మఱి మాటాడలేక యూరక కన్నీరు కార్చుచుండ స్వరాజ్యముకూడ నెఱ్ఱవారిన మొగముతో బాష్పాంబువులఁ జేలాంచలమునఁ దుడుచుకొనసాగెను. వసంతరావు నిట్టూర్పులు విడుచుచు నిశ్చేష్టితుఁడై యట్లే యుండిపోయెను. ఆ చావడి యంతయు మూఁడు నాలుగు నిముసములవఱకు భవభూతికావ్యమువలెఁ గరుణరసప్రధానమై యుండ, రామశాస్త్రి కామేశ్వరమ్మ నుద్దేశించి—

'అక్కయ్యాగా రలా కంట నీరు పెట్టుకోవడం ధర్మంకాదు. జాతకభాగంలో బావగారి లాంటి పండితుఁడు యీ మూఁడుజిల్లాల్లో

నా వృద్ధుడు. మావాడి జాతకం ఆమూలాగ్రంగా ఆయన పరీక్ష చేసే, పిల్లనిచ్చారు కాని మరొహాటికాదు. ద్వితీయవివాహం వున్నట్టు వాడిజాతకంలో యెక్కడా కనబడదు. ఏదో గ్రహవంకరచేత వాడి బుద్ధి శాస్త్ర వ్యాసంగంగావుంది. ఆ గ్రహం చక్కబడగానే వాడి బుద్ధికూడా చక్కబడుతుంది. గ్రహపాటు వచ్చినప్పుడు మనం శాస్త్ర వోర్చుకోవాలి కాని, విచారిస్తే యేంలాభం? నా కంఠంలో ప్రాణం వుండగా రాజ్యానికి లేశం లోపం రానియ్యను. నాకున్న ఆస్తిలో సగం ఆస్తి దానికి రాసిచ్చేస్తాను. నాకు కొడుకైనా అదే! కోడలైనా అదే!'

'ఇహనీద మేంకూడా ఇది కూతురుకాదు. కొడుకే అనుకుంటూ దుఃఖమంతా దిగమింగుతూ వుంటాం. మరేం చెయ్యగలం?'

అంతవరకు మౌనమువహించిన వసంత యొకనిట్టూర్పు విడిచి,

'మామయ్యగారూ! రాజ్యానికి, అన్నవస్త్రాలికి లోపంలేదు. అయినా, మీరు సెలవిచ్చారు కాబట్టి మీ రిస్తానన్నది మాత్రం దానికి మాటతప్పకుండా యిప్పించండి.'

'తప్పితే పంచమహాపాపాలూ చేసినట్టే! అమ్మాయికి తప్పకుండా సగంఆస్తి రాసిచ్చేస్తాను. కాని, వసంతం! వాళ్ళసంగతి మాత్రం నేను చెప్పక తప్పదు, నువ్వు వినక తప్పదు. వొంట్లో రక్తం చిక్కగావుండడంచేత మీకు తొందర యెక్కువ. మా కున్న శాంతం, మా కున్న ముందాలోచనా మీ కుండదు. నువ్వు రాసిన వుత్తరాల్లోని ధ్వనులూ, అంతరార్థాలు, నాకు బోధపడకపోలేదు. ఆదినుండీ మనకుటుంబాలు గొప్ప పేరు, ప్రతిష్ఠలు పొందినవే కాని, మరొహాటి కాదు. ఇలాంటి విషమపరిస్థితి వచ్చినప్పుడు తొం

దరపడి తప్పుదారి త్రొక్కి కుటుంబాలగౌరవం పాడుచెయ్యడం బుద్ధిమంతుడి లక్షణంకాదు. దూరఁ వాలోచించు. నాన్నగారేనా నీకిలాగే సలహా యిస్తారు కాని, మరోవిధంగా చెప్పరు. చచ్చిపోయిన మనిషిని బతికించడం అసాధ్యం కాని, బతికున్నమనిషిని బాగుచెయ్యడాని కెప్పటికేనా అవకాశం వుంటుంది. ఎక్కువొద్దు. ఒక్క సంవత్సరంమాత్రం వోర్చు. ఈలోగా నేను కొన్ని గ్రహశాంతులు చేయిస్తాను.'

గ్రహశాంతు లను మాటకు వసంతరావు నవ్వుచు,

'సాధ్యఁవైనంతవఱకు మీరు సెలవిచ్చినట్లు చెయ్యడానికే ప్రయత్నిస్తాను. చెయ్యలేకపోతేమాత్రం క్షమించండి.'



## 14 వ ప్రకరణము

### భ్రమరము శిరోభూషణమైనది.

విజయనగరమునందలి సుప్రసిద్ధ మహాసౌధములలో లింగధారిపేటలో నున్న యెర్రమిల్లివారి సౌధమొకటి యని చెప్పవచ్చును. తత్సౌధనిర్మాతయైన లక్ష్మణరావుపంతులు న్యాయవాదిత్వమున సంపాదించిన తన కీర్తియంతయు నా సౌధరూపమున నిహమున విడిచి పరమునకుఁ బోయెను. ఆతఁ డార్జించిన యైశ్వర్యముకూడ నా సౌధ

ముఖాంజేని వ్రడగప్పిన నిష్పృచొప్పున నిప్పందు కళాహీనమై యున్నది. ఆ మేడచుట్టు నత్యున్నతమైన ప్రాకారకుడ్యముతో నపారమైన యావరణప్రదేశము కలదు. ఆయావరణములో మామిడి, నారింజ, దబ్బ, నిమ్మ మున్నగు వివిధ విధ వృక్షజాతులు చల్లనిసిల్ల వాయువ్రల నెడజల్లుచుఁ దత్సౌధరాజమునకుఁ బెట్టని యాభరణముల వలెఁ గన్పట్టుచుండును. ఆ వృక్షములక్రిందఁ గుర్చీలు, సోఫాలు మున్నగు నాసనవిశేషముల యాకారములతో నచ్చటచ్చటఁ బెక్కు గచ్చుపీఠములు కట్టఁబడినవి. ప్రాకారకుడ్యమునకుఁ గల విశాలమైన యయఃకవాటములకుమీఁదుగా గోపురాకృతితోఁ జిత్రముగాఁ గట్టఁబడిన కట్టడము, విలోకనమాత్రముననే యది యొకజమీందారుని నివేశ మని తోఁపించుచుండును. అ య్యావరణమును, నావరణ ప్రాకారమును నింతటివైభవాఢ్యములైయుండఁ దదావరణమధ్యస్థమగు మహాభవన మెంతటి మనోజ్ఞరూపవిభవసంపన్నమో వివరింపంబనిలేదు.

మన కథాకాలమునాఁటి కా దివ్యభవనవైభవ మంతయుఁ గళాహీనమై రాజులేని రాజ్యలక్ష్మివలె గతభర్తృకయైన జవరాలు చందమున వెలవెలఁబోవుచుండెను. ప్రాకారగోపురద్వారము మొదలు లోపలిమేడగుమ్మమువఱకు వేయఁబడిన చక్కనిరోడ్డు పట్టణవీధులయందలి మ్యునిసిపల్ రోడ్లవలెనే గాతలు, గతకలు, రాళ్లును, గలిగి నిమ్నోన్నతముగానుండెను. కుడివైపున నొకమూలఁ బ్రాకారమునకుఁ జేరువగాఁ గట్టఁబడిన గుఱ్ఱాలసాల యిప్పుడు కేవలము శిథిలమైనది. ఆ సాలకు ముందుగాఁ జెట్లక్రిందఁ జక్రములు మున్నగు నవయవములు విఱిగిన ప్రాతగుఱ్ఱపుబండ్లు పడియుండెను. ఎడమవైపున మామిడిచెట్లక్రింది గచ్చుతిన్నెలన్నియును వాడుకలేక పచ్చని పాకుడు పట్టినవి.

జమీందారులతోడను, దత్తొల్యులగు ధనవంతులతోడను బరివేష్ఠితమై ఘుళ్ళు ఘుళ్ళున లక్ష్మి నిత్యమును దాండవమాడుచుండిన ప్లీడరుగారి కచేరీచావడి యిప్పుడు నిర్మానుష్యమై సరియైన సమ్మార్జనముగూడ లేక తన తొంటివైభవమంతయుఁ గోలుపోయినది. రికార్డుగదులు, గుమస్తాలు పనిచేయు నాఫీసుగదులు, వ్యాజ్యకారులైన జమీందారులు వేచియుండు సుందరమందిరభాగములు, నేడు తలుపులు మూయఁబడి కప్పతాళములు వేయఁబడి, గోల్డుస్మిత్ అను నాంగ్లేయకవి వ్రాసిన 'డిజర్టెడ్ విలేజ్'(Deserted Village) అను గ్రంథమును జ్ఞప్తికిఁదెచ్చుచున్నవి. బెంచీబల్లలు, మేజాబల్లలు, మఖమల్ సోఫాలు, చిత్రవిచిత్రములైన కుర్చీలును గబ్బిలములకు, నెలుకలకు నాసనములై యొకమూలగదియందుంచఁ బడియుండెను. ఆదివ్యభవనమునందలి రంగు రంగుల యద్దాలకిటికీ లన్నియు మూలల మూలయందేఁ బూజులువట్టి ధూళిధూసరితములైనవి. నిండారపండిన దొండపందిరివలెఁ, దెప్పలుగ నిండిన చెఱువువలె, నాశ్రితబంధుమిత్రులతోడను, దాసదాసీజనంబులతోడను నిండి, నిత్యకల్యాణమును, బచ్చతోరణమునై యొకప్పుడు మహైశ్వర్యమనుభవించిన యారమణీయభవనము, నేఁడు తన యైశ్వర్య మనుభవించువారు లేక యారణ్యపుష్పసౌరభమువలె నిష్ప్రయోజకమయినది—

కీర్తిశేషుఁడైన ప్లీడరు తా నపుత్రకుఁడగుటచే స్వార్జితంబంతయుఁ దనకూఁతునకే వ్రాసి యిచ్చుటచేత సుందరమ్మయే యిప్పుడా గృహమునకు యజమానురాలు. విధివశంబున నా బాలిక పితంతువగుటచే నిప్పుడా జవరాలి జీవితంబును భోగబాహ్యంబైన తద్భవనవైభవంబును నొక్కతీరునందే తూగుచున్నవి. విద్యావతియు, గుణవతియు నగు సుందరమ్మ యింతకాలము భాగర్భరత్న

ముకరణి ననామకస్త్రైయుండి యిప్పుడిప్పుడు జ్ఞానవతియై పితృవిచారమును, బతివిచారమును మఱచి, యేదే నొక్క నెపంబునఁ జుట్టుపక్కలంగల పురంధ్రీమణులఁ దనయింటికి రప్పించుకొనుచు వారి వలనఁ బరిచయమును, గౌరవమును బడయుచుండెను. జ్ఞానవతియైనతరువాతఁ దన తండ్రిజీవితమునే యాదర్శముగాఁ గొనవలయు నను సంకల్పము సుందరమ్మకుఁ గలిగినది. అట్టి సంకల్పముతోడనే యామె మ్యునిసిపాలిటీవారికి వేయిరూపాయీలను దానముచేసి, పట్టణస్త్రీలకుఁ బ్రత్యేకగ్రంథాలయము నెలకొల్పుటకును, అందలి గ్రంథముల నిండ్లకుఁ ద్రిప్పుచు స్త్రీలందఱ కందించుచుండుటకును దగినయేర్పాటులను జేయించెను. అప్పటినుండియు నామెపేరు పౌరకాంతలలో వ్యాపించినది. ఆమెజీవితముతో సంబంధించిన మిగిలిన విశేషములను జదువరులు వేఱొకసందర్భమున నెఱుంగఁగలరు.

ఆనాఁటి సాయంకాలము నాలుగుగంటలకు ముత్తయిదువలొక్కరొక్కరే యామందిరమునఁ బ్రవేశించి ద్వారములన్నియుఁ గడచి, లోపలిచావడి నలంకరింపసాగిరి. మహాసముద్రమువలె నతివిశాలమైన యాచావడియందు లక్ష్మణరావుపంతులుగారు వేదవిద్వాంసులచే వేదాధ్యయనము చేయించుచుండిరి. పండితు లాచావడియందే సత్కరింపఁబడుచుండిరి. వేదచావడి యనియు, మడిచావడి యనియుఁ జిరకాలము వ్యవహరింపఁబడిన యాచావడి యానాడు విచిత్రములైన చిత్రపటములతోడను, విలువఁగల నిలువుటద్దములతోడను జక్కగా నలంకృతమై తన ప్రస్తుత యజమానురాలైన సుందరమ్మగారి పేరు సార్థకముచేయుచుండెను. వచ్చిన వారలనెల్ల నింటిముత్తైదువయైన పేరమ్మ గౌరవించి యందు వేయఁబడిన తివాసీలపైఁ గూర్చుండఁ బెట్టుచుండెను. పండుటాకులుఁ నారంగులవక్కలుంగల వెండిపళ్ళెరములు, అత్తరుపన్నీరులు వోసిన

చిత్రములైన వెండిబుట్టలను, అందందు బంగరుపూవులు పొదివిన వెండిగంధపుగిన్నెయుఁ గుంకుమభరిణియు, పరిమళపుష్పసంపదల వెదఁజల్లుచుండిన యగరువత్తుల ధరించిన వింతయగు నొక రజతప్రతిమయు, ఒకహార్మోనియముపెట్టెయు నా చావడినడుమ నొకతివాసీపైఁ జక్కఁగా నుంచఁబడినవి. వచ్చినస్త్రీలెల్లరును పేరమ్మగారివమ్మనుబడసి, యా రజతపాత్రలచుట్టును సుఖాసీనలగుచుండిరి. 'సుందరమ్మగారేంచేస్తున్నారోవిడా?' అని తన్నడుగుచుండిన కాంతలతో 'ఇదుగో వస్తున్నారు. పింతండ్రితో మేడమీద యేదో మాటాడుతున్నారు' అని పేరమ్మ ప్రత్యుత్తరము లిచ్చుచుండెను.

ఒక్క యరగంటలోనే యాచావడిలో సగముభాగము కాంతామణులచే సమాక్రాంతమయినది. ముత్తైదులైన పిల్లలతోఁ దల్లులును, చెల్లెండ్రతో నక్కలును, కోడండ్రతో నత్తలును, నాఁడు సుందరమ్మగారి యాహ్వానమును మన్నించి వచ్చిరి. కంఠములయం దున్నశక్తి కన్నులయందుఁగాని, కాళ్ళయందుఁగాని లేని ముసలి యత్తలను, ముసిముసి నవ్వులతోఁ బడుచుకోడండ్రు చేతులుపట్టి తీసికొనివచ్చి కూర్చుండఁబెట్టిరి. శిశువులు మొదలు వృద్ధులవఱకుంగల యన్ని వయస్సులవారిచేతను, ఆచావడిలోఁ గూడిన మానినీసముదాయము భాసమానమగుచుండెను. ఆ పూటకు లేని నిఱుపేదరాండ్రును, మహైశ్వర్యసంపన్నలైన ధనికురాండ్రును, గురూపాంగులు, సుందరాంగులు, సౌందర్యగర్వితలు, వినయవతులు, వివేకశూన్యలు, విద్యావతులు, సంతానరహితలు, సంతానవతులునుం గల యా కాంతాసంతానమంతయు సుందరమ్మగారి యాగమనమును నిరీక్షించుచుండెను.

ఇంతలోఁ బేరమ్మయు, వంటబ్రాహ్మణుఁడైన వెంకన్నయు నుపాహారపుఁ బళ్ళెరములతో నాచావడిలోఁ బ్రవేశించినంతనే వారందరిదృష్టు లా వంక కాకర్షింపఁబడినవి. తివాసీలులేక యొక్క జంబుఖానామాత్రమే వేయఁబడిన యా చావడిలోని రెండవభాగమునఁ బేరమ్మ చించిన విస్తరాకుముక్కలు వరుసగా వేయుచు 'రండి, రం' డని వా రందరి నాహ్వానింపసాగెను. వేసినవిస్తరాకులలో వెంకన్న యుపాహారములను వడ్డించుచుండ, జిహ్వాచాపల్యమునఁ దొందరపడుచున్న పిల్లలతో నచ్చటి కాంతామతల్లులును, వారివెనుకనే బాలికలును లేచియాకులముందుఁ గూర్చుండిరి. ఆచారవంతురాలగుటచే సిద్ధాంతిగారి భార్యయు, నౌషధసేవచేయుచుండుటచే శిరస్థదారుగారి చెల్లెలును, జ్వరముపడి లేచినకారణమున భ్రమరమును, మామగారితో విందుభోజనముచేసిన కారణమున నాకలి లేక స్వరాజ్యమును దప్పఁ దక్కిన మహిళామణులెల్లరు నుపాహారభక్షణమునకుం గడంగిరి.

ఆనాఁటిమధ్యాహ్నము భోజనానంతరము తనపతింగూర్చి తన మామగారికిని, నన్నగారికిని జరిగిన సంభాషణమంతయు విన్నతరువాత స్వరాజ్య మెవ్వరితోడను మాటాడక తన గదిలోనికిఁ బోయి మంచముపైఁ బొరఁగిలఁ బరుండి కంట నీరు పెట్టుకొనుచుండఁ దల్లియు, నన్నయు నామె నెన్నోవిధముల నోదార్పసాగిరి. కలఁతపడిన యామెహృదయము కుదురుపడునని యెంచి, యపరిచితుల యిండ్లకుఁ బోవనేల యని మొదట వారించిన వసంతరావే సుందరమ్మగారియింటికి వెళ్ళుమని యామెను బ్రోత్సహింపసాగెను. కాని, తన కా యుత్సాహ మిప్పుడు లేనందున స్వరాజ్యము వెళ్లుట కిష్టపడలేదు. నాఁటిసాయంకాలము మూఁడున్నరగంటలకు వసంతము భ్రమరమును రప్పించి, సుందరమ్మగారియింటి కేఁగుటకు స్వరాజ్య

మును బ్రోత్సహింపుమని యామెకు బోధించెను. తానుఁగూడ నాహ్వానింపఁబడినదేయయ్యు వెళ్ళవలయునను సంకల్పము లేశము లేకయున్న భ్రమరము వసంతుఁడు చెప్పినచొప్పున స్వారాజ్యమును బోధించి యామెను లేవఁదీసినది. వసంతునకుఁ బ్రియమునుసేయుట కంటె భ్రమరమునకు వేఱుసంతోష మేమున్నది?

విందుభోజనముచే నాఁకలిలేనికారణ మొక్కటియేగాక, తినఁగూడని భ్రమరము తినకుండఁ దాను దినుట కిష్టములేకయుఁ, తన మనస్సునకు లేశమును హెచ్చరిక లేకయుండుటయుఁ గూడఁ గారణములుగా స్వారాజ్య ముపాహారమునకుఁ బోవలేదు. బలీయపదార్థములు తనకు జీర్ణముకా వను భయముచేతనేగాక, తాను రెండు గంటలకైనను భుజించెను గాని, చిన్నన్న ప్రొద్దున నుండియుఁ గఠినోపవాసమున శుష్కించుచుండుటయు, లేశమును గక్కుఱితిపడవలదని వసంతుఁడు తనకు బోధించుటయుఁగూడఁ గారణముగా భ్రమరము తనదృష్టి నా మిఠాయిలవంకఁ బోనీయలేదు. పేరమ్మ నిర్బంధించుటచేత స్వారాజ్యము, భ్రమరము, శిరస్తదారుగారి చెల్లెలును కాఫీలుమాత్రమే పుచ్చుకొనిరి. పిశాచమువలె నీయాచార మెక్కడ దాపరించెనో యనునట్లు పాపము సిద్ధాంతిగారిభార్య కాఫీయైనఁ బుచ్చుకొనక యుపాహారభక్షణముల రెప్పవేయక చూచుచు నట్లె కూర్చుండియుండెను.

ఉపాహారము లైనవా రొక్కరొక్కరే వచ్చి తివాసీలపై యథాస్థానముల నాసీనలగుచుండ, ఆ చావడికిఁ గుడివైపునఁ జేరువగానున్న మేడమెట్లనుండి దిగుచు నాకసమునుండి భూలోకమున కవతరించు దివ్యసుందరివోలె సుందరమ్మ సమీపించుచుండ, నామె సార్థకనామ యని యచ్చటి రామామణులెల్లరుఁ దదీయసౌందర్యలావణ్యవైభవముల లోలోనన మెచ్చుకొనసాగిరి. నల్లకలువలవలె

విలసిల్లు నామె విశాలనయనంబులకుఁ గాటుకలేనిలోటు లేశమును లేదు. అభ్యంగన మొనర్చినకారణమునఁ దైలసంస్కారములేని ముంగురులరేఖలు నొసట వ్రాలుచు నామె చక్కనిమొగమ్మునకు మృగమదతిలకాభిరామ మగుచుండెను. సువర్ణ కర్ణాభరణములయందలి వజ్రపురవల తళుకులు పలుచని బంగరుచెక్కులపై రంగారుచుండఁ జలితారుణాధరద్యుతులతోడను, ముత్యాలపల్వరుసకాంతులతోడను జిఱునవ్వువెన్నెలలఁ గాయుచుండిన యా సుందరిముఖసౌందర్య మచ్చటి సుందరీసందోహమునకెల్ల నవశ్యసందర్శనీయ మగుచుండెను. పోఁతవోసిన బంగరుబొమ్మయో యన నా చానమేనంతయు సువర్ణచ్ఛాయల నీనుచున్నకతన, నామె ధరించిన కంఠహారాద్యమూల్యాభరణములెల్లఁ గేవల వైభవసూచకములేగాని, యామెకు సౌందర్యదాయకములు గావయ్యె. ఎఱ్ఱపూవుల నెల్లనిపట్టురవికయు, వంగపండుచాయల రంగారుచు. బంగారుజరీయంచుల భారమును భరింపలేని సన్నని నూలుచీరయు ధరించి యాచావడిలోఁ బ్రవేశించిన సుందరమ్మ సౌందర్యవైభవముచేతను, నైశ్వర్యగరిమచేతను నచ్చటి మహిళామణులలోఁ దా నొకమహారాజ్ఞివలెనే శోభిల్లుచుండెను. విద్యావతియు, వినయవతియు నైన యా మానవతి మందహాసాంకురములతోడను, మందమందమృదూక్తులతోడను నచ్చటి మందయానల నెల్లర నొక్కరొక్కరిఁ బలుకరించుచు. వయసులోఁ దనకంటెఁ బెద్దలగువారికి నమస్కరించుచుఁ, దనయీడు చేడియల బహూకరించుచుఁ, దనకు ముద్దువచ్చిన బాలబాలికలఁ జెక్కిలి నొక్కి ముద్దాడుచు, నుపాహార మైనవారిని బదార్థముల చవులవిశేషములఁ బ్రశ్నించుచు, నుపాహారముసేయుచున్నవారిని మొగమోటపడరా దని హెచ్చరించుచుఁ, దాంబూలపళ్లెరముకడ

నున్న హార్మోనియముపెట్టి నించుక మీఁదికి జరిపి, యచ్చటఁ గూర్చుండెను.

తోడనే యచ్చటఁ జేరువగానున్న భ్రమరమును, భ్రమరము భుజముపై, జేయానుకొని కూర్చుండిన స్వారాజ్యమును గొంచెము వెనుకకు జరిగిరి. తన నల్లచుక్కల దుక్కపైట పరికిణీతోడను, నల్లని ఖద్దరుకబ్బాతోడను, అమూల్య వస్త్రాభరణాలంకృతయైన సుందరమ్మ ప్రక్కఁ గూర్చుండుట భ్రమరమున కెంతయు లజ్జాకరముగానుండెను. అంతియగాని తన వేడికన్నులయందలి యాకర్షణాశక్తియు, నరచందురుంబోలు ఫాలంబునం గ్రాలు భాగ్యరేఖలును, దన ముఖపద్మమునందలి లావణ్యావైభవమును నా బాలికామణి యెఱుఁగదు.

ఉపాహారభక్షణ, కాఫీపానాదికములు పూర్తియైనంతనే సుందరమ్మ యానతింగొని పేరమ్మ బొట్టుపెట్టి, తాంబూలములిచ్చి, యత్తరు వాసంగి పన్నీరు జల్లి చందనము పూసి యా చందనగంధులనెల్లఁ జందనగంధులఁ గావించెను. సుందరమ్మగారి కోరికపై శిరస్తదారుగారి పిల్లలిద్దఱును హార్మోనియము నందుకొని వాయించుచు 'లంబోదర లకిమీకర' అను గీతమును స్వరయుక్తముగఁ బాడిరి, పాతమునసబుగారి రెండవకుమార్తె తాను క్రొత్తగా నేర్చిన 'నిత్యకల్యాణి' యను కృతిచే నందఱ నానందింపఁ జేసెను. సంగీత సరణిగాఁ బాడ నేర్చినవారు మరి లేనందున నచ్చటి పాటలాధరలు పెండ్లిపాటలు, వడుగుపాటలు, వియ్యపురాలిపాటలు పాడనారంభించిరి. కొంతసేపున కాప్రాతపాటలుఁగూడఁ బూర్తియగుటయు నింక నెవ్వరిచేఁ బాడింపవలె నని సుందరమ్మ యందరిమొగములఁ జూడసాగెను? అప్పుడు సిద్ధాంతిగారిభార్య కంఠము సవరించుకొనుచు, 'కుసలాయుకము' పాడుట కుపక్రమించుచుండ వేమూరివారి కోడలు

'సుందరమ్మగారూ! దేశిరాజారిపిల్లని మరచిపోతున్నారు' అని పలుక 'ఔనమ్మా! ఔను. ఆపిల్ల పద్యాలు మాబాగా చదువుతుంది' అని యొకరును, 'వాళ్ళ చిన్నన్న ఆపిల్లకి శ్రద్ధగా చదువు చెవుతున్నాడు' అని మరియొకరును, మొకటి యుపపాదనమును బలపరుపసాగిరి. ఆమాటలు విని సుందరమ్మ యా బాలిక యెవ రని యిటు నటుఁ జూచుచుండ సిద్ధాంతిగారిభార్య సిగ్గుతోఁగూడిన చిఱునవ్వులతో మొగము వంచుకొనిన భ్రమరమును వ్రేలితోఁ జూపించుచు, 'ఇదిగో! ఈ పిల్లే! ఈపిల్లే! నూతిలో పడిపోయిందని ఆవేళ మనం విచారించాం' అని చెప్ప, సుందరమ్మ యాశ్చర్యముతో, 'అలాగ టండీ! అయ్యో పాపం! నిజంగా ఆవేళ నామనస్సు మా కష్టపడ్డాది. శాస్తుల్లు గారొస్తారూ, పాఠం చెప్పించుకుందాఁ మని భాగవతం పట్టు క్కూచునే సరికి మాపేర మ్మొచ్చి గోవులసాలవీధిలో పదమూడేళ్ల పిల్ల నూతిలో పడిపోయిందని చెప్పింది. మరి నాకు పాఠంమీద బుద్ధి వెళ్ళలేదు సరికదా, అన్నంకూడా సాయించిందికాదు. మళ్ళా మధ్యాహ్నం మూడుగంటలక్కాబోలు మాపేరమ్మ వచ్చి పిల్ల బతికిందని చెప్పింది' అని తన దయారసవీక్షణములను భ్రమరముపై బ్రసరింపజేయుచు, ' ఈపిల్లని చూడ్డం ఇవాళ నాకు మా సంతోషంగా వుంది. ఇలా రామ్మాయీ! ఇలారా!' అని భ్రమరమును బిలువ నా బాలిక మొగమువంచుకొని యట్లే కూర్చుండెను. 'తప్పు లేదమ్మాయీ! ఇలా రా!' అని సుందరమ్మ మఱలఁ బిలుచుచు నా వైపునకు వంగి యామెచేయి పట్టి తనయొద్దకుఁ దీసికొనగాఁ దన మాసినబట్టలతో నామెప్రక్కఁ గూర్చుండుటకు భ్రమరము మరింత లజ్జపడసాగెను. అంత నాసుందరీమణి రవలయుంగరముల కాంతులతో సువర్ణకంకణద్యుతములు ముడివడుచున్న తన కోమలవామహస్తమును నామెవీపుపైఁ జేర్చి,

'నీ పే రేమి టమ్మా!'

'నా పేరు భ్రమరాంబ'

'బాగుందమ్మా! నీ చక్కని కళ్లు మీవాళ్లు పెట్టినపేరు సార్థకం చేస్తున్నాయి. భ్రమరమంటే యర్థం తెలుసునుకదూ?'

'తెలుసును. తుమ్మెద.'

'భ్రమరాంబన్న పేరు యెవరికుందో యెరుగుదువా?'

'పార్వతీదేవి కున్నాది.'

'నువ్వు చదివిన పుస్తకా లే వేమిటి?'

'భాస్కరరామాయణంలో సుందరకాండ చదివేను. భాగవతంలో రుక్మిణీకల్యాణం చదివేను.'

'అలాగా? నేనూ యిప్పుడు రుక్మిణీకల్యాణమే చదువుతున్నాను.'

'భారతంలో యేమేనా చెప్పుకున్నావా?'

'ఇప్పుడు దేవయానికథ చెప్పుకుంటున్నాను.'

'ఇవన్నీ నీ కెవరు చెపుతున్నారు?'

'మా చిన్నన్నయ్య.'

'మీ చిన్నన్నయ్య కేంపనీ?'

'ప్రొప్రయిటరు బాబుగారిదగ్గర గుమస్తా.'

'జీతమెంత?'

'పదిహేను రూపాయలు.'

'సరే! ఏదీ? రుక్మిణీకల్యాణంలోని పద్యాలు — నువ్వు బాగా చదువుతా వని అంతా చెపుతున్నారు. రెండు పద్యాలు వింటాను.'

ఈ సంభాషణవలనఁ దన మనసునందలి జంకు కొంత దొలంగుటయు, జదువుమని స్వారాజ్యము తన్నుఁ గనుసంజ్ఞలతోఁ బ్రోత్సహించుచుండుటయు, భాగవతములోని 'వేశ్వేర బొమ్మల పెండ్లి'oడ్లను పద్యము మొదలు భ్రమరమువరకుఁ గంఠస్థములైన యైదారు పద్య

ములను జదివెను. ఆ మనోజ్ఞ కంఠస్వరమునఁ గల యత్యాకర్షణ శక్తిచే బాలిక లెల్ల నామెచుట్టును గుమిగూడిరి. శిశువులెల్ల రోదనములు మానిరి. యోషామణులెల్ల నిశ్చేష్టితులైరి. ఆనందాతిశయమునఁ గల్గిన తన్మయత్వమున సుందరమ్మ సాలభంజకవలెనే తోఁచుచుండెను. భ్రమరము బద్యములు చదువుట మానిన రెండు నిమిషములవరకుఁ గూడ నామె కా తన్మయత్వము తొలంగలేదు. తన వామహస్తమున భ్రమరమును మఱింత చేరువగాఁ దీసికొని కౌఁగిలించి, 'ఏ దమ్మా! రుక్మిణి కృష్ణుడికి పంపిన సందేశములోనివి—రెండుపద్యాలు?' అని మందమందమృదూక్తుల సుందరమ్మ వేడినంతనే భ్రమరము '(శ్రీ)యుతమూర్తి యో పురుషసింహమ!' యను పద్యము మొదలు మఱి యైదారు పద్యములను జదివి 'నా కాయాసంగా వుంది. మరి చదవలేనండి' అని దైన్యముతోఁ బలికెను. 'ఈమధ్య జ్వరం వచ్చింది. ఇంకా నీరసం వదల్లేదు. పత్యంకూడా చేస్తున్నాది?' అని స్వరాజ్యమును, 'అందుకే అమ్మాయి యేఁవీ తిన్నాదికాదు. కాఫీనూత్రిం తా గూరుకుంది' అని పేరమ్మయు సుందరమ్మతోఁ జెప్పిరి. 'పొద్దుపోయింది. ఇహ మాకు సెలవిప్పించండి సుందరమ్మగారూ!' అని ముత్తైదువ లొక్కరొక్కరే లేచుచుండ 'మంచి దమ్మా మంచిది' అని పలుకుచు సుందరమ్మ వీడ్కొలుపసాగెను.

'సుందరమ్మగారూ! నిజంగా మీ మింటాయి యెంతబాగుందో యీ అమ్మాయి పద్యాలు చదవడం అంత బాగుందండీ!' అని యొకరును, 'ఇన్నినూర్లు మీ యింటికొచ్చాం కాని, యివాళ్లున్నంత శోభగా యెప్పుడూ వుండలేదండీ!' అని మఱియొకరును, 'ఎంత పేదటికంలోవున్నా చదు వెప్పుడూ చదువే' అని యింకొకరును గాంతామణులెల్ల భ్రమరమును గొనియాడుచు నిష్క్రమింపసాగిరి. ఎట్టిభూషణములు లేకపోయినను నాఁటి బహుభూషణభూషితాంగులైన యోషామణులలో మన భ్రమరము శిరోభూషణమైనది.

# 15 వ ప్రకరణము

## వేంకటశాస్త్రి సలహా

'వదినా! మనంకూడా సుందరమ్మగారిదగ్గర సెలవు పుచ్చుకుందాం లెండి' అని భ్రమరము స్వారాజ్యముతోఁ బలుకుచుండ, మునసబుగారిపిల్లలను, శిరస్తదారుగారిచెల్లెలిని సగౌరవముగ సాగనంపుటకు లేచిన సుందరమ్మ యీ మాటలను విని,

'భ్రమరాంబా! నువ్వేమాత్రం తొందరపడకు! ఇదుగో వస్తున్నాను.' అని యొకటి రెండుద్వారములవఱకు వారిని సాగనంపి వచ్చుచు, వెండివస్తువులను దీసి యథాస్థానముల భద్రపరచుటకై వచ్చుచుండిన పేరమ్మతో నేమియో రహస్యముగాఁ జెప్పి లోనికిఁ బంపి, యామె క్రిమ్మర నాబాలికలకడ నాసీనయయ్యెను. స్వారాజ్య భ్రమరములు తప్ప నప్పుడా చావడిలో మఱి ముత్తైదువ లెవ్వడను లేదు. సుందరమ్మ సుఖాసీనయై 'అమ్మాయీ! ఈమె నీకు వదినగారా? ఎలాంటి వదినగారమ్మా?' అని ప్రశ్నించెను. ఆప్రశ్నకు భ్రమరమును, స్వారాజ్యము నొండొరులు మొగములఁ జూచి నవ్వకొనసాగిరి. 'సుందరమ్మగారూ! ఈమె నాకు లోకంలోని వదినగార్ల వంటిది కాదు. ఈ వదినగారు నాకెలా తటస్థించిందో చెప్పడానికి రెండు మూఁడుమాటలు చాలవు.' అని నవ్వుచుఁ బలుకుచుండ, సుందరమ్మ 'ఆలాగా? అయితే మీ వదినగారి చిత్రకథ వినవలసిందే.' అని ప్రత్యుత్తరమిచ్చుచు, నింతలోఁ బేరమ్మ పట్టెడు పచ్చి దాక్షపండ్లను, నాలుగునారింజపండ్లను గల వెండిపళ్లెమును దెచ్చి యచ్చట నుంచినంతనే యామె, 'అమ్మాయీ! ఇవి నీ పథ్యానికి

చాలామంచివి.' అని భ్రమరమును హెచ్చరించి, "మీరుకూడా పుచ్చుకోండి" అని స్వారాజ్యముతో నుడివి, నారింజపండ్లు తొనలు తీయుటకై పేరమ్మను నియోగించెను. పరస్పర ముఖావలోకనములతో స్వారాజ్య భ్రమరములు రెండు మూఁడునిముసములవఱకు నా ఫలముల నంటలేదు. సుందరమ్మ మఱల వారిని హెచ్చరింప, భ్రమరము సిగ్గుతో నవ్వుచు, 'మీరుకూడా' అని సగము చెప్పుచుండఁగనే యామె దద్భావమును గ్రహించి, 'సరే అలాగైతే, అందరం పుచ్చుకుందాం కానీయండి' అని తానును, వారునుగూడ నొక్కొక్క ఫలము నోటవేసికొన సాగిరి.

ఆ ఫలాహారసమయమున సుందరమ్మ ప్రశ్నలపై స్వారాజ్య భ్రమరములు పూర్వమునుండియుఁ దమ కుటుంబములకుఁ గల పరస్పర సంబంధమును, తమ తండ్రుల యన్యోన్య గౌరవభావములును, తత్కుమారులైన తమ యన్నగారుల గాఢస్నేహానుబంధమును, వారి విద్యాభ్యాస విశేషములును బూసగ్రుచ్చిన ట్లామెకు నెఱింగించిరి. స్వారాజ్యము చెప్పమానిన వానిని భ్రమరమును, భ్రమరము నుడువక విడిచినవానిని స్వారాజ్యమునుజెప్పుచుండ, భ్రమరము నూతిలో నుఱుకుటకును, స్వారాజ్యము ఈ పురమున కేగకుండుటకును గల విశేషములతోఁగూడ నా యుభయ కుటుంబముల చరిత్రమును సుందరమ్మకు సువ్యక్తమైనది. ప్రస్తుతము తాను దన కుటుంబముతో ననుభవించుచుండినఘోరదారిద్ర్యమును మాత్రము భ్రమర మామెకు వ్యక్తముకానీయలేదు. స్వారాజ్యముకూడ నా విషయమును మఱుఁగు పరచియే ప్రసంగించినది. ఆ ప్రసంగము వలన నా వెలనాటి నియోగికుటుంబముల చిరకాల పరస్పర గౌరవ స్నేహాతిశయములకు సుందరమ్మ యత్యాశ్చర్య పరీతచేతస్కయై కొనియాడుచుండ, ఆ దీర్ఘసంభాషణమువలన, భ్రమరమునకును,

భ్రమరముతోఁబాటు స్వారాజ్యమునకును అమెయెడఁ బరిచయ స్నేహ గౌరవభావములు మఱెంత యధికమైనవి. స్నేహలాలసమైన సుందరమ్మయు సూక్ష్మముగా మనసిచ్చి మాటాడు స్వభావముకలది యగుటఁ దన కపరిచితలైన స్వారాజ్య భ్రమరములు చిరపరిచితలగా బ్రసంగింపసాగెను. నిష్కల్మషస్వాంతము లప్రయత్నముగానే స్నేహ సమాక్రాంతములగుట వింతకాదు. అపహాససూచక మగు సుందర మందహాసముతో సుందరమ్మ భ్రమరమును విలోకించుచు,

"భ్రమరం! అన్నీ చెప్పేవు కాని, వొక్కసంగతిమాత్రం చెప్పేవుకా వమ్మా!"

"అ దేదో సెలవియ్యండి! తప్పకుండా చెప్తాను."

"అలా గంటావు కాని, నువ్వు చెప్ప వని నాకు తెలుసును. చెప్పినా, చెప్పకపోయినా నేనుమాత్రం అడిగేస్తేను- నువ్వెందుకు నూతిలో పడిపోయేవో చెప్పూ!"

"దీని కింత బ్రహ్మాండఁ వెందుకు? ఈ స్వల్పవిషయంలో చెప్ప డాని కేఁవుంది? నీళ్లుతోడుతూ నంద జరిగిపోవడంచేత ముందుకు జోగి పోయి నూతిలో పడిపోయాను."

సుందరమ్మ పకపక నవ్వి,

"శబాసు నమ్మా! అంతచక్కగా అతికిన ట్లబద్ధఁవాడడం కష్టం" స్వారాజ్యంకూడ నవ్వుచు,

"సుందరమ్మగారూ! ఈమె కవీశ్వరుడి చెల్లెలు. అందుచేత కల్పన అంతవేగిరంగా స్ఫురించింది. నిజం నేను చెప్పనా? వొక భయంకర విగ్రహానికి భయపడి మా భ్రమరం—"

అని సగము చెప్పుచుండఁగా భ్రమరము—

"ఔనండీ వదినా! నేను భయపడుతూన్న భయంకరవిగ్రహం

నీూదే. నేనే కాదు సోమశేఖరం అన్నయ్యకూడా భయపడే చెన్న పట్టణంనుండి రాకుండా వున్నాడు.''

అని పలికిన భ్రమరముపలుకులకు సుందరీ స్వారాజ్యములు నవ్వుకొనుచుండ, మేడమీాదినుండి, సుందరీ యని యొకమాఱును, సుందరం! అని యొకమాఱును, సుందరమ్మా! అని యొకమాఱును, మూఁడుపిలుపులు వినవచ్చుటయు, సుందరమ్మవిని, ''పేరమ్మా'' అమ్మ యెందుకో పిలుస్తున్నాది, కనుక్కొని రా!'' అని పేరమ్మను బంపి క్రమ్మఱ భ్రమరమున కిట్లనియె;

భ్రమరం! పోనీ కాని, భారతంలో యిప్పుడు నువ్వు చదువు తున్నది దేవయానికథేనా?''

''ఔను. దేవయానికథే''

''ఆ కథ చదవడంవల్లనే దేవయానిలాగ నువ్వుకూడా నూతిలో పడిపోయావు.''

ఆ మాటలవెంటనే స్వారాజ్యము నవ్వుచు,

''చేతిలో పని కాబట్టి నూతిలో పడింది కాని, మా భ్రమ రానికి యయాతి తటస్థించడం యెలాగ''

''నూతిలోనుండి తీసిన మహానుభావుఁడుంటూవుండగా య యాతి తటస్థించ కేం?''

స్వారాజ్యము చేతులుచఱచి పక్కున నవ్వుచు,

బాగా చెప్పేరండీ సుందరమ్మగారూ! ఇంక మా అన్నయ్యకి మరి సంబంధం చూచుకోక్కర్లేదు.''

''శాఖాంతర వివాహం తప్పలేదు. ఇప్పుడంతా వొప్పు కుంటున్నారు. ఏ వమ్మా భ్రమరం! ఊరుకుంటూ వేం?''

అని సుందరమ్మ నవ్వుచు నడుగ నంతవఱకు నవనతవదనయై యుండిన భ్రమరము మందహాసముతో మొగమెత్తి,

"మీరుకూడా మా వదినగారితోనే దేకీభవించీశారు. ఊరు కొక-యిద్దరు వదినగార్ల కొక్కరైతే నేం సమాధానం చెప్పగలను?"

"అలాగా? అయితే నన్నుకూడా మీ వదినగారికిందే లెక్క వేశీశావు! పోనీ నువ్వన దెందుకన్నా దనాలి. ఇవాళనుండీ నీకు నేను వదినగారినే అవుతానులే!"

అని సుందరమ్మ పలుకుచుండ నా చావడి వెనుకనున్న యొక గదిలోనుండి గడియారము గంటలు కొట్టుచుండ స్వారాజ్య భ్రమరము లయ్యాలు గంటలును లెక్కించి, తా మచ్చట నంతవఱకు నుండిపోయినందుకు నొచ్చుకొనుచున్న మొగముతో సుందరమ్మను సెలవిమ్మని కోరిరి. అది వినియు నామె వారికిఁ బ్రత్యుత్తరమీయక, మేడ దిగి వచ్చుచుండిన పేరమ్మవంక విలోకించుచు నామె తన్ను సమీపించినంతనే,

"అమ్మేం చేస్తున్నాది? చిన్నాన్నకూడా వున్నాడా?

"మీ చిన్నాన్న గంటకిందటే వెళిపోయారట. అమ్మగారి మొహం చూస్తేమాత్రం గోజూకంటె యివాళ బాగా వాదించు కున్నట్లు తోస్తూంది."

"నిత్యం వున్నదే. ఇవాళ కొత్త కాదు. నన్నెందుకు పిల్చింది? అమ్మ?"

"వోమారు వెళ్ళి రండి! ఎందుకో రమ్మంటున్నారు."

అంత సుందరమ్మ స్వారాజ్య భ్రమరములను జూచి, "ఇప్పుడే వచ్చేస్తున్నాను. తొందరపడకండి, మ రేంభయం లేదు. పేరమ్మ మిమ్మల్ని దిగబెడుతుంది. లాంతరుతో నవుఖరుకూడా వస్తాడు." అని చెప్పి మేడమీదకుఁ బోవుచుండ నొకసేవకుఁడు, "పెట్రొమేక్సు" అను దేదీప్యమానమగు నొకవిద్యుద్దీపమునుదెచ్చి యాచావడినడుమ వ్రేలాడుచుండిన యినుప కొక్కెమునకుఁ దగిలించెను. అరచేతుల

శ్రీకారములు చుట్టుకొని వా రిరువురుఁ దమ్ముఁ గాంతిసముద్రమున ముంచుచుండిన యమ్మహాదీపమునకు నమస్కరించిరి. వారుచూచు చుండఁగనే యా దీపకారుఁడు త ద్గృహాంతర్భాగములలో మఱికొన్ని యెడలఁ గూడ దీపములు పెట్టెను. ఆ చావడియందలి కాంతిపుంజ మున రంజిల్లు తనుద్యుతులతో స్వారాజ్య భ్రమరములు సుందరమ్మ యాగమనమును క్షణక్షణము నిరీక్షించుచుండిరి. కాని, యిప్పుడే వచ్చెద నన్న సుందరమ్మ యెంతసేపునకును రాదయ్యెను. తిమ్మిరి పట్టిన పాదములు సాఁచుకొనుచు, మెటికలు విఱుగఁ జేతులు విసరు కొనుచు, జిటికెలు వేసి యావులించుచు వా రిరువురుఁ దమ విసుగు దలలను సూచించుచుండ నా చావడికి ముందున్న ముందరిచావడి తలుపులు గొడ్డంట మోదిన తెఱంగున గుభిల్లున మహాధ్వని గలిగించి నవి. ఆ ధ్వనికి స్వారాజ్య భ్రమరములు త్రుళ్ళిపడి యిటు నటుఁ జూడసాగిరి. అపారమైన దీపప్రభారాశిలో మునిగియుండినకతన నప్పుడు లోక మెంతచీకటి పడినదో వా రెఱుఁగరు. కాని, యంతకుఁ గొంతముం దాఱుగంటలు విన్నవారగుటచే నప్పటి కొకపావుగంట తక్కువగ నేడుగంటలు కావచ్చు నని యా కలువకంటు లూహించు కొని మేడమెట్లవంక నాలోకింపసాగిరి. క్షణముక్రింద నుప్పతిల్లిన తలుపులచప్పుడునకుఁ దోడుగ హోరుహోరున నూతన భయంకరా రావము కర్ణగోచర మగుచుండుటయుఁ, జావడినడుమ వ్రేలాడుచున్న విద్యుద్దీప మూగుచుండుటయుం గనిపెట్టి, గాలివాన ప్రారంభించె నని స్వారాజ్య భ్రమరములు దిగులుపడుచుండ, నాకసమునుండి యుఱు ముల ఫెళఫెళధ్వానములు లోకముల బీటలువారింపఁ జొచ్చెను. అప్పుడు పేరమ్మ మేడపైనుండి చప్పుచప్పున వచ్చి "అమ్మా" గాలీ, వానా వచ్చింది. ఇప్పుడు మరి వెళ్ళలేరు. అమ్మాయిగారు మిమ్మల్ని మేడమీదకు వెళిపోరమ్మంటున్నారు." అని చెప్ప స్వారాజ్య

భ్రమరములు చేయున దేమియు లేక వేగవ్యగ్రతతో సోపానములతో మేడమీఁదకుఁ బోయిరి.

అప్పు డాకస మంతయు వినీల గాఢ జీమూత సంఛన్నమై ప్రతిక్షణజాయమాన ఘెళఘెళధ్వానములతోడను, యాతాయాత శంపాలతావితానములతోడఁ భయానక రసప్రధానముగఁ దోఁచు చుండెను. దట్టముగఁ గ్రమ్మిన కాఱుమబ్బులచే నాఁటి చీఁకటిరాత్రి మసిపూసిన తెఱంగున మఱింత కటిక చీకటిరాత్రి యైనది. లోకమును జాపచుట్టగఁ జుట్టి నెట్టుకొనిపోవునో యన, నుండుండి యొక్కొక్క మాఱు మహావాయువు వీఁచుచుఁ దన ప్రభంజన నామమును సార్థకము చేసికొనుచుండెను. ఆ వాయు విజృంభణమునకుఁ దోడుగ ధారాపాతమగు మహావర్షము మాత్రము లేక యప్పుడు జల్లువాన మాత్రమే కురియుచుండెను.

వృక్షావృతంబైన యా మేడముందరి యావరణ మంతయు నా గాలివానలో నా కటికచీకటిలో భీకరాకృతిం దాల్చి తన్నివాసులకే భయప్రదముగాఁ దోఁచుచుండెను. దుష్కార్యధురంధరుల కంధకారము ప్రాణబంధువగుటచేఁ, గపటచిత్తుల కుటిలాలోచనముల కా కటికచీకటి తల యూఁపుచున్నదో యన న య్యావరణ తరువితానమంతయు నిటునటు నూఁగసాగెను. ముందరి కచేరీ చావడిలో నట్టనడుమ వ్రేలాడుచుండిన హరికేన్ లాంతరు నూటిమాటి కల్లలాడుచు గుప్పు గుప్పున నెగడుచుండిన దీపముచే మసివారఁ దొడంగెను. ఆచావడికే చాలని యా దీపము దరిద్రుని యీవివలెఁ దన కాంతి నా చావడిగుమ్మమునకు ముందున్న యరుగుభాగము నకును, నరుగుక్రిందనున్న మెట్లకునుగూఁడ గొంచెము కొంచె మొసంగుచుండెను. ఇరువంకల మిక్కిలి పొడవుగానున్న తక్కిన

యరుగుభాగములును, నరుగులచివర రెండునైపులను గల యెత్తైన గచ్చుతిన్నెలును నంధకారబంధురములే.

ఆ సమయమున నెడమతట్టునం గల యరుగుమీఁద నిరువురు వ్యక్తులు నేల జతికిలఁబడి చావడిగోడకుఁ జేరఁబడి కూర్చుండియుండిరి. వారు చేరబడియుండిన గోడకుఁ గల గవాక్షము కవాటవిహితమై యుండెను. ఆ కిటికీతలుపులు తెఱవబడియే యుండిన యెడలఁ జావడి లోని దీపపుకాంతి కొంచమైన నాభాగమునకుఁ బ్రసరించియుండును.

ఆ చీకటిలో వణకుపుట్టించుచున్న చలిగాలిచే నుత్తరీయముల శరీరములు గప్పుకొని తడిసినగొడుగులను గోడకుఁ జేరబెట్టి యా పురుషు లిరువురుఁ జాలసేపువఱకుఁ గూర్చుండిరి. అంత నా యిరు వురిలో నొక్కఁడు రెండవవానిం జూచి,

''గాలికి జోరుతగ్గింది. కాని, వర్షం జోరైనట్లు కనిపిస్తూంది''

''ఔను. ఇంతలో విడిచేట్టుకనఁబడదు. కర్తవ్యం యేవిటి?''

''ఇలా కూర్చోడంవే కర్తవ్యం. ఇలాంటప్పుడు బండికూడా దొరకదు.''

''దొరకక్కేం? నేను వెళ్ళి తీసుకొస్తాను. నువ్వుండు.''

''అలాగే తీసురావచ్చు. ఒక్కక్షణం ఆగు.''

అని యిట్లు సంభాషించుచుండఁ బ్రాకారమునకుఁగల యినుప గజముల తలుపులు తోసికొని యిరువురు పురుషులు ఛత్రిహస్తులై కట్టుబట్ట లెగఁగట్టుకొని వణకుచుండిన సంకుచిత శరీరములతో వడి వడి నడచుచు వచ్చి మెట్లెక్కి యిటునటుఁ జూడకయే గుమ్మము దాటి యా చావడిలోఁ బ్రవేశించిరి. వారిని జూచి యరుగుపైఁ గూర్చుండిన యిరువురుఁ తమలో గుసగుస లాడుకొనుచుండఁ జావ డిలోఁ బ్రవేశించినవారి సంభాషణ మీ క్రిందివిధముగా వారికి వినరాదొడంగెను.

"చూశారా మా చావిడెలా వుందో? పెద్దా పిన్నా వస్తే వో బెంచీకాని, కుర్చీకాని యెక్కడా లేదు. మా యింటికీ మా యింటిలో వాళ్ళకీకూడా చొక్కమారే వెధవరికం వచ్చేసింది. ఈ కిటికీలో కూర్చుందాం"

ఆ మాటలవెంటనే కిటికీతలుపులు చప్పుడౌటచేత వారిరువురు నా చావడిలో కిటికీయందుఁ గూర్చుండిరని, యరుగుపైనున్న వా రూహించుకొని వారిసంభాషణమును నిశ్శబ్దముగా వినసాగిరి.

"గుమాస్తా! ఇక కర్తవ్యం సెలవియ్యండి! సలహా చెప్పడంలో మీ బుద్ధిలాంటి బుద్ధి సాధారణంగా వుండదని ప్రొప్రయిటరు బాబు గారు తరచుగా సెలవిస్తూవుంటారు."

"అది కేవలం నా మీద వారికున్న అభిమానం! మీరు చెప్పిన వ్యవహారం సాధించడం దావా చేశా? తంత్రం చేశా? దావా అంటే లక్షలమీద వ్యవహారం. ఓం ప్రథమంలోనే స్టాంపు కొండా నికి వెలకొద్దీ పొయ్యాలి. మీశక్తి చూసుకోండి."

"నా శక్తి అంటే మనవిచేస్తాను వినండి! మీదగ్గిర దాపరికం యెందుకు? ఈమధ్య అయిదు వేలరూపాయిలు నా చేతిలో పడ్డాయి. ఆ సొమ్ము ప్రాణపదంగా దాచుకుంటున్నాను. ఈ సంగతి బాబు గారితోకూడా మనవిచేసుకుంటే; భయంలేదు, చాలకపోతే దావా ఖర్చులికి మరోఅయిదు వేలు మేం సాయంచేస్తాంలెండని సెలవిచ్చారు. ఇదీ నాకున్న అయివేజు."

"ఈ అయివేజు చాలు. చాలకపోయినప్పుడు బాబుగారుండనే వున్నారు."

"ఆహా! ఉన్న అయివేజంతా నాకు బాబుగారే. దావాకే మనంనిశ్చయించుకుంటే బాబుగారిధైర్యం చూచుకునే కోర్టెక్కాలి."

"అలాంటిప్రభువు మనకి తపస్సుచేసినా దొరుకుతాట్టండీ లక్ష్మీంపతిగారూ! ఆయన మాటన్నారూ అంటే చేసి తీరే రన్నమాటే. అందుచేత మీరు సంశయించకండి."

"నా కెప్పుడూ సంశయంలేదూ. సంశయమేలేకపోడానికి మరోరహస్యంకూడా వుంది మనవిచేస్తాను వినండి! మా అన్నగారు కాలంచేసేముందు ప్రిప్రియిటరుబాబుగారు వోగ్రిమం తణఖా యిచ్చిన నలభై వేలు వారిదగ్గర ఋణంపుచ్చుకున్నారు. బాబుగారి దయవల్ల ఆ స్తి నాకు దఖలుపడితే ఆ నలభై వేల ఋణపత్రిం వొక్కకానీయేనా పుచ్చుకోకుండా వాటికి దాఖలుచేసుకుంటాను. ఈసంగతి నేను బాబుగారితో అంటే వారునవ్వి వెధవ నలభై వేలూ మా కెందుకండీ? ఋణంసొమ్ము మేం వుంచుకోం—మీ కక్కర్లేక పోతే వోబ్రాహ్మడికి దానంచేశేస్తాం" అన్నారు.

"బ్రాహ్మణ్ణి నే నున్నాను. నాకుదానం చేసీమనండి"

"నేనూ అదే అనబోతున్నాను. అయి దారులక్షలరూపాయిల ఆస్తి నాకు కలిసినప్పుడు వోనలభై వేలు విడిచిపెట్టడం అంటే నాకు కష్టంగా వుండదు. అందుచేత బాబుగారు మీ కిచ్చేస్తే నా కంభ్యంతరంలేదు. నేనుమాత్రిం పుచ్చుకోను."

"మీరు పుచ్చుకోరు—బాబుగా రుంచుకోరు—అందుచేత మీ రుభయులూ కలిసి బీదబ్రాహ్మణ్ణి నన్ను బాగుచెయ్యండి."

"నన్ను మీరు బాగుచేస్తే మిమ్మల్ని నేను తప్పకుండా బాగుచేస్తాను. ఇది మీ సొంతవ్యవహారంగా భావించి శ్రిద్ధగా పని నడిపించండి."

"తప్పకుండా నడిపిస్తాను. అయితే యిప్పటికి తేలిం దేవిటీ అంటే దావా తేవడానికి డబ్బు లోపంలేదు. ఇహ దావాలోవున్న బలంగూర్చి ఆలోచించాలి. మీ అన్నగారు రాసినవీలు రిజిస్టేరు కాలే దన్నారుకదూ?"

"కాలేదు. లిమిటేషన్ పీరియడు దాటిపోవడంచేత మరి రిజిస్ట్రీ చేయించడానిక్కూడా వీల్లేదు. ఆ వీలుపుట్టి నాలుగేళ్ళయింది"

"అది సరిలెండి! దావాకున్న ముఖ్యమైన బలంగూర్చి ఆలోచిస్తున్నాను. మీది అవిభక్తకుటుంబం అని మీరు రుజువు చేసుకోవలసుంటుంది. అంతే గాక—"

"మీ మాట కడ్డొస్తున్నాను శాస్త్రీజీ! ముఖ్యమైనవిషయం వొకటుంది. అది మీరు వినాలి. మా అన్నగారు రాసినవీల్లో సాక్షి సంతకాలు చేసినవాళ్ళలో మన ప్రొప్రయిటరుబాబుగా రొకరు. ఈ సంతకం మాది కా దని మేం కోర్టులో సెలవిస్తా మనిన్నీ తక్కిన సాక్షులచేతకూడా ఇవి దొంగసంతకా లని చెప్పిస్తా మనిన్నీ బాబుగారు నాకు వరం యిప్పించారు. అందుచేత ఆ వీలు దొంగవీలని మూడునిమషాల్లో రుజువు చేసేగలం."

"అయితే యింతసేపూ మరి చెప్ప రేం? బాగానే వుంది! మంచిరోజు చూచి దావా పడేయండి"

"పడేస్తాను కాని, మీరు తత్రిం అంటూ వొకటి సెలవిచ్చారు. ఇంతకంటె సులువని మీకుతోస్తే తంత్రిచేసే కార్యం సాధిద్దాం."

"దావాకంటె తంత్రిం ఎలాగేనా సులువే. దావా అంటే వేలకొద్దీ దిమ్మరిస్తూవుండాలి? సంవత్సరాలకొద్దీ పడిగాపులు పడి

కూడా పోవాలి. తంత్రం అంటే వొకకానీకూడా ఖర్చులేకుండా మూడునిమిషాల్లో కార్యం సాధించేగలం.''

''అందుకే దావా వెనక్కిపెట్టి తంత్రాన్ని ప్రస్తుతం అవలంబిద్దాం. ఇది సాగనప్పుడు—అది యెలాగా తప్పదు.''

''అయితే వినండి. మీ యన్నగారు రాసినవీలు యేలాగేనా మహమ్మాయం చేసీయాలి.''

''నిజఁవే కాని, ఆవీలు మహమ్మాయం చెయ్యడం సామాన్యంగా సాధ్య పడదు. ఆ కాగితం యినప్పెట్టెలో పెట్టి ఆముండలు బ్రహ్మాండంగా కాపాడుకొంటున్నారు. మూడేళ్ళై ప్రయత్నిస్తూనా ఆ తాళం నాకు దొరకలేదు.''

''ఆ పెట్టెమీద కంపెనీపేరూ, నంబరూ వుంటాయి. అవి నోట్ చేసి నా కివ్వండి. కంపెనీకి రాసి దానితాళం తెప్పిస్తా.''

''అ వూ టన్నారు, బాగుంది. ఈ వుపాయం నాకు స్ఫురించలేదు.''

''లేదా—మనబాబుగారిదగ్గర మూడు నాలు గినపెట్టెలున్నాయి. రేపొస్తే ఆ తాళా లన్నీ మీ కిప్పిస్తాను. దేంతోటేనా వస్తుందేఁవో చూడండి.''

''ఈ వుపాయం మరీ బాగుందండీ శాస్త్రీజీ!''

''ఆ మూడు నాలుగు తాళాలవల్లాకూడా రాదనుకుందాం. అప్పుడు మరోవుపాయం వుంది, చెప్తాను వినండి. మా యినప్పెట్టి తాళం పోయింది కాఁబట్టి వోమారు మీ యినప్పెట్టితాళం యిప్పిస్తే మా పెట్టె వస్తుందేమో చూచుకొని వెంటనే వెంటనే పంపించేస్తున్నాం అని బాబుగారిచేత వోవుత్తరం రాయిద్దాం. పెద్దపాప్రియిటరూ—అంతేకాక వీల్లో సాక్షిసంతకంచేసిన పెద్దమనిషీ అన్నవమ్మ

కం మొహమాటంచేత మీవాళ్ళు తప్పకుండా తాళం పంపిస్తారు. వెంటనే మీరు పంపించినతాళం పెట్టె తీస్తూన్నంటే విరిగిపోయింది కాబట్టి మరోతాళం ఇక్కడ చేయించికాని, కంపెనీనుండి తెప్పించి కాని మీకు పంపించేస్తున్నాం. ఏఁవీ అనుకోవద్దని మళ్ళా బాబు గారుచేత రాయిద్దాం.''

''ఈ వుపాయం బెస్టండీ శాస్త్రీజీ! ప్రస్తుతం ఇదే ఖాయ పరుద్దాం.''

'' మీ యిష్ట-చూచుకోండి! శరపరంపరలాగ వుపాయాలు విదిలేస్తూవుండం నా వంతు. ఎంచుకోవడం మీ వంతు. ఇదే ఖాయ పరుస్తే రేపే రాయించేదాం బాబుగారిచేత—''

''ఇదే ఖాయం సెలవైతే రేపు దివాణంలో మీదర్శనం చేస్తాను.''

''తప్పకుండా దయచెయ్యాఁడి! ఇహ నేను సెలవుపుచ్చు కుంటాను. మా తల్లిగారికి చాలా జబ్బుగావుంది. ఏ క్షణాల్లో యెలా వుంటుదో తెలియదు. వొకనూరూపాయి లప్పుకోసం వుదయం నుండీ పట్నంవంతా గాలించేస్తువున్నా యెక్కడా పుట్టలేదు. భోజనం చేసి గాలైనా వానైనా సంతపేట వెళ్ళి కాబూలువాడితో మాట్లాడాలి.''

''గురూజీ! అయితే ఆ నూరూపాయిలూ నేను దాఖలు చేసుకుంటాను. నోటు రాసిప్పించండి. మనకార్యం ఫలించిన తరు వాత నే నా నోటు మీ యెదుటనే చించీసి-యింకా నాకు తోచిన—''

''మీ కార్యం జయం కావడఁవే నాకు బహుమానం. రేపు నోటు రాసి దాఖలుచేసుకుంటాను. సొమ్ము సిద్ధంగా వుంచండి. ఈ విషయం బాబుగారితో మాత్రిం అనకండి! సెలవు పుచ్చుకుంటాను''

''చిత్తం-చిత్తం. లాంతరు చూపిద్దునా?''

వారు లాంతరుతో వెలుపలికి వచ్చెదరని తెలిసినంతనే యరుగుపైనున్న వ్యక్తులు తమ్ము వారు సంశయింపకుండఁ దా మప్పుడే వచ్చినవారివలె నటింపనెంచి తటాలున లేచి యిటు నటుఁ జూడసాగిరి. అంత లాంతరుతో లక్ష్మీపతియు, వెనుక వేంకట శాస్త్రియు వెలుపలికి వచ్చుటయు, ముడిచినగొడుగు విప్పి వేంకట శాస్త్రి మెట్లుదిగి నిష్క్రమించుచుండ వానికి మార్గప్రదర్శకముగా లాంత రెత్తిపట్టుకొనిన లక్ష్మీపతి యావ్యక్తులను జూచి, వెలవెలఁ బోవుచు, "ఎవరు వా"రని కంపితకంఠముతో నడిగెను. తోడనే యా వ్యక్తులలో నొకండు.

"అయ్యా! వర్షముచేత మా పిల్లలు మీ యింట్లో వుండి పోయారు. వాళ్ళని తీసుకు వెళదాఁవని వచ్చాం. నా పేరు లక్ష్మీ కాంతం నన్ను మీరు చూసే వుంటారు."

"మీరు వచ్చి యెంతసే పవుతుంది?"

"ఇప్పుడే యిలా వస్తున్నాం."

"అంటే వో పావుగం టవుతుందా?"

ఆ మాటలకు లక్ష్మీకాంతము ప్రత్యుత్తర మొసంగకమున్నే వసంతరావు "అయ్యా! వర్షం కొంచెం వెలిసింది. మళ్లా యెక్కువ కాకుండానే వెళ్ళిపోవాలి. మీరులోపలికి దయచేసి మావాళ్ళని పంపించేస్తే సంతోషిస్తాం."

అని పలుక లక్ష్మీపతి తీవ్రదృష్టులతో వారిని జూచుచు శంకా కలితస్వాంతముతో నడుగు లిడుచు, వేంకటశాస్త్రి చెప్పిన యాలోచ నమువలని యానందము లేశము లేకయే ధుమధుమలాడు మొగంతో లోనికిం బోయెను.



# 16 వ ప్రకరణము

## ఒక కప్పు కాఫీ.

'ఇది నాకు భరింపలేని మనోవేదన. ఈ మనోవేదన నన్నెంతో కాలం బతకనిస్తుందని తోచదు. నేను కోరేదికూడా అంతే. The sooner the better — ఎందుకూ పనికిరాని నా వెధవ బతుకు నాకే అసహ్యంగా వుంది. నా Life అంతా full of disappointments కిందా మీందా కనకుండా ముప్పయిరోజుల్నుండీ తుప్పూ తుప్పూ తూనట్తూన్న నా తుళ్ళిపాటంతా మూడునిమిషాల్లో అణిగిపోయింది. ఏ మొహం చూసి పున్నమచంద్రుడని పొంగిపోతూ వుండేవాణ్ణో ఆ మొహం విప్పుడు చవితిచంద్రుం డయింది. ఒక్కొక్క సంజ్ఞ — ఒక్కొక్కచూపూ — ఒక్కొక్క నవ్వూ — ఒక్కొక్క లక్ష! ఇప్పుడో ఒక్కొక్కటి ఒక్కొక్క వురిశిక్ష — నాలాంటి పరమ మూర్ఖుడికి ఎన్ని వురిశిక్షలేనా వెయ్యవలసిందే. ఈ శూద్రదాని కోసం ఎన్నెన్నో దారుణాలికి సిద్ధపడ్డాను. సెలవు లివ్వగానే నలుగురిలాగా యింటికి పోయుంటే నా ప్రాణాని కింతక్షోభ లేకపోయుండును......అబ్బబ్బా! ఏం తలబాధ? దీనికితోడు కడుపులో మంట? ఈ చెన్నపట్టణంలో ఏ డాక్టరూ నా బాధ కుదర్చలేడు. గుండెలుకూడా దడదడ కొట్టుకుంటున్నాయి. మోకాళ్ళలో వున్న శక్తంతా యేం వయిపోయిందో తెలియదు. తండ్రీ — భార్యా — అత్తా — మామా — అందరూ వుండగా, అమ్మా అబ్బా లేని యీ చెన్నపట్టణంలో — ఇన్నాళ్లూ బతికి యింటివెనక చచ్చాడన్నట్టు నాకు చావుందేమో? కార్పరేషన్ డెత్ కార్లో నా శవాన్ని తీసుకు పోతూన్నప్పుడు హేమలత కంట నీరు పెడుతుందా? నేను పడుతూ

వున్న యీ వేదనలో పద్దోవం తేనా దానికున్నట్లు తోచదు. నన్ను పెళ్ళాడతావా అని నాలాంటివాళ్ళ కెంతమంది కుత్తరాలు రాసిందో! అయ్యయ్యో? ఇంతనీరసాని కేం కారణం? ఈ హార్ట్ - ఇలా స్టాపై పోదుకదా? పాల్ ఫూట్ నుండి వో కప్పు కాఫీ తెచ్చిపెట్టే దిక్కు లేదు. కాఫీ తాగుతే యీ బాధ కొంత తగ్గుతుందేమో? తలుపు గడియ తీశానంటే అయ్య రొచ్చి దెయ్యంలాగ మీద పడతాడు. కల్లో కూడా అయ్యారే. ఏం చెన్నపట్టణం? ఏం చదువు చదివేను? వో మోస్తరుగా డిస్మిస్ లన్నమాటే. నన్ను రూయిన్ చెయ్యడం యిష్టంలేక ప్రిన్సిపల్ ట్రాన్సుఫర్ సర్టిఫికెట్టిచ్చేశాడు. ఆక్రిస్టియన్ ముండవల్ల నా చదువూ - ఈ కాపముండవల్ల నాబతుకూ ధ్వంస ధూళయిపోయాయి. ఈ వెధవచదువు మరి నేను చదవే చదవను. ఈ యింగ్లీషుపాండిత్యం చాలు. ఇహామీద యింగ్లీషుముక్కంటూ సాధారణంగా నోట రానివ్వను. ఈ బుక్సు - ఈ పుస్తకాలూ, గిస్త కాలూ అమ్మేసి అయ్యరప్పు తీర్చేస్తాను. ఇహా చదు వెందుకు? బతు కెందుకు? నేను ప్రేమించే వస్తువే ప్రపంచంలో లేదు. నన్ను ప్రేమించే వస్తువుంది కాని, ఏం లాభం? ఆ వస్తువుమీద నాకు ప్రేమ లేదు. రాజ్యం వట్టి నిర్భాగ్యురాలు. రాజ్యం కాదు. నేనే వట్టి నిర్భాగ్యుణ్ణి. అదెంతో సుగుణవతి కాబట్టే ఆ కోడలంటే మా తండ్రి కంతప్రేమ! వొక్కర్తే కూతురవడంచేత ఆ తల్లిదండ్రులకు మరీ పే్రమ. ఇహ దా నన్నగారికి దానిమీదున్న ప్రేమ చెప్పే అక్కర్లేదు. లోకమంతా ప్రేమిస్తూవున్న రాజ్యంమీద నాకు ప్రేమ లేకపోవడంవల్ల నేనే నిర్భాగ్యుణ్ణి. ఈజన్మలో రాజ్యంమీద నాకు ప్రేమ కలగాలంటే తపస్సుచేసి సాధించాలికాని సామాన్యంగా కల గదు. రాజ్యం మాత్రం నాప్రేమకోసం తపస్సు చేస్తూనే వుంది. ఎంత తపస్సుచేసినా ప్రేమమీద మరి నాకు ప్రేమ లేదు. ప్రేమమీద

విశ్వాసంకూడా పోయింది. నామీఁదే నాకు ప్రేమ లేదు! అందుచేత రాజ్యాన్ని నేను ప్రేమించడం అన్నది యీజన్మలో మరి లేదు.'

అని యిట్లనుకొనుచుండ 'వున్నాది వున్నాది. ఆగండి'' అను మాటలు తలుపులుమూసి, చావడిలోఁ గూర్చుండిన సోమశేఖరమునకు వినఁబడినవి. ఆ మాటలవెంటనే తలుపుసందునుండి యొక కవరుత్తరము జారి వానిపాదములకడఁ బడినది. అది పది గంటలవేళ యగుటచేఁ దపాలావాఁడు వచ్చి తన్నెవ్వరో యుత్తర మున్నదా యని యడుగ నున్నదని జవాబు చెప్పుచుఁ దనకు వచ్చిన యుత్తరము తలుపుసందునుండి పడవేసె నని తలంచి, 'మ. రా. శ్రీ ఓరుగంటి సోమశేఖరరావు పంతులుగారి పాదపద్మముల సన్నిధికి.' అను పైవిలాసముతోఁ దన పాదములకడ వ్రాలిన యా కవరుత్తరమును నీరసముగా ముందునకు వంగి యందుకొనెను. మూసిన తలుపులకుఁ జేరువగనే వాలుకుర్చీయందుఁ గూర్చుండిన సోమశేఖరము, శుష్కించినశరీరముతోఁ గళాహీనమైన మొగముతో, నిద్దురలేమి నెఱ్ఱవారిన కన్నులతోఁ, దైలసంస్కారములేని శిరోజములతో, మంచముపట్టిన రోగివలెనే కానవచ్చుచుండెను. ఆతఁడు తొడుగుకొనిన గ్లాస్గో మల్లు లాల్చీయును, గుండారుగాఁ జుట్టుకొనిన గ్లాసుగోమల్లుపంచయు మూఁడునాలుగు దినములనుండి విడువనియట్లు మిక్కిలి నలిగి మాసి యుండెను. వాలుకుర్చీయందు వ్రేలాడుచు వానికిఁ గన్నీరు తుడుచుకొనుటకై యుపయోగపడుచుండిన టర్కీతువ్వాలు గూడఁ జాకింటిది కాదు. కాంతాకనకాదులయందు విరక్తి వహించిన బాలసన్యాసివలెఁ గన్పట్టుచున్న సోమశేఖర మాయుత్తరముకవరు చించి విప్పి తనలో నిట్లు చదువుకొనెను.

'ప్రాణేశ్వరా!

ఎన్నటికైన మీ పాదసేవ లభింపకపోదను ధైర్యముతో, మొన్న మొన్నటివఱకు నేను గడపితిని. చెన్నపట్టణమునుండి మా యన్నగారు వచ్చి చెప్పిన సంగతులనుబట్టియు, మీరు చెన్నపట్టణం నుండి రాకుండుటబట్టియు, నా యాశలన్నియు నడుగంటినవి. మీరు ద్వితీయవివాహ ప్రియత్నములో నున్నట్లు మాయన్నగారి మాటల వలన నాకుఁ దెలిసినది.

భార్య మరణించినకారణమునఁ బురుషుఁడు ద్వితీయ వివాహమునకుఁ బూనుకొనుట లోకసమ్మతము. నేను బ్రతికియుండఁగనే మీ రిట్టి దారుణమునకుఁ గడంగెద రని నా కెన్నఁడు, దోచలేదు. దీనిని బట్టి నేను బ్రతికియుండుట మీకు లేశము నిష్టము లేదని స్పష్ట మగుచున్నది. ఒక్కమాఱు దర్శన మిప్పించినయెడల మీ చరణ సన్నిధినే మీ యిష్టమును గావించెదను.

మీరు రెండవ పెండ్లిప్రియత్నములో నుంకుట యెఱుఁగక యీ పండుగకైన రాకుండెదరా యని కొండంతయాశతోఁ నెదురు చూచుచుంటిని. కోరిక పుట్టినప్పుడెల్ల మీ దివ్యసుందరవిగ్రహసంద ర్శనమునకు, మనము పెండ్లినాఁడు మధుపర్కములతోఁ దీయించు కొనిన ఛాయాప్రతిమయే నా కాధారమగుచున్నది. మా యన్నగారి మాటలవలన నీ నాలుగేండ్లుమాత్రమే గాక యింక నాయావజ్జీవిత మును గూడ నా కీ ఛాయాప్రతిమయే దిక్కని తోఁచుచున్నది.

చదువుగాని, చక్కదనముగాని లేని పల్లెటూరుదాని నొల్ల కుండుటలో మీవల్ల లేశమును లోపము లేదు. విద్యారూపలావణ్యాతి శయములుగల యొకనాగరక కన్యను మీ రెంచుకొనినయెడల, మామగారు మీవివాహమునకు ధనసాహాయ్యము చేయకపోయినను నా యలంకారములను వస్తురూపమునఁగాని, ధనరూపమునఁగాని మీకు సమర్పించుకొనెదను.

మీతో దాంపత్యసౌఖ్య మనుభవించు యోగ్యత నాకు లేక పోయినను, మీ నూతనదంపతుల సౌభాగ్యమును జూచి సంతోషించుటకైన నన్ను మీ యింటిపనులుచేయు దాసిగా నంగీకరించి, నన్ను రప్పించుకొనుటకుఁ గోరుచున్నాను. మీచరణసేవ సేయుచు, మీ చరణసన్నిధినే ప్రాణములు విడుచుటకంటె నాకు మరియొక యభీష్టము లేదు. ఈ ప్రార్థన నంగీకరించినట్లు దయతోఁ బ్రత్యుత్తరమిచ్చినయెడల నాలుగేండ్లనుండియు నేకధారగా నేడ్చుచున్న నాకన్నులు తుడుచుకొని యింక నాయంతటి భాగ్యవతి లేదని గర్వముతో సంచరించెదను.

ఇట్లు మీ చరణదాసి,
రాజ్యాంబ.''

ఇట్లు చదివిన యా యుత్తరమును దన మొగమునఁ బడవైచుకొని సోమశేఖరము దుఃఖాతిశయమున బోరుబోరున నేడువసాగెను. మాటిమాటికి నంతరంగమున నుప్పొంగుచుండిన విషాదతరంగములు బాష్పధారా పూర్వకముగాఁ గన్నులనుండి ప్రవహించుచు, మూఁడు నాళ్లనుండి స్నానములేని కొఱఁత నతనికిఁ దొలఁగించుచుండెను. ముంజేయి రెండుకన్నులపైఁ బడవేసికొని, పాతికేండ్లవాఁడయ్యుఁ బసిబాలునివలె వెక్కివెక్కి యేడ్చుచుండిన సోమశేఖరము శోకాకృతిని గన్నవారికి, వాని దుర్వర్తనము విస్మృతమై జాలి నొడమకమానదు. ఇట్లు పది పదునైదు నిముషములవరకు నేడ్చి, యోదార్చువారు లేనందున నా దుఃఖమంతలో నుపశమిల్లుటయు, సోమశేఖరము కన్నులును ముక్కును తుడుచుకొని, కందగడ్డవలె నెఱ్ఱవారిన మొగముతో నుత్తరము మరియొకసారి జూచి,

'నా కొరకు నువ్వూ, నీ కొరకు నేనూ ఏడుస్తూ యిలా వుండవలసిందే. ఇది మన తండ్రు లిద్దరూ మనకు చేసిన మహోపకారం, భార్యకొరకు నేనూ, పతికొరకు నువ్వూ మన జీవితమంతా తపస్సుచేస్తే వచ్చేజన్మలో మనకి దాంపత్యసుఖం కలుగుతుందేమో? నీ యన్న పౌరుషం కలవాడనీ, నీకు పునర్వివాహం చేసేస్తాడనీ, మా తండ్రి నన్ను భయపెడుతూ వుండేవాడే? ఆ ప్రయత్నం ఏమయింది? ఫలించింది కాదు కాబోలు. ఔను. నే నుండగా నీకు పెళ్లెలాగవుతుంది? నేను బతికున్నంతకాలం నీకు పెళ్ళికాదు. అందుచేను ద్వేషిస్తూ వున్నంత కాలం నాకు జయం కాదు. అక్కడ నువ్వూ, ఇక్కడ నేనూ ఇలా శుష్కించి శుష్కించి చావవలసిందే!......ప్రేమించిన ప్రతిచోటా మోసం తప్ప నాకు మరో ప్రయోజనం కలుగలేదు. అందుచే ప్రేమమీద మరి నాకు విశ్వాసం నశించింది. ప్రేమచేతనే నా బతుకిలా బద్ధలయింది. నాకు పరమశత్రువైన ప్రేమను నేను సంపూర్ణంగా జయించినాను. ఒకప్పు డెప్పుడేనా ప్రేమ నన్ను జయించి మళ్లా నామనస్సులో ప్రవేశించిందో అది మరియెవర్తెకొరకో గాని నీకొఱకుమాత్రం కాదు... ఓహో ఇంకా నన్ను స్త్రీవాంఛ విడిచిపెట్టలేదు. చింత చచ్చినా పుల్ల చావలేదు. ఈ పాడుబుద్ధులకు మరి చోటివ్వక హాయిగా పరమేశ్వరధ్యానం చేసుకుంటాను. ఓ జగద్రక్షకా! ఆపద్బాంధవా? పరమేశ్వరా! నీవు స్వారాజ్యమునకు అధిపతివి. నా యపరాధములన్నీ క్షమించి నన్ను త్వరలో నీ రాజ్యములో చేర్చుకొమ్ము. నేను నిన్ను కోరునది స్వారాజ్యభిక్ష! ఓ స్వామీ! స్వారాజ్యభిక్ష! స్వారాజ్యభిక్ష......

ఈ మాట లాతనినోట వెలువడుటయే తడవుగ వరండాలో నుండి యెవ్వరో తలుపులు తట్టుచు 'స్వామీ! స్వరాజ్యభిక్ష! స్వరా

జ్య భిక్ష' యని బిగ్గరగ నరచుట సోమశేఖరమునకు వినఁబడెను. అత్యాకస్మికముగ వినవచ్చిన యా కేకల కతఁడు త్రుళ్ళిపడి మెల్లఁగా గుర్చీ నానుకొని సగములేచి చేతికందిన యినుపగడియ తీసి మఱలఁ గుర్చీయందే కూలఁబడెను. ఆ గడియచప్పుడు విని వరండాలోనివారే తలుపులను నా రెక్కతలుపులను ద్రోసివేయఁగా ఖదరువస్త్రధారులైన ముగ్గురు పురుషులను, ముగ్గురు స్త్రీలును సోమశేఖరమునకుఁ గానవచ్చిరి. చేతులయందు గజముబద్దలును, భుజములయందు ఖద్దరు తానులును గల స్త్రీ పురుషులు సోమశేఖరమును జూచినంతనే "స్వామీ! స్వరాజ్యభిక్ష! స్వరాజ్యభిక్ష" అని మఱల నఱచి, యందఱు నేకగ్రీవముగా నీ క్రింది ఖదరుపాట నాతనియెదుట నభినయముతోఁ బాడ నారంభించిరి—

ఖదరు వచ్చినది కొనరా ముదుకని బెదరిపోకు సుకుమారా!
అందరిలోపల—అందకాడ గా
యందము చెడునని—సందేహింపక ॥ఖదరు॥

నాణ్యమైన ఖద్దరురా జన్మము ధన్యమొందు ఖద్దరురా।
నిక్కంబగు మేల్—చక్కఁదనము నీ
కొక్కమారె పెం—పెక్కఁజేయఁగల ॥ఖదరు॥

విసుగు చెందలేదటరా। పయిపయి। వేస మెంతకాలమురా।
హేటును బూటును—సూటును దొడగుచు
గోటుచేసితివి—నాటనుండి యిఁక ॥ఖద్దరు॥

ఆ మనోహర గీత మాతని చేతము నాకర్షించినది. ఆ గీతముతోఁబాటుగ నందలింభావములుఁగూడ నా యవస్థలో నతనికి హృదయ ప్రియములైనవి. చెన్నపట్టణ వీధులలో ఖద్దరు విక్రేతలగు స్త్రీ పురుషుల నతఁ డెన్నియోసారులు చూచెనుగాని, వానిదృష్టి నిముసమైనను వారియం దెన్నఁడు నిలువలేదు. బంగరు జరీపనుల

పట్టంచులు గలిగి, పట్టుకంటెను మిలమిలలాడు నెఱపత్తి నూలు దుస్తులను ధరించి, యాకృతులచేతను, ఆభరణాదికములచేతను, ధనికుల బిడ్డలవలెఁదోఁచుచుండిన పదూ లేఁబ్రాయపు స్త్రీపురుషులు సోమశేఖరముకంటికి కప్పుడు గంధర్వస్త్రీ పురుషులవలెఁ గానవచ్చుచుండిరి. పాట ముగిసినవెంటనే సోమశేఖరము వెనుకకుఁ జేరఁబడియుండియే చేతులుమోడ్చి నుదుటంజేర్చి వారికి నమస్కరించి, యేమేమియో గొణుగుచు వచించెను గాని, యా నీరసపుమాటలు వారికి వినబడలేదు. శోమశేఖర మంతకు బిగ్గరగ మఱిమాటాడలేక, తన సమీపమునకు రమ్మని యా పురుషుఁడు వానిచేరువం జేరి నిలువ, సోమశేఖరము లోతువడిన కంఠస్వరముతో నిట్లు ప్రసంగించెను.

"అయ్యా! నన్ను చూచి, నాయవస్థ చూచి, నేనిప్పు డేం చెయ్యవల సుంటుందో సెలవియ్యండి! చేతనైతే చేస్తాను."

"మీరు చాలా నీరసస్థితిలో వున్నారు. ఇంతకంటె మీ యవస్థ మాకు తెలియదు."

"మీకే కాదు. నా దురవస్థ పరమేశ్వరుడికికూడా తెలియదేమో? తెలిసేవుంటే నన్నీ పాటి క్కాపాడే వుండును."

"ఆలాగునా! అయ్యా! ఇట్టి అసమయంలో వచ్చినందుకు క్షమించండి! అంతదురవస్థలో వుండికూడా చేతనైనది చేస్తానని మీరు సెలవిచ్చినందుకు మేం సిగ్గుపడుతున్నాం. మీరు వెలమలా? కమ్మలా? రెడ్లా?"

"నేను బ్రాహ్మణ్ణి!"

"అయితే క్షమించాలి. పైనున్న బోర్డుమీద 'నాన్‌బ్రాహ్మిన్ లాడ్జ్' అన్న పేరు చూచి మీరు బ్రాహ్మణులు కారనుకున్నాం."

అని యా పురుషుఁ డిటు నటుఁ జూచి,

"మీ కెవ్వరూ ఇక్కడ దక్షత వున్నట్టు కనబడదు. ఏదేనా మేం సాయం చెయవలసుంటే చెప్పండి! డాక్టర్ని తీసుకురమ్మన్నారా?"

"నా కెవ్వరూ దిక్కులేరు—ఓ కప్పు కాఫీ......"

అని సోమశేఖరము మఱి మాటాడలేక గదివంక వ్రేలు చూపుచు, నా గదిలో గోడకొయ్యకుఁ దగిల్చిన కోటుజేబులో డబ్బు లున్నవనియు, నా గదిలోనే కాఫీపాత్రయుఁ గలదనియుఁ దనకొఱకు కాఫీ తెచ్చిపెట్టవలయు ననియు సంజ్ఞలతో నెఱింగించుచు దీనమైన ముఖముతో వేడుకొనెను. అంత నా పురుషుఁడు వడివడి నా గది లోనికిఁ బోయిఁ యం దొకమూలఁ బడిఁయున్న కాఫీపాత్రి నందుకొని, చేతనున్న గజముబద్దతో గ్రుచ్చి యెత్తిపట్టిన నల్లని సర్జి కోటును గొనివచ్చి, "అయ్యో! ఇది ఖద్దరు కాదు. ఈ గుడ్డలను మేం ముట్టుకోకూడదు. మీరే జేబులోవున్న డబ్బులు తీసి యిప్పించండి" అని వానిమీఁదఁ బడవేసెను. సోమశేఖరమా కోటు జేబులో నున్నడబ్బులను దీసి వాని కొసంగ, నతండు వరండాలోనున్న మఱియొకని కిచ్చి కాఫీ కొనిరమ్మని పంపి, మఱల సోమశేఖరము నుద్దేశించి, "మీ రౌషధం పుచ్చుకుంటున్నారా?" అని యడిగెను. సోమశేఖరము సంజ్ఞలతోడనే మందు పుచ్చుకొనుటకుఁ దనయొద్ద సొమ్ము లేదని ప్రత్యుత్తరమిచ్చెను. అంత నా ఖదరుధారుఁడు "మీరు మా ఆశ్రమంలోనికి దయచేస్తారా? అక్కడ మీ కౌషధసేవ చేయిస్తాం" అని ప్రశ్నింప, సోమశేఖరము వానికి నమస్కారముచేసి తప్పక వచ్చెదనని తలయూచెను. "ఈ బట్టలతో మీరు మా యాశ్రమంలోనికి రాకూడదు. ఖదరిస్తే కట్టుకుంటారా?" అని యతఁడు మఱలఁ బ్రశ్నింపఁ గట్టుకొనెద నని సోమశేఖము సూచించెను.

ఇంతలోఁ దనకు కాఫీవచ్చుట చూచి యా నిర్భాగ్యుఁడా కాఫీపాత్ర నాత్రముతో నందుకొని, ప్లీడరుమామ మూఁడు వేలు కట్నమిచ్చునెడల నెంతసంతసింప నెంచెనో, యంతకంటెఁ బదిరెట్లధికముగ సంతసించెను.



## 17 వ ప్రకరణము

### "ఇవాళనుండీ నా కిద్దరు వదినగార్లు"

లక్ష్మీకాంత, వసంతరావులను విడిచి యా నాటిరాత్రి లోనికిఁ బోయిన లక్ష్మీపతి, మఱల మూఁడు నాలుగు నిముసములలోనే, చేత హర్కేన్ లాంతరుతో సేవకుఁ డొకఁడు తనవెంట నుండ, గుప్పుగుప్పునఁ జుట్ట కాల్చుకొనుచు వెలుపలికి వచ్చి, 'అప్పుడూఁ పాపం, చాలారాత్రయిపోయింది. వేగిరం వెళ్ళిరా' అని చెప్పి యా సేవకుని వీధిలోనికిం బంపి, యరుగుపైనున్నవారు తన ప్రసంగము నెంతవఱకు వినిరో యను సందేహముతో మఱల వారితోఁ బ్రసంగమును బ్రారంభించెను.

'వర్షం బాగానే పడ్డాది కాని, నిజంగా యివాళ కాసినయిండకి యింకా యీ వర్షం చాలదు. ఏఁ వంటారు?'

ఆ మాటలకు లక్ష్మీకాంతము,

'మేఘం గాఢంగానే వుంది. పడితే యింకా పడవచ్చు'

'వర్షం పడుతూన్నంతసేపూ పాపం, మీ రివతలే వుండిపోయారు. కాఁబోలు?'

ఆ ప్రశ్నకు వసంతరావు తనలో నవ్వుకొనుచు,

'ఎక్కడుంటే నేం కానండీ యింతవరకూ లక్ష్మణరావు పంతులుగారి మేడా అంటూ చెప్పుకోవడం తప్ప యీ లోపలికి వచ్చి యెరగం. నిజంగా ఇంత గొప్పభవనం యీ పట్నంలో లేదు.'

'నిజమే కానండీ యీ యింటి వైభవ మంతా మా అన్నగారితోటే పోయిందండి. చావి డెలా వుందో చూశారా? వో కుర్చీ లేదు. వో బెంచీ లేదు. రాక రాక మీలాంటి పెద్దమనుష్యులు రావడం— ఆహ్వానం లేకుండా అడుగుమీదే వుండిపోవడం— నా మనస్సు మహా విసవిసలాడుతూం దివాళ.'

ఆ మాటలనుగూడ లక్ష్మీకాంతమును మాటాడనీక వసంతరావు,

'ఎంతమాట? మీ రలా సెలవియ్యడం న్యాయంకాదు. మీరు విసవిసలాడ్డానికి నే నింకా విద్యార్థిని. బి. ఏ. చదువుతూంటున్నాను. ఇతణ్ణి మీరు చూసే వుంటారు. నా స్నేహితుడు. ఇవాళే బాబుగారిదగ్గిర ప్రవేశించాడు.'

'ఔ నౌను. దివాణంలో యితణ్ణి చూసినట్టే జ్ఞాపకం. బాబుగారితో గట్టిగా మనవిచేసి తగినజీతం చేయిస్తాను. పాపం, చాలా మంచివాడిలాగే కనపడుతున్నాడు.'

'ఏదో కాస్త కటాక్షించండి! మా లక్ష్మీకాంతం చాలా పేదవాడు.'

ఈ ప్రసంగమువలనఁగూడ వాఁడు తన రహస్యకార్యసంభాషణ మెంతవఱకు వినియుండునో యను విషయము లక్ష్మీపతికిఁ దెలియలేదు. వసంతరావు బుద్ధిపూర్వకముగనే తెలియనియ్యలేదు. ఆతఁడు పనిమనిషి యాంతరంగికాంతరోద్యోగనమును వారిపుడుఁగూడ

గ్రహించిరి. లక్ష్మీకాంత మనూయకుఁడును, భయస్థుఁడు నగుటచేత వసంతము వానిని మాటాడనీయక, తానే లక్ష్మీంపతికిఁ బ్రత్యుత్తరము లిచ్చుచు వచ్చెను. తనకుఁ గావలసిన ప్రత్యుత్తరమునకై లక్ష్మీంపతి వారి నడిగిన ప్రశ్నలన్నియు వ్యర్థములైనవి. అట్లయ్యు నతఁ డంతతో విడువక సందేహనివృత్తికై యింకను మాటాడఁ దలంచెను గాని, గృహాంతర్భాగమునుండి నవ్వులు, మాటలునువాని నాకస్మికముగ వినవచ్చుటచేత నతఁ డూరకుండెను. వేదచావడిలో వెలుగుచున్న పెట్రోమేక్సు విద్యుద్దీపమునకు స్థానచలనము కలిగి నట్లు తద్దీపకాంతులు వీధిచావడిలోనికి, వీధిచావడినుండి యరుగు మీఁదనునుగూడఁ బ్రసరించుచుండెను. చిరకాలమునుండియు నగతికయై, భోగబాహ్యయై, యానందరహితయై, యనాధస్థితినున్న యా యింటియందలి యైశ్వర్యలక్ష్మి తనకుఁ దగినకాంతుని వెదకికొనఁ దానే వెడలివచ్చుచున్నదో యన, వినఁబడుచుండిన నవ్వులమాటలతోఁగూడఁ గనఁబడు చుండిన విద్యుద్దీపకాంతు లంతకంత కధికమై చావడిగుమ్మమునకుఁ గట్టెదురుగానున్న ప్రాకారద్వారము వఱకును బ్రాఁకసాగెను. ఇంతలో నొకసేవకుఁడు చేత విద్యుద్దీపమును బట్టి లోపలినుండి వెలుపలికి వచ్చి మెట్లముందు నిలువఁబడి, బండికొఱకు వెళ్ళిన యప్ప డింకను రాలే దేమని వీధివంక విలోకించుచుండెను. అంతవఱకు నంధకార బంధురమైయుండిన యా గృహావరణప్రదేశము సముద్రమువంటి యా విద్యుద్దీపమునుండి వెడలుచుండిన కాంతితరంగములచే నత్యంతకాంతిమంతమై, యెంతటి దరిద్రునైన నొక్కక్షణములో మహైశ్వర్యవంతునిఁ జేయఁగల కాలచక్రమహిమను సూచింపసాగెను.

అంత, సుందరీ స్వారాజ్య భ్రమరము లొండొరుల భుజములపైఁ బాణిపల్లవము లిడుకొని, యత్యల్పకాలముచేఁ గలిగిన యత్య

ధికస్నేహమున వికసించిన ముఖాబ్జములతోఁ, జావడిలోనుండి వచ్చుచు లక్ష్మింపతిని జూచి స్వరాజ్య భ్రమరములును, లక్ష్మీకాంత వసంతరావులను జూచి సుందరమ్మయు, వీధియరుగుపైఁ బాదము లిడక చావడిగుమ్మముకడనే శిలాప్రతిమలవలె నిలుచుండిపోయిరి. పూర్వసంభాషణములో నెవ్వ రెవ్వరి నేమని పరిహసించిరో కాని, వారిముఖము లింకను నవ్వుచునే యుండెను. వారిని జూచి చుట్టకాల్చుకొనుచున్న లక్ష్మింపతి యా యరుగుపై మఱి మూఁడు నాలుగడుగులు మీఁదికిం బోవ, లక్ష్మీకాంత వసంతరావులు తా మున్నచోటున కించుక వెనుకకుఁ దగ్గిరి. అపారమైన యా విద్యుద్దీపకాంతిలో సహజసౌందర్యవతులైన యా ముగ్గురు జవ్వనులు సాలభంజికలవలె భాసిల్లసాగిరి. సుందరికివలె స్వరాజ్య భ్రమరములకుఁగూడ నా దీపకాంతి సుందరీనామధేయములను గల్పించుచుండెను. కను ముక్కు తీరులయందొండొరులకుఁ బోలికలు లేకపోయినను సౌందర్యమే యా ముగ్గురి యందుగల సామాన్యగుణము. విలాసార్థము మూఁడుమూర్తులుగా నవతరించిన సౌందర్యదేవతవలెనే యా కాంతాత్రయము గానవచ్చుచుండెను.

స్వరాజ్యము తనకుఁ జాటుగా నెడమచేయి యా మెభుజముపై నిడికొని, కుడిచేతితోఁ దనకుఁ జేరువగా నిలిచియున్న భ్రమరమును గాఁగిలించుకొని, లోపలిగుమ్మములో నిలిచియున్నసుందరమ్మ ప్రథమ దర్శనము లక్ష్మీకాంతమునకును, వానితోఁగూడ వసంతరావునకును నమితానందజనకమైనది. 'మీ యిద్దరిలో నా యిరువురు నెవరి కెవరన్నగా రవ్వొదకో మీరు చెప్పనక్కఱలేకుండ మీ మీ ముఖ లక్షణములను బట్టియే నేను గ్రహింపఁగల్గితినిజుమా'' యని సుందరమ్మ స్వరాజ్యము చెవిలో గుసగుసలాడుచుండ, నామె నవ్వుచు నితఁడు మా యన్నగా రనియు, నతఁడు భ్రమరమునకుఁ జిన్నన్న

యనియు స్పష్టపరచెను. ఆ గుసగుసలు వినఁబడకపోయినను దమ యిరువురిని వ్రేలితోఁ జూపించుచుండుటంబట్టి యా సంభాషణార్థమును వసంత లక్ష్మీకాంతములు గ్రహించిరి. సుందరమ్మనుగూర్చి వినుటయే తప్ప ఆ హేమాంగి యింతటి సుందరాంగి యని కాని, యింత శ్రేయోభాగ్యము కలదియని కాని వా రెఱుంగరు. మఱియు, నా ముువ్వురి గుసగుసలును, నవ్వులును గనిపెట్టి తమ చెల్లెండ్రకు సుందరమ్మతో నత్యల్పకాలముననే యంతటిపరిచయము కలిగినందుకు వింతపడసాగిరి. వసంతరావు మెల్లగా, 'కాంతం! ఈమె మన స్వారాజ్యముకంటె పెద్దదా, చిన్నదా!' యని ప్రశ్నించెను గాని, లక్ష్మీకాంతము వానికిఁ బ్రత్యుత్తరమీయలేదు. ఆ ప్రశ్నయే వానికి శ్రవణగోచరముకాలేదు. ఆతని దృష్టియుఁ జిత్తమునుగూడ నిలువుగ శృంగారమొలుకుచుండిన సుందరీ సుందరాకృతి యందుఁ దన్మయత్వమును జెందినవి. లక్ష్మీకాంత మంతటి చక్కని వ్యక్తి నెన్నఁడును గన్నవాఁడు కాఁడు. వసంతరావువలె దూరప్రయాణములను జేసినవాఁడును గాఁడు. ఆ వయసున కుండఁదగిన లోకానుభవ మాతనికి లేదనియే చెప్పవచ్చును. జ్ఞానము వచ్చినది మొదలు వానికున్న యనుభవమంతయు దిన దిన గండమగు కుటుంబ దారిద్ర్యమే. ఆ లావణ్యరాశిని సందర్శించినది మొదలు వాని దృష్టు లింద్రనీలమణి కాంతుల నేలు నామె వేణీరుచుల యందు సంచరించి, భాగ్యలక్షణసమన్వితంబైన ఫాలతలంబున విహరించి, చెక్కిళ్ల జాళువా తళుకులం గొనియాడి, మెడనుండి యున్నతవక్షస్థలముపైఁ బడి, మువ్వల యొడ్డాణమువరకు వ్రేలాడుచుండిన కంఠాభరణములయందలి బంగరు వాచీగొలుసుల పఱసలను లెక్కించుచుండ, నభిజ్ఞానశాకుంతలము నందలి

"అనాఘ్రాతం పుష్పం కిసలయ మనూనం కరరుహైః।
అనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదితం రసం।
అఖండం పుణ్యానాం ఫల మివచ తద్రూప మనఘం।
నజానే భోక్తారం క మిహ సముపస్థా స్యతివిధిః॥

అను శ్లోకము తనకు జ్ఞప్తికిరా మనసులో నొకమారు చదువుకొనెను. మలినవస్త్రధారిణి యయ్యు సుందరీదక్షిణ కరాలింగనమున నమూల్యాంబరాభరణ ధారిణివలె రాణించుచుండిన భ్రమరము లక్ష్మీకాంతమునకు మఱియు నాశ్చర్యకారణమైనది. ఆమె దుర్భరజీవితములో నానాఁడుమాత్ర మా నాలుగుగడియలు నామెకు మంచిగడియలు వచ్చెనని యతఁ డనుకొనెను. భ్రమరము – దుర్భరజీవితము నను మాటలు తన మనసునకు స్ఫురించినంతనే సుందరీ సుందరావయవపరిశీలనమునుండి వానిదృష్టి మఱలినది. అప్పుడు భ్రమరమున కొకచేతఁ గాగితపుపొట్లము నొకచేతికి మూసిన పిడికిలియు నుండుట లక్ష్మీకాంతము కనిపెట్టెను గాని, యం దేయే వస్తువు లున్నవో యాతఁ డెఱుఁగఁడు.

మాసినవస్త్రములకే నూతనవస్త్రశోభ కలిగించుచుండిన యా విద్యుద్దీపకాంతితరంగములు, సహజసౌందర్యవతియైన భ్రమరమున కమూల్యాభరణప్రాయము లగుచుండుట వింతకాదని వసంతరావను కొనుచు, బి. ఏ. తరగతిలోఁ దాను ప్రస్తుతము చదువుకొనుచున్న తేజశ్శాస్త్రము (Optics) నందలి కాంతిమహిమలను స్మరించుకొనుచుండెను. ఇంచుక జ్ఞానము వచ్చినదిమొదలు తన వివాహమునుగూర్చియో, తన కుటుంబమునకుఁగల దీనావస్థనుగూర్చియో కాని, సర్వకాల సర్వావస్థలయందును భ్రమరము ముఖమునందు విషాదాభావ మావరించియే యుండుట తెలుచుగాఁ గని పెట్టుచు, నట్టివిషాదభావము లేకుండినయెడ నామెముఖ మింకను నెంత దర్శనీయముగ నుండునో

కదా యని భావించుకొనుచుండిన వసంతుని ముచ్చట నాటిరాత్రి తీరినది. సుందరీ స్నేహభాగ్యముచేతనే కాఁబోలు, నిష్కళంకము, నిర్విచారమునై యానందముఁ నుత్సాహమును గల్గి పదియాఱుకళల నాటి జాబిల్లివలెనే శోభిల్లుచుండిన భ్రమరము ముఖము నాటిరాత్రి వసంతమున కెంతచూచినను దృప్తిగూర్పని దైనది. ప్రాకార కవాటములు త్రోయఁబడిన ట్లనుపచక్రములు కిరకిరచప్పు డైనంతనే భ్రమరము మొఖముపైఁ దాండవించుచుండిన యాతని దృష్టులు వీధి వంకకు మఱలినవి.

కవాటముల కిరకిరధ్వానము వెంటనే యెద్దుమెడలోని మువ్వల ఘల్లులారావము లచ్చటివారి దృష్టులన్నియు నాకర్షించుచుండ నొక పెట్టెబండి యా యావరణములోఁ బ్రవేశించి మెట్లవరకు వచ్చి మఱల వీధి కభిముఖముగాఁ దిరిగినది. అరుగుపైనున్న మగవారికి వినరాకుండఁ దమలో మందహాసపూర్వకమగు రహస్యసంభాషణము గావించుకొనుచుండిన యా యపూర్వ స్నేహలాలనలకు మువ్వురకు నా శకటము వియోగకారణమైనది. అందుచేఁ దమ యప్రస్తుత ప్రసంగములను మాని వీడుకోలుమాటలనుధారాళముగనే ఇట్లు మాట్లాడు కొనిరి.

స్వరా:—అక్కయ్యగారూ! ఇంక సెలవిప్పించండి! మళ్లా యెప్పుడేనా మీ దర్శనానికి వస్తాం.

సుంద;—మళ్లా యెప్పుడో కాదు, రేపే రావాలి. బండితో పేరమ్మను పంపిస్తాను. మధ్యాహ్నం వోమారు దయచెయ్యండి.

స్వరా:—మా మాఁవగారు వెళిపోతే వస్తాను. ఆయ నుంటేమాత్రం

సుంద:—అలాగా? పోనీయండి! (అని భ్రమరమును జూచి, మఱింత బిగ్గిరగఁ గాఁగిలించుకొని) భ్రమరం! నీ మాట?

స్వరా:—(నవ్వుచు) భ్రమరంమాట మీ రడగక్కర్లేదు. ఎవరేనా

పిలుస్తే చాలు వారింటికి వెళిపోయే స్థితిలో వుంది. అందుచే తప్పకుండా వస్తుంది.

సుంద:—అంటే? నా కర్థం కాలేదు—

స్వరా:—భ్రమరం గెంటేస్తున్నా పెళ్లికొడు కిల్లు విడిచిపెట్టక పెండి పట్టుకొని వేలాడుతున్నాడు. అందుచేత యెవరేనా పిలుస్తే చాలు భ్రమరం వాళ్లయింటికి పారిపోతూ వుంటుంది.

సుంద:—అలాగ టమ్మా భ్రమరం! అయితే నువ్వు నాదగ్గిరే వుండిపో? అతగాడు వెళిపోయేదాకా! చదువు లేదనా, చక్కదనం లేదనా? నీ కిష్టం లేకపోడాని కేం కారణం?

స్వరా:—(నవ్వుచు) అక్కగారి అమాయకత్వం గాని, చెపుతుందనే యడిగేరా ఆ ప్రశ్న? నన్నడగండి నేంచెప్తాను. పెళ్లికొడుకు చదువుమాట నాకు తెలియదు కాని, రూపానికి మాత్రం పిఠాపురం బత్తె?

చేలాంచలములఁ దమ నోరులు కప్పికొని సుందర స్వరాజ్యములును, ప్రక్కమోములతో లక్ష్మీకాంత వసంతరావులు నా మాటకు నవ్వుకొనసాగిరి. అధోముఖాబ్జయై యీ పరిహాసవచనముల కానందించుచుండిన భ్రమరమును జూచి, సుందరమ్మ—

సుంద:—పెణక పట్టుకొని వేలాడుతూన్న పెళ్ళికొడుకుని విడిచిపెట్టేడం నీకు న్యాయం కాదమ్మా భ్రమరం? అంత ప్రాధేనపడే వరుడు నీ కెలా దొరుకుతాడు?

స్వరా:—అక్కగారు మళ్లా అలాగే అంటే మా కేం దారి? అదేదో స్పష్టం చేసేస్తే మేం మరో సంబంధం చూచుకుంటాం—

అని పలుకుచుఁ దన నవ్వు మొగమును వసంతమువంక కొక సారి త్రిప్పెను. సుందరమ్మ నవ్వుచు,

"ఔనమ్మా! ఆ మాటే మఱచిపోయాను. సరే! ఏదేనా ఇప్పటి కిప్పుడే చెప్పేయమండం న్యాయంకాదు. ఇవాళ్లల్లా ఆలోచించి భ్రమరం మనకి రేపేదో వొకటి చెప్పేస్తుంది.

అని లక్ష్మీకాంతమువంక నొకసారి వీక్షించి, యాతని దృష్టి తనపైపునకే ప్రసరించుచుండుటచేఁ దటాలునఁ దనదృష్టి మఱల్చుకొని.

"భ్రమరం! బాగా ఆలోచించి రేపు చెప్పేస్తావుకదూ?"

"రేపటిదాకా యెందుకు? నేం చెప్పవలసిన సమాధానం యిందాకే చెప్పేశాను."

"ఏం చెప్పేవో నాకు జ్ఞాపకం లేదు, మళ్లా చెప్పు!"

"ఇవాళనుండీ నా కిద్దరు వదినగార్లు."



## 18వ ప్రకరణము

### ప్లీడరు నోటీసు.

అది పదిగంటలవేళ. బొబ్బిలి ప్యాసింజరువచ్చినట్లు రైలుకూత స్పష్టముగా వినవచ్చుచుండెను? లక్ష్మీకాంతము దివాణము వారి కచేరీచావడిలో రత్నకంబళిపైఁ గూర్చుండి, బాబుగారి సెలవు చొప్పున వోటర్ల లిస్టు వ్రాయుచుండెను. వాని సమీపముననే వేంకటశాస్త్రి గోడనుఁ జేరబడి కూర్చుండి, యచ్చుప్రతిని జూచి

యందలిపేరు లొక్కొక్కటి వానికిఁ జెప్పుచుండెను. ముందొక బల్లగాని, డసుకుగాని లేక క్రిందనే యొకయట్టపైఁ బెట్టిన తెల్లకాగితములపై లక్ష్మీకాంతము నేలను వంగి వేంకటశాస్త్రి చెప్పుచున్న పేర్లను వ్రాయుచుండెను. అప్పుడు ప్రొప్రయిటరు బాబుగారు చావడిలో లేరు. అందుచే ఆఫీసుగదిలోని గుమస్తాలును, చావడిగుమ్మము కడనున్న సేవకులును విచ్చలవిడిగా మాటలాడుకొనుచుండిరి. అప్పుడు లక్ష్మీంపతి వీధిలోనుండి వచ్చి యాచావడిలోఁ బ్రవేశించి యిటు నటుఁ జూచుచు, "బాబుగా రెక్కడ" అని వేంకటశాస్త్రిని బ్రశ్నించి, మెల్లఁగా సమీపముననే నేల నాసీనుఁడయ్యెను. వెంటనే వేంకటశాస్త్రి చేతనున్న వోటర్లలిస్టు క్రిందఁ బడవైవ, నొకగంటనుండియు వంచిన నడు మెత్తకుండా వ్రాయుచుండిన లక్ష్మీకాంత మొక్కసారి నడుమెత్తి నిట్టూర్పు విడిచెను. అప్పుడు వేంకటశాస్త్రి కంటియద్దములను దీసివేసి కన్నులు నులుముకొనుచు లక్ష్మీంపతితో నిట్లు మాటాడసాగెను.

"బాబుగా రివాళ స్వయంగానే నలుగుర్నీ చూతా మని క్యాన్వాసింగికి బయలుదేరేరు. టైము దగ్గరకొచ్చింది చూడండీ"

"మంచిపనే చేశారు. తప్పకుండా బయలుదేరవలసిందే. ఎంతమంది యేజెంట్లు పనిచేస్తూవున్నా, అప్పుడప్పుడు వారిదర్శనం ప్రజల కుంటుండాలి."

"ఔను. అందుకే కారు వేసికొని బయలుదేరేరు. గొంతు వీధికి సాతాని మనఁవలయ్యని వో యేజెంటుగా పెట్టేం. శతమానం పుచ్చుకున్నాడు. అతగాడి కో లిస్టు ప్రత్యేకంగా తయారుచేసి యిమ్మని బాబుగారి సెలవైంది. రాయిస్తున్నాను."

లక్ష్మీకాంతము నేలఁబడియున్న యచ్చుప్రతి తానే చూచు

కొని పేరులు వ్రాయుచుండ, లక్ష్మింపతి వానిని శంకాసంకలితవీక్షణములతో వీక్షించుచు, వేంకటశాస్త్రి నుద్దేశించి,

"మనం అనుకున్నది బాబుగారితో మనవిచెయ్యడాని కవకాశము కలగలేదుకాబోలు?"

"కలక్కేం? పదినిమిషాలుదాకా మాటాడేను. ఇవాళా, రేపూ కాస్త తొందరగా వుంటారట. ఎల్లుండి తప్పకుండా ఆ వస్తువు తెప్పిస్తాం- అని సెలవిచ్చారు. మీ పనిలో యెప్పుడేనా అశ్రద్ధ చేస్తానా?"

"ఎంతమాట? నే నెప్పుడూ అలా గనుకోను."

అని లక్ష్మింపతి పలుకుచుండఁగా వేంకటశాస్త్రి తాను వ్రాయించి తెచ్చిన ప్రోమిసరీనోటు జేబులోనుండి తీసి వానికిచ్చెను. లక్ష్మింపతి యా కాగిత మందుకొని చదివి——

"బాగుంది. ఈ సాక్షిసంతకా లెవరివి శాస్త్రీజీ! ఆ రామన్న అంటే"

"అబ్బెబ్బే కాదండీ! జోళ్లషాపు కెదురుగావున్న మేడ అతనిదే. నెల కరవై రూపాయి లద్దె పుచ్చుకుంటున్నాడు. అంతేకాక, పదివేలరూపాయల సంసారి. ఆ మంచి—రామన్నా అని మామంచివాడు. మీ రెరగరు కాని——"

"అలాగా? సం—దేవదత్తుడు-"ఇత డెవ రండీ?"

"దేవదత్తాన్నే యెరగరా? మన తాలూకాబోర్డు కంట్రాక్టరు. కుర్చీలూ, బెంచీలూ తయారు చేయించి సప్లయిచేస్తూ వుంటాడు. ఇప్పటికి నలభై వేలు గణించా డని వాడుక. చచ్చు వెధవల చేత సాక్షిసంతకాలు చేయించడం యిష్టంలేక కాస్త ఘరానా మనుషులచేత పెట్టించాను. వ్యవహారంలో బాసు గుండకూడదు చూడండీ."

"ఎంతమాట ఎంతమాట? ఈ యాసామీలని నే నెప్పుడూ యెరక్క అడిగేను. మ రేఁవీ అనుకోకండీ. ఇదిగో సొమ్ము."

అని లక్షింపతి యా నోటు మఱచి తన జేబులో భద్రపరచుకొని, జేబులోనుండి పది పదిరూపాయలనోట్లు తీసి, తా నొకమాఱు లెక్కించి శాస్త్రికి సమర్పించుకొనెను. వేంకటశాస్త్రి సొమ్ము సరి చూచుకొని,

"బాబుగారితో మాత్రం ఈ విషయం మనివి చెయ్యకండి. న న్నెందు కడగలేదని చీవాట్లు పెడతారు. ఈ ఖర్చుసమయంలో వారి నడగడం నా కిష్టంలేదు."

"ఖ ర్చేఁవిటి - రూపాయిలు గవ్వల్లాగ విసిరేస్తున్నారు— ఇవాళో, రేపో, దొంతికి దొంతీ కాసులు కావాలి. వారి కందవలసిన సొ మ్మందకుండా వుంది. తుకారాం నలభయివే లివ్వాలి. ఆ గాడిదకొడుకు తన దేశం వెళ్ళి నాలుగు నెలలైనా యింకా రాకుండా వున్నాడు."

అని వేంకటశాస్త్రి చెప్పుచుండఁ దపాలావాఁ డాచావడిలోఁ బ్రవేశించి తన వాడుకచొప్పున నాఫీసుగదిలోనికిఁ బోయి మఱల రెండు మూఁడు నిముషములలోనే తనదారి నేగెను.

లక్ష్మీకాంతము పేర్లు వ్రాయుచుండినను వానికి సగముదృష్టి లక్షింపతి వేంకటశాస్త్రుల సంభాషణమునందే యుండెను. గతరాత్రి వారి రహస్యప్రసంగమంతయు విన్నవాఁడగుటచే, నంతవరకు జరిగిన యా యిరువురి సంభాషణమును వానికి సూక్ష్మముగానే యర్థమైనది. రెండు మూఁడుదినములలోనే బాబుగా రావస్తువు తెప్పించెదరని పలికిన వేంకటశాస్త్రి వాక్యమునందలి వస్తువునకు, ఇనుపపెట్టితాళ మని యతఁ డర్థము చేసుకొనఁగలిగెను. లక్ష్మీకాంతము తన కనుమానపురుషుఁ డగుటచేఁ దాను వేంకటశాస్త్రితోఁ బ్రసం

గించుచుండియు లక్ష్మీపతి తఱచుగ నాతని ముఖవైఖరి పరీక్షించుచునే యుండెను. లక్ష్మీకాంత మది గ్రహించి తన ముఖలక్షణముల యందు లేశమును మార్పు గలుగనీక, నియమితకార్యమునందుఁ దన్మయుండైనవానివలె నటించుచుండఁ దమ ప్రసంగమునందు వాని కెట్టిదృష్టియు లేదని యనుకొని, లక్ష్మీపతి గతరాత్రి వహించిన సంశయమును గూడఁ బరిత్యజించి తృప్తుఁడయ్యెను.

తపాలావాఁడు వెడలిపోయిన మూఁడు నాలుగు నిముసముల లోనే ప్రొప్రయిటరుబాబుగారు దయిచేసిరి. పసుపుపచ్చని పంట్లా మును-నల్లని సర్జికోటు-తెల్లని సిల్కుషర్టు ఎఱ్ఱని పట్టునెట్టయి-ఆకు పచ్చని కుచ్చులచెప్పులాధరించిన బాబుగారి పొడవైన విగ్రహము రంగు రంగుల రంగారు నింద్రధనుస్సువలెఁ జూడ వేడుక వొడమించు చుండఁ జావడిలోనివారును, నౌఖరులును లేచి చేతులెత్తి నమస్క రించిరి. మోటారు దిగి యత్యంతజవంబునఁ జావడిలోఁ బ్రవేశించి, నవ్వుమొగముతో లక్ష్మీపతి వేంకటశాస్త్రులనుజూచుచు ప్రొప్రయి టరు తన యాసనమున నుపవిష్టుండయ్యెను. ముకుళితహస్తములతో శాస్త్రియు, లక్ష్మీపతియు మేజాబల్ల సమీపింపింప వారి నచ్చటి కుర్చీ లపైఁ గూర్చుండ నాజ్ఞాపించి, యందరితోఁబాటుగ లేచి కూర్చుం డుట కాజ్ఞకై వేచియుండిన లక్ష్మీకాంతమును జూచి "ఆ వ్రాయు చున్న కాగితము లీటు తె" మ్మను నర్థముతో "బ్రింగ్ దట్ రైటింగ్ పేపర్స్" అని యింగ్లీషుతో సెలవీయఁగా, నతఁడు తా నంతవఱకు వ్రాసిన కాగితములను బ్రభుభయసూచకంబైన తొట్రుపాటుతోఁ గొనివచ్చి బాబుగారికి సమర్పించెను. బాబుగా రా కాగితముల నొక్కొక్కటిగాఁ బరిశీలించుచు శాస్త్రి లక్ష్మీపతులతో నిట్లు ప్రసంగింప సాగిరి.

బాబు:– శాస్త్రిజీ! ఈ కుఱ్ఱవాడు దస్తూరీ మా బాగారాస్తాడండీ.

వేంక:—చిత్తం చిత్తం చూశాను. నల్లనిముత్యాలుకూడా వున్నాయా యన్న భ్రాంతిపుట్టిస్తుం దా దస్తూరీ.
లక్ష్మి:— దస్తూరే కాదు. తెలివి తేటలో-అద్భుతం—
బాబు:— ఇంగ్లీషుకూడా బాగానే రాస్తాడు. అయితే కొంచెం తప్పులుంటా యక్కడక్కడ—
వేంక:— తప్పుల్లేకుండా రాయడానికి పాపం బియ్యే ప్యాసయాడా? ఎమ్మే ప్యాసయాడా?
లక్ష్మి:— బాబుగారిదగ్గర యింగ్లీషు మాట్లాడ్డానికి బి. ఏ.; ఎమేల్ను ప్యాసయినవాళ్ళకు్కూడా భయంగానే వుంటుంది.
బాబు:— మా యింగ్లీషూ అంటే అది వేరు. ఎస్టేటువ్యవహారమంతా మా కింగ్లీషుతోటే జరగాలి, తెల్లవారితే కలక్టర్లూ, గవర్నర్లూ-ఇలాంటివాళ్ళతో కరస్పాండెన్సుంటుంది. పరీక్షలు పాసయినంత మాత్రాన్ని మా యింగ్లీషు రమ్మంటే యెలా వస్తుంది? అయితే వొహటి-మా దగ్గిర కొంతకాలం పనిచేస్తే యింగ్లీషులోకూడా తరిఫీదవుతాడు. తెలివైనమొహమే కాని, జిడ్డుమొహంకాదు.''
వేంక:— మొహంలో మంచికళుంది. చక్కనిదస్తూరీ చక్కనిరూపం! రేఖ బయలుపడాలి కాని యెంతవాడేనా కావచ్చు.
లక్ష్మి:— రేఖ బయలుపడ్డాది కాబట్టే బాబుగారిఆశ్రమం లభించింది.
బాబు:— (లక్ష్మీకాంతమును జూచి) అబ్బాయ్! నీ పేరు లక్ష్మీకాంతంకదూ? రేపటినుండి మా దగ్గిరికి కాస్త మంచిబట్టలు కట్టుకొని వస్తూవుండు. అందులో నువ్వుకట్టుకొన్నది మరీ అన్యాయంగావుంది.
లక్ష్మి:— (అంతవఱకు వంచుకొనినమొగ మెత్తి చేతులుజోడించి) చిత్తం! చిత్తం! ఈ నెలాకరుదాకా శ్రీవారు సెలవిప్పిస్త

జీతందొరగ్గానే బట్టలు కొనుక్కుంటాను.

బాబు:— నెలాఖరుదాకా యెందుకు? మేం తెప్పించిస్తాం కట్టుకో? శాస్త్రీజీ! జపానుమల్లు బాగుంటుంది. వోతాను తెప్పించండి పాపం—

లక్ష్మి:— (భయముతో) చిత్తం–నేను ఖదరుతప్ప మరోబట్ట కట్టనని శ్రీవారితో మనవి చేసుకుంటున్నాను.

బాబు:— నీ మొహం–ఖద రేఁవిటి? తప్పు తప్పు! మా దగ్గిర ఖదరు కట్టకూడదు. మేం గవర్నమెంటు మనుష్యులం!

లక్ష్మి:— (వణకుచు) శ్రీవారు నన్ను కటాక్షించాలి. ఖదరికీ గవర్నమెంటుకీ సంబంధంలేదు. నే నిదో వ్రతంలాగ—

బాబు:— (కోపముతో) నోరు ముయ్! పశువా? వొద్దంటూంటే వ్యాఖ్యానాలు కూడానా? ఖదరికీ గవర్నమెంటుకీ సంబంధం వుందో లేదో నువ్వా మాకు బోధపర్చే వాడివి? శాస్త్రీజీ? చూస్తూన్నారా వీడి వ్యవహారం?

వేంక:—చూస్తున్నాను? చూస్తున్నాను?

బాబు:—వీ డెంతోకాలం మందగ్గిర వుండేటట్టు కనబడదు.

వేంక:—మందగ్గిరే కాదు. ఎవరిదగ్గిరేనా చెల్లందమ్మిడీలాగే కనబడుతున్నాడు.

లక్ష్మి:— (తల యూపుచు) అబ్బో? ఇది దేవతలకి పంచాంగం చెప్పే బాపతు—

వేంక:— ఇందులోవున్న రహస్యం బాబుగారితో మనవి చేస్తాను. మొన్నటి శనివారంనుండి మనవూళ్లో మళ్లా పికెంగు ప్రారంభించారు. ఆడవాళ్లూ, మొగాళ్లూ ఖదరుబట్టల్తో తెల్లవారేసరికి దుకాణాలదగ్గిర తయారై పోతున్నారు. ఆ వెట్టి యితనికూడా ఆవేశించింది,

బాబు:—అలాంటి వెఱ్ఱి వెధవ్వేషాలు నాదగ్గిర పనికిరావు. గూబలు సాగదీయించేసి, గుడ్లు పొడిపించేస్తాను జాగ్రత్త! ఫో! ఈ కాగితాలు పట్టుకుపోయి అక్కడేడు.

అని కాగితములు వానిముఖముపై విసరివేయఁగా లక్ష్మీకాంతము కన్నీరు తుడుచుకొనుచుఁ జిన్నవోయినముఖముతో మఱలఁ దన యథాస్థానమునకుఁ బోయి వ్రాత ప్రారంభించెను. అట్లు లక్ష్మీకాంతముపైఁ గోపగ్రస్తమైన యా ముఖముతోడనే బాబుగారు, "హెడ్ క్లార్కు! బ్రింగ్ పోస్టు దిస్ డే కమింగ్" అని పలుకుచు నేడువచ్చిన టపా తీసికొని రమ్మని యాజ్ఞాపించిరి. విశ్వనాథ మాఫీసుగదినుండియే చిత్తము చిత్తమని ప్రత్యుత్తరమిచ్చుచు నొక రిజిస్ట్రీయుత్తరమును దెచ్చి మేజాబల్లపై నుంచి కట్టెదుట నిలువఁబడెను. బాబుగా రాయుత్తరమును జదువుకొని, విశ్వనాథమును జూచి, "బ్యాంకులో మన సొమ్మింకా యేపాటుంటుంది?"

"చిత్తం—సెలవుప్రకారం నరసయ్యసెట్టికోసం మూడువేలు డ్రా చేశాను. శాస్తుల్లుగా రైదువందలు పుచ్చుకున్నారు. ఇంకా రెండువందలచిల్లర వుంటుంది."

"శాస్త్రీజీ! మీ చికాకు వదిలిపోయిందా?"

"చిత్తం చిత్తం, బాబుగారే నన్ను రక్షించారు."

అని వేంకటశాస్త్రి చేతులుమోడ్చి వచించుచుండ లక్ష్మీంపతి యాశ్చర్యసందేహములతో వానిముఖమును జూడసాగెను. ప్రాప్రయిటరు కొంచెమునే పాలోచించి శాస్త్రిని జూచి,

"శాస్త్రీజీ! శ్రీకాకుళమునుండి బట్టల-అన్నాజీ ప్లీడర్ నోటీసిప్పించాడు. వాడికి మనం పదివేలు బాకీ వున్నాంలెండి! మూడు రోజుల్లోగా పంపకపోతే దావా ఫయిల్ చేస్తాట్ట! మూడురోజు లక్కర్లేదు మూడునిమిషాల్లోనే వాడిసొమ్ము వాడికి పారేశానికి మేం

నిశ్చయించుకున్నాం. అందుచేత సొమ్మెలాగేనా జతపెట్టాలి. తుకారాం మనతాలూకు నలభయివేలూ యిచ్చేస్తే యిలాంటి చిక్కులుండకపోను. కాని, వాడెంతకీ యివ్వకుండా వున్నాడు.

లక్ష్మి:—చిత్తం. రిజిస్ట్రీనోటీ సిప్పిద్దాం—

బాబు:—మేం కూడా అలాగే అనుకొన్నాం కానీ, మళ్లా వొకసంగతాలోచించి వూరుకున్నాం. మీ అన్నగారికి మేం యివ్వవలసిన సొమ్ముకీ, మాకు తుకారాం యివ్వవలసిన సొమ్ముకీ సరిపోతుందికదా అని ఆ సొమ్ము అలా మీదు కట్టినట్టుంచేశాం.

లక్ష్మి:—మా అన్నగారి ఋణపత్రంగూర్చి యెంతమాత్రం తొందరలేదు. అది బాధించేఋణం కాదు. అందుచేత బాబుగారు తుకారాంసొమ్ము వసూలుచేసి—

బాబు:—(నవ్వుచు) లక్ష్మింపతిగారూ! మీ వుద్దేశం మేం గ్రహించాం — ఋణం బాధించినా, బాధించకపోయినా తీర్చేడం మాకు ధర్మం. — అన్నట్టు చూడండీ—దావాఖర్చులకోసం — అయిదువే లుంచుకున్నా నని మీరు మాతో మనివి చేసుకున్నారుకదూ! ఆ సొమ్ముంచారా, ఖర్చుపెట్టేశారా?

లక్ష్మి:— ఆ సొమ్మే ఖర్చుపెట్టేస్తే, ఇహ నేను ముష్టెత్తుకు బతకవలసిందే. వొకవందమాత్రం తక్కువగా ఆ సొమ్మంతా అలాగే వుంది. సెలవైతే—

బాబు:—సరే! తెప్పించండి! వోవంద తక్కువ తక్కువకాదు. విశ్వనాథం! లక్ష్మింపతిగారిపేర అయిదువేలకి ప్రోమిసరీనోటు రాసి మా సంతకానికి—పటా్రి!''

లక్ష్మి:—బాబుగారలా సెలవియ్యడం ధర్మంకాదు. నోటు నాలుగువేల తొమ్మిదివందలకీ రాయించడం నా కోరిక. తమ కాగ్రహం వస్తుందని నోటు పుచ్చుకుంటున్నాను కాని, నాకు నోటే

అక్ఖర్లేదూ. బాబుగారిదగ్గర వుంటే నా సొమ్ముకి మరీ జాగర్త.

బాబు:—శాస్త్రీజీ! ఏఁవి టాలోచిస్తున్నారు? మరో మైదు వేలకి మీా సలహా కావలసుంది.

వేంక:—అదే ఆలోచిస్తున్నాను. దివాణంలోకే రోజూ యాయవారానికి వస్తూవుంటాడు—పేరి సుబ్బయ్యా అని — అతణ్ణి బాబుగారు చూసేవుంటారు.

బాబు:— ఔను. చూశాం కాబోలు!

వేంక:—అతడిదగ్గిర మూడువేలున్నాయి. ఇంట్లో పెళ్లాంమీాదా, తల్లిమీాదా నమ్మకం లేక ఆసొమ్ము నోట్లకింద మార్చి బొడ్డు కొంగులో మూటకట్టుకునే తిరుగుతూవుంటాడు.

బాబు:—సరే కనుక్కోండి! ఎంతవడ్డీ కోరితే అంతవడ్డీ యిద్దాం—

వేంక:—చిత్తం. తప్పకుండా కనుక్కుంటాను. బాబుగారిపేరు చెప్తే ఎగిరి గెంతులేస్తూ యిస్తాడు. ఇది యిలా వుండగా మరో హాటి ఆలోచిస్తున్నాను.

బాబు:—అ దేఁవిటో చెప్పండి.

వేంక:—మనం కాసులు రేపే కొనవలసుంటుంది. ఎల్లుండేనా వాళ్ళ మొహాలమీాద పారేస్తేనే కాని—

బాబు:—ఔనౌను. మాకు తెలుసును. ధారావరహాల్ని మేం అడగమన్నట్టూ అడిగేరా? ఏఁ వన్నాడు?

వేంక:—వుత్తరం తెమ్మన్నాడు. నాచేతకూడా సంతకం పెట్టించుకుంటాట్ట!

బాబు:—సరే వుత్తరం రాసిస్తాం. మీారుకూడా సంతకం పెట్టండి!

22



# 19 వ ప్రకరణము

## లక్ష్మీకాంతుని యాలోచనము.

ఆనాటియుదయము లక్ష్మీకాంతమునకు మిక్కిలి సంతాపకర మైనది. ప్రొప్రియిటరు పలికిన పలుకులు ములుకులవలె వానిహృదయమును వేధింపసాగెను. తొలినాటి వార్నింగుపదముకంటెను నాటి కఠినోక్తులు వాని యుద్యోగానందమును డిందుపఱచినవి. క్షణములోఁ దా నొక మహామహునిగా వర్ణింపఁబడి, మఱల నొక్కక్షణమునందే యధమాధమునిగాఁ బరిగణింపఁబడినందుకు లక్ష్మీకాంతము తనలోఁ దానె నవ్వుకొనుచు ధనమదాంధులు కొలువులక్షణములను గ్రహింపఁ గలిగెను. లక్ష్మింపతి వేంకటశాస్త్రిల యద్భుతచర్యలను జూచి, తాను స్కూలుఫైనలుక్లాసులోఁ జదువుకొనిన నీతిచంద్రికలోని కరటక, దమనకులను జ్ఞప్తికిఁ దెచ్చుకొని, తద్గ్రంథకారుని లోకానుభవజ్ఞానమును దనలోఁ గొనియాడసాగెను. తా నాశ్రయించిన ప్రభువు–వాని దుర్మంత్రులు – వానిభాషాజ్ఞానము–వాని దుర్వ్యయాదిక, దుర్వర్తనములును మన కథానాయకున కుద్యోగమునందు విరాగమును కలిగించినవి. కాని, సంవత్సరములనుండియుఁ బ్రయత్నించుచుండ లభింపక లభించిన యుద్యోగ మని యెంచియు, దుర్భరమగు కుటుంబదారిద్ర్యమును దలంచియు నతఁ డా యవమానమును భరింపక తప్పినది కాదు.

వర్తకునకుఁ దాను బదిరూపాయి లిచ్చుచుండఁగాఁ జూచిన లక్ష్మింపతి యెవ్వఁడో లక్ష్మీకాంతమున కిప్పుడు తెలిసినది కాని, వర్షమునాటిరాత్రి వేంకటశాస్త్రితో నాతఁడు గావించిన ప్రసంగము విన్నంతనే యతఁ డొకమహాద్రోహి యని నిశ్చయించుకొని,

తనపోయిన పదిరూపాయలనుగూర్చియు వానితో మఱి మాటాడఁ దలఁచుకొనలేదు. మిఠాయిదుకాణములోఁ దాను వినుచుండఁగా లక్ష్మీపతి దూషించిన యిరువురి స్త్రీలలో నొకతె సుందరమ్మ యనియు, రెండవది యామెతల్లి యనియుఁగూడ నాతఁడు తెలిసికొనఁ గలిగెను. సుందరీకర పరిష్వంగమునం దుండినప్పుడు భ్రమరము చేతిలోఁ దాను జూచిన కాగితముపొట్లములోనివి ద్రాక్షపండ్లనియు, రెండవచేతి పిడికిటిలోనివి పదిరూపాయిలనియు బండిలోఁ గూర్చుం డినవఱకు లక్ష్మీకాంత మెఱుఁగఁడు. అయ్యవి భ్రమరముచేఁ బద్య ములు చదివించి సుందరమ్మ మెచ్చి యిచ్చిన బహుమానములని తెలిసినంతనే లక్ష్మీకాంతమునకుఁ గలిగిన యానంద మింతింతకాదు.

భోజనానంతరమున వసంతునిచావడిలో రాత్రిపఁద్రెండుగంట లవఱకు స్వరాజ్య భ్రమరములు వసంత లక్ష్మీకాంతములకు సుందరీ జన్మదినోత్సవ విశేషములన్నియు వరుసగఁ బూసగ్రుచ్చినట్లు వారు చ్చిరి, ఆద్యంతము నా వివరములన్నియు విని, నాటి యోషామణు లలో భ్రమరము శిరోభూషణమైనదని చూడని లక్ష్మీకాంత వసంత రావులుఁగూడఁ జూచినట్లే గ్రహించి, యానందపారవశ్యమును జెం దిరి. లక్ష్మీకాంతము తన జన్మము తరించినట్లే సంతసించెను. పట్టణ మున నాంధ్రమహిళాగ్రంథాలయమును బెట్టించి యత్యున్నతకీర్తి వహించి, ధనవంతులయు, నున్నతోద్యోగులయు నిల్లాండ్రచేఁ గొని యాడఁబడుచుండిన యున్నతవంశసంజాతయు, నిమితైశ్వర్యసము పేతయు నైన సుందరమ్మకు దీనావస్థయందుండియుఁ బ్రాణస్నేహితు రాలు కాఁగలిగిన తన చెల్లెలియదృష్టమును నతఁడు మెచ్చుకొని యెను. మందహాసముతో మొగమువంచుకొని భ్రమర మప్పుడప్పుడు మొగమెత్తి వీక్షించుచుండఁ స్వరాజ్య మామె పద్యములుచదువు టయు, నయ్యవి హృదయంగమములై యచ్చటి యంగనామణుల

నెల్ల రంజింపఁజేయుటయు, నక్కాంతామణు లొక్కరొక్కరె పల్కిన మెచ్చుమాటలును జెప్పుచుండ, నమేయానందాస్పదంబైన వసంతుని వదనంబును భ్రమరమువంకఁ జూచెడు నాతని చూపుల యందలి తీరును జూచితీరవలసినవి. సుందరీ పరిహాస వచనరచనా విశేషములఁగూడ వచించుచు, "అన్నయ్యా! సుందరమ్మగారు నువ్వ యయాతి వన్నారు. భ్రమరం దేవయాని నట." అని చెప్పి స్వారాజ్యము పకపక నవ్వుచు నా మువ్వురిమోములు తిలకించుచుండ, నా మాటకు భ్రమర మవనతముఖియైనది. లక్ష్మీకాంతముముఖ మంతవఱకు లేని నవీనభావస్ఫూర్తి వహించినది. వసంతుని ముఖము రెప్పవేయని కన్నులతో ననిమేషత్వము నొందినది.

ఆ చావడివెనుకఁ జీడీయందుఁ బండుకొనిన కామేశ్వరమ్మ, వారి నవ్వులచేతను, మాటలచేతను నిద్రపట్టక, "పడుకోండ్రా! పడుకోండ్రా! చాలా రాత్రయిుంది. భ్రమరం! నువ్వు నాదగ్గిరికి వెళిపోరా! నిద్రలేకపోతే నీవొళ్ళు చెడిపోతుంది." అని నడుమ నడుమ మందలించుచువచ్చెను గాని, వసంతునిసమక్షమున భ్రమరమును గదల నీయలేదు. సుందరీభవనవిశేషములతోఁ గొంతవఱకుఁ బ్రొద్దుపుచ్చి యా ప్రసంగము మాగిసినంతనే వసంతలక్ష్మీకాంతములు లక్షింపతి వేంకటశాస్త్రిల ప్రసంగమునుగూర్చి ప్రసంగింపనారంభించిరి. ఆ ప్రసంగములో లక్షింపతికిఁ బుట్టిన దుర్బుద్ధియు, వేంకటశాస్త్రి కుతంత్రపరాయణతయుఁ దలంచి వారివలన సుందరి కెట్టిమోసము కలుగునో యని విచారింపసాగిరి. వీలు నపహరించుటయందుఁగాని, యది సాగనియెడల వ్యాజ్యముచేయుటయందుగాని లక్షింపతికిఁ దోడు పడుటకై వేంకటశాస్త్రి దుర్మంత్రమున ప్రోత్సాహించుట కెంతటిసాహసమునకైన సిద్ధపడకమానఁ డని వారు నిశ్చయించుకొనిరి. ఆ సంభాషణమున వివరములన్నియు విని సుందరమ్మకు రాఁబోవు నాపదఁ

దలంచి యామెకుఁ దోడ్పడుట మనకుఁ గర్తవ్యమని స్వరాజ్య భ్రమరములు తమ యన్నలను హెచ్చరించిరి. తనపక్షమున నిలిచి పనిచేయుట కొకమగపురుషుడైన లేని యసహాయస్థితిలో నున్న సుందరమ్మకు రానున్నకష్టము నెఱిఁగియు మనము తోడుపడక యుపేక్షించుట యుత్తమపురుషలక్షణము గాదని లక్ష్మీకాంతము వసంతము ముఖము చూచుచుఁ బలికెను. ప్రొప్రయిటరు తాళముకొఱకుఁ గబురుపంపినయెడల నెంతమాత్రము నీయవలదని నే నుదయముననే సుందరమ్మగారితోఁ జెప్పి వచ్చెద నని భ్రమరము వచించెను. వారి మాటలన్నియు విని వసంతరావు లక్ష్మీకాంతమును జూచి, "కాంతం! సుందరమ్మయోగ్యత, సౌజన్యం మన కొక్షణంలోనే బోధపడ్డాయి! అంత ఐశ్వర్యం వున్నందుకు గర్వం అన్నది ఆవిడ మొహాన్ని లేనేలేదు. నిజంగా ఆవిడకి సాయంచెయ్యడంలో నాకున్న వుత్సాహం ఇంతా అంతా అని నేను చెప్పలేను. ఏది యెలాగైనా సరే తాళంమాత్రం యివ్వవద్దని మనం ముందుగానే భ్రమరంచేత కబురుపెట్టడం అవశ్యకర్తవ్యం! దొరక్క దొరక్క దొరికిన వుద్యోగానికి ప్రమాదం వస్తుందేమో అన్నభయం నాకుకూడా వుంది కాని నిన్నరాత్రి మనం అక్కడికి వెళ్లడంవల్ల యేలాగా ప్రమాదస్థితిలోనే పడ్డాం! వాళ్ళ సంభాషణ మనం విన్నామన్న అనుమానం లక్షింపతికి బాగావుంది. సుందరమ్మ తనంత తానే తాళం యివ్వకపోయినా మనం కబురంపించామనే లక్షింపతి అనుమానిస్తాడు. ఆవిడ తాళం యిచ్చిందా సరి! యివ్వకపోతే నీ వుద్యోగం సున్న. అందుచేత యెలాగా చిక్కులోనే పడ్డాం కాబట్టి, సంశయం యెందుకు? తాళం యివ్వవద్దని భ్రమరాన్ని పంపించి చెప్పించు."

అని విషయములన్నియుఁ జక్కఁగా సమన్వయించి చెప్పెను. ఆ మాటలపై సుందరమ్మకుఁ దోడుపడుటయందు లక్ష్మీకాంతమున

మహోత్సాహము మఱింతయధికమైనది. వారి నిశ్చయమునకు జయసూచకముగాఁ గోటలో మ్రోగుచుండిన పండ్రెండుగంటల నగారా వినవచ్చుచుండుటచేఁ జాలరాత్రి యైనదని వారు వెంటనే శయనించుటకు లేచిరి. చీకటి దట్టముగానుండుటచేతను, జిన్నతుప్పర కురియుచుండుటచేతను, స్వారాజ్యము భ్రమరమును దనయొద్దనే పరుండఁ బెట్టుకొన, లక్ష్మీకాంతముమాత్రము తన యింటికి వచ్చి యొక యరుగుపై సోమరాజు నిద్రించుచుండ రెండవయరుగుపై నొకచాప వేసికొని మెల్లఁగా మేనువ్రాల్చెను. ఆ వీధియంతయు నపు డంధకారమయమై నిశ్శబ్దముగానుండెను. హృదయమునఁ బుట్టినయాందోళనము వానికి లేశమును నిద్రపట్టనీయలేదు. అందుకుఁ దోడుగ రెండవయరుగుపైఁ బరుండిన సోమరాజుకంఠమునుండి శునక, శృగాల, మార్జాలాది వివిధధ్వనులతో వెడలుచుండిన గుఱ్ఱు వానికి మఱింత నిద్రాభంగము గావింపసాగినది. పథ్యమని పట్టెడు ద్రాక్షపండ్లును, బట్టలకని పదిరూపాయిలు నిచ్చి తన చెల్లెలి నంత గౌరవించి యాదరించిన సుందరమ్మ సుందరాకృతి వాని మనోదృష్టి కింకను గానవచ్చుచునే యుండెను. ఆమెయెడఁ దాను కృతజ్ఞుఁడు కావలయునని తలంచుకొనునప్పుడెల్ల నుద్యోగభంగవిషయము స్ఫురించి వాని చిత్తము నూరక కలఁతపెట్టుచుండెను. నిద్రలేక యటు నిటు నొత్తిగిలుచు లేచుచుఁ గూర్చుండుచు, నావులించుచు, మెటికలు విఱుచుచు, నిట్టూర్పులు విడుచుచుఁ గడ కతఁడు లేచి కూర్చుండి తనలో నిట్లు వితర్కింపసాగెను.

"వందలూ, వేలూ వరకట్నాలు పొయ్యవలసిన యీ పాడు రోజుల్లో—యీ దరిద్రసంసారంలో— భ్రమరానికి వివాహంకావడం స్వప్నంలోని వార్త! అది సోమరాజుని పెళ్లాడలేదనీ— పెళ్లాడేటట్టు నేను బోధపర్చలేదనీ మా అమ్మకీ అన్నయ్యకీ నా మీద కోపం!

ఒక వేళ నేను బోధపర్చినా— నేనే కాదు— బ్రహ్మదేవుఁడు బోధప ర్చినా అది సోమరాజుని పెళ్లాడదు. నేనుకూడా వాళ్ళతో యేకీభ వించి బలవంతంగా దాన్ని సోమరాజుకి ముడిపెట్టేస్తే—''

అని యనుకొనుసరికి— ''మాప్రశస్తంగా వుంటుంది. విజయ నగరం పకోడీ!'' అను సోమరాజు పలవరింతలు వానిచెవిలోఁ బడి నవి. లక్ష్మీకాంతము మఱలఁ జింతాసమాధియందు మునిఁగి—

''నూతిలో పడి బ్రతికినపిల్ల అని ఆ సుందరమ్మకు భ్రమరం మీాద కలిగిన జాలీ, దయా ఇంతా అంతా కాదు. ఆమెచేసిన పరి హాసాలన్నీ భ్రమరం విమాహంగురించే నట! భ్రమరం దేవయా నిట! వసంతం యాయా తిట! ఈ మాట స్వరాజ్యం చెప్పినప్పుడు వసం తుని మొహంలో నాకొక్రొత్తవికాసం కనిపించింది. ఆవికాసంలోవున్న అంతరార్థం యెలా తెలుస్తుంది? సరే కదిపి చూస్తాను. తల్లీ తండ్రీ వొప్పుకోవాలి కాని, వసంతాన్ని యెలాగేనా వొప్పించవచ్చు. శాఖాంతరవివాహం తప్పులేదని సుందరమ్మ అన్నా దట! ఇంత చిన్నతనంలో ఇంత యుదారహృదయం సాధారణంగా స్త్రీజాతిలో అరుదు—సద్గుణం! చక్కదనం! వివేకం! విద్యా! ఇన్నింటికీ తోడు గొప్పయైశ్వర్యం! ఓహో! అదీ జన్మ! ఒక్కలోపమేనా కల్పించక పోతే తన ప్రయోజకత్వానికి భంగంవస్తుందని కాబోలు పాపం— బ్రహ్మ— ఆమెను.........ఈ వుద్యోగం వున్నాసరే, పోయినా సరే! నే నామెసేవ చెయ్యకతప్పను. భ్రమరాన్ని ఆమెపాదాలమీాద పడేసి, యీామెభారం నీదే అని ప్రార్థిస్తాను. ఆ యుదారహృదయ నన్ను తప్పకుండా అనుగ్రహిస్తుంది! భ్రమరంతాలూకు భారం నాకు తప్పిపోతే నాజన్మ తరించిందన్నమాటే! ఏది యెలాగైనా మరి నాకు విచారంవుండదు. భ్రమరాని కీవిధంగా వివాహం కావాలి కాని, మరోవిధంగా జరగడానికి నక్షత్రమండలం ఈ మధ్యలో యెక్కడా

అవకాశంలేదు. కానీ, చిరకాలంనుండీ మా కుటుంబాన్ని ఆశ్రయించుకొనివున్న పెద్దమ్మ సుందరమ్మ కనుగ్రహం పుట్టనిస్తుందా అని నా సందేహం! అబ్బబ్బా! ఈ దుస్థితిలో ఈ యాలోచనతో నా తల పగిలిపోతున్నాది! సోమరాజుని ఇష్టపడమని భ్రమరాన్ని బ్రతిమాలీదా? భ్రమరాన్ని వివాహంచేసుకొమ్మని వసంతాన్ని హెచ్చరించీదా? భ్రమరంభారం నీదే అని సుందరమ్మని వేడుకొనీదా? భగవంతుడా! నాకేది దారని భగవంతున్ని ప్రార్థించీదా? ఏది చేసినా, ఎవరిని ప్రార్థించినా లాభంలేదు. ఆ పెద్దమ్మ కనుగ్రహం పుడితే యెవరికేనా అనుగ్రహం పుడుతుంది. అందుచేత పెద్దమ్మనే మొదట ప్రార్థిస్తాను.

చ॥ పిలిచిన పల్కుచుందు విలువేలుపవై బహుకాలమయ్యె; మ
మ్ములవిడుమమ్మ! నీ వడుగుమోపఁగఁ జోటిక ముజ్జగంబులన్
గలుగదటమ్మ! పాల్కడలిగాంచిన ముద్దుల పెద్దబిడ్డ! యో
కలుములగొంగ! యో యినుపగజ్జెలతల్లి! నమస్కరించెదన్॥

అని యి శ్లోకపద్య మల్లుకొని లక్ష్మీకాంతము తనలోఁ జదువుకొనుచుండ—"నా పదిరూపాయిలూ పారేస్తే నాఖర్మాన్ని నేను పోతాను." అను సోమరాజు పలవరింతమాటలు వాని చెవిలోఁ బడినవి. ఆ మాటలతోడనే కోటలోఁ గొట్టిన మూఁడుగంటలును విని యతఁడు మేను వాల్చెను. అతని ప్రార్థనము విని జ్యేష్ఠాదేవి నిన్ను విడువఁజాలనని వానిం గౌఁగిలించుకొనినదో యన లక్ష్మీకాంతమునకు వెంటనే నిద్రపట్టినది.

మఱునాఁడుదయమున నతఁడు రాత్రి నిద్దురచాలనికన్నులతో లేచి, కాల్యములు నిర్వర్తించుకొని, వసంతునితో శ్రీనివాస విలాసమున కేగి యచ్చటినుండి దివాణమునఁ జేరుకొనెను. నాటియుదయమున దివాణములో బాబుగారును, వాని మంత్రులును దన్ను

మిక్కిలి బహూకరించినప్పుడు– తాను రాత్రి గావించిన స్తోత్రమును మన్నించి పెద్దమ్మ యింతతోఁ దన్ను విడిచిపోవునేమో యని లక్ష్మీకాంతము భ్రాంతిపడెను గాని, వెంటనే పొందిన పరిభవతిరస్కారముచే నా భ్రాంతియు వానికి వెంటనే తొలఁగిపోయినది.



## 20 వ ప్రకరణము

### ఖదరు ప్రక్రియము.

విజయదశమి వెళ్లువఱకు నుండిపోవలసిన దని కామేశ్వరమ్మయు, వసంత స్వరాజ్యములు నెంత బ్రతిమాలినను రామశాస్త్రి వినలేదు. పండుగ కుండకపోయినను మఱి యొకటి రెండునాళ్లయిన నుండవలసిన దనికూడ వారు వేడుకొనిరి. తనకు సొంతపను లున్నవని చెప్పి యామఱునాఁడే యుదయ మేడుగంటలబస్సులో నతఁడు స్వగ్రామమగు రెల్లివలస బయలుదేరెను. ఆ నాఁడే యుదయము పదిగంటల బొబ్బిలిబండిలో వచ్చిన రామావధానిరాక యా కుటుంబమువారికి నూతనోత్సాహము కలిగించినది. మూఁడుమాసముల నుండి చూడని తండ్రిని జూచి యాతని కొడుకును, కూఁతురును జిన్నపిల్లలవలెనే యుప్పొంగిరి. పితృప్రేమకు వయసుతో సంబంధము లేదు. గుమ్మము దాటు రామావధాని చావడిలోఁ గాలుపెట్టిన వెంటనే చెప్పిన శుభవార్త యా కుటుంబమువారి సంతోషమునకు మఱింత కారణమైనది. మొంటాడగ్రామ పురోహితుఁడైన శాంభుక్త

గారి రెండవకుమార్తె సోదెమ్మ యనుపదేండ్ల బాలికను వసంతరావు నకు నిశ్చయించి యతఁడు పెండ్లిసంబంధము కుదిర్చెనఁట! వరు నకు వేయియు నూటపదారులు కట్నమఁట! కాంభుక్త వివాహ కాలమున సోదెమ్మను బదునైదుతులముల బంగారముతోఁ గూడ గన్యాదాన మిచ్చునఁట! ఆ బంగారము కొని యిష్టమువచ్చిన నగ లు మీరే చేయింపుఁ డని సొమ్ము తన కిచ్చివేసెనఁట!

రామావధాని చెప్పిన యీ శుభవార్తకుఁ గామేశ్వరమ్మ యానందము పట్టలేక, వంటయింటిలోనుండి వెలుపలికి వచ్చి యిరు గు పొరుగుల దానెఱిఁగిన యమ్మలక్కల కా శుభవార్త చెప్పి ప్రత్యేకముగా దేశిరాజువారి యింటికిఁ బోయి సూరమ్మకు నామె కోడలు వీరమ్మకు నెఱిఁగించి మడిచెడినందున మఱల స్నానముచేసి వంటయింటిలోఁ బ్రవేశించెను. వసంతమునకుమాత్ర మా శుభ వార్త తలక్రిందై తండ్రివచ్చిన యానందమునకు భంగముకలిగించి నది. భోజనము చేయుచున్నంతసేపు చెన్నపట్టణవిశేషములు నచ్చట నాతని విద్యావిశేషములు, మార్కులు, పరీక్షలు, మొద లుగఁ దండ్రి త న్నడుగుచువచ్చిన ప్రశ్నలకన్నింటికి నతఁడు ముకు ళితముఖముతో ప్రత్యుత్తరములిచ్చుచు వచ్చెను. ఆ నాటిభోజన మతనికి జ్వరము విడిచిన రోగిపథ్య మైనది. ఆతని భోజనమునందలి వ్యత్యాసము నానందాతిశయమున మైమఱచి వడ్డించుచుండిన కామే శ్వరమ్మ కనిపెట్టలేదు. "కోడలి కేన్నగలు చేయించమన్నా వోయ్?" అని పురుషవాచకముతో సంబోధించుచు రామావధాని భార్య నడుగ, వసంతుని వెండికంచములోఁ జారువడ్డించుచున్న కామేశ్వరమ్మ, "మా చిన్నతనంలో మేం రాగిడీలు, జుఁవకాలు, సూర్యుడు, చంద్రుడు, బాజాబందులూ—యిలాంటివి పెట్టుకునే వాళ్ళం! ఇప్పటి పద్ధతులూ, ఈ కాలం అంతా వేరూ—నా యిష్టం,

నా ముచ్చటా జరుగుతుందా యేఁ వేసేనా? బాబు నడగండి! వాడి కేఁ విష్టఁవైతే అవి చేయించండి'' అని ప్రత్యుత్తరమిచ్చెను. వసంతరావది విని ''సంబంధం కుదరడంలో నాన్నగారియిష్టం జరిగినప్పుడు, నగలు చేయించడంలో నీ యిష్టంమాత్రం యెందుకు జరక్కూడదు? పెళ్ళికూతురుపేరు సోదెమ్మ కాబట్టి రాగిడీలూ, జుఁవకాలే బాగుంటాయి.'' అని తల్లినుద్దేశించి పలికెను. అది వ్యధికరణ ప్రత్యుత్తర మని రామావధాని గ్రహించి, నాలు గైదుకబళము లారగించువఱకు నూరకుండి, ''వసంతం! నువ్వు చెన్నపట్టం వెళ్లేలోపుగా వోమారు మెంటాడ వెళ్ళి పిల్లని చూసుకో. ఇవాళో రేపో నిన్ను తీసుకెళ్లడానికి నీ మాఁవగా రొస్తాడు.'' అని చెప్పెను. ''మీరంతా నిశ్చయంచేసుకొని వచ్చింతరవాత యిహ నే చూస్తేనేం? చూడకపోతే నేం? సొమ్ముకూడా పుచ్చేసుకొని నే నొద్దంటే మానేస్తారా?'' అని వసంతము పలుక, రామావధాని మాటాడక యూరకుండెను. స్వారాజ్యము నవ్వుచుఁ దండ్రికీ మజ్జిగ వడ్డించుచున్న తల్లినుద్దేశించి, ''అమ్మా! అన్నయ్య కీ సంబంధం యిష్టంలేదే! నువ్వు సురసుర పరుగెత్తి యిరుగూ పొరుగూ చెప్పొచ్చేవు కానీ'' అని పలుకఁ గామేశ్వరమ్మ యా మాటలకు మొగము ముణుచుకొని, యేఁవో వా డిష్టం, మీ నాన్న యష్టం! నా కెందుకు? ఈ కాలం అంతావాళ్లిష్టే! మన పిల్లడు మనకి మంచివాడూ—వొహాళ్ల పిల్లడు మనకి చెడ్డవాడూ—అల్లుడుతో యింత సుఖపడిపోతున్నాంకదా? ఇహ కొడుకుతో యేం రాతుందో'' అని భర్త నుద్దేశించి, ''ఆ యిష్టం ఆ యిష్టం లేకపోవడం—అ దేదో కనుక్కొని మరీ దిగండి వ్యవహారంలో. అల్లుడు కాబట్టనేశాం—కొడుకు నేఁ వనుకోగలం?'' అని సణుగుకొనసాగెను.

# లచక్రము

భోజనానంతరమున రామావధాని చావడిలోనికి వచ్చి బేసి వని తేన్చుచు నిటు నటు పచారుసేయుచుండెను. భోజనమైనవెంటనే యట్లు పచారుసేయుట వాని యభ్యాసము. "వసంతం! రాజ్యాన్ని తమలపాకులు తెమ్మని నువ్విలా రా!" అని పచారు చేయుచున్న యవధాని గదిలోనున్న కొడుకును బిలచి చెప్పెను. పట్టుపంచ విప్పి నూలుబట్ట కట్టుకొనుచున్న వసంతరావు తన వివాహమునుగూర్చియే తండ్రి తనతో, బ్రసంగించునని నిశ్చయించుకొని, యాతనికిఁ జెప్పవలసిన సమాధానముల నాలోచించుకొనుచుండెను. జ్ఞానము వచ్చినదిమొదలు వసంతము తండ్రికెన్నఁడు నెదురాడినవాఁడు గాఁడు. తన కొడుకు విద్యా వినయ వివేకగుణ సంపన్నుఁడని రామావధానియు నెఱుగక పోలేదు. లోకమువారల కొడుకులలోఁ దనకొడుకుం జూచి, యతఁడు తనలో నిత్యము గర్వించుచుండును. వానియందున్న గౌరవముచేఁ గుటుంబ యాజమాన్యమంతయు నతఁడు వసంతమునకే విడిచిపెట్టెను. తండ్రి పిలిచినంతనే యతనికేమని ప్రత్యుత్తరము చెప్పవలసివచ్చునో యని భయపడుచుఁ, దెల్లనిబట్టయుఁ జొక్కాయు ధరించి భుజముపై నొకతువ్వాలు పడవేసికొని, తన వెనుకనే స్వరాజ్యము తన చెవిలో నేమో గుసగుసలాడుచుండ, వసంతరావు చావడిలోనికి వచ్చి, యచ్చట నున్న యొక కఱ్ఱకుర్చీపైఁ గూర్చుండెను. స్వరాజ్యము పచారుసేయుచున్న తండ్రికిఁ దాంబూల మిచ్చి వసంతుని వెనుకనే గోడకుఁ జేరఁబడి నిలువఁబడెను. రామావధాని కూఁతు రిచ్చినతాంబూలము వేసికొనుచు, "వసంతం! అయితే, రాజ్యం మాఁవగారు చివరకేఁవంటాడు? తనకొడుకు కార్యం చేసుకుంటాఁ డంటాఁడా? చేసుకోఁ డంటాఁడా? నువ్వు మొహమాటం పడకుండా గట్టిగా అడిగేవా?"

"అడగవలసినవన్నీ అడిగేశాను. కాని యతనివల్ల యేమీ లోపంలేదు. కొడుకును వొప్పించడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు."

అని తనకును రామశాస్త్రికిని జరిగిన ప్రసంగవిశేషములన్నియుఁ దండ్రి కెఱింగించెను. రామావధాని యన్నియు విని, కొంచెముసేపు మౌనముదాల్చి, తల పంకించుచు, వసంతరావు నుద్దేశించి

"అయితే యీవిషయములో నీ వుద్దేశం యెలావుంది? మనం చెయ్యవలసిం దేమేనా వుందా?"

వుంది కాని, మీరు పూర్వకాలపు మనుష్యులు. అందుచేత నా వుద్దేశం మీకు సరిపోదు."

"అయినా చెప్పందూ!"

"ఘటాశ్రాద్ధం పెట్టేసి చెల్లెమ్మకి మళ్లా పెళ్లిచేసీడమే నా వుద్దేశం"

ఆ మాటకు రామావధాని నిశ్చేష్టితుఁ డయ్యెను. నిలువఁబడియుండిన స్వారాజ్యము తటాలున నేలఁ జతికిలఁబడి కన్నీరుదుడుచుకొనుచుండఁగా, రామావధాని నిట్టూర్పు విడచి,

"అబ్బాయీ! ఇంత కర్ణకఠోరంగా నువ్వు మాటాడతావని తెలిస్తే నిన్నడక్కపోదును."

"అందుకే నేనుకూడా చెప్పనన్నాను. ఇది తప్ప రాజ్యం తన జీవితంలో సుఖపడ్డానికి మరోసాధనం వుంటే మీరే చెప్పండి! ఇష్టం వుంటే మీ పంక్తినే అన్నంపెట్టొచ్చు. లేదా వాకట్లో పడీవచ్చు. అంతేకాని, పెళ్ళిచెయ్యకుండా ఆడపిల్లనెంతకాలం యీలా యేడుస్తూ కూచోమంటారు? ఇదంతా బాల్యవివాహంవల్ల వచ్చిన అనర్థం—"

ఇంతలోఁ గామేశ్వరమ్మ వచ్చి—

"ఇది విన్నారా? ఇలా చూడండి! బాబు చెన్నపట్టం వెళ్లేటప్పుడు రాజ్యంకూడా వెళుతుందట. వెళ్ళనియ్యండి. ఏఁవో దీన్ని చూడగానే వాడిబుద్ధి మారకూడదు? వాడు మరి వచ్చేదీ, చూసేదీ లేనే లేదు. ఇదేనా వెళితే యిద్దరూ వోమారు చూసుకుంటారు. నాలుగేళ్లాయి చూడక పిల్లకళ్లు కాయలు కా సున్నాయి. వోమారు పంపించండి తప్పులేదు. మాటా మంతి లేక అల్లుడు మొద్దులా కూరకుంటే బాబు వెంటనే తీసుకొచ్చేస్తాడు."

అని పలుక వసంతరావు మొగము చిట్లించుకొనుచు,

"ఏఁవి టమ్మా? చెన్నపట్టం అంటే యేఁవి టనుకున్నావు? ఎక్కడుంటాడని తీసుకెళ్ళ మన్నావు దీన్ని? ఇది వెళతా నండం బాగానే వుంది. నువ్వు వెళ్ళనియడం బాగానే వుంది. ఇహ దీన్ని వెంటపెట్టుకొని వెళ్ళి నా చెల్లెల్నేలుకుంటావా, యేలుకోవా అని అక్కడ నలుగుర్లోనూ తగువుపెట్టమన్నావా యేఁవిటి? తోచకపోతే సరి—"

"నా మీ దెందుకు కేకలేస్తావురా? అది చెప్పమని నా ప్రాణాలు తీస్తూంటే చెప్పేను. ఆ మీద మీ ఖర్మం— దాని ఖర్మం— నా కెందుకు?"

ఈమాటలు వినుచుండిన రామావధాని పచారుమాని నోట మాటలేక సట్టనడుమ నట్టులే నిలిచి, వీధివంకఁ దేరిపారఁ జూచుచు నాలోచనమున మునిఁగియుండెను. దీనమైన మొగముతో స్వారాజ్యము— మాఱుమొగముతో వసంతరావు — కొడుకుమాటలవలన కోపమున ధుమధుమలాడు మొగముతోఁ గామేశ్వరమ్మయు, మౌనములు దాల్చియుండ, రెండు మూఁడునిముసములవఱకు నిశ్శబ్దమై యుండిన యీ చావడి, క్రొత్తగాఁ బ్రవేశించిన యిరువురువ్యక్తుల

వలన నూతన సంచలనము వహించినది. ఆ ప్రవేశించిన వ్యక్తులు మన లక్ష్మీకాంత, భ్రమరములు. రామావధాని లక్ష్మీకాంతుని జూచినంతనే వికసించిన ముఖముతో, "ఏఁవోయి బాబూ! అంతా క్షేమఁవేనా?" అని కుశలప్రశ్న యడిగి, యాతని ప్రత్యుత్తరము నపేక్షింపకయే, యాతురతతో, "ఇలా దామ్మా! ఇలా దా!" అని స్వారాజ్యము వంకకుఁ బోవుచున్న భ్రమరమును జేయిచాచి యడ్డగించి, యామె తనచేరువనే యవనతముఖియై నిలువఁ జేతితో నామె వీపుపైఁ దట్టుచు,

"ఏఁవిటమ్మా! అంత ఘోరంచేశీశావుట? ఇంతమందిం వుండగా దిక్కుమాలిందానిలాగ నీ కీ బుద్ధెలా పుట్టిందమ్మా! వెఱ్ఱి తల్లీ! భగవంతు డనుగ్రహించాడు కానీ, వ్యతిరేకఁవే జరిగుంటే బతికున్నంతకాలం నిన్ను తల్చుకుని మేఁవంతా యేడుస్తూ వుండవలసిందేకదా? చచ్చి స్వర్గాన్నున్న నాన్నగారు రామావధాని బ్రతికుండగా నా కుటుంబంలో యిలాంటిదుర్మరణం జరిగిందా అని నన్నెంతేనా దూషించివుందురు?"

అని జాలిచే వొడమిన కన్నీరు భుజముపైనున్న యంగవస్త్రముతోఁ దుడుచుకొనుచు, వసంతుఁడు కూర్చుండినకుర్చీ నానుకొని యాతనివెనుక నిలిచియుండిన లక్ష్మీకాంతమును జూచి,

"కాంతం! వసంతం రాశాడు భోగట్టాలన్నీ—ఆ వుత్తరం వచ్చిన్నాడు చేతిలోవున్న మేరంగివారి జాతకం అలా పారేసి— ప్రాణాలన్నీ భ్రమరంమీద పెట్టుకొని కంట నీరు పెట్టుకుంటూ మతిపోయి కూచున్నాను. అయినా యీదిక్కుమాలినసంబంధం యెవరు కుదిర్చారోయ్? ఆ సోమరాజుగాడిపేరు చెప్తే పిల్లలు దక్కరు— ఆయుర్దాయం వుండబట్టి భ్రమరం యెలాగో బ్రతికింది కాని— వాడో దరిద్రగొట్టు జాతకుడు. వాడికి పిల్ల నిద్దాఁవని మీ చిన్నతనంలో—

మీ నాన్నగారు, అమ్మగారూ అనుకొనేసరికి— ఆ పిల్ల— అనఁగా భ్రమరం— అనుకున్నారు. బ్రతికుంటే యిప్పటికి పదిహేనేళ్ళది— యిట్టే చచ్చూరుకుంది.''

''అమ్మా, అన్నయ్యా పట్టుపట్టి యీ సంబంధం నిశ్చయించారు. మా అత్తయ్య వుభయఖర్చులూ భరిస్తుందని యాశపడి— భ్రమరంపెళ్ళికి మా వున్నస్థితిలో మరోగత్యంతరం లేక—''

అని లక్ష్మీకాంతము సగము చెప్పుచుండఁగనే రామావధాని చికాకుతో ''ఔనయ్యా! అన్నీ నిజఁవే! ఇదీ మా వుద్దేశఁ వని నా కోసం కార్డేనా రాశి పడేయాలా? నాన్నగారు చనిపోయినా, నేను బ్రతికున్నానే? నేను లేకుండానే భ్రమరానికి పెళ్ళిచేసేదాఁ వనా అమ్మకీ అన్నయ్యకీ వుద్దేశం?''

అని మఱల భ్రమరమును జూచి,

''భ్రమరం! అంతా యేకఁవై నిన్నా సోమరాజుకి ముడిపెట్టేస్తారని తెలిసినప్పుడు నువ్వెందుకు రాశావు కావమ్మా నాకూ? పోనీ వెంటనే బండీ చేసుకొని కోటిపల్లి వెళిపో రాలేకపోయావా?''

అని తా నడుగుచున్న ప్రశ్నలకు వెక్కి—వెక్కి— యేడ్చుచుండిన భ్రమరము నోదార్చుచు రామావధాని,

''ఎందు కమ్మా అలా గేడుస్తావు? తప్పు తప్పే మ రేడవకు! అంతా అయిపోయిం తరువాత— యిహ నీ కొచ్చినభయఁ వేఁవిటి? నాన్నగారిని తీసుకురమ్మంటే తీసుకురాలేనుకాని మరోలోపం నీకు రానియ్యను.''

ఆ మాటకు లక్ష్మీకాంతము వానిం జూచి,

''అవసానకాలంలో నాన్నగారు భ్రమరాన్ని మీ కప్పగించి మీతో అన్న మాటలు మీకు జ్ఞాపకంవుంటే నిజంగా భ్రమరానికే లోపం వుండదు.''

"జ్ఞాపకం వుంటే— అంటున్నావు! కాంతం! నేనంత కృతఘ్ను ణ్ణనుకున్నావా? నాన్నగారు కంట నీరుపెట్టుకుంటూ భ్రమరం చెయ్యి నా చేతిలో వుంచి, 'మగపిల్లలు ప్రాజ్ఞులయ్యారు. నా కా విచారం లేదు. ఈ యాడపిల్లనిమాత్రం మీ కప్పగించేశా' నని మూడేళ్ళ క్రింద అన్న మాటలు నిన్న నన్నట్లే నా మనుస్సులో నాటు న్నాయి."

"మూడేళ్ళక్రిందట నాన్నగారే అప్పగించినప్పుడు మాళ్లా మేం అప్పగించవలసిన అవసరం లేదు. నాన్నగారి అప్పగింత క్రియా రూపంలో పెట్టించండి! ఇదీ నా ప్రార్థన' '

"కాంతం! పనితొందర్లలో మూడుమాసాలనుండి విజయ నగరం రాకపోవడంవల్ల భ్రమరాన్నిగూర్చి నేను తీవ్రంగా ఆలోచిం చడాని కవకాశం కలగలేదు. ఈమధ్య మెంటాడలో వసంతానికో సంబంధం నిశ్చయించాను. ఆ గ్రామములోనే రెండు మూడు నియోగి కుటుంబాలుకూడా వున్నాయి. అల్లుణ్ణి తీసుకు వెళ్లడానికి మా వియ్యంకుఁడు రెండు మూడురోజుల్లో వస్తాడు. అతనితో మాటాడి అక్కడే మంచిసంబంధం వొహటి భ్రమరానికి రైటు చేయిస్తాను."

"చిరకాలంనుండీ మీకూ మాకూ వున్న అనుబంధంచేత వెలనాట్లయినా మాకు నియోగులక్రిందే లెక్క! అందుచేత భ్రమ రానికి వెలనాటి సంబంధం చెయ్యాలనే నాకుంది."

ఆ మాటలకు రామావధాని నవ్వుచు,

వొద్దోయ్! మన కలాంటివి వొద్దు, శాఖాంతర వివాహా లిప్పుడు చేశేస్తున్నారు కాని, మనం ఆమార్గం తొక్కొద్దు."

ఆ మాటకు లక్ష్మీకాంతము మఱి ప్రత్యుత్తర మీయలేదు. అతఁడు తన తండ్రితో మాటాడుచున్నంతసేపుచు వసంతుని మనసం

తయు నా సంభాషణమునందే లగ్నమైయుండెను. ఆ ప్రసంగము వానికి వింతగాఁ దోఁచి సంతోషాశ్చర్యములను గలిగించినది. మెంటాడ సంబంధమునుగూర్చి తండ్రినోటనుండి వెలువడినమాటలు మాత్రమే వసంతుని మనసును జిన్నపుచ్చినవి. కుర్చీయందుఁ గాళ్ళు ముడుచుకొని, గడ్డముక్రింద నఱచేయి యిడుకొని, తండ్రికడ నిలిచిన భ్రమరమును గ్రీఁగంటిచూపులతోఁ జూచుచు, మెంటాడసంబంధమునుండి తండ్రిని మఱలించుట కుపాయ మాలోచించుచుండ "దయచేయండమ్మా! ఇలా దయచేయండి!" అని యాకస్మికముగా రామావధాని పలికిన పలుకులు వాని యాలోచనమునకు భంగము కలిగించినవి.

అప్పుడు ఖదరువస్త్రధారిణులగు నేవురు రమణీమణులు తమ భుజముల ఖదరు తానులతోఁ జేతులయందు గజముబద్దలతో నా చావడిలోఁ బ్రవేశించిరి. నానావిధాభరణాభూషితలై ధనికుల యిల్లాండ్రవలెఁ గన్పట్టుచుండిన యా యోషామణులం జూచి, లక్ష్మీకాంత వసంతరావులు ప్రక్కకుఁ దొలంగ, స్వరాజ్యమును, గామేశ్వరమ్మయు వారిని గౌరవించి చాపలువేసి కూర్చుండఁ బెట్టిరి. ఆ ఖదరుధారిణులు తమ భుజములపైనున్న ఖదరుతానుల నాచాపలపై, బేర్చుచుండ రామావధాని, వారిలో నొక మానినీమణిం గాంచి యిట్లు ప్రసంగించెను—

"అమ్మా! ఎండలో వచ్చారు. దాహం పుచ్చుకుంటారా?"

"అక్కర్లేదండి. ఈ పక్కింటిలో ఇప్పుడే పుచ్చుకున్నాం. తమయింట్లో ఖదరేఁ వేనా పడుతుందా? మంచి మంచి రకాలున్నాయి చూడండి"

"చూస్తానమ్మా చూస్తాను. తప్పకుండా పుచ్చుకుంటాను. మీరంతా గొప్పింటిపిల్లల్లా గున్నారు. మీరు చేస్తూన్న సేవ నాకు

మహానందంగా వుంది.''

''ఔనండి బాబుగారూ! జైళ్లలో పడలేనివాళ్ళూ, వుపన్యాసాలు చెప్పలేనివాళ్ళూ ఖద్దరమ్మడం, ఖద్దరు కొనడం—ఈ రెండూ చేస్తూవుంటే చాలని మహాత్మాజీ వుపదేశం.''

''అమ్మా! మీరంతా యిక్కడివారేనా?''

''అంతా యీ వూరువాళ్లం కాదండి! నాది గుంటూరు. ఈమెది రాజమహేంద్రవరం. ఆమెది అమలాపురం.''

''అబ్బా! అంతదూరంనుండికూడా వస్తున్నారేం? ఎవరమ్మా మిమ్మల్ని పంపిస్తున్నారు?''

''ఖద్దరుప్రచారంకొరకేర్పడ్డ నాయకులు! ఈ జిల్లాలో ఖద్దరు ప్రచారం బొత్తిగా తక్కువగావుందని యిక్కడ స్వరాజ్యాశ్రమం వొకటి స్థాపించారు. ఖద్దరు విక్రయించడానికి విదేశవస్త్రవిక్రయం నిరోధించడానికి సమర్థులైన ప్రచారకుల్ని దూరదేశాలనుండికూడా యిక్కడికి తెప్పిస్తున్నారు. స్త్రీలూ, పురుషులూ చాలమందివచ్చారు. ఇంకా వస్తారు.''

''మహాబాగా వుందమ్మా! మహాబాగా వుంది''

''బాగుందంటే లాభంలేదు బాబూ! వీలైనంతవరకు మీ స్త్రీలనుకూడా మాకు సాయంగా పంపించండి!''

ఆ మాటకు రామావధాని తెల్లబోయి వెఱ్ఱినవ్వుతో వసంతుని ముఖము చూచుచుండ, నా ఖద్దరుధారిణి మఱల వాని కిట్లనియె.

''మీ కిష్టంలేకపోతే మీ స్త్రీలని పైవూళ్ళకి పంపించక్కరలేదు. ఈ పట్టణంఅంతాకూడా తిప్పక్కర్లేదు. రోజు కొక్కవీధి చాలు! ఒక్కగంట చాలు! మీ స్త్రీలచేత ఖద్దరమ్మించండి!''

అంతవఱకు దైన్యము గ్రమ్మియుండిన ముఖమున కిప్పుడించుకవికాస ముదయింప, స్వరాజ్యము తండ్రిని సమీపించి,

"నాన్నగారూ! మీరూ అన్నయ్యా వెళ్ళమంటే వెళ్లాలని నా కుతూహలంగావుంది. ఆవీధి ఈ పక్కవీధిమాత్రం తిరిగి వస్తూ యుంటాను." అని ప్రార్థించెను. రామావధాని మజిల వసంతుని దెస నవలోకింపఁ దండ్రి తన యుద్దేశ మెఱుంగఁగోరుచుండె నని యతఁ డూహించి, "వెళ్ళనీయండి! ఇంట్లో కూచుంటే లేనిపోనివన్నీ మనసులో పెట్టుకొని మొహం ముణుచుకొని కూచుంటుంది. ఇదో వ్యాపకంగా వుంటుంది. వెళ్ళనీయండి" అని చెప్పెను. తోడనే భ్రమరము లజ్జా సూచకమందహాసముతో, "మావయ్యా! నేను వెళ్లొద్దండీ?" అని యడుగుచుండ, ఖదరుధారిణి, 'ఈమె మీతోడలా' యని రామావధానిని బ్రశ్నించెను. "ఈ పిల్ల నా మేనగోడ' లని యతఁడు ప్రత్యుత్తరమిచ్చి, "అమ్మా! మీ సెలవుప్రకారం రేపటినుండీ మా పిల్లల్ని పంపిస్తాంలెండి" అని చెప్పి, పాతికరూపాయిల ఖద్దరుబట్టలను బేరముచేసెను. అం దొకచాపు లక్ష్మీకాంతమునకు, నొకచీర భ్రమరమునకు నొసంగఁబడినవి.



# 21 వ ప్రకరణము

## భ్రమరాంబ - రాజేశ్వరమ్మ - సుందరమ్మ

"ఓహో! భ్రమరాంబగారా? పేరమ్మచేత ఎన్నిమార్లు కబురుపంపించినా దర్శనఁవే యిప్పించారు కారూ! పోనీయండి! ఇప్పటికేనా దయపుట్టింది. దయచెయ్యండి!" అని మేడమీఁది ముందరి

వసారాలోఁ బట్టుపరుపులసోఫాపైఁ గూర్చుండి చేత నేదియో పుస్తకమును బట్టి చదువుకొనుచుండిన సుందరమ్మ, ప్రాకారద్వారమును ద్రోసికొని వచ్చుచుండిన భ్రమరమును జూచి, యానందాతిశయమున లేచి నవ్వుచుఁ బరిహాసముగాఁ బలికెను. ముందరి జల్లీకట్టు నానుకొని నిలిచి తన్నుఁ జూచి పరిహాసమాడుచుండిన సుందరమ్మను భ్రమరము క్రిందనుండి మొగమెత్తి వీక్షించుచు నవ్వుచుఁ దానప్పుడు ధరించిన క్రొత్తఖద్దరుచీరకుచ్చెళ్ళచే రాపాడుచుండినపాదములతోఁ దన గమనవేగమును హెచ్చించెను. సుందరమ్మ తన్నత్యాతురముతో నిరీక్షించుచుండ, భ్రమరము వీధిమెట్లెక్కి చావడిదాటి లోనికిఁ బోయి ద్వారములన్నియుఁ గడచి, తా నిదివర కెఱింగిన సౌధమార్గమున నామె నవలీలలో సమీపింపఁగలిగెను. సుందరమ్మ సంభ్రమమున నాలు గైదడుగు లెదురుగాఁ బోయి కొనివచ్చి సోఫాపైఁ దనప్రక్కనే కూర్చుండఁజేసి వామహస్తము నామెవీపునఁ జేర్చి నవ్వుచు,

'భ్రమరం! చూశావా! కొత్తచీర కట్టుకొనేసరికి అప్పుడే నీమొహానికి పెళ్ళికళ వచ్చింది. ఇదెంతయిందమ్మా?'

'ఏమో నాకు తెలియదు. మా మాఁవయ్యగా రిచ్చారు.'

'మీ మాఁవయ్యగా రెవరు?'

'మా వసంతబావ నాన్నగారు.'

'మీ వదినగారినికూడా తీసుకొచ్చావుకావేం?'

'ఇక్కడ ఓవదినగా రుండగా మళ్ళా ఆ వదినగారుకూడా యెందుకని తీసుకురాలేదు.' అని భ్రమరము నవ్వుచుఁ బలుక సుందరమ్మ యామెవీపు తట్టుచు,

'అబ్బా! మాటకారివే నమ్మా? సత్తికాలువుదాన వనుకున్నాను.'

'లేదమ్మా ఆవిడమనస్సు బాగులేదు. అందుచేత రాలేదు.'

'ఏఁవీ పాపం! మ రేం విశేషం లేదుకదా?'

'మామూలువిశేషం తప్ప కొత్త దేఁవీ లేదు. మా బావ దంతా అదో మోస్తరు. ఏలుకోని మొగుడు బ్రతికున్నా చచ్చినా వొకటే కాబట్టి ఆవిడికి పునర్వివాహం చేసీయాలని ఆయన వుద్దేశం.'

'అలాగా? ఆవిడి కిష్టంలేదు కాబోలు?'

'మా వదిన కా భర్తంటే పంచప్రాణాలున్నూ-'

'తల్లికీ తండ్రికీకూడా యిష్టలేదు కాబోలు?'

'ఎలా గిష్టం వుంటుంది? అల్లుడు బ్రతికుండగా-'

'ఔను పాపం! ఈ విషయంలో మీ చిన్నన్నయ్యగా రేఁవంటారు? ఆయనికి పునర్వివాహం యిష్టఁవేనా?'

'మాచిన్నన్నయ్య కిష్టఁవేకాని యతనియిష్టం యేం పని కొస్తుంది? అన్నగారితో చెన్నపట్టం బయలుదేరి భర్తదగ్గిరికి వెళ్లి పోతానని మావదిన నిన్నటినుండి పట్టుపట్టి కూర్చుంది.''

అని భ్రమరము చెప్పుచుండిన కడపటివాక్యమునందు సుంద రమ్మ దృష్టి యుంచలేదు. నిమీలితనేత్రయై యించుక ప్రక్కమొగ ముతోఁ బరధ్యాన నిమగ్నయై యుండిన యామెముఖమును జూచుచు, భ్రమర మొక్కక్షణ మూరకుండి,

''ఏఁవిటమ్మా? అంతదీర్ఘంగా ఆలోచిస్తున్నారు?''

అని ప్రశ్నించెను. మైమఱచియుండిన సుందరమ్మ యా ప్రశ్నకుఁ ద్రుళ్ళిపడినట్లు తటాలున భ్రమరమువంకఁ జూచి నవ్వుచు,

''ఏఁవీలేదు. ఇంతముతకచీర నువ్వెలా కట్టగలిగేవని యా లోచిస్తున్నాను, నువ్వు మరోలా గనుకోకపోతే—''

అని యామెసగము చెప్పుచుండఁగనే భ్రమరము—

''మొదటినుండీ ఖద్దరు కట్టడఁవే మా రెండుకుటుంబాల్లోనూ ఆచారం! ఎంత లేమిలోవున్నా మాచిన్నన్నయ్య—''

అని నాలుక కఱచుకొని, తనలేమి నామెకు వెల్లడింప నిష్టము లేక-

"ఖద్దరు కట్టవలసిందనే తన స్నేహితులకు చెప్తూ వుంటాడు."

"అయితే నేనుకూడా యిహామీద ఖద్దరే కట్టుకుంటాను. నాకో యాభైరూపాయిలు ఖద్దరుబట్టలు కావాలి. మీ చిన్నన్నయ్య తెచ్చిపెడతారా?"

"నేనూ మావొదినా మీకు కావలసినవి రేపు తెస్తాంలెండి."

అని తానును స్వరాజ్యమును వీధులవెంట ఖద్దరు విక్రయించుటకుఁ బూనుకొనిన విశేషము నామె కెఱింగించి—

"నే నోసంగతి మీతో మనవి చేసుకోవాలని వచ్చాను. సెలవైతే మనవిచేసుకుంటాను."

"అదేఁవిటమ్మా! ఆమనవులూ,—ఆసెలవులూ—బాగానే వుంది! నేనేం జమీందారురాలు ననుకున్నావా యేఁవిటి?"

"మీరు కాకపోతే మరెవరు జమీందారురాలుఁ? కాకపోవడానికి మీకున్న లోపం యేఁవిటి?"

"అంతా లోపఁవే. లోపంకాక నా కున్నదేఁవిటి? ఈమేడా-ఈఆస్తీనా? నానవుఖర్లినికూడా నాదగ్గిరిలా మాటాడనివ్వను. సరే! ఇంకచెప్పు! ఏఁవిటి చెప్పతలచుకున్నావు?"

"మాచిన్నన్నయ్య మీతో వొక్కసంగతి—"

సుందరమ్మ నవ్వుచు,

"మనవి చెయ్యమన్నారా? చెప్పమన్నారా"

భ్రమరము నవ్వుచు—

"చెప్పమన్నారు—"

''అయితే చెప్పు—తప్పకుండా వింటాను.''

''పాపం! ప్రొఫెసరు బాబుగారి యినప్పెట్టె తాళం పోయిందిటమ్మా!''

అని భ్రమరము చెప్పుచుండ నామేడచావడిలోనుండి సుందరమ్మతల్లియైన రాజేశ్వరమ్మ యచ్చటికివచ్చి, 'సుందరం' అని పిలుచుచు, తన్నుఁ జూచి లేవఁబోవుచున్న భ్రమరమును, 'కూర్చో! అమ్మాయీ! అలాకూర్చో' అని పలుకుచు నాప్రక్కనే యీసోఫామైఁ దానుఁగూడ నాసీనయై కూఁతుం జూచుచు,

'ఈసంగతి విన్నావా? రాసినవీలు మూడేళ్ళదాకా రిజిస్ట్రీ కాకపోతే యిహ చెల్లకూడదని యిప్పుడు కొత్తపద్ధతి వొచ్చిందట!'

'ఎవరు చెప్పేరమ్మా?'

'మీచిన్నాన్న నిన్న పేపర్లో చూశాట్ట! మీనాన్న వీలురాసి నాలుగేళ్ళయింది.

'నువ్వు దేనికీ తొందరపడకమ్మా! ప్రతీదానికి భయపడుతూ వుంటే యెలాగ? చిన్నాన్న రోజుకో దొంగవేషం వేస్తూ వుంటాడు. అవన్నీ నువ్వు నమ్ముకొని హడలిపోతూ వుంటావు. నయాన్నో భయాన్నో మన్ని సాధించాలనేకదూ తెల్లవారిలేస్తే చిన్నాన్న ప్రయత్నం? నువ్వు తొందరపడకు నేను మునసబుగారిభార్యకి కబురంపిస్తాను. ఆవిడ భర్తనడిగి యిందులోవున్న రహస్యం మనకి చెపుతుంది.'

'అయితే మరియెప్పుడో కాదు. ఇప్పుడే కబురు పంపించు. ఇంకా మూడెయ్యలేదు. మూడూ వేసేగానే ఆవిడ పురాణంలో కూచుంటుంది. పేరమ్మ సరిగా చెప్పగల్దో లేదో! వోకాయితం మీద వుత్తరంలా రాసిచ్చి! ఇదేదో తెల్సిస్తేనేకాని నా కీగాబరా తగ్గదు.

సుందరమ్మ యొక్కక్షణ మాలోచించి, తల్లిని జూచి,

'పేరమ్మేం చేస్తున్నాది?'

'కింద నున్నాది. వెంకన్నచేత కాఫీ పెట్టిస్తున్నాది. దేవుడు ధర్మాన్ని యిదే అబద్ధం అయితే అంజనేయస్వామికి నూరుకొబ్బరి కాయలు కొట్టిస్తాను. ఇలాంటి వెధవకబురు లెప్పుడూ చెప్పొద్దని మీ చిన్నాన్నని మొహం ముట్టించేస్తాను. పేరమ్మని పిలవ మన్నావా?''

ఆమాట విని—భ్రమరము తటాలున లేచి, ''మీరు కూర్చోండి—నేను పేరమ్మని తీసుకొస్తాను.''

అని పలుకుచుండ రాజేశ్వరమ్మయు సుందరమ్మయు నామెను జెరియొకచేయియుఁ బట్టి కూర్చుండఁబెట్టఁగా, రాజేశ్వరమ్మ సంతోషముతో భ్రమరమును జూచుచు,

'ఆవేళ అమ్మాయిపద్యాలు వినడానికి ప్రాప్తం లేకపోయింది. అంతా వింటున్నారు మీకుకూడా రండమ్మా రండమ్మా అని పాపం పేరమ్మ నాలుగైదుమారులు చెప్పింది! మనసు కులాసాగా లేకపోతే ఏం వచ్చేది ఏం వినేది? ఇదిగో కాస్త మనసు కుదుటపడగానే అమ్మాయి నోపూటల్లా నాదిగ్గరే వుంచేసుకుంటాను.''

అని యభినందించుచుండ నింతలోఁ బేరమ్మ రెండు వెండి గిన్నెలతోఁ గాఫీ తెచ్చి సుందరమ్మకును భ్రమరమునకు నందీయఁగా సుందరమ్మ కాఫీ పుచ్చుకొనుచు,

'పేరమ్మా! పాతమునసబుగారిభార్యదగ్గరికి ఏమా రర్జంటుగా వెళ్ళిరావాలి! వుత్తరం యిస్తాను. ఎంత తొందరలో వున్నా సరే దీనికి వెంటనే జవాబిమ్మని నేను బతిమాలుకున్నానని చెప్పి తీసుకురావాలి'

అని చెప్పుచుఁ గాఫీ పుచ్చుకొన్నంతనే లేచి మేడచావడిలో నున్న యొకగదిలోనికిఁ బోయి యొకయుత్తరమును వ్రాసి తెచ్చి

పేరమ్మ కిచ్చి పేరమ్మ వెడలిపోయినంతనే యథాస్థానమునం గూర్చుండి సుందరమ్మ భ్రమరమున కిట్లనియె.

సుంద—భ్రమరం! ఇప్పుడు చెప్పమ్మా! ఏఁవిటన్నావు? ప్రొప్రయిటరుబాబుగారి యినప్పెట్టితాళం పోయిందనా? పోతే?''

భ్రమ—మీాయినప్పెట్టెతాళం వోమారిమ్మని యివాళో రేపో మీాకు కబురొస్తుంది'

సుంద—రానీ! వస్తేనేం? తప్పకుండా యిద్దాం.'

రాజే—అంత వా రడిగినప్పు డివ్వకపోతే బాగుంటుందా? అదీకాక వారికీ మాకు చాలావ్యవహారా లున్నాయి '

సుంద—మానాన్నగారే ప్రొప్రయిటరుగారి వకీలు. ఆరోజుల్లో ప్రొప్రయిటరుగారు తరుచుగా మాయింటికొచ్చేవారు.

రాజే—దీనిపింతండ్రి పాపరుదావా తెచ్చి– రాసినవీలు దొంగవీలని కోర్టులో రుజువు జేయుస్తానని తుప్పూ తుప్పూ తూల్తావుంటాడు అదే నిజఁవైతేమాత్రం బాబుగారిసాయం మాకెంతేనా వుంటుంది.

భ్రమ—పోనియ్యండికాని మీాకూ బాబూగారికీ వున్నవ్యవహారా లేఁవిటో నే నడగవచ్చునా?

రాజే—(నవ్వుచు) నీ కెందుకమ్మా చిన్నపిల్లవి.

సుంద—(తల్లిని జూచి) చిన్నపిల్లయినా ఎంతచక్కగా అడుగుతున్నాదో కనిపెట్టు– (అని భ్రమరమునుజూచి) భ్రమరం! రహస్యాలంటే నిజంగా అవి రహస్యాలు కానేకావు. అయితే ప్రస్తుతస్థితినిపట్టి ప్రతీదీ రహస్యంగా వుంచవలసిన యవసరం వచ్చింది. చెప్పలేదనీ యేఁవీ అనుకోకు! మరోమారు నీకు చెప్తానులే!

భ్రమరం—అది కాదమ్మా! బాబుగారు వోగ్రామం తణఖా యిచ్చి

మీనాన్నగారిదగ్గిర నలభై వేలు పుచ్చుకున్నారు. అది నాకు తెలుసును. మీనాన్నగారు రాసిన వీలులో ఆయనకూడా వోసాక్షి సంతకం పెట్టేరు. అదికూడా నాకు తెలుసును. ఈ రెండూకాక యింకేవేనా మీకు వ్యవహారా లున్నాయేమో అని యడుగుతున్నాను.

ఆమాటలు విని నోటమాటలులేక సుందరమ్మయు రాజేశ్వరమ్మయు నత్యాశ్చర్యమున నిశ్చేష్టితలై భ్రమరము ముఖమును జూడసాగిరి. అతిరహస్యములని తాము భావించుచున్న యీవిషయముల నెవరు చెప్పిరనియు నెందుకుఁ జెప్పిరనియు నెప్పుడు చెప్పిరనియు వా రిరువురును భ్రమరమును బలుతెఱంగులఁ బ్రశ్నించుచుండ నామె నవ్వుచు మఱల నిట్లు ప్రసంగించెను.

భ్రమ—నే నడిగింది మొదట చెప్పండి! తరువాత మీప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్తాను, ఈరెండువ్యవహారాలేనా వారికీ మీకూ మరేవేనా వ్యవహారా లున్నాయా?

సుంద—మాతండ్రిగారే చనిపోతే ఇహనేం వ్యవహారాలు?

భ్రమ—తండ్రిగారు చనిపోయినా తండ్రింతవారు పింతండ్రిగారున్నారు కా రటమ్మా?

రాజే—వాడిమొహం! వాడికి వ్యవహారంవేఁవిటి? పొట్టచీల్చినా అక్షరం లేదు.

సుంద—భ్రమరం! ఇప్పుడు నాకో అనుమానం కలుగుతున్నాది. మా పింతండ్రి పొర్రయిటరుతో ఏకీభవించాడని యేకీభవించి యేదోకుట్ర చేస్తున్నాడనీ—ఇన్ని తెలిసినదానివి యీసంగతి కూడా తెలిసేవుంటుంది. చెప్పు! చెప్పు! అలాంటిదేఁదేనా జరుగుతున్నదా?

భ్రమ:—ఏఁవీ జరక్కపోతే తాళంకోసం కబురెందుకు? అది పట్టి దొంగవేషం. ఆకబురు నమ్మి మీరు తాళం యిచ్చేస్తా

కేసూ అన్నభయంచేతనే మాచిన్నన్నయ్య మీతో ముందుగా చెప్పిరమ్మని నన్ను పంపించాడు. మీరు తాళం మాత్రం యివ్వకండి! ఇచ్చారంటే అది ప్రొప్రయిటరుగారి ద్వారా మాపినతండ్రిచేతిలో కొస్తుంది. ఆయనగారెప్పుడో సమయం కనిపెట్టి యినప్పెట్టెలోవున్న వీలు చక్కగా లంకించుకుంటాడు.

రాజే:—(గుండెబాదుకొనుచు) ఏంవిటీఘోరం? ఏంవిటీఘోరం? ఇదంతా నిజవే? మాకొంప ముంచేడానికే యెత్తు వేశాడు!

సుంద:—(ఒక్కనిట్టూర్పు విడిచి) అమ్మా! చూశావా! ప్రొప్రయిటరెంతదుర్మార్గుడో? ఇంతకాలం మనం బెద్దమని పనుకుంటున్నాం. వీణ్ణి నమ్ముకుంటే నువ్వూ నేనూ గంగలో వురకవలసిందే.

ఇంతలోఁ బ్రాకారద్వారమునుండి ముందుఁ బేరమ్మయు నామె వెనుక నొక దవాలీబంట్రోతు వచ్చుచుండుట రాజేశ్వరమ్మ చూచి,

రాజే:—అదిగో పేరమ్మ వచ్చేసింది! సుందరం! ఆబంట్రోతెవరు? మునసబుగారు పంపించారు కాఁబోలు?

సుంద:—మునసబుగారు బంట్రోతు నెందుకు పంపించాలి? కనుక్కుంటాను. (అని లేచి క్రిందకుఁ జూచుచు) పేరమ్మా! ఆబంట్రోతెవరు?

అని యడుగఁ గ్రిందవచ్చుచుండిన పేరమ్మ వెనుకకుఁ దిరిగి తనవెంట వచ్చుచుండిన బంట్రోతుతో మాటాడి మీఁదికి, జూచుచు, 'అమ్మా! ప్రొప్రయిటరు బాబుగారేదో వుత్తరం యిచ్చారట! తేనా' అని యడుగఁ దెమ్మని చెప్పి సుందరమ్మ యథాస్థానమునఁ గూర్చుండెను.

రాజే:—(సుందరమ్మను జూచుచు) ఆవుత్తరం తాళంకోసఁవే! అమ్మాయి చెప్పిందంతా నిజం! మొదటినుండీ మీఁంపినతండ్రి దొంగముండాకొడుకే! ముద్దకు లేదని కాళ్లూ కడుపూ పట్టు కుంటే యింట్లో చేరనిచ్చాం. ఇప్పుడా ఆస్తికే ఔపోసనం పట్ట డాని కాలోచిస్తున్నాడు.

అని రాజేశ్వరమ్మ లక్ష్మీంపతిని దూషించుచుండ నింతలోఁ బేరమ్మ వచ్చి సుందరమ్మ కుత్తరమిచ్చెను. వెంటనే యా యుత్తరమును విప్పి

'యర్రమిల్లి రాజేశ్వరమ్మగారికి—

మాయినప్పెట్టి తాళం పోయి మూడురోజులయింది. ఈమూ డురోజులనుండీ మానౌఖర్లు దివాణం అంతా గాలించినా పోయిన తాళం దొరకలేదు. ఎన్నితాళాలతో ప్రయత్నించినా పెట్టి రాకుం డావుంది. మీయినప్పెట్టి తాళం వోమారు మాబంట్రోతుద్వారా యిస్తే తిరిగి వెంటనే పంపించేస్తున్నాం.

గంగాధర ప్రసాదరావు బహద్దరు.'

అని చదివెను.

రాజే:(కోపముతో) పేరమ్మా! ఇవ్వడానికి వీల్లేదని చెప్పి ఆబంట్రో తును పొమ్మను.

సుంద:—పొమ్మంటం కాదు. పేరమ్మా! ఆబంట్రోతును మేడమీది కో మారు తీసుకొనిరా!

రాజే:—(చికాకుతో) వాడు మేడమీది కెందుకమ్మా? పొమ్మనక?

సుంద:—చెప్తానుకదూ!

పేరమ్మ క్రిందికిఁ బోయి యాసేవకుని మేడమీఁదకుఁ దీసికొని వచ్చెను. ఆసేవకుఁడు వరండాలోఁ బ్రవేశించి గోడ నానుకొని నిలు వఁబడియుండ సుందరమ్మ వానితో నిట్లు ప్రసంగించెను.

సుంద:—ఎవ రెవ రున్నారోయ్ బాబుగారిదివాణంలో?

సేవ:—బాబుగారూ, నర్సింపతిగారూ, యెంకటచాత్తుల్లుగారూ.

సుంద:—ఈవుత్తరం యిచ్చేటప్పుడు నీతో మరేఁవేనా చెప్పేరా?

సేవ:—మరేటీ సెప్పలేదు. యీది సెప్పేరు. యిల్లుసెప్పేరు, ఆళ్లో ళ్లుంతారు. ఆళ్లకి వుత్తరంయిస్తే తాళం యిస్తారు వొట్రమ్మన్నారు.

సుంద:— బాబుగారిదివాణంలో తాళం పోయిందట! దొరికిందా?

సేవ:—యే తాళం పోనేదు.

సుంద:—మీరంతా మూడురోజులు వెతికేరట!

సేవ:—అదేటో నవ్మా! నాకు తెల్దు.

సుంద:—(ఆలోచించి) సరే! తాళం యివ్వడానికి వీల్లేదన్నారని చెప్పు.తరవాత—(అని యేమో చెప్పఁబోయి చెప్పుట కిష్ట పడక) నువ్వింక వెళ్లవచ్చు.

సేవకుఁడు చిత్తమని పల్కి వచ్చినమార్గముననే మేడదిగి నిష్క్రమించెను. తోడనే రాజేశ్వరమ్మ పేరమ్మను జూచి—

రాజేశ్వ:—పేరమ్మా! నువ్వు వెళ్ళినపనేవయిందో మొదట చెప్పు.

పేరమ:— చెప్పడాని కేఁవుందమ్మా! ఉత్తరం చూసీ చూడ్డంలో మునసబుగారూ మునసబుగారిభార్యా కడుపులు చెక్కలయేటట్టు విరగబడి నవ్వుకొన్నారు. మూడేళ్లుకాదు ముప్ఫైయేళ్ళ యినా మీవీలు కే మీ భయంలేదని మునసబుగారు మీతో చెప్పమన్నారు. అలాంటిపద్ధతి యెక్కడా లేదట! లేనిపోని మాటను నమ్మి బెంగపెట్టుకో వద్దన్నారు.

రాజేశ్వ:—(సంతోషముతో) పోనీ! అలా అన్నారుకదా! నీకడుపు చల్లగా సంతోషఁవైన కబురు చెప్పేవు. నీకో చీర కొని పెడతానులే. (అని కుమార్తెవంకఁ జూచి) సుందరం! ఇవాళ

మనం లేచినవేళ మంచిది. పెద్దగండాలు రెండు తప్పేయి. మూడేళ్లు దాటితే పీలు చెల్లదూ అన్నపద్ధతి నిజమైనా మన కొంప పోను! అవుత్తరం నమ్ముకొని తాళం యిచ్చేసినా మనకొంప పోను! ఈరెండూ జరక్కుండా భగవంతుఁడు చక్రం వేశాడు. నిజంగా ఈఅమ్మాయి యివాళ మనయింటికి మహాలక్ష్మిలా గొచ్చింది. చూడూ! ఆకళ్ళూ ఆమొహం! నిజంగా మహాలక్ష్మే.

సుంద:-అమ్మా! నువ్వన్నవి రెండూ నిజమే కాని గండాలు గడిచా యని నువ్విప్పుడే సంతోషించకు. ఆబ్రాహ్మణయిటరూ చిన్నాన్నా యిద్దరూ యేకమై యింకా యేంతంత్రం ఆలోచిస్తున్నారో? (భ్రమరమును జూచి) భ్రమరం! చిన్నన్నయ్యగారు నీతో మరేమేనా చెప్పేరా?

భ్రమ:-తాళంమాటే చెప్పి ర మ్మన్నారు.

సుంద:-ఆయనకు మరేమేనా భోగట్టాలు తెలిశాయా?

భ్రమ:-అడగమంటే అడుగుతాను నాకు తెలియదు.

రాజేశ్వ:-అడగడం కాదమ్మా! వోమారు చిన్నన్నయ్యగారినే మా యింటికి దయచెయ్యమను! ఏఁవీ తప్పా? మాయింటికి రాకూడదూ? రాజేశ్వరమ్మ మరీమరీ బతిమాలుకుందీఒక్క మారు తీరుబడి చేసుకుని రమ్మని చెప్పు. ఆయన రాకపోతే నేనే వస్తాను.

సుంద:-భ్రమరం! మానాన్నగా రార్జించి యిచ్చిందంతాకూడా ఇవాళ చిన్నన్నయ్యగారు మాకు పెట్టిన భిక్షయింది. ఈ ఋణం యెలా తీర్చుకోగలమో తెలియదు. మాఅమ్మ చెప్పి నట్టు వోమారు రాకతప్పదని మరీమరీచెప్పి తీసుకుని రావాలి.

భ్రమ:-ఈపాటిదాని కిన్నిమార్లు చెప్పాలా? తప్పకుండా చెప్తాను.

రాజే:-(పేపుపైఁ దట్టుచు) అమ్మాయీ, నీవుపకారం నేను మరచిపోనునుమీ.

భ్రమ:-మీరానూటంటే నేను చెప్పే చెప్పను.

రాజే:-(నవ్వుచు లేచి) పోసి అన్నలే! కోప్పడకు! పేరమ్మాపద! ఇవాళ సహస్రనామపూజ చేసుకుందాం,

అని యామె పేరమ్మతో నందుండి వెడలిపోయెను. భ్రమరాంబాసుందరాంబ లిరువురు నాటిసాయంకాల మైదుగంటలవఱకు నచ్చటనే ముచ్చటించుచుఁ గూర్చుండిరి, ఆసంభాషణములలోఁ దన చిన్నన్న యొనర్చిన యుపకారమును దఱచు శ్లాఘించుచు వచ్చిన సుందరమ్మ శ్లాఘా వాక్యములచేఁ గలిగిన యానందముతో భ్రమరము సెలవుపుచ్చుకొని యింటికివచ్చి, తాను వచ్చునరి కరుగుపై దీనాననుఁడై కూర్చుండిన తనచిన్నన్న తా నుద్యోగమునుండి తొలంగింపఁబడినట్లు చెప్పినంతనే యాబాలికామణి ఖిన్నవదనయైనది.

## 22 వ ప్రకరణము

### ఆశ్రమమునందలి విశేషములు

తనయన్నగారిప్రోత్సాహమునఁ దండ్రిగా రొసంగిన యాజ్ఞగైకొని యామఱునాటినుండియు స్వరాజ్యము, ఖద్దరుధారిణులతో నొకటి రెండువీధులు తిరిగి వచ్చుచుండెను. తనయన్నతోఁ దాను గూడ నీసారి చెన్నపట్టణమేగి పతిని దర్శింపవలయునని యొకమూఱును, తనమామగారు తనభర్త కేమియు వ్యయమునకుఁ బంపని యెడల నాతఁ డచ్చట నెట్టియిక్కట్టులు పడయునోయని, తనయలంకారము నొకటి రెండు విక్రయించి వాని కాసొమ్ము పంపుచుండవల

యునని యొకమాఱును దల్లితోఁ జెప్పుచు మొగము ముడుచుకొని యలిగి కన్నీరు పెట్టుకొనుచుండుట వసంతరావు తఱచుగాఁ జూచు చుండినవాఁడగుటచే, నట్టితలంపులనుండి యామెను దప్పించుటకే యతఁడు తండ్రి కట్టిసలహా యొసంగెను. ఖద్దరుధారిణు లేగిన తరు వాత రామావధాని కుమారునివలన నీవివరములన్నియు విని, పట్ట ణములోని యున్నతోద్యోగులయు ధనవంతులయు నిల్లాండ్రుఁగూడ నీయుద్యమమునఁ బ్రవేశించుచున్నారని యెఱింగి స్వరాజ్యమును బంపుటకు సమ్మతించెను. జోదరుస్థితి యేగాక, యాదినుండియు ఖద్దరు ధారణమునఁ గలప్రీతియు వసంతుఁ డట్టిసలహా యిచ్చుటకుఁ గారణ మైనది. అత్యవసరముగా రావలయునని సుందరమ్మగారి సెలవైన దని పేరమ్మ వచ్చి చెప్పినప్పుడును, గృహము నిస్తంతులమై తనకు భోజనము లేనప్పుడును దప్పఁ దక్కినసమయములయందు భ్రమరము కూడ స్వరాజ్యముతో ఖద్దరువిక్రయమునకు బయలుదేరుచుండెను.

ఖద్దరువిక్రయమునకు బయలుదేరిన యొకటి రెండు దినముల లోనే స్వరాజ్యమునకుఁ దక్కిన ఖద్దరుధారిణులతో మిక్కిలి పరిచ యము కలిగినది. ఆపరిచయ మామె నాయుద్యమమునకుఁ బ్రబలిదిన మును బ్రోత్సహింపసాగెను. ఖద్దరువిక్రయమునకుఁ గడంగిన కాంతా మణులెల్లరు సాయంకాల మగుసరికి స్వరాజ్యాశ్రమమునకుఁబోయి, యచ్చటి స్వచ్ఛందసేవకురాండ్ర నాయకురాలికిఁ దమతమ విక్రయ ధనములు చెల్లించి, శేషించిన తానులప్పగించి లెక్కలు చెప్పి యిండ్లకుఁ బోవుచుందురు. ఒకటి రెండు దినములవఱకు స్వరాజ్యము స్వరాజ్యాశ్రమమునకుఁ బోవక, మార్గమధ్యముననే తా నమ్మిన సొమ్మును మిగిలిన బట్టలును ఖద్దరుధారిణులలో నెవ్వతెకైన లెక్క చెప్పి యప్పగించి తా నింటికి మఱలుచుండెను. కాని క్రమక్రమ

ముగా నుత్సాహ మధికమైనకొలఁది నామె తక్కినవారివలె నాశ్రమ మునకే పోవసాగినది— ఇంటికి మఱలి వచ్చునప్పుడెల్ల నా మెముఖము నందలి వికాసము నాయుత్సాహము నాసంతోషాతిశయమును గని పెట్టి, యింతసే పైనదేమనికాని యెన్నివీధులు తిరిగితి వనికాని, రామావధాని మున్నగువా రెవ్వరు నామెను బ్రశ్నింపకుండిరి.

అట్లు స్వరాజ్యము ఖద్దరువిక్రయించుచుండిన దినములలో నొకదినము మ్యునిసిపల్ వోటర్ల యెన్నికలదినమైనది. ఆ నాడు పట్ట ణమంతయు మహాసంగ్రామసంరంభముతో నిండియుండెను. వీధుల యందు నిండ్లయందు నంగడులయందు కాఫీక్లబ్బులయందు వోట్లప్ర సంగముతప్ప మఱియొకమాటయే లేదు. నా డెటుఁ జూచినను బుర వీధులయందు మోటారుకారుల రాకపోకలు శునకసంచారముల కంటెను దఱచైనవి. వాడవాడల గోడలయందు "మురహరిరావు నాయుడుగారికి వోటుచేయుఁడు" "ప్రొప్రయిటరు బాబుగారికి వోటు చేయుఁడు." అను నుభయపక్షప్రకటనలును, డాళఫలప్రమాణాక్షర ములతోఁ జూపరుల నాకర్షించుచుండెను. వీరు నిరుపేదలు వీరు ధని కులు నను బేధమును బాటింపక ధనప్రధానుఁడుగాక, రోగులసమ బుద్ధితోఁ జూచుచుఁ జిరకాలమునుండి పట్టణమున సుప్రసిద్ధుఁడై యుం డిన నాయుఁడే జయించునో; వోటర్ల యెదుట రాత్రిబవళ్లు ఘల్లుఘల్లున ధనదేవతను దాండవ మాడించుచుండిన ప్రొప్రయిటరే జయించునో యనువాదములు నాటియుదయమునుండియుఁ బట్టణప్రజలలోఁ బ్రబ లముగా సాగుచుండెను. వేశ్యాపరుఁడను కళంకమున్నను నాయుఁడు మిక్కిలి కీర్తియుతుఁడు. ఋణాక్రాంతుఁడగుచున్నను ప్రొప్రయిటరు గొప్పధనాధికుఁడు. ఆనాటి వోటుపోరాటములోఁ గీర్తియే జయిం చునో ధనమే జయించునో యనునాందోళనము విద్యాధికులకుఁ గూడ గలత పెట్టసాగినది. అసత్యము నన్యాయము నధర్మము మోసము

క్రౌర్యము దౌర్జన్యము మున్నగు యుద్ధసాధనములతో నుదయ మేడు గంటలనుండియు వోటుపోరాటము నిరాఘాటముగ జరుగుచుండెను. వివాహములలో రాక్షసవివాహమువలె వోటరుని యువాయకులఁ గాలుసేతులఁ గలయఁగట్టి మోటారుకారులఁ బెట్టి మ్యునిసిపలాఫీసునకుఁ గొనిపోవుచుండిరి. ప్రొప్రయిటరుబాబు తొలినాడే బ్యాండు మేళమునకు 'బయానా' యొసంగి సంపూర్ణధైర్యముతో నెప్పుడెప్పుడని విజయవార్తకు నిరీక్షించుచుండెను. డాక్టరు నాయుఁడు ఖద్దరుధారుఁడును ఖద్దరాశ్రమమువారికి గౌరవవైద్యుడు నగుటచే స్వరాజ్యాశ్రమమునందలి స్వచ్ఛందపురుషసేవకులు నాడు నాయుఁడుపక్షమునసే పనిచేయుచుండిరి. లక్ష్మింపతి వేంకటశాస్త్రిలు పాటుపడుచున్నను, ప్రొప్రయిటరుపక్షమున నిజముగాఁ బనిచేయుచున్న దొక్కధనమే.

ప్రొప్రయిటరు బాబుగారివోటర్లలో నొంటెద్దుబండ్లవాండ్రును, కిల్లీదుకాణదారులునుగూడఁ గొందఱు కలరు. ఆనాటిజాతకచర్యలో వారి కందఱికి వాహనయోగము లుండుటచే మోటారుబండ్లు గుఱ్ఱపుబండ్లు నెక్కియే మ్యునిసిపలాఫీసునకు వచ్చిరి. ఉభయపక్షములకుఁ జెందిన వేలకొలఁదిజనులచే నాయాఫీసుమందిరమంతయు నిసుకవేసిన రాలకుండఁ గిటకిట లాడుచుండెను. సంబంధము లేని వారుఁగూడ వినోదార్థ మాజనసముదాయమును జూచుటకు వందలకొలఁది నాప్రాంతమునఁ జేరుకొనుచుండిరి. రైలు వచ్చు వేళ సమీపించుకొలఁది రైలుస్టేషనులోఁ బ్రయాణికుల తొడిత్రొక్కుడధిక మగుచుండునట్లు, వోట్లువేయుట పూర్తికావలసిన యైదవగంట సమీపించుకొలఁది నచ్చటిజనసమ్మర్దములో నల్లకల్లోలము పెచ్చుపెఱుగఁ జొచ్చెను. నాటిసాయంకాలము నాలుగుగంట లగుసరికొకానొక కోమటివోటరును దమప్రక్కకుఁ ద్రిప్పుకొనుచుంటలో

బాబుగారి వేఁపెంట్లకును నాయఁడుగారి వేఁపెంట్లకును గలహము పుట్టుటచే కొండొరులఁ జేపాటికఱ్ఱలతో మోదుకొనసాగిరి. వారాయుధపాణులై పోరాడుచుండుటచేఁ బ్రాంతములనున్నవారు చెంతకేఁ బోవుటకుఁ భయపడి దూరమునుండియే కేకలు వేయుచు వారి కలహమును వారించుటకుఁ బ్రయత్నించిరి. కాని బిగుళ్ల నూదుకొనుచు! బరుగుపరుగునఁ బోలీసువారు వచ్చువఱకు నాయుద్ధ మాఁగలేదు. ఈలోపున నుభయపక్షముల వారికినిగూడ గాఢప్రహారములు తగిలినవి. తీవ్రమైన గాయములు తగిలినవారు తక్షణమే యందుండి తీసికొనిపోఁబడిరి.

స్వరాజ్యాశ్రమమునందలి స్వచ్ఛందసేవకులలో (Volunteers) ననేకులు నాటిదినమంతయు మ్యునిసిపలాఫీసుకడనే నాయుడు పక్షమునఁ బనిసేయుచు నుండిపోవుటచేత నానాడు స్త్రీలుమాత్రమే ఖద్దరువిక్రయమును గావించిరి. ఆకాంతామణులు తమయాచారము చొప్పున సాయంకాలమగుసరికి విక్రయము చాలించి స్వరాజ్యాశ్రమమునఁ జేరుకొనిరి. కార్యాంతమునఁ బోయిన స్వచ్ఛందసేవకులింకను మఱలి రానందున నానాడు వేళపట్టున దీపములు వెలిగింపఁబడలేదు. నాయకురాలిగదియందును మఱియొకటి రెండు గదులయందును మాత్రమే యప్పటికి దీపములు వెలిగింపఁబడినవి. ఆయాశ్రమమందిర మైదాఱుసామాన్యకుటుంబములు నివసించుటకుఁ దగిన పెద్దనాలుగిండ్లబవంతి. పట్టణమునకు నట్టనడుమనేగల యామందిరమన్నిప్రాంతములవారికిఁ జేరువగా నుండునని యెంచి, స్వరాజ్యాశ్రమువారాగృహమును మూఁడుమాసము లుండుటకుమాత్రమద్దెకుఁ దీసికొనిరి. అన్యప్రదేశములనుండి రావింపఁబడినవారి వంటలు భోజనములు వెనుకభాగమున నున్నయింటిలోఁ గావింపఁబడుచుండ నాగృహము ముందుభాగమున నున్నగదులలోఁ గొన్ని

ఖద్దరుబట్టలు నిలువ చేసికొనుటకును మఱికొన్ని మనుష్యులు నివసించుటకును నుపయోగింపఁబడుచున్నవి.

నాటిసాయంసమయమున నాయాశ్రమమందిరమునఁ బ్రవేశించిన ఖద్దరుధారిణులలోఁ గొందఱు గ్రామాంతరములనుండి వచ్చినవారగుటచే నచ్చటనే యుండిపోవలసినవారు. మఱికొందఱు పౌరకాంత లగుటచేఁ దిరిగి తమయిండ్లకుఁ బోవలసినవారు. సాఱును వీరునుగూడ నాయకురా లున్నగదిలోఁ బ్రవేశించి తమతమ విక్రయధనముల నామె కప్పగించి లెక్కలు చెప్పుచుండ, వారిలో నొక సుందరీమణి యందఱికంటెఁ దొందరపడుచు, చీకటి పడుచున్నదనియుఁ దన్నుఁ ద్వరగాఁ బంపివేయవలయుననియు నామెను బ్రార్థింపసాగెను. కాని పాతికరూపాయిల వెలగల ఖద్దరు తా నొకటి లెక్కకు దొరకక చిక్కుపెట్టుచున్నందునఁ జికాకులోనున్న నాయకురాలామె ప్రార్థనమును గొంతవఱకు మన్నింపలేదు. ఆయువతీమణియు నాలస్యమగుచున్నందుకు నొచ్చుకొనుచు మఱల మఱలఁ బ్రార్థించుచుండఁ దుదకు నాయకురాలామెను జూచి 'అమ్మాయీ! పాపం నువ్వు తొందరపడుతున్నావు. అమ్మకముసొమ్ము నీదగ్గిరే వుంచు రేపు లెక్కచూసి పుచ్చుకుంటాను. నువ్వివాళ తీసుకుని వెళ్ళినవి చీరాల చీరలేకదూ! చీరాలసరుకంతా యీపక్కగదిలోనే వుంది. ఈచీరలేమూటలోనుండి తీశావో ఆమూటలోనే పెట్టి కట్టేసి వెళిపో!' అని చెప్పెను.

చెప్పుటయె తడవుగఁ దాను విక్రయింపఁగా శేషించిన చీరాల చీరలతో నమ్మరాళగమన ప్రక్కగదిలోనికి బయలుదేరెను. అప్పుడప్పుడే చిఱుచీకటులు ప్రారంభమగుచుండుటచే వెలుపలిభాగములయం దింకను వెలుగున్నను, మందిరాభ్యంతరములుమాత్రము దీపావసరమును సూచించుచున్నవి. ఇంటికిఁ బోవుసంరంభముతో

నున్నయారమణీమణి తటాలుననాప్రక్కగదిలోఁ బ్రవేశించి, చీకటిలో లీలగాఁ గానవచ్చుచుండిన తెల్లని బట్టలమూటలలోఁ దాను మధ్యాహ్నము చీరలకొఱకు విప్పిన బట్టలమూటజాడ కనిపెట్టి, తాను గుర్తించిన యామూటను వెలుపలనున్న వెలుగులోనికిఁ గొనిరావలయునను నుతలంపుతోఁ దనరెండుచేతులఁ జాచి బిగ్గరగాఁ బట్టి యెత్తఁబోయెను. కాని తన కోమలమృణాలబాహుస్పర్శ కామూట బట్టలమూటవలెఁ దోపక, మూట కుండఁదగిన మెత్తదనముగానక, యాబిత్తరి తత్తరపాటుతోఁ దటాలున రెండడుగులు వెనుకకువేసినంతనేఁ యామూట కించుక చలనము కలుగుటయుఁ జలనముతోడనే నిట్టూర్పులు విడుచుచుండుటయుఁగూడ నామెకు స్పష్టమైనవి. ఆచీకటిలో, దనబాహువల్లరులఁబట్టి యెత్తిన దొకమానవవ్యక్తి గాని బట్టలమూట గాదని తనకు స్ఫురించినంతనే పాప మామె యవయవములకుఁ గంప ముదయించినది. శరీర మాపాదమస్తకము చెమట పట్టినది. గుండియ దడదడఁ గొట్టుకొనసాగినది. ప్రక్కనున్న గదిలోనివారలను బిలువ నుద్యమించిన కంఠమునుండి మాట వెడలదయ్యె. భయాతిశయమున గడగడ వడఁకుచుండిన పాదములవశములై యామె నొక్కయడుగైన నీవలికిఁ బెట్టనీయవయ్యె. పరపురుషస్పర్శచే మానవతియైన కాంతకుఁ గలుగు హృదయవేదనమంతయు నామెకప్పు డుదయించినది. తాను గదిలోఁ బ్రవేశించుటయుఁ దన కడకు వచ్చుచుండుటయుఁ జూచియు మాటాడక మిన్నకున్న యా మానవవ్యక్తిపై నామె కనితాగ్రము వొడమినది. ఈధూర్తుఁ డెవఁడో దురాచారుఁడనియు, నిట్టిదురాచారులు సాధ్వీమణు లుండు నాశ్రమములో నుండఁదగినవారు కారనియు నాయకురాలితోఁ జెప్పి వాని నందుండి తొలగింపవలయునని నామె నిశ్చయించుకొనెను.

అట్టి నిశ్చయముతో నాసాధ్వీమణి హృదయమును బదిల పఱచుకొని, తనతొట్రుపాటంతయు నణఁచుకొని రొమ్ముక్కవిసురున గుమ్మముదాటి యీవలకు వచ్చినంతనే, చేత హార్కికేలాంతరుతో నొక స్వచ్ఛందసేవకుఁడును వానివెనుక డాక్టరు మురహరిరావు నాయుఁడు నాగదివైపునకే వచ్చుచు నామెను దప్పించుకొని లోనఁ బ్రవేశించిరి. ఆలలనాలలామ నాయకురాలిగదిగుమ్మమువఱకుఁ బోయి, ప్రక్కగదిగుమ్మమువద్దఁ దాను విడిచివచ్చిన చీరాలచీరల భద్రపఱుపవలయుననియో, తా నంటిన మానవవ్యక్తి యెవ్వఁడో చూడవలయుననియో మఱల వెనుకకుఁ దిరిగి యాగదిగుమ్మమును సమీపించి లోనికిఁ జూడసాగెను. నెత్తిపై నెడమవైపున బలమైన గాయము తగులుటచే బాధపడుచు బట్టలమూటకుఁ జేరఁబడి కూర్చుం డిన యొకపురుషుఁ డప్పు డామెకంటఁ బడెను. వానిచేరువనే మఱి యొకమూటపై నాయుఁ డెత్తుగాఁ గూర్చుండి లాంతరువెలుగున వానిగాయమును బరీక్షించుచుండెను. వానిం గొనివచ్చిన స్వచ్ఛంద సేవకుఁడు డాక్టరుతో నింగ్లీషున నేమో మాటాడుచుండెను.

గాయముతో బాధపడుచున్న యాపురుషవ్యక్తిని జూచు టయె తడవుగనాయన్నులమిన్న కోపమంతయు నొక్కమారె తొలఁ గిపోయినది. ఆయాగ్రహస్థానములో నామెహృదయమున ననుగ్రహము వొడమినది. ఆదీనునిగూర్చి తాను దప్పుతలంపులు తలంచి నందుకు మిక్కిలి పశ్చాత్తాప మొందినది. ఆబాధితునిముఖ మాసుం దరీమణికి దర్శనీయముగాఁ దోచినది. ఆస్వచ్ఛందసేవకుని పచ్చనిశరీ రచ్ఛాయయుఁ గళ లీనుచుండిన విశాలమైన ఫాలతలంబును, సొరు పెంపారు కనుముక్కుతీరును తదేకదృష్టితో నాయువతీమ చక్కఁగా బరిశీలించినది. వాడిన ముఖముతో, గాయమునుండి చిమ్ముచుండిన రక్తముతో, నాఖద్దరుధారుఁడు తనశిరస్సుచేరువనున్న మూటపై నానుకొని తన్ను రెప్పవేయక వీక్షించుచుండుట యాభ్రమ రేక్షణ

కనిపెట్టినది. ఇప్పుడే వచ్చి కట్టు కట్టెదనని డాక్టరు లాంతరుతో వెలుపలికి వచ్చినంతనే యీసుందరీమణి కామనోహరవ్యక్తి మజిల జీకటిమైనది. పాప మాదీనురా నింకఁ జేయునదిలేక యొక్క నిట్టూర్పు విడిచినది. ఖద్దరుబట్టల భద్రపఱచుకొని యింటికి బయలు దేరినది.



## 23 వ ప్రకరణము

### రహస్యోపాయము.

'అమ్మాయీ! నామాటవిను. బ్రాహ్మణుఁ డన్నవాడి కింత కంటె మరివుద్యోగం దొరకదు. నిజంగా ఇది శాస్త్రోక్తమైన వుద్యోగం. ఇప్పు డాక్షేపణ వచ్చిందికాని మహర్షులకాలంలో యీవృత్తి కేంతో గౌరవం వుండేది. పోనీ భారతంలో చూపిస్తే ను వొప్పుకుంటావా? మాటాడవమ్మా! అలా మొహం వొంచుకొని కంట నీరు పెట్టుకుంటే నీతో మరిమాటే మాటాడను. నీతో చెప్పడం పొరపాటయిందికదూ! పోనీలే! ఇహమీద నీతో ఏఁవీ చెప్పే చెప్పను.'

'అన్నయ్యా! ఆవేళ నూతిలోపడి బ్రతకడం పొరపాటే. వసంతంబావ నన్ను నూతిలోనుండి తియ్యడం బ్రతికించడం కోసం కాదు. చంపడంకోసం. నావిస్తరీఅన్నం బరువైందికాబట్టే అమ్మా అన్నయ్యా కలిసి నన్ను పెందరాళే నడిపేడాని కాపెళ్ళి తలపెట్టేరు. నీ కీకష్టాలన్నీకూడా నేను బ్రతికుండబట్టే. అందుచేత- అమ్మకీ-

అన్నయ్యకీ– నావిస్తరి బరువు కాకుండా– నాకోసం నువ్విన్ని కష్టాలు పడకుండా– నేను నాన్నగారిదగ్గిరికి– వెళిపోతాను.'

'భరింపరం! నోరెత్తేసరికి ఇలాంటపశకునం మాట లెందు కొస్తాయమ్మా? మొత్తానికి అమ్మా వదినా దెబ్బలాట్లమాటలన్నీ నీకూ్కడా పట్టుపడుతున్నాయి. నువ్వొక్కత్తెవే నాన్నగారిదగ్గిరికి వెళ్ళలేవు. నేనుకూడా వస్తానుపద! ఇద్దరం కలిసే పోదాం! ఇలాంటి ధోరణిలో నువ్వు మాటాడితే ఇహ కష్టం సుఖం నీతో యేం మాటాడను. పోనీ! నీతో మరేవీ ప్రసంగించనులే. ఇంట్లోకివెళిపో! వసంతంబావకి జ్వరం తగ్గిందో లేదో చూసి వస్తాను.'

'అన్నయ్యా! ఇందాకా అన్నమాట యెత్తకుండా వుంటే మరి యేంచెప్పినా వింటాను. ఆసంగతిమాత్రం యెత్తవద్దు. ఆమాట అనీ అనడంలో నాగుండెలుమీద గుద్దినట్టయింది. అది విని నేను భరించలేను.'

'భరించలేనంటే యెలాగమ్మా? తెల్లవారిలేస్తే యీఅన్నగత ప్రాణాలి కేవిటి దిక్కు? ఏదేనా ఆధారం వుండాలా? ఇహ వుద్యోగం దొరుకుతుందన్న ఆశ మరి నాకు లేదు. వ్యాపారాలన్నీ పడి పోయాయి– వర్తకం మందంగా వుంది. బ్రాహ్మణుడ కుద్యోగం యివ్వకూడదన్న రోజు లొచ్చాయి. నియోగినని చెప్పుకుంటే వైదీకి పాడు గొంటేస్తాడు. వైదీకినని చెప్పుకుంటే నియోగపాడు గొంటేస్తాడు– బ్రాహ్మణుడనని చెప్పుకుంటే శూద్రుడు గొంటేస్తాడు– ఉద్యోగం కోసం ఎన్నిపాట్లు పడ్డానో చిన్నపిల్లవి నీకు తెలియదు. అన్నివిధాలా ఆప్రయత్నంమీద నాకు విరక్తి పుట్టింది. అథవా ప్రయత్నిస్తానే యనుకో! ఎన్నిమాసాలకో ఎన్నిసంవత్సరాలకో కాని యివాళా రేవూ సిద్ధంగా దొరకదుకదా? దొరికేదాకా జీవయాత్ర సాగడం

యెలాగ? మనస్థితి దినం గడుస్తే దీర్ఘాయువుగా వుంది. ఇన్నీ ఆలోచించే యీవుపాయం నిశ్చయించాను తెల్లవారుజామున లేస్తాను. సన్యాసిలాగ వేషం వేసుకుంటాను. పాటపాడుకుంటూ వొకటి రెండు వీధులు తిరిగేసరికి వో సేడుబియ్యం దొరక్కపోవు. వెలుగు రాకుండానే మళ్లా యింటికి వెళిపో వస్తాను. పరమేశ్వరుఁ డెప్పటికేనా అనుగ్రహిస్తే—'

'అన్నయ్యా! మనకుటుంబంవిషయంలో– పరమేశ్వరుడూ– అనుగ్రహం– అన్నమాటలు– అర్థంలేని వ్యర్థపదాలు. ఆపదలు కాపరం చెయ్యవనీ– కష్టసుఖాలు కావడికుండలనీ– చెప్పుకుంటున్న సామెతలు లోకానికేకాని మనకుటుంబానికి వర్తించవు. కాలం చక్రంలాగ తిరుగుతుం డంటారు. మనకుటుంబంలో కాలచక్రానికి సీల బిగిసిపోయిందికాబోలు! నాటికీ నేటికీ వొక్కలాగే వుందికాని వొక్కఅంగుళంకూడా కదలలేదు. పొరుగునే మామయ్యగారి కుటుంబం వుండగా– నన్ను చూస్తే పంచప్రాణాలూ పెట్టే సుందరమ్మగా రుండగా– నువ్విలాంటివుపాయం ఆలోచించడం నాకేఁవీ యిష్టంలేదు.'

'ఎందరున్నా ఏంచేస్తారమ్మా? దశరథుడూ వసిష్ఠుడూ మంత్రిలూ– తమ్ములూ– తల్లులూ అంతా చూస్తూ వుండగానే రాముడడవికి బయలుదేరేడు. భగవంతుడైన కృష్ణు డున్నప్పటికీ పాండవులకి భిక్షాటనం తప్పిందికాదు. చుట్టూ ఎంతమంది వైద్యులు కూర్చున్నా రోగికి రోగం అనుభవించక తప్పదు. దరిద్రంకూడా రోగంలాంటిదే. మనకున్న అప్తు లెంతధనవంతులైనా మన కీయనుభవం తప్పదు. పోనీ నీకు కష్టంగావున్న యీవుపాయం విడిచిపెట్టేస్తాను. ఒక్క విషయంలో నువ్వు పూచీ పడతావా? ఇంటిలో వంట లేనప్పుడల్లా

నువ్వు మావయ్యగారికుటుంబంలోనో, లేకపోతే సుందరమ్మగారినో అడిగి వోసేరుబియ్యం పట్టుకొస్తూ వుంటావా? చెప్పు.

'వంట లేనప్పు డల్లాకాదు- ఒక్కరోజు కాదు- ఒక్కపూటకి కూడా నాప్రాణంపోయినా నడగలేను.'

'ఔనామరి! ఇంతమందీ వుండగా మనకేం ప్రయోజనం కలిగిందో నువ్వే చెప్పు! అందుకే యీవుపాయం ఆలోచించాను. ఈవుపాయం శాస్త్రసమ్మతమయినదీ- బ్రాహ్మణుడికి చెప్పినదీ- పవిత్రమయినదీ- రెండోకంటికి తెలియనిదీ- ప్రస్తుతం మన కిబ్బంది లేకుండా దినచర్య గడిపేదీ- మరోఆధారం యెప్పుడు కలిగితే అప్పుడే మానీవచ్చు...............'

'అన్నయ్యా! ఇన్నింటిలో రెండోకంటికి తెలియ దన్నావు. అదొక్కటే నాకు నచ్చింది.'

'ఎలా తెలుస్తుంది? నువ్వు చెప్పవు- నేను చెప్పను. మరొకరికి తెలియదు. బయటపడితేకదా మనకి చిన్నతనం?'

'సరే! ఈయాలోచనయిందికదా! ఇంక లేచి వోమారు బావను చూసి రావద్దూ?'

'వెళదాంకానీ- బావకీ వుూష్టం యెందుకొచ్చిందో పోల్చావా?

'నేనా పోల్చేదాన్ని? వైద్యుడుకాని- దగ్గూ ఆయాసంమాత్రం అధికంగా వున్నాయి.

'అది కా దమ్మా! ఇది బెంగవుూష్టంలాగ నాకు తోస్తూంది.'

'పెళ్ళివిషయంలోనా?'

'ఔను. అదే! శుక్రవారం వచ్చి శనివారంనా డల్లుణ్ణి తీసుకు వెళతానని మొన్న శాంభుక్త వుత్తరం రాశాడు. ఆవుత్తరం వచ్చి నప్పటినుండీ వసంతంబావకి మొహాన్ని కళలేదు. నిద్రాహారం లేక రాత్రీ పగలూ బెంగపెట్టుకొని కూర్చున్నాడు. తండ్రిమాటకి వ్యతి

లేకం చెప్పలేడు- చెప్పే స్వభావం కలవాడు కాడు. ఈవిషయంలో నాకో అనుమానం కలిగింది చెప్పేమన్నావా?'

ఏమిటా అనుమానం?

ఇంట్లోవున్న ఆడవాళ్లే నిన్నడగవలసినప్రశ్న నే నడగవలసి వచ్చింది. ఇలాంటిప్రశ్నలు— అమ్మ నిన్నడగదు- నువ్వు చెప్పవు. అందుచేత నే నడుగుతున్నాను. వసంతంబావకి నిన్ను పెళ్ళి చేసుకో వాలనేప్రద్దేశం వున్నట్టు నాకు స్ఫురించింది. అదే నిజమైతే నీ కిష్టం లేనా?''

''అన్నయ్యా! ఇది ప్రయోజనం లేనిప్రశ్న— ఎవ రెవరిష్టా లెలాగున్నా మామయ్య కిష్టంవుండొద్దూ?''

''ఔను. ఆమాటా నిజమే. ఆవేళమధ్యాహ్నం సావిట్లో జరిగిన ప్రసంగంలో మామయ్యవుద్దేశం బోధపడ్డాది. అయినా బావ యిష్టపడుతూన్నప్పుడు మనం ప్రయత్నించడాని కవకాశం లేకపోలేదు.''

''ఏప్రయత్నానికేనా మొంటాడసంబంధం తప్పితేకదా? బ్రిహ్మేదు లక్ష్మపడినా అదితప్పేటట్టు కనబడదు. బావ కిష్టం లేదన్న సంగతి తెలిసీకూడా మామయ్య ఏధైర్యంచేతనోకాని మాటాడకుండా చెయ్యవలసిన ప్రయత్నాలు చేసేస్తున్నాడు.''

''కొడు కెప్పుడూ తనమాటకి వ్యతిరేకం చెప్పడని— ఇంతకు తండ్రి కేంధైర్యం కావాలి? కాని నేను వసంతానికి బోధపర్చి తండ్రితో గట్టిగా చెప్పించి చూస్తాను.''

''బెంగవూష్టం పెట్టుకున్నబావ గట్టిగా చెప్పడం కూడానా? ఉత్తరంప్రకారం కాంభుక్త నిన్ననే వచ్చుండాలి. మరి వ్యవధి కూడా లేదు.

''వస్తేమాత్రం— ఉత్సాహంతో యెలా వెళతాడు?''

అని పెన్నికలు జరిగిన మఱునాటియుదయమున నెనిమిదిగంట లప్పుడు లక్ష్మీకాంతమును భ్రమరమును దమయింటిచావడిలోఁ దాటాకుచాపపైఁ గూర్చుండి సంభాషించుచుండిరి. ఉద్యోగభంగము వలనఁ గలిగిన మనస్తాపముచేతను, వారము పదిదినములనుండియు లేనియొకమొకము మఱలఁ గుటుంబమునకుఁ దటస్థించుటచేతను, లక్ష్మీ కాంతము రాత్రియంతయుఁ గలతనిద్రతోడనే గడపి వేకువజాముననే లేచి, సంసారరథగమనమునకు మార్గ మాలోచించుచుఁ గూర్చుం డెను. ఆయాలోచనములో నాతనికి స్ఫురించిన యుపాయమునకు భ్రమరము లేశమును సమ్మతింప దయ్యె. భ్రమరము మేలుకొనుటకు సుందరమ్మకుఁ దోడుపడునుత్సాహముతో నతఁడుద్యోగముపై నెంత నిరాశ చేసికొన్నను, ఉద్యోగభంగమైనతరువాతమాత్రము వాని మనసు పరిపరివిధములఁ గలత నొందుచునే యుండెను. ఆనాడు కచేరి చావడిలో ఖద్దరుధారణమునుగూర్చి యతఁడు ప్రొప్రయిటరుచే నవ మానింపఁబడి నప్పటినుండియు వాని కుద్యోగముపై నిరాశయు సుందరమ్మకుఁ దోడుపడునాశయమును మఱింత యధికమైనవి. అధిక మైనను దొరకక దొరికిన యుద్యోగమునకు భంగము వాటిల్లె నను విచారము మాత్రము వానిని బాధించుచునే యుండెను. విచారము కలిగినప్పుడెల్ల నస్థిరచిత్తుఁడు నిరక్షరకుక్షియు దుర్వ్యయపరుఁడు నగునట్టిప్రభువుకడ దొరకిన కొలు వెంతకాలము నిలుచునని మఱలఁ దనలోఁ దానె సమన్వయించుకొని తృప్తి పడుచుండెను.

భ్రమరము సుందరమ్మతోఁ బ్రసంగించివచ్చి, తాళ మీయ వలదని మనము చెప్పుకున్నయెడల, లక్షలకొలది విలువగల సుంద రమ్మగారి యాస్తియంతయు నొక్కక్షణములో లక్షింపతిచేతిలోఁ జిక్కిపోవలసినదేసుమా యని తనతోఁ జెప్పినప్పుడుమాత్రము లక్ష్మీ కాంత ముద్యోగభంగవిషాదమును బరిత్యజించి తనజన్మము సార్థక

వెుసల్లు సంతసించెను. నిష్ప్రయోజనమైన తనదరిద్రజీవితములోఁ దనవలన నొకరి కుపకారము కలిగినందుకుఁ దనలోఁ దానె యాశ్చర్య పడసాగెను. తాళ విూయవలదని పంపినవార్తకు సుందరమ్మరాజే శ్వరమ్మలు తన్ను మెచ్చుకొనినవిధంబును, రాజేశ్వరమ్మ తనతో స్వయముగాఁ బ్రసంగింపఁ గోరుచున్నవిధమును భ్రమర మెఱింగించి నంతనే, లక్ష్మీకాంత యానందపరవశుఁడై భ్రమరము వివాహము నకు వారివలనఁ దగిన ధనసాహాయ్యము తనకు లభింపఁగలదని కొం డంత ధైర్యము వహించెను. కాని యాధనసాహాయ్యముతో భ్రమ రమునకుఁ జేయనున్న వివాహమునకు వరుఁడు వసంతుఁడా మఱియొ కఁడా యనుసంశయముమాత్రమే వానిని బాధించుచుండెను. వసంతు నకు భ్రమరమునం దనురాగ ముదయించినసంగతి వాని కింతకు మున్నే స్ఫురించినను, భ్రమరమునకుఁగూడ వసంతునియందుఁ బ్రేమ గలదనువిశేష మానాడే వానికి స్పష్టమైనది. అందుచే నావిషయ మునుగూర్చియు ముందుముందుఁ దీవ్రముగా నాలోచించి శక్తియు న్నంతవఱకుఁ బ్రయత్నింపవలయునని లక్ష్మీకాంతము నిశ్చయించు కొనెను. దినదినగండమై వేధించుచుండిన కుటుంబభార భరణమును గూర్చి నిత్యము నుపాయాంతరము లాలోచించుచుండుటలో భ్రమ రము వివాహమునుగూర్చి కాని, సుందరమ్మకుఁ దోడుపడువిషయమును గూర్చికాని శ్రద్ధగా యోచించుటకుఁ బాపము లక్ష్మీకాంతమున కవకాశమే కలుగ దయ్యె.

జీవయాత్రకై ప్రస్తుతము తాను గనిపెట్టిన యుపాయమునకు సమ్మతింపని భ్రమరము నెట్టులో సమ్మతింపఁజేసి, తొలినాటిరాత్రి నుండియు జ్వరబాధితుఁడైయుండిన వసంతము నొకమాఱు చూచి రావలయునని లక్ష్మీకాంత ముద్యమించుచుండ నింతలోఁ బేరమ్మ వచ్చినది. గుమ్మమెక్కి చావడిలోఁ బ్రవేశించిన పేరమ్మను జూచి భ్రమరము నవ్వుచు—

'రండి పేరమ్మగారూ! రండి కూర్చోండి! ఏమిటి విశేషాలు? సుందరమ్మగారేం చేస్తున్నారు?'

'తల్లీ కూతురూ కూర్చుని మాటాడుకుంటున్నారు. మీతో చెప్పిన సంగతి యేమయిందో కనుక్కోమన్నారు. మీ చిన్నన్నయ్య గారికి తీరుబడిలేకపోతే రాజేశ్వరమ్మగారే వస్తారట! వీలైతే మిమ్మల్నోమారు రమ్మన్నారు.'

'కూర్చున్నారు కాదు. నిలబడే మాటాడుతున్నారు.'

'కూచోనమ్మా కూచోను. మెంటాడనుంచి చుట్టం వచ్చాడు. సుందరమ్మగారితో చెప్పి వేగిరం యింటికి వెళ్లిపోవాలి.'

'ఎవరమ్మా ఆచుట్టం? ఎందుకొచ్చాడేమిటి?'

'ఇహ ఎవరని అడక్కండి! అవసరంవస్తే అంతా చుట్టాలే! కాంభుక్తా అనే మెంటాడగ్రామానికి పురోహితుడు. మా పెదమామ గారి సవితన్నదమ్ముడికి వోవేలువిడిచిన మేనమామకొడుకు. కూతురికి సంబంధం చూడ్డాని కొచ్చాడు. రామావధానిగారికొడుకట! కతికితే అతకదని మాయింట్లో దిగేడు. మరి నన్ను నిలపెట్టకండి! ఏం చెప్పమన్నారు రాజేశ్వరమ్మగారితో—'

'మాచిన్నన్నయ్య తప్పకుండా వస్తాడని చెప్పండి.'

'ఎప్పుడొస్తారంటే?'

ఆప్రశ్నకు భ్రమరము ప్రత్యుత్తర మీయక లక్ష్మీకాంతము ముఖము చూచుచుండ నతఁడించుకసే పాలోచించి, పేరమ్మను జూచి,

'మధ్యాహ్నం తప్పకుండా వచ్చి దర్శనం చేస్తానని చెప్పండి.'

అని పలికినంతనే పేరమ్మ గొంక్కవిసురునఁ జావడిలోనుండి నిష్క్రమించెను. పేరమ్మ వెడలిపోయినంతనే లక్ష్మీకాంతము

'భ్రమరం!' అని పిలిచి, యేమేమో యాలోచించుచు మూఁడు నాలుగునిముసములవఱకు నట్లే యూరకుండ, భ్రమరము—

'అన్నయ్యా! దేని కాయాలోచన?'

'వేరమ్మ వచ్చి వెళ్ళిపోగానే మెంటాడసంబంధం తప్పించడానికి నాకో చిన్నవుపాయం స్ఫురించింది—అయితే—'

'అయితే అని మళ్లా సంశయం దేనికి?'

'నువ్వు సిగ్గుపడకుండా ధైర్యంగా నేను చెప్పినట్లూ సుందరమ్మగారితో మాటాడ గలిగితే ఆవుపాయం నీతో చెప్తాను.'

'నాప్రాణం రక్షించాలని తనప్రాణంకూడా తెగించిన వసంతంశావకి మేలు చెయ్యడంకంటె నాజన్మకి మరిసార్థకం యేఁవుంది? అతని కిష్టంలేని మెంటాడసంబంధం తప్పించడానికి—యెవరితో యెంత ధైర్యంగా యేం మాటాడమన్నా మాటాడతాను. అదేదోచెప్పు''

లక్ష్మీకాంత మామాటలకు సంతసించి తనకుస్ఫురించిన రహస్యోపాయము భ్రమరముచెవిలోఁ చెప్పెను.



## 24 వ ప్రకరణము

### లేమియందలి కలిమి.

మెంటాడసంబంధమును దప్పించుటకుఁ దనకుఁ దోఁచినయుపాయమును రహస్యముగాఁజెప్పి, సుందరమ్మతో మాటాడవలసినవిధానమంతయు నెఱింగించినంతనే భ్రమరము లక్ష్మీకాంతమున కిట్లనియె.

'పేరమ్మమాటలనుబట్టి ఆవిడ సుందరమ్మగారిదగ్గిర సెలవు పుచ్చుకొని వేగిరం యింటికి వెళిపోయేట్టు తోస్తూంది. పేరమ్మ వెళిపోకుండానే నేను సుందరమ్మగారితో మాటాడాలికదూ?'

'ఔను. మాటాడాలి. ఆలస్యంచేస్తే కార్యం చెడుతుంది. కాని- ఇవాళ వంటయేసరి కెంతసే పవుతుందో? చల్దన్నం యేమేనా వున్నాదేమో కనుక్కున్నావా?,

'శ్యామలా సోమరాజబావా యిద్దరూ తింటున్నారు. చాల్తుందో చాలదో అని వదిన నన్ను కొంచెం వెనక్కుండ మన్నాది.'

'అవున్నదే కాస్త సర్ది పెట్టలేకపోయిందా? అమ్మేంచేస్తు న్నాది.'

'సర్ది పెట్టడానికి బావ వొప్పుకోడు. అమ్మ యింట్లో లేదు. బియ్యం అప్పడగడానికి యెవరింటికో వెళ్ళింది.'

'పోనీ కొంచెంసేపుండి అన్నం వుంటుందేమో చూచుకొని మరీవెళ్ళు.'

'ఆలస్యంచేస్తే మనం అనుకున్నది మించిపోతుంది. వుండెడు మెతుకులేనా మిగుల్తాయో మిగలవో? ఈభాగ్యంకోసం కొండంత కార్యం పాడుచేసుకో మన్నావా?'

'అయితే యివాళకిమాత్రం సుందరమ్మ భోజనానికి రమ్మంటే మొహమాటం పడకు!'

'ఆవిడ తప్పకుండా పిలుస్తుంది కాని-అబ్బా! అక్కడ భోజనం చెయ్యడానికి నామనస్సుకి కష్టంగా వుంటుం దన్నయ్యా!'

'అలాక్కాదు. నామాట విను. ఇవా ళొక్కరోజేకదూ? రేపటినుండీ యేబాధా లేదు. ఏదో వుపాయం భగవంతుడు తోపించాడు.'

అన్నగారు పలికిన కడపటిమాటల కాపాలికామణి మొగము చిన్నపుచ్చుకొని తక్షణమే యందుండి బయలుదేరెను. లక్ష్మీకాంతము వసంతునియింటికిఁబోయి చావడిలోఁ బ్రవేశించినంతనే పసుపుఁ బచ్చని ఖద్దరు శాలువ గప్పుకొని కఫజ్వరముచే నాయాసపడుచు వాలుకుర్చీయందు నీరసముగాఁ బరుండిన వసంతుఁ డాతనికంటఁ బడెను. వానిప్రక్కనే స్వారాజ్యము కూర్చుండి యొడిలో నుంచుకొనిన ఛాయాప్రతిమ మాటిమాటికిఁ జూచుచు నతఁ డడిగినప్పుడెల్ల కాఫీ యిచ్చుచుండెను. వానికట్టెదుటనే కామేశ్వరమ్మ నిలువఁబడి యాయాస మెట్లున్నదనియుఁ దలనొప్పి తగ్గినదాయనియుఁ గుమారుని బ్రశ్నించుచుండెను. లక్ష్మీకాంత మచ్చటఁ బ్రవేశించినంతనే వసంతునిముఖముపైఁ జేయిడి కొంతసేపు చూచి, కామేశ్వరమ్మ నుద్దేశించి—

'ఎవరిచేతేనా చెయ్యి చూపించారా అత్తయ్యా!'

'పొద్దున్నే పూజారి గౌరీశం వచ్చి చెయ్యి చూసి పుష్టం బాగానే వుందని చెప్పివెళ్ళేడు. తరువాత యెవరో డాకటరు బగ్గీమీద వెళిపోతూవుంటే మీమామయ్య చూసి పిలిచి చెయ్యి చూపించారు. అతగాఁడు పీవ రొచ్చిందన్నాడు. పుష్టంమీద పీవ రొస్తే మరేం భయంలేదుకదా కాంతం?'

ఆప్రశ్నకు లక్ష్మీకాంతవసంతరావు లొండురుల ముఖములఁ జూచుకొని నవ్వుకొనసాగిరి. స్వారాజ్యము ముఖమునందుమాత్రము హాసాంకురములు లేశము నుదయింపలేదు. ఆసాధ్వీమణిదృష్టి యంతయు నొడియం దుంచుకొనిన ఛాయాప్రతిమయందే లగ్నమైయుండెను. ఆదీర్ఘదృష్టులలో నొకప్పుడు కేవలము నిరాశయు నొకప్పుడు కొండంత యాశయు నామెముఖమునఁ దాండవించుచుండ, ఉత్పలములనుండి దొరగు జలకణంబులవలె నామెకాటుకకన్నులనుండి

వెడలు నీటిబొట్టులు నిరాశచేఁ బొడమిన దుఃఖబాష్పములో, నాశచే గలిగిన సంతోషాశ్రువులో తెలియరానివయ్యె. వసంతరావు లక్ష్మీకాంతమును గూర్చుండుమని చెప్పి, యతఁడు చేరువనేయున్న యొక కుర్చీపైఁ గూర్చుండినంతనే, తనయొద్ద దీనానయై కూర్చుండిన స్వారాజ్యమును నాతనికిం జూపి,

'కాంతం! యింట్లోవుంటే యిదే మోస్తరు! నిన్న ఖద్దరమ్మడానికి వెళ్ళి ఆలస్యంగా యింటికి వచ్చిందని నాన్నగారు కోప్పడి యివాళనుండీ మరివెళ్లొద్దన్నారు. అందుచే ఈపూట వెళ్ళడం మానీసింది.'

అని యాయాసముచే దగ్గుచు మఱి మాటాడ లేకపోయెను. ఆమాటలు విని స్వరాజ్య మన్నగారిని జూచి.

'నాన్నగారు కోప్పడ్డారనే కాదు. నీకూష్టంవస్తే యెలా వెళ్లేది?'

'నావూష్టానికి నువ్వు చెయ్యవలసిన వుపచారాలేవీ లేవు. మధ్యాహ్నం వెళ్లు. నేను నాన్నగారితో మాటాడతాను.'

అని యాయాసముతోడనే వసంతరావు పలుక, గామేశ్వరమ్మ లక్ష్మీ కాంతమును జూచి—

''కాంతం! వొఖసంగతి చెప్తాను విను. చెన్నపట్టంవెళ్ళి మొగుణ్ణొమారు చూడాలని దీనికి బాగా బుద్ధి పుట్టింది. పంపించడానికి వాళ్ళనాన్న కిష్టం లేదూ— తీసికెళ్ళడానికి వాళ్ళన్న కిష్టం లేదు. నాతో చెప్పుకొని యేడుస్తుంది. ఆడదాన్ని నే నేం చెయ్యగలను?''

అని సణుగుకొనుచు నచ్చటినుండి లోనికిఁ బోయెను. అప్పుడే రామావధాని వీధిలోనుండి వచ్చి తాను దెచ్చిన మందుసీసాయును నమ్మందు పుచ్చుకొనవలసిన విధానము వ్రాయఁబడిన కాగితమును,

వసంతుని చేతి కిచ్చి, యచ్చట నిలువకయే యింటిలోనికిఁ బోవుచు, మరల వెనుకకుఁ దిరిగి—

"వసంతం! నాయుడికీ ప్రొప్రయిటరుకీ వోట్లు సమంగానే వచ్చాయిటోయ్! చిన్నబజార్లో చెప్పుకుంటున్నారు, మళ్లా యెప్పుడో వోట్లు వేయిస్తారట! నిర్భాగ్యుడు ప్రొప్రయిటరు నీవోటు పాడుచేసుకున్నాడుకాని నిన్న నువ్వుకూడా వోటిచ్చుంటే గెల్చేవుండును."

"ఔను. వాడిగర్వం వాణ్ణి తినేసింది. ఆదిలో నావోటుకోసం చాలా తాపత్రయం పడ్డాడుకాని క్రమంగా గర్వం బలిసిపోయింది. మొన్న బావ కుద్యోగం తీసేసి పొమ్మన్నప్పుడు, దగ్గిరున్నవాళ్లు వసంతరావు వోటివ్వడేమో అంటే, వెధవోటు వొక్కవోటు పోతే నాకు లక్ష్యంఁ వేఁవిటన్నాట్ట! ఇప్పుడు తెలుస్తుంది నావొక్కవోటూ ఎన్నివేల ఖరీదో"

ఆమాటలకు నవ్వుకొనుచు రామావధాని లోని కేగినతరువాత లక్ష్మీకాంతము వసంతుని చెంతనే పదిగంటలు వేసినంతవఱకు నుండి పిమ్మట లేచి మరల వచ్చెదనని వానితోఁ జెప్పి యింటికివచ్చి, సర్వశూన్యమై ఘోరదారిద్ర్యమునకు భాండార మనందగిన మహానసగృహములోఁ బ్రవేశించెను. చావడిలోఁ గాలు పెట్టుసరికే వంటయింటినుండి వెడలుచుండినధూమరేఖలం గాంచి, తనతల్లి యెచ్చటినుండియో బియ్యము తెచ్చి వండుచున్నదని భ్రాంతిపడెనుగాని, పోయి చూచుసరి కది వంటకాదని వానికి స్పష్టమయినది. తొలినాటిసాయంకాలమున వీరమ్మయు భ్రమరమును బొరుగింటివారి బొమ్మలకొలువు చూచుటకుఁబోయి వాయనములు తెచ్చిన సెనగలను సూరమ్మ యప్పుడు వేయించుచుండెను. బాల్యచాపల్యముచే శ్యామలయు జిహ్వాచాపల్యముచే సోమరాజును జించినయాకుముక్కలతో నావంటింటియందే కూర్చుండిరి. పెరటిగుమ్మముకడ నున్నజాతి

కోటిలో వీరమ్మ మిరెపకాయలపొడి దంపుచుండెను. పొగబట్టిన కన్నుల బట్టకొంగుతో నొత్తుకొనుచు సూరమ్మ లక్ష్మీకాంతమును జూచి, 'కాంతా! అన్నయ్య బళ్లోనుండి వచ్చి మళ్ళా వీధిలోకి వెళ్లేడు. ఏఁవవుతుందో తెలియదు. మామయ్యగారింట్లో భ్రమరం వుంటుంది పిలు! నువ్వు చెప్పకుండా వీధిలోకి వెళ్ళిపోకు! రెండుగింజలు తిని నీళ్లు తాగుదుగాని' అని చెప్పెను.

లక్ష్మీకాంత మామెమాటల కేమియుఁ బ్రత్యుత్తర మీయక క్రమ్మఱ వీధియరుగుపై కేగి యాతాయాతజనంబుల వీక్షించుచు నచ్చట నొంటరిగఁ గూర్చుండెను. పదునొకండుగంటలపై నొక్కయరగంట యగుసరికి వీధిలోనికి వెళ్లిన సుబ్బారావు శూన్యహస్తుఁడై వచ్చినంతనే లక్ష్మీకాంత మది కనిపెట్టి వాని నేమియుఁ బ్రశ్నింపక తనలోఁ గర్తవ్యము నూహింపసాగెను. సుబ్బారావు తిన్నగఁ బెరటింటిలోని కేగి యచ్చటఁ దల్లియిచ్చిన సెనగలు తిని చేయి కడిగికొని, మఱలఁ జావడిలోనికి వచ్చుసరికి, లక్ష్మీకాంతము గదిలోనికిఁబోయి తండ్రిగారిపూజాసామగ్రిలో నప్పటికి శేషించిన రాగిహరివాణమును గొనివచ్చి యన్నగారికిచ్చి మఱల వానిని వీధిలోనికిఁ బంపెను. భ్రమర మెచ్చటనున్నదో తీసికొనిరమ్మనియు సెనగలు తినుటకుఁ దన్నురమ్మనియు నప్పుడప్పుడు తల్లి తన్నుఁ బిలుచుచువచ్చెనుగాని యతఁడు జవాబు చెప్పలేదు. ఉన్నచలిదన్నమును సర్ది భ్రమరము నకుఁగూడఁ బెట్ట లే దనుకోపమున లక్ష్మీకాంతము తల్లితోఁగాని వదినగారితోఁగాని మాటాడక, పండ్రెండుగంటలైనంతనే పెరటిలోనికిఁబోయి స్నానముచేసి, తలకు నూనె రాసికొని పాపట దువ్వుకొనవలయునని వంటింటిలోని నూనెగిన్నెకడకు వచ్చి యయ్యది తైలశూన్యమై యుండుటచేఁ జావడిగదిలోఁ బ్రవేశించి, తడితలయందే పాపట సవరించుకొని, మఱల వచ్చెదనని చెప్పివచ్చిన

వసంతునొక్కసారి చూచి రావలయునని యనుకొనెను. అందుచేఁ దసముఖము తనయభోజనమును జెలుపకుండ నుదుటఁ జక్కని యంగారుచుక్క పెట్టుకొని బట్టలు కట్టుకొని వీధిగుమ్మములోనికి వచ్చినంతనే బియ్యముమూటతో సుబ్బారావు వాని కెదురై

'కాంతం! నాయుడుప్రోత్సాహంమీద ప్రొప్రయిటరు బాకీ వున్న కోమట్లంతాకూడా రిజిస్ట్రీవుత్తరాలు రాసి వొక్కమారే దావాలు పడేడానికి నిశ్చయించుకున్నారట! ఇంతమందికీ వొక్కమారెలా యిచ్చుకుంటాఁడో?'

'ఇచ్చుకో లేకేం? ఇచ్చేస్తాడు. తుకారాం నలభై వేలివ్వాలి. ఆసొమ్ము వసూలైతే సహమంట్టుకు కొట్టి పారేస్తాడు.'

'ఏదో చాలాగందరగోళంగానేవుంది. ఏఁవవుతుందోకాని-ఎవరో లక్ష్మింపతిట! పాపం వోస్వరాజ్యవాలంటేర్ని బుజ్జ బద్దలు కొట్టించేశాట్ట! నాయుడు కలక్టరుదగ్గిరికి వెళ్ళి యీసంగతి స్వయంగా చెప్పడానికి నిశ్చయించుకున్నాట్ట!'

అని బజారువీధిలోఁ దానువినివచ్చిన వార్తలను జెప్పి సుబ్బారావు లోనికిఁబోయెను. సుబ్బారావు చెప్పినసంగతులనే లక్ష్మీకాంతము మఱలమఱలఁ దనలోఁ దలంచుచుఁ బర్యవసాన మేమగునో యని యనుకొనుచుఁ దన్ను నిష్కారణము పరిభవించిన ప్రొప్రయిటరున కెన్నఁడును జయము గలుగరాదని శపించుచు నచ్చటనే కొంతసేపు నిలువఁబడియుండ లోని కేగిన సుబ్బారావు మఱల వచ్చి-

'కాంతం! భ్రమరంపుస్తకాలు పెట్టుకున్న పేకాజీడొక్కటి కావాలి'

'ఎందుకు? పొయ్యిలోకేనా?'

'ఔను. కట్టెలూ లేవు-బొగ్గులూ లేవు.'

'అది వచ్చి చూసిందంటే యేడుస్తుంది, పుస్తకా లెక్కడేనా

జాగ్రత్తగాపెట్టి యాడొక్క తీసుకో'

అని ప్రత్యుత్తరమిచ్చి లక్ష్మీకాంతమచ్చట నిలువక వెంటనే వసంతునియింటికి వచ్చి చావడిలో యథాపూర్వకంబుగఁ గూర్చుండిన వసంతరావును జూచి,

'వసంతం! అప్పటినుండీ యిక్కడే కూచున్నావా?'

'లేదోయ్! ఇప్పుడే వచ్చాను. ఎంతకని పడుకోవడం ఆగదిలో?'

'జావ తాగేవా? కాఫీ తాగేవా?'

'రెండూ అసహ్యంగానే వున్నాయి నోటికి?'

'ఆయాసం కొంచెం తగ్గిందా?'

'దగ్గు జాస్తీగా వుందోయ్'

ఇంతలో స్వరాజ్యము లోపలినుండి వచ్చి,

'అన్నయ్యా! మూడునాలుగేళ్ళకిందట మీరంతా చెన్నపట్టంలో ఫోటోగ్రాపు తీయించుకున్నారుకదా అది వుందాపోయిందా?'

'వుండాలమ్మా! దాని కద్దం కట్టించలేదు. కావిడిపెట్లో పడేసినట్లు జ్ఞాపకం. ఇప్పుడెందు కదీ?'

ఆమాట కామె ప్రత్యుత్తర మీయక దొడ్డివిసురున లోనికి నేగెను. అప్పుడొక బ్రాహ్మణుఁడు చెవులకుఁ గుండలములును జేతులకు సింహముఖములైన కంకణములును ధరించిన నల్లనిలావైన పొట్టివిగ్రహమువాఁడు చావడిలోఁ బ్రవేశించి, లక్ష్మీకాంతమును జూచి, 'రామావధానిగా రున్నారా?' యని ప్రశ్నింప వసంతరా వాతనిముఖమును జూచి 'నాన్నగారు భోజనంచేసి పడుకున్నారు. లేపమన్నారా' అని మిక్కిలి దగ్గుచు, నాదగ్గుటవలనఁ గలిగిన యాయాసముతో నడిగెను. ఆబ్రాహ్మణుఁడు వసంతుని ముఖమును దదేకదృష్టితో నిదానించి చూచిచూచి

'ఎందు కెందుకు? లేపఖర్లేదు. మళ్లా వచ్చి దర్శనం చేస్తాను.'

'తమ రెవరో పిలవిస్తే లేవగానే నాన్నగారితో చెప్తాను.

'ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. చిన్నపని చూసుకొని యిప్పుడే వస్తాను.'

అని ఆ బ్రాహ్మణుఁడు మఱియచ్చట నిలువక తొందరపని గలవానివలె వడివడిగా నందుండి వెడలిపోయెను. ఆ బ్రాహ్మణుఁ డెవరని లక్ష్మీకాంత వసంతరావు లొండొరులముఖములు చూచుకొని ప్రశ్నించుకొనుటకు సిద్ధముగానుండఁగా, దీనమైన వదనముతో స్వరాజ్యము లోపలినుండి మఱల వచ్చి—

'అన్నయ్యా! నువ్వు చెప్తేనేకాని నాన్నగారు వెళ్ళమనరు.'

'అలాగే నమ్మా! నేను చెప్పి పంపిస్తానుకదూ! గడియగడియకీ నన్ను బాధపెట్టకు!'

'లేవగానే చెప్తావా?'

'ఎప్పుడు చెప్తే నీ కెందుకు? నిన్ను పంపించే పూచీ నాదీ.'

ఆమాటలచే వికసించినముఖముతో రాజ్యాంబ లోనికేగుటయు లక్ష్మీకాంతము లేచి వసంతుని చేతిగడియారమును జూచి యొంటిగంటపైఁ బదినిముసములగుట యెఱింగి రెండుగంటలకు రాజేశ్వరమ్మగారియింటికి వెళ్లవలసినవాఁడు గావున వసంతుని లోనికేగుమని చెప్పి తాను భోజనము చేయుటకింటికి వచ్చెను. గుమ్మములోఁ గాలు పెట్టునరికి నాటియుదయమున భ్రమరమునకుఁ జలిది యన్నమును బెట్టనివిషయమునుగూర్చి తీవ్రముగా వాదన జరుగుచుండెను. పెట్టలేదని సూరమ్మయుఁ బెట్టుమని చెప్పలేదని వీరమ్మయుఁ బలుకుచుండిన వాక్యోపవాక్యములతో నాజగడము క్రమక్రమముగా వృద్ధిలోనికి వచ్చినది. లక్ష్మీకాంత మరుగుపైనే కూర్చుండి యాజగడ మెప్పటికైన జల్లారునేమోయని యిరువదినిముసములవఱకు నిరీక్షించెనుగాని యింతలో నాగ్రహావేశముతో సుబ్బారావు

కంఠముగూడ నతిభయంకరముగ వానికి వినఁబడెను. రెండుగంటలవేళ సమీపించుచుండుటచే నింటిలో నాజగడము చల్లారుటయు దనకు భోజనము కొరకైనయు జరుగనేరదని యాదినము తనకుఁ బెట్టిపుట్టని దినమని లక్ష్మీకాంతము నిశ్చయించుకొని, వసంతుని జబ్బుచే శ్రీనివాసవిలాసమునకుఁ బోవని కారణమున నుదయము నుండియు నొకకప్పెడు కాఫీయైనలేక కాలుచుండిన కడుపుతో మలమలమాడుచుండిన యాయెండలో రాజేశ్వరమ్మయింటికి బయలుదేరెను. ఎండలో వాడియుఁ బ్రొద్దుననుండియు భోజనము లేకుండియుఁ దీర్చిదిద్దిన ప్రక్కపాపటచే వంకరలువారిన ముంగురులతో రంగారుచున్న వానివదనమునందలి సహజలావణ్యము దర్శనీయమై దారిఁబోవువారి నొక్కమాఱైనఁ దనవంకఁ జూడఁ జేయుచుండెను.

ఇట్లు లక్ష్మీకాంతము గమ్యస్థానమును జేరి ప్రాకారద్వారములోఁ బ్రవేశించుసరికిఁ దదాగమనమును నిరీక్షించుచున్న పేరమ్మయు భ్రమరమును మేడపైనున్న ముందరివసారాలోనుండి చూచి, చప్పున లోనికిఁ బరువెత్తిరి. వాకిటంటె ముందుగనే చల్లని యయ్యావరణమునందలి శీతలమందవాతపోతములు తన్ను నాహ్వానించుచుండ లక్ష్మీకాంతము తిన్నఁగాబోయి మెట్లెక్కి చావడిలోఁ బ్రవేశించుసరికి, మేడదిగి తనకొఱకు వచ్చినభ్రమరమును బేరమ్మయు వానికెదురై వానిని మేడమీఁదికిఁ దీసికొనిపోయిరి. ఆ మహాభవనమందలి గృహాంతరమార్గములనుండి పోవుచుండినప్పుడు భ్రమరమునందలి చుఱుకుఁదనమును జూపులయందలి సంతుష్టియు ముఖమునందలి యానందమును లక్ష్మీకాంతము కనిపెట్టి యామె సుందరమ్మతోఁగూడ సరసపదార్థసంపన్నంబైన యన్నంబు భుజించినట్లు తెలిసికొని లక్ష్మీకాంతము తాను భుజించినట్లె సంతో

షించెను. బహువిధచిత్రప్రతిమాలంకృతమును నమూల్యాసనభాసమానమును నగుమేడనడిచావడిలోఁ బ్రవేశించినంతనే, యాచావడికొకప్రక్కనున్న గదిగుమ్మముకడ నిలిచియుండిన రాజేశ్వరమ్మ నవ్వుచు లక్ష్మీకాంతమున కెదురుగా వచ్చి చిత్రమైన యొకచిన్న మేజాబల్లకడ నున్నపట్టుపరుపులుగల కుషన్‌కుర్చీపై నాతని గూర్చుండఁ గోరెను. లక్ష్మీకాంతము శంకాసంకలితస్వాంతముతో నయ్యమూల్యాసనమున సుఖాసీనుండై వెఱ్ఱివానివలె నిటునటుఁ జూచుచుండ మీఁద వ్రేలాడుచున్న 'పంఖా' సూత్రాకర్షణమున గతాగతకారి యగుచుఁ దీవ్రాతపమునఁ జెమ్మగిల్లిన యాతనిబంగరు మేనికి సుఖపరంపర లొనఁగూర్పసాగెను. ఆగౌరవము లెల్లఁ దన మితికి మించినవని యనుకొనుచు, నపరిచితలైన స్త్రీలతో నేమి మాటాడుటకును మోమోటపడుచు నాతఁ డవనతవదనుండై కూర్చుండియుండ, మూఁడునాలుగు విధములైన యుపాహారపదార్థములఁ జేర్చిన వెండిపళ్లెరమును దెచ్చి వెంకన్న వానిముందున్న మేజాబల్లపైఁ బెట్టినంతనే యాతనిమోమోటము మఱియు నధికమైనది.



## 25 వ ప్రకరణము

### "మీరిద్దరూ యిష్టపడితే నాకూ యిష్టఁవే!"

'అబ్బాయిగారి నివాళ యెండలో కష్టపెట్టవలసివచ్చింది. ఏంచెయ్యను! కష్టపెట్టక తప్పిందికాదు. భ్రమరానికీ సుందరానికీ

వున్న స్నేహాన్నిపట్టి యీ పాటి చనువు చేసుకొని మీకు కబురు పంపించాను. భగవంతుడు మీకింత చిన్నతనంలోనే- ఇంతవిద్యా- తెలివితేటలూ- రూపురేఖలూ యివ్వడం- మీతల్లిదండ్రులు చేసుకున్న యదృష్టం! మాసుందరమ్మ యెప్పుడూ మీభోగట్టాలే చెప్తూవుంటుంది. మీకుటుంబం- మీమర్యాదా- నిజంగా నాకు మాసంతోషంగా వుంది! నియోగులం అన్నప్పుడు- యెక్కడేనా కొంత చుట్టరికం వుంటుందికాని వుండకపోదు. అబద్ధ మెంతం యెలావున్నా మాకు రావలసిన పెద్దఆపద రాకుండా తప్పించి మీరు మాకు ప్రాణబంధువులయారు.'

అని యుపాహారమును బుచ్చుకొని కాఫీ త్రాగుచుండిన లక్ష్మీకాంతమును వానికట్టెదుటఁ గొంచెము దూరములో నొకబెత్తుసోఫాపైఁ గూర్చుండిన రాజేశ్వరమ్మ యభినందించెను. భ్రమరమును సుందరమ్మయు, సుందరమ్మగదిలో నుపాహారములు పుచ్చుకొని యప్పుడే వచ్చి రాజేశ్వరమ్మసోఫా వెనుకనున్న రెండుకుర్చీలయందుఁ గూర్చుండిరి. రాజేశ్వరమ్మ యభినందనవాక్యములకు లక్ష్మీకాంతము మొగము వంచుకొని నవ్వుకొనుచు మొగము వంచుకొనియే నామెతో సంభాషణము గావింపసాగెను.

లక్ష్మీ:-భ్రమరంమీద మీకున్న అభిమానం మిమ్మల్ని ఇలా మాటాడిస్తున్నాది. మీవల్ల నాకు కలిగిన కష్టం యేమీలేదు. నన్ను పొగడవలసినంత వుపకారం కూడా నావల్ల మీకేమీ జరగలేదు. దైవయోగంచేత వొకనాటిరాత్రి లక్షింపతి కుతంత్రాలోచనం నాచెవిలో పడడంచేత—'

రాజే:- ఔను. భ్రమరం చెప్పింది. మీ రరుగుమీద కూర్చుని సావిట్లో వాళ్లు మాటాడుకుంటే విన్నారట.

లక్ష్మీ:-నేను విన్నభోగట్టాలన్నీ కూడా వొక్కమాఱు భ్రమరం చెప్ప

గలకో లేకో అని తాళంమాత్రం యివ్వవద్దని మొదట చెప్పిరమ్మన్నాను.

రాజే:-భ్రమరం వచ్చి, ఆకబురు చెప్పకపోలే ఆవేళ నిజంగా తాళం యిచ్చీవలసినవాళ్ళంవే. మీరు చక్రం వేసి కాపాడేరు.

సుంద:-మానాన్నగారు నాకు రాసిచ్చిన ఆస్తి ఆవేళ నాకు దక్కింది.

లక్ష్మి:-నేను విన్నభోగట్టాలన్నీ చెప్పేముందు నేనో సంగతి మిమ్మల్ని అడగవలసివుంది. ఈలక్ష్మింపతి యెంతకాలంనుండీ మీ యింట్లో వున్నాడు? ఇంకా యెంతకాలం వుంటాడు?

రాజే:-అయితే చెప్తాను వినండి! వీడిభోగట్టా- మైనార్టీ తీరగానే అన్నగారితో దెబ్బలాడి పితురార్జితం పంపకం చేయించేసు కున్నాడు. ఆ ఆస్తి పట్టుకొని రామచంద్రపురం వెళిపోయి బైరాగుల్తోటీ సన్యాసుల్తోటీ సహవాసంచేసి పాదరసం బంగారం చెయ్యడానికి ఆస్తంతా తగలెట్టేశాడు. ఇప్పుడు తిండాని కన్నంలేదు. కట్టుకోడానికి బట్టలేదు.

సుంద:-రాజమహేంద్రవరం రూపాయిల కేసులో ఈమహానుభావుణ్ణి కూడా మొదట ఎరస్టుచేసి తరువాత విడిచిపెట్టేశారు.

రాజే:-అన్నగారు బతికున్నంతకాలం చుట్టరికపుమాపు కేనా మా గుమ్మం యెలాంటిదో యెన్నడూ తొక్కలేరగడు.

లక్ష్మి:-ఇశగాడికి పిల్ల లున్నారా?

రాజే:-నలుగురైదుగురు పిల్లలూ భార్యా- ఆపిల్లలికి మేంవే జీతాలు కట్టి రామచంద్రపురంలో చదువులు చెప్పిస్తూన్నాం.

సుంద:-కుటుంబాన్ని యిక్కడికే తెచ్చిపెడతానన్నాడు. కాని మా అమ్మే వొప్పుకున్నాది కాదు.

రాజే:-మీఅన్నగారు కాలంచేశారని వుత్తరం రాయిస్తే పరామర్శ కేనా వచ్చాడు కాడు. మరిరెండుమూడునెల్లకే మాకు దెబ్బ

మీద దెబ్బ తగిలింది. మా అల్లుడు కూడా చనిపోయాడు. ఇహ నాగతుకుగంటూ యెవరూ లేదుకదా అని అప్పుడు మా యింట్లో ప్రవేశించాడు. రెండుమూడేళ్ళా తిరిగి పోయి ప్లేగుసమయంలో వ్యాపారం ఏం మనుద్దేశంతో వచ్చాడన్న సంగతి నాకెలా తెలుస్తుంది? కాళ్ళా వేళ్ళా పడి వదినా! నేను నిరాధారురాలైపోయాను. మీవాత్సల్యకారాలన్నీ చూస్తూ మిమ్మల్నే కనిపెట్టుకుంటాను. పిల్లలవాణ్ణి. నన్ను పోషించక తప్పదని బతిమాలుకుంటే అలాగేలే అని ఒప్పుకొని అప్పటినుండీ అతని కుటుంబానికి నెలకి యాభైరూపాయిలు పంపిస్తున్నాను.

సుంద:-(తల్లినిజూచి) అమ్మా! కాశీలోకథకూడా చెప్పు.

రాజే:-ఇదిగో చెప్తున్నాను. విన్నావాబాబూ! తరవాత కొన్నాళ్ళకి- వదినా సుందరం చిన్నపిల్ల. యింకా పెద్దమనిషి కానా కాకుండా దానికీరోత వచ్చింది. అందుచేత దానికి మళ్ళా పెళ్ళిచేసీసి మనం కాశీ వెళిపోదాం నీకిష్టంవేనా అని అంటే- నాయనా తప్పకుండా పెళ్ళి చేసేదాం- నూరేళ్ళు బతకవలసిన బతుకు- ఇంతాస్తివుండగా దాన్నెందుకు కష్టపెట్టడం? ఇంతకీ నేనెంత కాలం బతకాలికనక? వుంటే యిక్కడే వుంటాను లేకపోతే కాశీ వెళిపోతాను- అని నేననేసరికి- అయితే వొదినా ఆవీలు నన్నోమారు చూడనియ్యండి- అన్నయ్య యేం రాశాడో చూదాం అన్నాడు- దానసత్వాధికారాలతోటే దానితండ్రి దానికి రాశిచ్చేశారు. చూడక్కర్లేదని చెప్పి ఆవీలు మాత్రం వాడికంట పెట్టలేదు. నాటికీ నేటికీ నేను చేసిన తెలివైనపని యిదొక్కటే.

సుంద:-(నవ్వుచు) మొన్న ప్రొప్రయిటరువుత్తరం చూసి ఆతాళం

యిచ్చేసుంటే నీతెలివంతా బయలుపడిపోను!

రాజే:—అప్పటినుండీకూడా ఆవీలెలాగేనా సంగ్రహించడానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు.

లక్ష్మి:-మీకు రావలసిన శిస్తులన్నియు యితనే వసూలు చేస్తున్నాడా?

రాజే:-శిస్తులు వసూలు చెయ్యడానికి మాకు ముగ్గురు గుమస్తాలున్నారు. పదేళ్ళపట్టీ మంచినమ్మకంగా వాళ్ళే మావ్యవహారాలు చూస్తున్నారు. మాకంతా సాలుకి పదిహేనువేలొస్తాయి. వొక్క అనకాపల్లిభూముల మీదే యైదారువేలు వస్తాయి. పాపం! యీమధ్య మాఅనకాపల్లిగుమస్తా పోయాట్ట! ఆగుమస్తా అక్కడిశిస్తులు వసూలు చేశాడో లేదో కనుక్కొని మరోగుమస్తా నక్కడవేసి రమ్మని అనకాపల్లి పంపిస్తే యితగాడు వెళ్ళివచ్చి గుమస్తా యెవరూ దొరక లేదన్నాడు. సొమ్ము వసూలు కా లేదన్నాడు.'

లక్ష్మి:—ఇతను వెళ్ళి అడిగితే గుమస్తాలుకాని రైతులుకాని యితని చేతికి సొమ్మిచ్చే యాచారం యిదివరకున్నాదా?

రాజే:-ఆచారం లేదుకాని రశీదు కట్టుకొని నమ్మకంమీద యిస్తే యివ్వవచ్చు. అనకాపల్లిరైతు లేవో మా రలాగిచ్చారు గుమస్తా సెలవుపెడితే—

లక్ష్మి:—ఈమధ్య మీలక్షింపతి ప్రొప్రయిటరికి నోటుమీద అయిదువేలప్పివ్వడం జరిగింది. ఆసొమ్ము యేబాప తయివుంటుందో మీరే ఆలోచించుకోండి.

రాజే:-(ఆశ్చర్యముతో గుండె బాదుకొనుచు) ప్రొప్రయిటరుకే? అయిదువేలే? ఇహ నాలోచనెందుకు? అనకాపల్లిశిస్తు లంటీశాడు. అంటీకపోతే వీడికంత సొమ్మెక్కడిది? అయిద్దమ్మిడీలు

కూడా వీడిదగ్గర లేవు.

లక్ష్మి:-ఔను ప్రాప్రయిటరుతోకూడా అలాగే చెప్పేడు. మీఆస్తి అపహరించడానికి సలహాలు చెప్తూవున్న వెంకటశాస్త్రికో నూరున్నూ తననాలుగువేల తొమ్మిదివందలూ ప్రాప్రయిటరి కిన్నీ నోట్లమీదనే ఋణాలిచ్చాడు. అయితే ప్రాప్రయిటరు ప్రొపరియిటరుకాబట్టి అయిదువేలకే నోటు రాసిచ్చాడు.

రాజే:-(ఆతురతతో) ఈవెంకటశాస్త్రి ల్లెవడు నాయనా మాకొంప మీదికి? చల్లగా చాపకింద నీరులాగ పన్నాగాలల్ని పన్నుతూ కొంపముంచీడానికే సిద్ధపడ్డాడు లక్ష్మింపతి. అబ్బాయీ! చెప్పండి! ఆవేళ రాత్రి మీరు విన్నవి చెస్తే జాగ్రత పడ తాం! మీరేం చెయ్యమంటే అది చేస్తాం! ఈవిషయంలో మీరే మాకాధారం!

లక్ష్మి:-మీఆస్తి లపహరించడానికి ప్రయత్నిస్తున్నాడని చాలాకాలం కిందటే మీ కనుమానం కలిగిందికదా అప్పుడే పొమ్మనకుండా యింతకాలం యింట్లో యెందుకుండ నిచ్చారు?

రాజే:-పొమ్మంటే— ఆకోపంచేత— మాగుమాస్తాలనే విడతీసేస్తాడో రైతులనే విడతీసేస్తాడో—ఆస్తికేం చిక్కులు తెచ్చిపెట్టి యెప్పుడు కోర్టెక్కిస్తాడో అన్నభయంచేత—సాహసించి పొమ్మ నలేక వూరుకున్నాం. ఈమధ్య నాకో కొత్తాలోచన తోచింది. పదివేలో పదిహేనువేలో వాడిమొహాన్ని పార పోసేసీ—నాకూ మీఆస్తికీ మరేసంబంధం లేదూ అని వోముక్క రాయించి పుచ్చుకొని యింట్లోంచి పంపీయాలని— రోజుకో కోర్టు ఘోగట్టాచెప్పి మమ్మల్ని భయపెడుతూ వుం టాడు. స్వార్జితంకూడా అన్నదమ్ములకి పంపకం వుండాలనే కొత్తపద్ధతి వచ్చిందని వోనాడు—మూడేళ్లు దాటితే రిజిస్ట్రీ

కాని వీలు చెల్లదూ అని వోనాడు—ఆడవాళ్లంకదూ? ఈపద్ధ
తులు తెలియక భయపడుతూ వుంటాం.

సుంద:-(నవ్వుచు) ఆడవాళ్ళంకదూ అని బహువచనం పెట్టకు.
నువ్వు భయపడ్డావుకాని నేను భయపడలేదు.

లక్ష్మి:-(సుందరమ్మను జూచి నవ్వును)

రాజే:-(నవ్వుచు) ఆమాట నిజమే! వాడు మన్నేం చేస్తాడూ అని
మాసుందరమ్మదంతా మొండిధైర్యం?

మాటిమాటికి మొగమువంచుకొనియే మాటాడుచున్న లక్ష్మీ
కాంతము మొగముపందే తఱచుగ దృష్టి సారించుచుండిన సుంద
రమ్మ తల్లిని జూచి,

'అమ్మా! చిన్నాన్నచిత్రచరిత్రంలో పూర్వభాగమంతా
నువ్వు చెప్పేవు. ఇహ నుత్తరభాగం మనం వినాలి!'

అని పలుకఁ జెప్పవలసినవిషయములను జెప్పవలయునని
సుందరమ్మ తన్నన్యాపదేశముగాఁ గోరుచున్నట్లు లక్ష్మీకాంత
మూహించి,

'రాజేశ్వరమ్మగారూ! మీకుమాత్రె జన్మదినోత్సవంనాడు పడ్డ
వర్షం నిజంగా మనపాలిటకి—అమృతవర్షం అని సంతోషించవలసింది.

అని పలుకుచు నానాటివర్షాటంకమున స్వరాజ్యభ్రమరము
లుండిపోవుటయు, వారికొఱకుఁ దాను వసంతునితో వచ్చి కటికచీక
టిలోఁ జావడికిటికీకడ నరుగుపైఁ గూర్చుండి యుండుటయు, నప్పుడు
లక్ష్మీపతి వేంకటశాస్త్రిలు తమయునికి దెలియంగక చావడిలోఁ బ్రవే
శించి గవాక్షమునఁ గూర్చుండి ప్రసంగించుటయు, ఆప్రసంగములో
లక్ష్మీపతి తన కెట్టులో నైదువేలు లభించినట్టులును, ఆహామ్మె
వ్యాజ్యమునిమిత్త ముంచుకొన్నట్టులును, ఆసంగతి ప్రాప్రయిట
రుతోఁ జెప్పఁగా నామొత్తమునకుఁ దోడుగ మఱియైదువేలు తాను

సాయము చేసెదనని తనకు మాట యిచ్చినట్లును, ఆ యుపకారము నకుఁ బ్రత్యుపకారముగ నాస్తి తనకుఁ జిక్కినపిమ్మట ప్రొప్రయిటరీయవలసిన నలువదివేలును దాను విడిచిపెట్ట నూహించుకొన్నట్లును వీలు దొంగవీలని తెచ్చెడు వ్యాజ్యములో వీలులో సంతకము పెట్టిన ప్రొప్రయిటరీ సంతకము నాది కాదని తా ననుటయేగాక తక్కిన సాక్షులచేఁగూడ నట్లు చెప్పించెదనని తనకు వర మిచ్చినట్లును, వేంకటశాస్త్రితోఁ జెప్పినవిధంబంతయు వారికి వివరించి, లక్ష్మీపతి చెప్పిన దానిపై వేంకటశాస్త్రి, వ్యాజ్యమూలమునఁ గార్యము త్వరలో నెరవేరదుగావునఁ దంత్రముచేసి వీలు నపహరించుట యుక్తమని చెప్పుటయు, నినుపపెట్టె తాళమును సంగ్రహించుటకుఁ జెప్పిన యుపాయమును లక్ష్మీకాంత మామూలాగ్రముగ సుందరమ్మ రాజేశ్వరమ్మలకు నెఱింగించెను.

లక్ష్మీకాంతము చెప్పిన వివరములన్నియు విన్నంతనే రాజేశ్వరమ్మ భయాకులచిత్తయై గొలవెలఁ బోవసాగెను. సుందరమ్మ కోపపరీతమానసయై యెఱ్ఱవారిన మొగముతో రెప్పవేయక కట్టెదుట వీక్షించుచుండెను. చెప్పవలసినదంతయుఁ జెప్పి లక్ష్మీకాంతము మొగము వంచుకొని కూర్చుండెను. ఇట్లా మేడచావడి నాలుగైదు నిముసములవఱకు నిశ్శబ్దమై యుండెను. కోపావేశసూచనమైన సుందరమ్మ తటాలున లేచి కట్టెదుటనున్న గదిలోనికిఁ బోయి యొకనల్లని యూటకలమును తెల్లని కాగితమును దెచ్చి లక్ష్మీకాంతుని ముందున్న మేజాబల్లపై నునిచి తల్లిని సమీపించి,

“అమ్మా! వెంటనే ప్రొప్రయిటరికి రిజిష్ట్రి ఉత్తరం వ్రాయించు! వారం రోజులు గడువులో సొమ్ము యివ్వకపోతే దావా పడేదాం. నే నిప్పుడే కిందకి వెళ్లి మూడు తాళాలతో చిన్నపెట్టె తీసేసి యూ

పెట్లోవున్న ప్రోమిసరీనోట్లు రెండూ పట్టుకొనివచ్చి నాపెట్లో దాచేస్తాను. ఆనోట్లు పోతే పీడిసంకటం అణిగిపోతుంది."

"ఔనమ్మా! బాగానేవుందికాని నువ్వు దేనికీ తొందరపడకు! ఏదేనా అబ్బాయిగారి నడిగి మరీచేదాం"

ఆమాటలు విని లక్ష్మీకాంతము రాజేశ్వరమ్మను జూచి,

"రాజేశ్వరమ్మగారూ! ఇప్పుడు మీఅమ్మాయి చెప్పినవి రెండూ అవశ్యంగా జరిగించవలసినవే. ఇందులో మీకేమీ ప్రమాదం వుండదు. నిన్న వోటింగులో మీలక్షింపతి డాక్టరునాయుడు యేజెంట్లలో వోయేజెంటుకి బుజ్జ బద్దలుకొట్టించేశాడు. నాయుడు కలక్టరుతో రిపోర్టు చేశాట్ట. లేక చేస్తాడో? ఈకేసులోలక్షింపతి మతిపోయి కొంతకాలం తిరగవలసుంటుంది. అందుచే ఆనోట్లుసంగ్రహించడానికి కిదేసమయం."

రాజేశ్వరమ్మ సంతోషముతో రెండుచేతులు చఱచి—

"ఈదెబ్బతో పీడికో నాలుగునెల్లు ఖైదు పడిపోతే యీ నాలుగునెల్లపాటూ మాప్రాణాలు హాయిగా వుంటాయి. చల్లనికబురు చెప్పేరు."

"ఇహ రెండో సంగతి వినండి. ప్రొప్రయిటరుకూడా యించుమించుగా యిలాంటిస్థితిలోనే వున్నాడు. నాయుడుపక్షాన్ని వున్నవర్తకులంతా ప్రొప్రయిట రివ్వవలసినబాకీలకి వొక్కమారే రిజిస్ట్రీవుత్తరాలు రాసి దావాలు పడేస్తున్నారు. అందుచేత ఈసమయంలోనే మీరుకూడా నోటీ సిప్పించండి! ప్రొప్రయిటరికి బుద్ధివస్తుంది. మీఅమ్మాయిచెప్పిన ఆలోచన్లు రెండూ బాగానే వున్నాయి."

"సరే! మీరిద్దరూ యిష్టపడితే నాకూ యిష్టమే."



# ౨౮వ ప్రకరణము

## ఛాయాపటము



"అమ్మగారూ! మొన్న గాయం తగిలిన స్వచ్ఛందసేవకుడు మాపినమాఁవగారికొడుకు. అతనితల్లిదండ్రులు నాభర్త కుత్తరం రాశారు. గాయం తగిలినసంగతి విని నాభర్త చాలావిచారించి నువ్వాక్కడికి వెళ్ళినప్పు డల్లా జాగ్రత్తగా చూస్తూ వుండవలసిందని నా కాజ్ఞాపించారు. నాలుగైదురోజుల్లోనే తల్లీ— తండ్రీ— భార్యా వచ్చి యతణ్ణి చూచి వోమారింటికి తీసుకు వెళతారట! నాభర్త ఆజ్ఞమీద నే నంతవరకూ ఈ ఆశ్రమంలో అతని కుపచారాలు చేస్తూవుండుటకు మీసెలవుకూడా కోరుతున్నాను."

అని యానాఁటిసాయంకాలమునఁ జీకటిలో బట్టలమూటయను భ్రాంతితో స్వచ్ఛందసేవకు నఁటిన కలువకంటి యొంటరిగ నున్న నాయకురాలిని బ్రార్థించెను. అదిమధ్యాహ్నము మూఁడుగంటలవేళ ఖద్దరువిక్రేతలైన పురుషులును స్త్రీలును వీధులలోనికి వెడలిపోవుటచే నయ్యాశ్రమమంతయు నిర్జనమై నిశ్శబ్దముగ నుండెను. నాయకురాలుమాత్రము తనగదిలోఁ గూర్చుండి లెక్కలు వ్రాసికొనుచుండెను. ఆమెకుఁ గట్టెదుట నేలఁగూర్చుండిన యాయువతీమణి చుట్టును బడియుండిన నోటుపుస్తకములలో నొక్కొక్కటి తీయుచుఁ గాలక్షేపముకొఱకుఁ బుటలు తిరుగ వేయుచుండెను. ఆనోటుపుస్తకములలో నొకటి యాశ్రమములో నున్న స్త్రీలయొక్కయుఁ బురుషులయొక్కయు నామములజాబితాఁ ఆజాబితాపుస్తకమునందుమాత్ర మామె కెక్కువసేపు దృష్టి నిలిచినది. నాయకురా లామెప్రార్థనమువిని

తాను వేయుచున్న ఖద్దరు లెక్క ముగించి మొగమెత్తి యామెను జూచి నవ్వుచు—

‘‘అమ్మాయీ! నీభర్తగారి సెలవైనప్పుడు మా సెల వెందుకు?’

‘‘మీ సెలవు లేకుండా— ఈయాశ్రమంలో వున్నవాకపురుషుడితో నేను మాటాడినా చూసినవారికి విరుద్ధంగా తోచకుండా—’’

నాయకురాలామాటలకు మిక్కిలి నవ్వుచు—

‘‘ఈయాశ్రమంలో మాత్రం అలాంటనుమానం అవసరం లేదు. ఇందులో చేరినవాళ్ళంతా పవిత్రమూర్తులే— జారులకీ చోరులకీ ఇది స్థలం కాదు. నీకు బంధువుడని చెప్తున్నావు కాబట్టి నువ్వు స్వేచ్ఛగా వెళ్ళి చూస్తూ వుండడానికభ్యంతరం లేదు.’’

అని యనుజ్ఞ నొసంగెను. ఆయనుజ్ఞపై నాయువతీమణి తానాశ్రమమునకు వచ్చినప్పుడెల్లం దనబంధువుండైన యాఖద్దరుధారుని దర్శించి తనకుం జేతనైన యుపచారములు చేసి పోవుచుండెను. తలపైం దగిలిన బలమైన గాయముచే నాపురుషునకు రెండుమూండు దినములు తీవ్రమైన జ్వరముకూడ వచ్చినది. ఆజ్వరదినములలో నొకనాండా చేడియ వానిశయ్యపైం జేరువగా నాసీనయై కంట నీరు పెట్టుకొనుచుండంగా నా పెరటింటి గదిలోనికి నాయుడును నాయకురాలును నాకస్మికముగాం బ్రవేశించి యామె విచారమును గనిపెట్టిరి నాయకురాలివలన నాయుడు వారిబాంధవ్యమును విన్నవాండుగావునం గంట నీరిడుకొనుచున్న యాయన్నుమిన్నం జూచి, ‘‘అమ్మాయిగారూ! ఇదిగాయంమీదవచ్చిన జ్వరంకాని మరోహాటి కాదు. ఇవాళకో రేపటికో తగ్గిపోతుంది. మీరలా విచారించకండి. ఇతణ్ణి కొట్టించిన లక్ష్మీపతినిగూర్చి ఇవాళపొద్దున్నే కలక్టరుతో మాటాడి వచ్చాను. వాడికెలాగా పనిష్మెంటు తప్పదు’ అని యోదార్చెను.

నాయుడును నాయకురాలును జెంతనున్నప్పు డాయువతీమణి యాపురు
షున కుపచారములు చేయుచుండుట యాశ్రమమునందలి యితర
స్త్రీపురుషులు రెండుమూఁడుసారులుచూచి, యామె చెంతనున్నప్పుడు
మాత్ర మాప్రాంతమున కెవ్వరును బోవుట మానివేసిరి.

తనకోమలమృణాళబాహువులఁ జీకటిలోఁ దన్ను స్పృశించిన
యా కృశోదరిముఖము నాఖద్దరుధారుఁడునాటిరాత్రి దీపపుఁగాంతిలోఁ
జూచినంతనే తద్వదనవిలాసవైఖరు లాతనిచిత్తమును గరగింపఁ జేసి
నవి. ఆసౌందర్యమూర్తి యెవ్వరోత న్నేల స్పృశించెనో యనుశంకా
పరంపర లాతనిచిత్తమును గలతవెట్టసాగినవి. ఖద్దరుమూటకై వచ్చి
యచ్చపలాక్షి చీకటిలో నెఱుంగక తన్ను స్పృశించినదే యగునెడ,
యెఱింగినపిదపఁ దనకంటఁ బడక యావలకుఁ దొలంగవలయునేగాని,
దీపపువెలుంగున ద్వారముఖమున ననిమేషలోచనయై నిలిచి తన్ను
నిదానించి చూచిన కారణమేమియో వానికిఁ దోపలేదు. తన
కట్టెదుట నిలిచియున్న యీ యనన్యలావణ్యరాశియైన జవరాలే
తన్ను స్పృశించిన వ్యక్తి యనితనకుఁ దెలిసియుండినయెడల నాయొక్క
క్షణములోఁ దనసౌఖ్య మెంత మిన్నందియుండునోయని యతఁ
డూరక నొచ్చుకొనఁజొచ్చెను. లాంతరుకాంతిలో నాకాంతామణి
తన్ను విలోకించుచున్నంతవఱకుఁ దా నామనోజ్ఞరూపము సందర్శింప
గలిగినంతవఱకు నతఁడు గాయముబాధనుండి విశ్రాంతి వహించి,
యామె దృక్పథమునుండి తప్పిపోయినంతనే మఱల యథావిధి
వేధింపఁబడసాగెను. వ్రణబాధయు దానిపైఁ గలిగిన జ్వరబాధయు
నీరెండింటికిందోడు రమణీవియోగబాధయు నామందభాగ్యు నారాత్రి
యంతయుఁ గన్నుమూయ నీయలేదు. ఆమఱునాటినుండియు వాని
జ్వర మధికమగుటచేత నొకటిరెండుదినములవఱకు వానికి మేన
స్మృతియే లేదని చెప్పవచ్చును. ఆజ్వరాతిశయమున నొక్కొక్కప్పుడు

తెలివివచ్చి కన్నువిచ్చి తనయుపకంఠమున నాసీనయైన యాకలకంఠకంఠిం జూచి యేమేమో మాటాడ గమకించి మాటాడలేక మఱలఁ గనుమూయుచుండెను. నాయఁడు పంపినమందు ద్రావించుటకో కాఫీ పోయుటకో గాయమునకుఁ గట్టుకట్టుటకో తనశయ్యాతలంబునఁదన్నుఁ దాకుచుఁగూర్చుండి మెడయందలి కంఠాభరణములు తనయురమున వ్రేలఁదన కుపచారములుసేయు నాసీమంతినిం గన్నెత్తిచూచి, యాచూచినయొక్క క్షణముననే యామందభాగ్యుఁ డానందమయుం డగుచుండెను. ఒక్కొక్కప్పుడు కనురెప్పలెత్తి చూచునప్పు డప్పుడఁటుక దన ప్రక్కం గానరాక, నాయుఁడో నాయకురాలో లేక తన కుపచరించు చుండిన మఱియేస్వచ్ఛందసేవకుఁడో కంటబడుట జరుగునెడ, నారోగి రోగమువలని వేదనకుందోడు రోగము లేని వేదనయుఁ బడ వలసినవాఁ డగుచుండెను. కప్పిన దుప్పటి లాగక, శీతజ్వరాతిశయమునఁ దనయొడలు గడగడ వడకునెడఁ దనయురంబున వ్రాలి-సౌఖ్యసామ్రాజ్యవైభవమునకు సింహపీఠికయనిందగు కౌఁగిటం దన్నుఁజేర్చి బిగియారం బట్టుకొనుపట్టిన నాస్వచ్ఛందసేవకుఁ డాచంద్రాస్యం జూచి, జరుగునెడ జ్వరమంత సుఖము లేదనుమాట తలంచుకొనుచు, నాజ్వర మెక్కుడఁ దొలంగునో యనుభయంబున మందు ద్రావకయుఁ ద్రావినిమందు దుమిసియుఁ బాప మామెం జిక్కులు పెట్టుచుండెను. వ్రణబాధయందును జ్వరబాధయందును నొక్కొక్కప్పు డాయువకుఁ డామె నేమియో ప్రశ్నలు వేయుచుండెను గాని యాప్రశ్నల కాజవ్వని నవ్వుటయుఁ దల యూచుటయుందక్కఁ దగిన ప్రత్యుత్తరము లొసంగలేదు.

నాయుఁడు గావించిన చికిత్సవలన మూఁడునాలుగుదినముల లోనే వాని కాగాయము కుదిరినది. జ్వరము తగ్గినది. ఉదయమున

విడిచిన జ్వరము మధ్యాహ్నము మూఁడుగంటలవఱకు మఱి తగుల లేదు. మఱి తగులదని నాయుడు చెప్పుటయేగాక, తగులు ననునను మానము రోగికిఁ గలుగలేదు. జ్వరముతోఁగూటుగ నాయువతీ మణియు నాతనిని విడిచి యానాఁడంతయు మఱివానికంటఁ బడలేదు. ప్రతిక్షణ మామె రాక నిరీక్షించుచు నిట్టూర్పులు విడుచుచు, మెల్లఁగా లేచి కూర్చుండి యాపెరటిగదిగవాక్షములనుండి చూడఁగలిగినంత వఱకుఁ దత్ప్రాంతములఁ బరీక్షించుచు నాదినమంతయుఁ గడప నిం తలోఁ జీకటిపడుటచే నవ్వనజాస్యఁగూర్చి యానాటికి నిరాశ చేసి కొనెను. ఆమఱునా డుదయమున నెనిమిదిగంటలప్పుడు తనప్రక్క నుండి పోవుచుండిన యొకస్వచ్ఛందసేవకుని బిలచి యాయువకుఁడు తన కుపచార మొనర్చుచుండిన రమణీమణింగూర్చి ప్రశ్నింప, నామె మధ్యాహ్నవేళల వచ్చుచుండుననియు సాధారణముగ నుదయముల వచ్చునాచారము లే దనియుఁ జెప్పి వానికిఁ బరమశత్రువుగాఁ దోఁచెను. ఆతనుమధ్య మధ్యాహ్నమువఱకు రాదని యాతఁడు నిరాశ చేసికొని వెల్లకిలఁబరుండి కన్నులు మూసికొని, యామనోజ్ఞాకార మును దనకట్టెదుట సాక్షాత్కరింపఁజేసికొని, తద్భావనాప్రపంచ మునఁ దనచిత్తమును స్వేచ్ఛగాఁ బఱువెత్తించుచుండెను. మధ్యా హ్నమాసుందరి తనకడకు వచ్చునఁట! ఆవచ్చుట యెఱింగి తాను గన్నులు మూసి కపటనిద్ర నభినయించుచుండునఁట! అంత నామె త న్నొకటి రెండుసారులు పిలుచునఁట! తాను బలుకఁడఁట! పలుక కుండుటచే జ్వరము వచ్చినదేమో యనుభ్రమ నాభ్రమరకుంతల తనశయనతలంబునఁ గూర్చుండి తనముఖమునఁ బాణిపల్లవమును జేర్చునఁట! అప్పుడు తాను దటాలునఁ గన్నులు విచ్చి చేతులు సాఁచి తనయురముపై వంగిన యామె నెడఁ గౌఁగిలించుకొనునఁట! ఇది యాయువకుని భావనాప్రపంచమునఁ బ్రదర్శింపఁబడుచుండిన

ఛాయానాటకములోని ప్రథమాంక ప్రథమరంగము. ఈప్రథమరంగము వానిహృదయరంగమున మూఁడుమాఱులు ప్రదర్శింపఁబడినది. ప్రదర్శింపఁబడునప్పు డెల్ల నెంతత్వరగాఁ గన్నులు విచ్చి, యెంత వడిగాఁ జేతులు సాచి యెట్లు కౌఁగిలించుకొనవలయునో యతఁడు తనలోఁ దానె యభినయించి చూచుకొనుచుండెను. నాలవసారి కూడ నతఁ డారంగమును బ్రదర్శించెను. ప్రదర్శించి యథాప్రకారము తటాలునఁ గన్నులు విచ్చి వడివడిగాఁ జేతులు సాచి కౌఁగిలింత నభినయించుసరికి, భావనాప్రపంచమునందలి కల్పితసుందరి కాక, బాహ్యప్రపంచమునందలి నిజమైనసుందరియే యప్పు డాతని సందిటలోఁ జిక్కియుండెను. తత్తరపాటుతో నాసుందరి యాతని కౌఁగిలింత వదలించుకొని మొగము ముణుచుకొని మంచమున కించుక దూరముగా నిలిచి, తాను వచ్చినప్పుడు తెచ్చిపెట్టిన కాఫీ పాత్ర నందుకొని 'బాగుంది! యీకాఫీ పుచ్చుకోండి' అని వంచిన మొగముతోఁ బలుకఁగా, మధ్యాహ్నమువఱకు లభింప దనుకొన్న తత్సుందరీసందర్శనభాగ్యము తన కత్యాకస్మికముగ లభించుటచే, నాస్వచ్ఛందసేవకుఁడు కొంతవఱకు నిశ్చేష్టితుఁడై యొక్కనిట్టూర్పు విడిచి, చిఱునవ్వుమొలకలఁ గలఁకతీరిన మొగముతోఁ నీరసించి లోతువడిన కంఠస్వరముతో మెల్లఁగా నిట్లు ప్రసంగించెను.

'నిన్న నెందుకు రాలేదు?'

'మందుగుణం యిస్తే యెందు కొస్తుంది?'

'జ్వరంమాట కాదు. నీమాట!'

'నామాటా? జ్వరం రాకపోతే నే నెందుకు?'

'జ్వరం రాకపోతే నువ్వు మరి రానేరావా?'

'మొదట కాఫీ పుచ్చుకోండి! చల్లారిపోతున్నాది.'

'కాఫీ నా కక్కర లేదు.'

'అయితే మరేంకావాలి?'

'జ్వరం వచ్చే మందు.'

'నేను త్వరగా ఇంటికి వెళ్ళాలి! కాఫీ పుచ్చుకోండి'

'నిన్న నల్లా రాలేదు. ఇవాళ వేగిరం వెళిపోవాలి. అంతే కదూ?'

'పని వున్నప్పుడేం చేస్తాను? రేపటినుండి యెలాగా రాలేను.'

'ఎందుచేత?'

కాఫీ తాగితే యెన్నిప్రశ్నలేనా వెయ్యవచ్చు-చల్లారిపో తున్నాది. చల్లారిపోతే విషంతో సమానం.'

'అలాగా? నిజంగా చల్లారినకాఫీయే విషంతో సమానం వయితే మరి రేపటినుండి నిన్ను చూడలేనన్న విచారం నా కుండదు.'

'అంతగా విచారించడానికి నన్ను మీరెలా యెరుగుదురు?'

'ఇంతగా వుపచారం చెయ్యడానికి నన్ను నువ్వెలా యెరుగుదువు?'

'ఆపదలో వున్నప్పు డుపచారం చెయ్యడాని కెరగ నవసరం లేదు. అయినా మీరునాకు బంధువులనికూడా తెలిసింది.'

'ఆబంధుత్వం నేను వినకూడదూ?'

అంతగా చెప్పవలసిన దగ్గిరబంధుత్వం కాదు. శాఖ వొక్కటీ అవడంచేత కలిసిన యెక్కడిదో దూరపుచుట్టరికం!'

'ఆదూరపుచుట్టరిక మేనా చెప్పకూడదు?'

'నేను చెప్పను'

'పోనీ మీయింటిపేరు?'

'అదీ చెప్పను!'

'నీ పేరో?'

'అంతకంటే చెప్పను.'

'అయితే నువ్వు చెప్పేదల్లా రేపటినుండి రానూ అన్నవొక్క మాటే కాబోలు? సరే! కాఫీ యీపాటి చల్లారుంటుంది. ఇలాతే! నీచేత్తోటే యిచ్చి వెళిపోదువుకాని— ఆవెళిపోయేటప్పుడుమాత్రం ఒకసంగ తడుగుతాను. సమాధానం చెప్పి మరీ వెళ్లు.'

'అయితే వేగిరం అడగండి! నాకు తొందరగానే వుంది. వెళిపోవాలి'

'ఒక్కమారు కూర్చుంటే అడుగుతాను.'

'కాఫీ మరి పుచ్చుకోరా?'

'మరి పుచ్చుకోను. పుచ్చుకునేస్థితిలో నువ్వు నన్నుంచలేదు. నన్నగాధంలో ముంచి వెళిపోతున్నావు. నాహృదయంలో వొక పెద్ద శూలం గుచ్చి వెళిపోతున్నావు. నే నడిగినప్రశ్నలలో వొక్కటేనా?— పోనీ ఏదీ? నీమొహం? నీమొహంలో— పోనీఆసంగ తెందుకు? మనం ఎప్పుడేనా? ఆసంగతి వద్దూ— నువ్వు విజయనగరంలో— అబ్బా! నిన్ను నే నేమీ అడగలేను. అడిగినా నువ్వు చెప్పవు. అందుచేత నే నడగదలచిన ఆఖరిప్రశ్నే అడుగుతున్నాను చెప్పు. ఈనాలుగు నాళ్లు నువ్వు నాకు చేసిన సేవకి నేను నీఋణం యెలా తీర్చుకోగలనో చెప్పేసి మరీ వెళిపో!'

'నిజంగానే అంతప్రేమ నామీ దున్నట్టయితే—'

'అయితే-అని సందేహాలెందుకు?

'నాకు సందేహంగానే వుంది'

'తొందరపడక వొక్కక్షణం ఆగుతే ఆసందేహం తీరుతుంది. ఉంటావా?'

'అమూల్యమైన ప్రేమకొలకు వుంటానే అనుకోండి! ఉంటే?'

'ఉంటే నాదగ్గిర కోమూరిలారా!'

'దగ్గరకొస్తే ఏం చేస్తారు?'

'నన్ను విడిచి వెళ్ళవద్దని యేడుస్తూ నీరెండుపాదాలు పట్టుకుంటాను. అప్పటికీ నీకు జాలి లేకపోతే నీపేరేనా చెప్పివెళ్లు! బ్రతికుంటే స్మరించుకుంటూ వుంటాను.'

నాపేరే చెప్తే ఒక్కక్షణంకూడా మీరు నన్ను స్మరించరు. ఈప్రేమంతా మంచు విరిగినట్లు విరిగిపోతుంది.'

'కాదు. కాదు. పాలుపొంగినట్లు పొంగుతుంది. ఆపేరేదో చెప్పు! చెప్పకుండా వెళిపోతే యీమూలగదిలో ఈమంచంమీదే ఆఖరిగడియ వచ్చేవరకూ నేను నీరసించిపోతాను. ఇది నీకు పాపం కాదూ?'

'మహాపాపం! నాకింత పాపానికి కారణం నామీద మీకున్న ప్రేమే. అందుచేత ఈప్రేమ మీకు లేకుండా చేసి వెళిపోతే మరి నాకేపాపం వుండదు. అందుచేత నావూరూ నాపేరూ చెప్తాను వినండి.'

'పోనీ అలాగనుకునేనా చెప్పు.'

ఒక్కనాపేరు చెప్తే చాలా? మీప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పవల సుంటుందా?'

'అన్నీ చెప్తే మరీ సంతోషం.'

'అయితే కొంచెం కాఫీ పుచ్చుకొండి చెప్తాను.'

'అధికంగా మాటాడ్డంవల్లగుండెలో నీరసంగావుంది. లేవలేను.'

అంత నమ్మందయాన నాతనిశయనతలంబున నాసీనయై కాఫీపాత్ర నేలనుంచి తనరెండుచేతుల నాతనిరెండుచేతులుంబట్టి యెత్తి కూర్చుండబెట్టి తనహస్తస్పర్శచే వికసింపసాగిన వానిముఖమును బరిశీలించుచు మెల్లఁగా వానిచేఁ గాఫీ త్రావించుచుఁ దా నచ్చటికి వచ్చినప్పుడే మంచంక్రిందఁ బెట్టుకొనిన యొకయట్టను గాలిత్రేళ్ళతోఁ

బట్టి చేతి కందుకొనుటకుఁ బ్రయత్నించుచుండెను. కాఫీ తాగ్రవ్రట పూర్తియగుటయు నాయువకుఁడు సొమ్మసిల్లినవానివలె క్షణకాలము కన్నులు మూసి మఱలఁ దెఱచి యాసుందరివంక విలోకింప, నామె కాటుకకన్నులు రెండును వానికి శ్రావణభాద్రపదమాసములవలె దోఁచినవి. కన్నీరు మున్నీరుగా వగచు నయ్యన్నుమిన్నం జూచి రిచ్చపాటుతో నెన్నేనియుఁ బ్రశ్న లడుగుచు నన్నింటికి నామె నిరుత్తర యగుటచే వెనుకనుండి తనరెండుచేతుల నామెంబట్టి తన యొడిలోఁ బడవేసికొనుచుండ నామె చేతంగలయట్ట వానికంటఁ బడినది. వెంటనే యతఁడు దాని నందుకొని చుట్టను జుట్టఁబడిన కాగితమును విప్పుచుండ, వానియొడిలోఁబడిన యువతీమణి మఱింత యధికముగ వెక్కివెక్కి యేడువసాగెను. ఆస్వచ్ఛందసేవకుఁడు కాగితములోఁ జుట్టబడిన ఛాయాప్రతిమను నిదానించి చూచుచుఁ జూచిన కొలందిఁ బొడముచుండిన యాశ్చర్యవిషాదసంతోషములచే క్షణక్షణము ముఖలక్షణములు మాఱుచుండఁ దనయొడిలో వ్రాలిన యాదీనురాలిని గన్నీటిధారలతోఁ గటాక్షించి, తనముఖము నామె ముఖమునఁ జేర్చి నోట నేమాటయు లేక నిశ్చేష్టితుఁడై యట్టులే యుండిపోయెను. వారివిషాదాశ్రువులను గాలచక్రము క్షణములో సంతోషబాష్పముల నొనర్ప, బరస్పరగాఢపరిరంభణములలో నారమణీరమణు లెంతవఱకు నిమగ్నులై యుండిరో వారే యెఱుఁగరు!



## 27 వ ప్రకరణము

### లక్షీఁపతి పరాభవము

"మాంఘోరం జరిగిపోయింది శాస్త్రీజీ!"

"చిత్తం! చిత్తం! ఇంతా అంతా ఘోరం కాదు."

"వాఖ్ఖివోటే సుమండీ!"

వాఖ్ఖివోటే! వాఖ్ఖివోటే! తలుచుకుంటే గుండె బద్దలవుతూంది."

"ఆవసంతరావన్నకుర్రాడు చాలమంచివాడు సుమండీ! నేను చెన్నపట్టం వుత్తరం రాస్తే వెంటనే జవాబిచ్చాడు. రెండుసూర్లు మాదర్శనానికికూడా వచ్చాడు. ఆలక్ష్మీకాంతాన్ని మనం డిస్‌మిస్ చెయ్యడంవల్ల ఆవోటు మనకి పోయింది."

"చిత్తం! అలాగే ఆవోటు పోయిందీ అంటే— ఇరవై మూడు వేల యేడువందలరూపాయిలసొమ్ము పోయిందన్నమాటే. బాబుగారింతసొమ్మూ మళ్లా ఖర్చుపెట్టవలసిందేకదా? ఆవాఖ్ఖివోటూ వచ్చుంటే మన కెంతసొమ్ము కలిసివచ్చుండునో చిత్తగించండి!"

"సొమ్ముమాటకేం? వెధవసొమ్ము! మనోపాతికవేలు పారపోశేస్తాం వేయనుకోండి! కాని ఫుల్ ఆఫ్ టైమ్ వేస్టింగ్! మళ్లా యీ మూడువందలవోట్లూ క్యాన్వాసింగు చెయ్యాలా? మళ్లా ఆనరసయ్య సెట్టిని మంచి చేసికోవాలా? మీరంతా మళ్లా అంతప్రయాసా పడాలా?"

"చిత్తం మాప్రయాసమాటకేంగాని ఆవొక్కవోటూ వస్తే బాబుగారికీ చికాకు లేవీ లేకపోను. ఈపాటికి దివాణం యెంతో కలకల్లాడుతూ వుండవలసింది."

"మన్ని చూడ్డానికి బస్తీకి బస్తీ యీపాటి తిరగబడి పోదుటండీ శాస్త్రీజీ! వార్లందరికీ వోనాడు టీపార్టీ యివ్వాలని మావుద్దేశం. మాఫ్రెండ్సు కొంతమంది వున్నారు లెండి. తరవాత టవున్ జెంట్రీలో వున్న లార్జిమెన్ అందరికీ వోనాడున్నూ— మీలాంటిఫ్రెండ్సూ వర్కర్సూ సానివీధివాళ్ళనిన్నీ కలిపి వోనాడున్నూ డిన్నరిద్దాం అని మాప్రయత్నం. విన్నారా?"

వేంకటశాస్త్రి ఒక్కనిట్టూర్పు విడిచి—

"పోయింది. ఆకళ్ల వైభవం అంతా పోయింది. వొక్కవోటులో పోయింది. చిలకల్లాంటి గుంటల్ని యేరి మేళం కట్టించి యీచావిట్లో చక్రపటాకీల్లాగ గిరగిర తిప్పించుందును."

"నిజఁవే! కాని యేంచేస్తాం? వొక్కవిషయంలో మేం పొఱపాటుపడ్డాం. దానికీ విచారిస్తున్నాం"

"చిత్తం! బాబుగారివల్లకాదు కానీ— వోపొరపాటుమాత్రం జరిగిందని నేనూ వూహించాను. అదేదో సెలవిస్తే వుభయులం అనుకున్న పొరపాటు వొక్కటవుతుందో కాదో చూదాం."

"శాస్త్రీజీ! మనవుభయుల బుద్ధివిశేషాల్లో సాధారణంగా అలాంటివ్యత్యాసం యెన్నడూ వుండకూడదు. అయినా చెప్తాను వినండి! మ్యున్సిపల్ కౌన్సిల్‌గా స్టేండింగుకావడంలో కొండంత ప్రయత్నం తలపెట్టినప్పుడు మనం యీలక్షింపతిగాణ్ణి చేరనియ్యడం గొప్పపొరపాటు—

వేంకటశాస్త్రి ముందరిమేజాబల్లపైఁ దటాలునఁ జేయిచఱచి-

"సరి—గ్గా— నే ననుకున్నదీ అదే— సవ్యంగా జరుగుతూన్న మనవ్యవహారంలో ఆలక్షింపతిగాడు వక్రుసుడిలాగ జతపడ్డాడు. వీడివల్లే ఆలక్ష్మీకాంతాన్ని డిస్‌మిస్ చెయ్యడం జరిగింది. ఆకుష్టాణ్ణి డిస్‌మిస్ చెయ్యడంవల్లే ఆవసంతరావువోటు మనకి పోయింది. ఆవోటు పోవడంవల్ల— మళ్లా— ధనవ్యయం— కాయకష్టం— తాపత్రయం— వొకటేఁవిటి? పునఃప్రయత్నం అంతా చెయ్యాలి."

"ఏం చెయ్యమన్నారు చెప్పండీ? ఊరుకోక ఆబంట్రోతుని వెధవప్రశ్నలన్నీ అడిగి మాకు కోపం తెప్పించాడు. మాఆర్డర్సు ప్రకారం తాళం యివ్వనందుకు వాళ్ళమీద కోపం వచ్చింది. దివా

ణంలో తాళం పోయిందా అని అడిగితే పోలేదన్నాడని బంట్రోతుని డిస్మిస్ చేసి పారేశాం. ఆడవాళ్ళద్వారా తాళం యివ్వవద్దని కబురంపించి యివ్వకుండా చేసినవాడు వీడే అని చెప్పేసరికి లక్ష్మీకాంతాన్ని డిస్మిస్ చేసేశాం. ఈలక్ష్మీంపతిగాడివల్ల మా స్టాఫ్‌లోనుండి వోప్యూనూ వోక్లార్కూ డిస్మిసయారు. ఇంతాచేస్తే మనకు సంబంధం లేదూ— ప్రియోజనం లేదూ—''

''ప్రయోజనం లేకపోవడం సరేసరి— ప్రమాదంకూడా తటస్థించింది.''

''వెధవాస్తి— వీడి కాస్తివస్తే మనకేం కావాలి? రాకపోతే మనకేం కావాలి? అనవసరంగా మన్ని దీల్లోకి దింపేడుకాని—''

చిత్తం అలాగే! పట్టానికి పట్టం అంతా, అఖండంగా బాగుపడే వోగొప్పవ్యవహారంలో దిగి బాబుగారు రాత్రీ పగలూ పని చేస్తూన్నప్పుడూ చేతనైతే యేదేనా సాయం చెయ్యాలి లేకపోతే వూరుకోవాలి కాని— సమయంలో సంగీతం అని మధ్య తనవ్యవహారం వొకటి తెచ్చిపెడతాడా? వీడికి బుద్ధిజ్ఞానంలేదూ? యాభైయేళ్లొచ్చాయికదా? ఆశ్రితపక్షపాతంలో బాబుగారిది పెట్టిందిపేరూ! స్వంతపనులు చెడిపోయినా యెవరేనా యేదేనా అడిగితే చాలు లేదూ అన్నముక్క నోటంట రానేరాదు.'

'నో వర్డ్ ఈజ్ కమింగ్ నో ఆల్వేజ్ ఫ్రమ్ అవర్ మౌత్! ఇది మొదటినుండీ మా కున్నగుణం! ఏం చెయ్యమన్నారు?'

'ఆడవాళ్లుకదా అని వాళ్ళఆస్తి పడేసుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు. చిత్తగించండి వీడిసాహసం!'

'అలాగే! మేం రాసిచ్చిన తణఖాపత్రింతాలూకు మూడేళ్ళ గడువూ దాటిపోయినా, పాపం— ఈక్షణంవరకు మన్ని సొమ్మడగలేదు. ఆడవాళ్లైనా వాళ్ళపెద్దమనిషితరహా చూడండి శాస్త్రీజీ!'

'ఎందుకూ? మరివీణ్ణి దివాణంలో కాలుపెట్టనీకపో తేసరి! మునిసిపల్లాపీసుదగ్గిర ఖద్దరువాలింటీర్ని కొట్టించీసి మీాదుమిక్కిలి బాబుగారే కొట్టించమన్నారని చెప్తున్నాట్ట! అందరితోటీ'

'మేం కొట్టించాఁవంటే కలెక్టరు మరి కేసు తియ్యాఁడుచూడండీ! అదీ గడుస్తనం! ఎందుకూ మేం కలక్టరికి వార్నింగిస్తాం! మాభయం మీాకెంతమాత్రం లేదనిన్నీ వీణ్ణి తప్పకుండా పనిషింగ్ చెయ్యవలసిందనిన్నీ'

'చిత్తం! పీడిసంగ తిలా వుండగా బాబుగారితో రెండుభోగట్టాలు మనవి చెసుకోవాలి. మందుగుండుసామాను పంపిస్తానని కంట్రాక్టరు తొందరపడుతున్నాడు. ఏం సెలవు?'

'సరే! పంపించీమనండీ! ఎంతది కట్టించాం?'

'అయిదువందలరూపాయిలది.'

'బుట్టల్లో పెట్టించి దివాణంలోకి తెప్పించీయండి! వోచ్చీమాటికి పనికొస్తుంది. మళ్ళా అప్పుడేనా కట్టించుకోవాలా? ఇహ రెండో దేఁవిటి?

'బేండువాళ్లు మనం యిచ్చినబయానా యిమ్మంటే యేడుస్తున్నారు. ఈమారు బాబుగా రెలాగా గెలుస్తారూ అప్పుడు వాయించేస్తా వంటున్నారు.'

'పోనీ! అలాగే కానీయండి. ఆసొమ్మెక్కడికిపోతుంది?'

అని ప్రాప్రయిటరుబాబు వేంకటశాస్త్రితో సంభాషించుచుండఁగా నాఫీసుగదినుండి విశ్వనాథము టపా యిచ్చుటకు బాబుగారిమొదుటికి వచ్చెను. అప్పుడు వానిచేతిలోనున్న యుత్తరములు ప్రతిదినమువలె రెండుమూఁడుమాత్రమేగాక యించుమించుగఁ బది పంద్రెండువఱకు నుండినట్లు దొంతిగాఁ గానవచ్చుచుండెను. ఎన్నికలలోఁ దనకు విజయము కలుగని కారణమున ప్రాప్రయిటరు విచా

రములోనుండినవాఁ డగుటచే రెండుమూఁడుదినములనుండియు వచ్చిన యుత్తరములు చూడలేదు. వచ్చినయుత్తరములు చూపవలసినది పదిగంటలవేళ యగుటచే విశ్వనాథము తనవిధిచొప్పున నుత్తరములతో వచ్చెనేకాని గంగాధరమున కానాడుఁగూడ వానిని జూడవలయు ననునుత్సాహము లేదు. అందుచే నతఁడు వానిం జూచుటయె తడవుగ—

'ఉత్తరాలేనా? ఎవ రెవరు వ్రాసినవి?'

'చిత్తం! అన్నీ లోకల్ లెటర్సే'

'అన్నీ రిజిస్ట్రీ చేసినవే కాఁబోలు?'

'చిత్తం.'

'మా కావేళే అనుమానం పుట్టింది. ఆరిజిస్ట్రీవుత్తరాలన్నీ చదివేవా?'

'చిత్తం చదివాను.'

'మొత్తం యేపాటి?'

'యెనభై వేలు చిల్లర'

'సరే, యూ విల్ గో!'

విశ్వనాథము తక్షణ మాఫీసులోనికిఁ బోయెను. గంగాధర మొక్కక్షణము తనలో నాలోచించి వేంకటశాస్త్రిని జూచి—

'ఆలోచన చెప్పండి శాస్త్రీజీ! మొత్తం అంతా యెనభై వేలు'

'చిత్తం! ఇదంతా నాయుడుదెబ్బ! మనబాకీదార్లందర్నీ లేవదీశాడు. ఈమూరు చేసే క్యాన్వాసింగులో వాణ్ణి హతం ఆర్చియాలి.'

'మేనేజమెంటంతా దరోబస్తూ యీమారు మీమీద విడిచిపెట్టేస్తాం.'

'చిత్తం! తక్కిన చిల్లరకూడా భర్తీచేయించియీమారు ముప్ఫైవేలూ శాంక్షన్ చేయిస్తే—'

అని చిటికెలువేయుచు శిరమాడించుచు, బుగ్గ నిడుకొన్న ధూమపత్రరసము నొక్కొక గుటకవేయుచు—

'చూపిస్తాను మజా— నాయుడికి— దెబ్బకి దెబ్బ— గిరగిర గిరగిర తిరిగి బాబుగారిపాదాలమీద పడేటట్టు చేస్తాను.'

'సరే! ఇదో ముప్ఫైయివేలూ— అదో యెనభై వేలూ— మొత్తం లక్షా పదివేలు. అథమం రెండుగ్రామాలేనా యిప్పట్లో మనం విక్రయించవలసుంటుంది.'

'గ్రామాలు విక్రయించేదాకా ఆగితే లాభం లేదు. ఈలోగానే మనం వోటర్లకి వర్తమానం చేసి మామూళ్ళు చెల్లించీయాలి.'

'ఆలాగా? అయితే అందాకా మనదగ్గిర కొంతజవహారీ వుంది. తాకట్టు పెడదాం వంటారా? లేకపోతే?—'

'తాకట్టెప్పుడూ వాకట్టే! అది మనకి లాభంలేదు.'

'సరే! ఆదివారంనాడు నోగోల్డుమర్చంటుని తెప్పించండి'

అని చెప్పుచుండ నింతలో లక్ష్మింపతి వచ్చి బాబుగారికి నమస్కరించి కట్టెదుట నిలువఁబడియుండ, నాచారముచొప్పున నతఁడు వానిని గూర్చుండుమనక కంటఁబడినంతనే—

'లక్ష్మింపతిగారూ! మేం విచ్చిన రెండువందలరూపాయిలూ మీరు గొల్లవీథిలో పంచిపెట్టేరా?'

'వెంటనే పంచిపెట్టేశాను. బాబుగా రెందు కలా సెలవిచ్చారో నాకు ఆశ్చర్యంగా వుంది.'

'మీరు వెంటనే పంచిపెట్టుంటే మాకిన్ని వోట్లెలా తగ్గిపోయాయి?'

'చిత్తం! ఆసంగతి న నన్నడుగుతే నేనేం మనవి చెయ్య గలను? సానివీధిలో మాత్రం కొంత మోసం జరిగిందని విన్నాను.'

ఆమాటలకు వేంకటశాస్త్రి కను లెఱ్ఱఁజేసి తీవ్రమైన ముఖముతో

వేంక:-లక్ష్మింపతిగారూ! నే నిక్కడే వున్నాను. ఆలోచించి మాటాడండి! సానివీధి ప్రసంగం యెత్తడానికి మీకు హక్కులేదు. ఆవీధి కంట్రాక్టంతా నాదీ. అక్కడ మోసం జరిగిందీ అంటే నేను మోసించేసే నన్నమాటే. నోరుమాత్రం తిన్నగా రానీయండి.'

లక్ష్మి:-ఎందు కలా తొందరపడతారు శాస్త్రీజీ! మీవల్ల మోసం జరిగిందని యెంతమాత్రం నావుద్దేశం కాదు. మీయిష్టం వచ్చిన ప్రమాణంచేస్తాను. అందుచేత మీనోరు తిన్నగా రానిస్తే బాగుంటుంది.'

వేంక:-దివాణంలో ప్రమాణం చేస్తా నంటావయ్యా? అదెంత తప్పో తెలిసికోకుండా——(అని ప్రొప్రయిటరువంకఁ జూచి) చిత్త గిస్తున్నారా బాబుగారు వీడిపేలాపన?

లక్ష్మి:-ఇదిగో శాస్త్ర్లుల్లూ! వీడూ వాడూ అని ఏకవచనప్రయోగం చేస్తే తలంటీస్తాను జాగ్రత! బాబుగారు న న్నేదో అడిగారు. నేనేదో సమాధానం చెప్పుకుంటూవుంటే మధ్య నీయేడు పేవిటి'

ప్రొప్ర:-లక్ష్మింపతిగారూ! మా వ్యవహారం అంతా మీవల్లనే పాడై పోయింది. సరే! ఆ రెండువందలూ మీ రేంచేసినా మాకు లక్ష్యంలేదు. కాని-లక్ష్మీకాంతాన్ని మీరు డిస్మిస్ చేయించడంవల్ల వసంతరావు వోటు మాకు పోయింది. అది వచ్చుంటే మేం గెల్చేసుందుంకదూ. అనవసరంగా మీరు

మమ్మల్ని మీవ్యవహారాల్లో ప్రవేశపెట్టి మావ్యవహారం పాడు చేశారు. ఇహమీఁద మాదివాణంలో మీరు కాలు పెట్టవల సిన పనిలేదని మీకు ఆర్డర్సిస్తున్నాం.'

లక్ష్మీ:-(మొగము ముణుచుకొని గడగడ వణకుచు) చిత్తం! నా అయిదువేలూ నాకు పారపోసీయండి.

ప్రొప్ర:—మీకు మేం యివ్వవలసినవి నాలుగువేల తొమ్మిదివందలే.

లక్ష్మీ:-బాబుగారిఔదార్యం యెలావుంటే అలాగే యివ్వవచ్చు.

ప్రొప్ర:-(కన్ను లెఱ్ఱఁజేసి) మాఔదార్యం యెత్తేవూ అంటే గుడ్లు పిదిలించేస్తాను. దగుల్బాజీ? ఎవ రక్కడ బంట్రోతులు? వీణ్ణవతలకి గెంటీయండీ!

అని యాగ్రహాతిశయమునఁ గేకలు వేయుచుఁ బలుకఁగా నిరువురు సేవకులు వెలుపలినుండి పఱుగున నాచావడిలోనికి వచ్చి విషాదభయకోపాతిశయములచే మఱింత గడగడ వడకుచుండిన లక్ష్మింపతిని బట్టుకొనిరి. లక్ష్మింపతి వేంకటశాస్త్రివంకఁ గొఱకొఱ జూచుచు—

'శాస్తుల్లూ! నాసొమ్ము నా కెప్పు డిస్తావ్! వెంటనే యిచ్చీక పోతే గుండెమీద తన్ని వసూలు చేస్తాను జాగ్రత్త.'

'నీసొమ్ము నీకు ముట్టుసరికి నీయబ్బ దిగిరావాలి! నేనురాసి చ్చిన నోటులోని సాక్షు లిద్దరూ యీసృష్టిలో యెక్కడా లేరు. ఆ రామన్నా అంటే ఆకాశరామన్న. సం- దేవదత్తుడూ అంటే సంస్కృతవ్యాకరణంలోవున్న దేవదత్తుడు. ఇప్పుడు తెలిసిందా? ఇహ నీదిక్కున్నచోట చెప్పుకో పో!'

పాపము లక్ష్మింపతి కంట నీరువెట్టుకొని యేడ్చుచుండ సేవకు లాతని నావల కీడ్చుకొనిపోయిరి. అప్పుడు సుందరమ్మగారి నౌఖర యిన అప్పఁడు లక్ష్మింపతికి జరిగిన పరాభవమును గన్నులారఁ

జూచుచుఁ జావడిలోనికి వచ్చి వ్రాయుటకును కొంకయుత్తరమిచ్చి జవాబిమ్మని కోరెను. గంగాధర మాయుత్తరమును విప్పి తనలోఁ జదువుకొని—

'శాస్త్రీజీ! పెద్దమొత్తానికే డిమేండొచ్చింది. యర్రమిల్లివారి నలభయివేలూ వారంరోజుల్లో యిచ్చెయ్యాలట. ఈఋణాలన్నీ రెండుగ్రామాలతో తీరేటట్టు కనబడదు. చూడండీ! ఈదస్తూరీ లక్ష్మీకాంతం దస్తూరీలాగ కనబడుతూంది.'

అని యాయుత్తరమును వేంకటశాస్త్రి కిచ్చి యాచావడికిటికీలోనుండి వీధివంక దృష్టి సారించుచుఁ గన్నీరు దుడుచుకొని యేడ్చుచుఁ బోవుచుండిన లక్ష్మీంపతిని జూడసాగెను.

తన దుర్వర్తనమునకు దురాశకుఁ బ్రతిఫలముగా నానాడు లక్ష్మీంపతి తన దుష్టప్రభువుచేతను దుష్టమిత్రునిచేతను సంపూర్ణముగాఁ బరిభవింపఁబడి యెఱ్ఱవాఱిన మొగముతో నతిత్వరితగతి నింటికిం బోయి, తత్క్షణమె వారిపై వ్యాజ్యములను వేయుసంకల్పముతోఁ దనగదితాళము తీసి లోనికింబోయి పెట్టితాళము తీసి చూడ యం దెంత వెదకినను వాని కాఋణపత్రములు రెండును గానరా వయ్యె.



## 28 వ ప్రకరణము

### పదిగంటలవఱకు మాటాడిరి.

లక్ష్మీంపతి పెట్టిలోనున్న ఋణపత్రములు రెండును సంగ్రహించుటకును, వారముదినములలో ఋణము చెల్లింపవలయునని వ్రాయుటకున కుత్తరము వ్రాయుటకును రాజేశ్వరమ్మకూడా సమ్మ

తించుటచే నారెండుకార్యములు నప్పుడే నిర్వహింపఁబడినవి. పిమ్మట లక్ష్మీకాంతము భ్రమరముతోఁగూడ రాజేశ్వరమ్మయొద్ద సెలవు గైకొనఁగా నామెయు సుందరమ్మయు భ్రమరమును విడిచి వెళ్ళ వలయునని వానిని గోరిరి. కానివసంతము జబ్బుగా నుండుటచే నుండు టకు భ్రమరముగాని యుంచుటకు లక్ష్మీకాంతముగాని సమ్మతింప లేదు. మఱియొకప్పుడు వచ్చి యుండెదనని భ్రమరాంబ మందహా సాంచితములైన మందమందమృదూక్తులతో వారిని వేడుకొనఁగాఁ దల్లియుఁ గుమార్తెయు నాబాలికాలలామను జెరియొక చేయిగాఁ బట్టుకొని, యామెవివాహమునుగూర్చి యామెతోఁ గొంతవఱకు హాస్యవచనము లాడిరి. పిమ్మట సుందరమ్మ కనుసంజ్ఞలతో రాజేశ్వ రమ్మ లక్ష్మీకాంతమును జూచి— 'అబ్బాయీ! అమ్మాయి కంత యిష్టంగా వున్నప్పుడు వెలనాటిసంబంధఁవైనా మనం యేం చెయ్య గలఁ? తప్పకుండా ప్రయత్నించండి! ఆచిన్నవాడుకూడా చాలా యిష్టంగా వున్నాడని సుందరం చెప్పింది. నా కివాళే తెలిసింది ఈభోగట్టా. ఆచిన్నవాఁడి కిష్టంవున్నప్పుడూ తల్లీ- తండ్రీ వొప్ప కోక యేం చేస్తారు? మహాచక్కా వొప్పకుంటారు. అందులో బియ్యేకూడా చదువుతున్నాట్ట! ఇలాంటి పెళ్ళిళ్ళంటే మాసుందరం నాన్నగారికి మాయిష్టం. అంతా బాృహ్మలఁవే తప్పేఁవిటంటూ వుండేవారు. మీ కెందుకు మీరు పృియత్నం చేస్తురూ! చూదాం యెలా వస్తుందో' అని హెచ్చరించుచుఁ బలికి వారికి సెల విచ్చెను.

లక్ష్మీకాంతము తనజన్మము సార్థకమైనట్లు మహానందపర వశుఁడై భ్రమరముతో నింటికి వచ్చుచుండ మార్గమధ్యముననే భ్రమరము 'అన్నయ్యా! సుందరమ్మగారు చెప్పినవెంటనే పేరమ్మ యింటికి వెళ్ళివచ్చింది. కాంభుక్తతో మాటాడేనని చెప్పింది.

కాంభుక్త యేమన్నాడని సుందరమ్మగారడిగితే యేమీ అనలేదు. పూరుకున్నాడనిమాత్రం చెప్పింది.' అని తనచిన్నన్న కెఱింగించెను. అది విని లక్ష్మీకాంతము మెంటాడసంబంధము తప్పించుటకుఁ దాను బన్నిన యుపాయ మెంతవఱకుఁ గొనసాగునోయనితలంచుచుఁ జెల్లెలి తోఁగూడ వసంతునియింటికిఁ బోయి తాను బోవుసరికి స్వరాజ్య మింట లేనందున వసంతునకుఁ గొంత యుపచార మొనర్చి పిమ్మట నింటికిఁ బోయెను. ఆమఱునాటినుండియు రాజేశ్వరమ్మ లక్ష్మీ కాంతముకొఱకుఁ బేరమ్మను బంపుచుండఁగా నతఁడు కబురు వచ్చి నప్పుడెల్ల నామెకడకుఁ బోయి మాటాడి వచ్చుచుండెను. స్వరాజ్య మింట లేనప్పుడు వసంతునియుపచారములకై భ్రమరమును విడిచి యొక్కొక్కప్పుడు లక్ష్మీకాంతము తా నొంటరిగనే రాజేశ్వరమ్మ యొద్దకుఁ బోవలసి వచ్చుచుండెను. అట్టియవసరములయందు నొంట రిగఁ బోవుట కతఁ డొకటిరెండుసారులు మిక్కిలి మోమోటపడి యెనేకాని రాజేశ్వరమ్మయు సుందరమ్మయుఁ జూపుచుండిన యభిమా నాతిశయము క్రమముగా వాని కామోమోటమును దొలంగించి రాకపోకలకై వానికి వలసినంత చనవు కల్పించినది.

ఒకనాటిప్రాతఃకాలమున రాజేశ్వరమ్మ తనయాచారము చొప్పున లేచి స్నానముచేసి తులసిపూజ గావించుకొని నుదుట విబూదిరేకలతోడను, మెడలో వ్రేలాడు బంగారుకట్ల సన్నని రుద్రాక్షతావళముతోడను మేడమీఁదికి వచ్చి సుందరమ్మకు కాఫీ యిచ్చుచుండిన పేరమ్మను జూచి, ''పేరమ్మా! పొప్పరయిటరు వారంరోజుల్లో సొమ్మిచ్చేస్తాట్ట! తణఖాపత్రంమీద వడ్డీ కట్టించాలి. తరవాత అనకాపల్లిరైతులకు త్తరాలుకూడా రాయించాలి. వోమారు బతిమాలుకున్నానని చెప్పి లక్ష్మీకాంతాన్ని తీసుకురా! మళ్లా యెని మిదిగంటలకల్లా దివాణంలోకి వెళిపోవచ్చునని చెప్పు'' అనిచెప్పి

పంపించెను. తనయుద్యోగభంగవార్త భ్రమరమును జెప్పనీయక తాను జెప్పక లక్ష్మీకాంతము వారికడ రహస్యముగానే యుంచెను. అందుచేఁ దల్లియుఁ గూఁతురును నతఁడు దివాణములోఁ బనిచేయు చుండెననియే యనుకొనుచుండిరి. తణఖాపత్రము సామ్ముకొఱకు నుత్తరము వ్రాయించిన నాఁటమాత్రము, లక్ష్మీకాంతము సంశయింపక స్వహస్తముతో నాయుత్తరము వ్రాసినందుకు వానియుద్యోగమును గూర్చి సుందరమ్మ కనుమానము కలిగినది. పేరమ్మ యున్నంతవఱకు నూరకుండి యామె లక్ష్మీకాంతము కొఱకు వెళ్ళినంతనే, తాను గూర్చుండిన సోఫాపైఁ దనప్రక్కనే కూర్చుండిన రాజేశ్వరమ్మతో సుందరమ్మ యేదోవిషయము నతిరహస్యముగఁ బ్రసంగింపసాగెను. బయలుదేరిన పేరమ్మ యింకను జుట్టుప్రక్కల నెక్కడనైన నున్న దేమోయని యటు నిటుఁ జూచుచు ననుమానముతో జంకుచు నొక్కొక్కమాట నుడువుచుండుటచే, నప్పుడామె ప్రసంగించుచున్న విషయ మాప్తురాలైన పేరమ్మకుఁగూడఁ దెలియరాని మహారహస్య మని మన మూహింపవలసియున్నది. తమసొంతవ్యవహారములను బ్రసంగించుకొనునప్పుడెల్ల నాతల్లిగూఁతుండ్రలో భయస్వభావయగు రాజేశ్వరమ్మముఖ మెప్పుడును వాడి దీనమై నిట్టూర్పులు విడుచుచు మితిలేని విచారమును సూచించుచుండ, సుందరమ్మముఖముమాత్రము లేశము నట్టికలఁత వహింపక ధైర్యముతోడనే యొప్పుచుండును. ఆనాటిప్రసంగ మెట్టిదోకాని యాయాచారము విపరీతమై సుందరమ్మ ముఖమునే మిక్కిలి దీనముగాఁ గావించినది. తర్కించి తర్కించి రాజేశ్వరమ్మ యడుగుచు వచ్చిన పదేసిప్రశ్నలలో నొక్కొక్క ప్రశ్నకుమాత్రమే యేదో సమాధానము చెప్పుచు నామె మిక్కిలి దీనాననయై మౌనముతోఁ గూర్చుండెను. అడిగిన వస్తువును బడయ నప్పుడలిగి కూర్చుండెడు చిఱుతబాలికవలెనే యాసుందరీమణి

మొగము ముడుచుకొని యాసోఫాపై ఖిన్నవదనయై యుండెను. కోరరానిది కోరిన పిల్లలకు సామవాక్యముల బోధించు తల్లులముఖము లందుఁ గన్పట్టు లక్షణములన్నియు నారహస్యప్రసంగములో రాజేశ్వరమ్మముఖమునందుఁ గన్పట్టుచుండెను.

నాటియుదయమున నాకాంతామణి కోరిన దెయ్యదియో రాజేశ్వరమ్మ వారించున దెయ్యదియోకాని క్రమక్రమముగా సుందరమ్మ కనుదమ్ముల నశ్రుకణము లురలఁ దొడంగెను. కూర్చుండుట కును జేరఁబడుటకును నాకుఁబచ్చని పట్టుపరపులుగల యాసోఫాపైఁ దల్లి కభిముఖముగా నాసీనయైయుండిన యారమణీమణి తనదక్షిణ హస్తమును సోఫావెనుకకు వ్రేలవేసికొని, దంతపుదండెపై మొగము చేర్చి, యందు శిల్పకారుఁడు మంచిముత్తియములఁ బొదువని లోప మును దనబాష్పకణములఁ దొలంగించుచుండెను. కూఁతురు కంట నీ రిడుకొనుట పాప మాతల్లికి దుస్సహమైనది. తనకుఁ గలిగిన పతిమరణ క్లేశమును బలిమి నడంచుకొని, పితృశోకమును దానివెంటనే పతి శోకమునుగూడ సంభవించిన తనయనుంగుఁగూఁతు నహర్నిశల నోదార్చుచు, నామెయుల్లాసమునకై పడరానిపాట్లెల్లఁ బడుచు నాటినుండియు నల్లారుముద్దుగఁ బెంచుచువచ్చిన రాజేశ్వరమ్మ సుంద రమ్మకన్నీరు దుడిచి, గుసగుసలుమాని ధారాళముగనే ప్రసంగింప సాగెను.

"సుందరం! నీకోసం నాగుండె రాయి చేసికొని నువ్వు కంట తడిపెట్టకుండా నాలుగేళ్ళనుండి నిన్ను కాపాడుకుంటున్నాను. కాని ఇవాళమాత్రం నాకు సాధ్యం కాలేదు. మంచీ చెడ్డా అడుగుతున్న ప్పుడు నాకు సమాధానం చెప్పాలికాని యీకన్నీళ్లెందుకమ్మా? ఏవో నాకు తోచినవి నాలుగూ చెప్పేను. నువ్వాలోచించుకో! నీ కెలా తోస్తే అలా చెయ్యి. మధ్య నాఆటంకం నీ కెందుకు?

సుందరమ్మ కన్నీరు తుడుచుకొని, సోఫాదండెపైఁ జేర్చిన మొగ మట్లే యుంచుకొని—

"నీ కిష్టం లేనప్పుడు ఆప్రసంగం మరెత్తకు. నేనుకూడా నావుద్దేశం మార్చేసుకున్నాను."

"నావల్ల నీవుద్దేశం యెప్పుడూ మార్చుకో అక్కర్లేదు. ఆసంగతి నువ్వే బాగా ఆలోచించుకో! జ్ఞానం వచ్చినదానివికాని చిన్న పిల్లవికావు. మాకాలపాళ్ళని ఆలోచ నడుగుతేమాత్రం యీలాగే వుంటుంది. ఇంతకీ ఈయాస్తి నీది— సర్వం నీదీ—"

"ఈయాస్తికూడా నా కక్కర్లేదు. నువ్వే తీసుకో నీవంతూ నావంతూకూడా—"

"నా కెందుకు? బుఱ్ఱమీద పెట్టుకొని వూరేగడానికి?"

"నువ్వూరేగ లేకపోతే దత్తుణ్ణి పెంచుకుందువుగాని. నీకు బదులుగా వాడే వూరేగుతాడు."

"బాగానే వున్నాయి నీమాటలు! ఆదినుంచీ నీదంతా వొక్క తీరకం! ముక్కు నున్నాది కోపం. సాధకబాధకాలన్నీ నే నాలోచించి చెప్తూవుంటే ఔననో కాదనో చెప్పాలికాని— అంత చికాకెందుకమ్మా? నీకే అక్కర్లేనప్పుడు చచ్చేకాలానికి నా కెందుకు దత్తుడు?"

"ఒక్కక్షణంలో తప్పిపోయిందికాని దత్తుడు నీకూ అవసరం లేకపోను నాకూ అవసరం లేకపోను. ఇంతకీ నాలుగేళ్లాయి మనికో దత్తుడింట్లో వుండనే వున్నాడు. అందుచేత ఆస్తికి మరిభయం లేదు. ఏయర్ధరాత్రిప్పుడో నీపీకా నాపీకా పిసికేసి ఆస్తి అప్పగింత పెట్టుకుంటాడు. అలాంటిబలవన్మరణం లేకుండా ఆపీలేదో చిన్నాన్న మొహం మీద పారేసి నువ్వూ నేనూ కాశీపోయి అన్నపూర్ణసత్రంలో యింత ముద్ద తింటూ నిర్వూచీగా వుందాం పద! దిక్కూ దివాణం లేకుండా

దినదినగండంతో యెంతకాలం యిలా బతగ్గలం!''

'ఔను. ఆమాట నిజఁవే. నువ్వాకాస్త చికాకూ కోపం విడిచి పెడితే యేసంగతేనా ఆలోచిద్దాం. నువ్విలా మొహం ముణుచుకొని కంట నీరు పెట్టుకుంఁటే నాకు మతిపోతుంది. చూశావా! ఇప్పుడు నువ్వు చెప్పింది నాకు కొంత సమాధానంగా వుంది. నిజంగా మన బతుకు దినదినగండంగానే కనబడుతూంది. వాడెంతకేనా తెగించే వాడే. ఎంతసాహసం లేకపోతే య్దైదువేలంటీస్తాడు? పదా పాతికా పోనీ వూరుకోడానికేనా? ఈయ్దైదువేలసంగతీ యెత్తేసరికే వస్తుంది వాడికీ మనకీ జట్టీ. నువ్వన్నట్టు పీక పిసికీయఖ్ఖర్లేదు. వొఖ్ఖలెంప కాయ కొడితే చాల్దూ? ఆడవాళ్ళం! యేడుస్తూ కూచోవలసిందేకాని యేం చెయ్యగలం?'

'చిన్నాన్నపెట్టె తీసి వూరికే వెతుక్కుంటూవుంఁటే పేరమ్మ చూసిందట. నోట్లు వెతుక్కున్నాడుకాబోలు? మనమీదమాత్రం అను మానం వుండదు. వున్నా దొంగలతల్లి కేడవభయం. అడగలేడు.'

'అడగలేడనకు—అడిగేస్తాడు. కలక్టరుకచేరికి తిరుగుతూ వుండడంవల్ల తీరుబడి లేకుండా వున్నాడు.'

ఇంతలో నెవరో వచ్చుచున్న పాదములచప్పుడు వినవచ్చి నందున నాతల్లికూఁతుం డ్రిరువురుఁ దమప్రసంగమును గట్టి యావంక వీక్షించుచుండ వారిసేవకుఁడైన యప్పడు దీనాననుడైన మఱి యొక పురుషుని వెంటనిడుకొని వారికట్టెదుటకు వచ్చెను. తోడనే సుందరమ్మ అప్పడు వెంటవచ్చిన పురుషుని జూచి—

'అప్పడూ—ఇత నెవరు?'

'పొప్పరయిటరుగారిదివాణంలో పనిచేసే యొకనౌకరండి.'

'ఇలాగా వచ్చాడెందుకు?'

'అమ్మగారిని చూడటానికి వొచ్చాడు'

'అబ్బాయీ! నీపేరేవిటి'

'నాపేరు అచ్చన్నండి'

'న న్నెందుకు చూడవలసివచ్చింది?'

'పాప్పరయిటరుగారు నాఉద్యోగం పీకేసి దివాణంలోంచి వెల్లిపొమ్మన్నారండి'

'కారణ వేఁవిటి?

'నేను మీదగ్గిరికి తాళంకోసం వచ్చినప్పుడు నన్ను మీరేవడిగారని గసిరితే లచ్చింపతిగారూ, ఎంకటచాత్తుల్లుగారూఉన్నారని చెప్పేనని, అందువల్లె మీరియ్యడం మానేసేరని, తాళంపోయిందాఅని మీరడిగితే పోనేదని, ఆయేళ యిక్కడ జరిగిన సమాచారమంతా వెంకటశాస్త్రిగారూ-లచ్చింపతిగారూ-అడిగితే చెప్పేశాను. ఆరిద్దరూ పాప్పరయిటరుగారికి పురెక్కించి నాఉద్దోగం పీకేయించి గెంటించేశారు. తరవాత లక్ష్మీకాంతంబాబుగారు అచ్చన్నా! ఈఉద్యోగం పోయినందుకు విచారించకని నాకు ధైర్యం చెప్పి మీదగ్గిరికి పంపించారండి.'

'ఏవిటి చెప్పేరు నీతోటి?'

'ఆయమ్మగారు మామంచోరూ-వెల్లిసెప్పుకో నీయదుష్టం యెలాగుంతే అలాగుంతాదీ అని సెప్పినారు. తనవుద్దేగంకంటే నావుద్దేగం పోయిందనేపాపం ఆపంతులో రిశారిస్తూ వుంటారు.'

ఆమాటకు సుందరమ్మరాజేశ్వరమ్మ లొండొరుల మొగములను జూచుకొనసాగిరి. అప్పుడు రాజేశ్వరమ్మ—

'పాప్పరైటరు లక్ష్మీకాంతాన్నికూడా తీసీశాడా యేవిఁటి?'

'మరేటి?ఆపొద్దే తీసీసినాడు. 'ఫూల్-నాసిస్' అని యేటేటో తిట్టి గెంటించీసినాడు.

సుందరమ్మ విచారముతో నొక్కనిట్టూర్పు విడిచెను. రాజేశ్వరమ్మ యాశ్చర్యముతో మఱల నానౌఖరుని జూచి,

'ఎందుకు గెంటించీశాడు? ఆ అబ్బాయి చేసిన తప్పేంవిటి?'

'తాళం యివ్వొద్దని యీాపే కబురెట్టినాడని నచ్చింపతిబాబు సెప్పీసరికి- పొప్పరేటరుగారు గెంటించీసినాడు. పాపం! ఆపంతులు ఆపూటకేనా సేనోడు!

అంతవఱకు మొగము వంచుకొని వినుచున్న సుందరమ్మ తటాలున మొగమెత్తి యానౌఖరుని జూచి——

'అంతపేదరికం వున్నట్టు నీకేం తెలుసును?'

'పొప్పరేటరుద్దేగం యిచ్చిన్నాడు ఆకవరు నానే తీసికెళ్లిచ్చినాను. నాకేశేనా యీనాం దొరుకుతుం దనుకున్నానుకాని యేటీ యియ్యనేదు. తరవాత దివాణంలో నన్ను పిలిసిఁ అచ్చన్నా! అచ్చన్నా నీసేతిలో ఓ పావలాడబ్బు శేనా యెట్టనేకపోయినానూ. నాకు మా యిశారంగా వుందీ యేటీ అనుకోకూ! నీయీనాంమాట మరిసిపోనులే! అని మా యిశారించినారు.'

'పోనీలే! నీకు మేం నౌఖరీయిస్తే ఆయీాసాం నీకు ముట్టినట్టే కదా? ఇవాళనుండీ మా నౌఖరీ చేసుకో!'

అని సుందరమ్మ పలికినంతనే రాజేశ్వరమ్మ వానితో—

'సజీతం ఆ అబ్బాయివచ్చి యేర్పాటు చేస్తాడు. అయితే లక్ష్మీంపతి నిన్నే కాకుండా ఆ అబ్బాయినికూడా తీయించీశాడూ?'

అని కుమార్తెవంకఁ దిరిగి—

'మనతో మాటవరసకేనా చెప్పలేదు చూశావా సుందరం!'

'ఔను. చెప్పలేదు. ఆమొహమాటం యింతా అంతా కాదు?'

'ఒక్క మొహమాటఁవే కాదమ్మా! మీావల్ల నాపుద్యోగం పోయిందిసుమండీ అని మనతో చెప్పడం అతని కిష్టం లేదు. వుద్యోగ

లక్ష్యం లేకుండా అంతపేదరికంలో వుండికూడా యెంత సాహసం చేశాడు?

'ఇది సాహసం కాదమ్మా! సుగుణం! నిజమైన సుగుణం పేదరికంలోనే తెలియాలి! బంగారం నాణెం చెయ్యడానికి గీటురాయుండాలి! నక్షత్రం తాలూకు కాంతి తెలియడానికమావాస్యచీకటి రావాలి. తనవుద్యోగం పోయిందని చెప్తే ప్రతిఫలం కోరుతున్నట్టు మనం అనుకుంటాఁవేమో అని అనుమానం! అందుచేత చెప్పలేదు. భ్రమరాన్నికూడా చెప్పనియ లేదు.

'అంతే! నువ్వు చెప్పిందే నిజం! తనబతుకు చూసుకోకుండా మనబతుకు తెరువు చూశాడు. అతని ఋణం తీర్చుకోడానికి నువ్వన్నదే బాగుంది. వొక్కవిధంచేత కాదు. అన్నివిధాలా బాగుంది.''

ఆమాటలవలనఁ దన కుదయించిన యాత్మవికాసమును దన ముఖమునఁ దోపఁనీయక ప్రక్కమొగము వెట్టుకొని, ''అప్పడూ! ఇవాళచిన్నాన్న పొద్దున్నే వెళ్ళినట్టుంది దివాణంలోకి?'' అని నేఁడియుఁ దోఁచనిసప్రశ్నగా నడిగెను. అప్పఁ డప్పుడు—

''సిత్తం! ఇయాలపొద్దున్న యేడుగంటలకే కలకటేరాపీసు కెల్లాలట— యెల్లినారు. ఆబాబు మరిదివాణంలోకి యెల్లరు.''

''ఆపొద్దు మీారిచ్చిన వుత్తరం వొట్టుకొని నే నెల్లేసరికి పొప్ప రేటరు నౌఖర్లచేత నచ్చింపతిబాబుని యీాదిలో కీడిపించేస్తూంటే నాను సూసినాను. ఆరికీ యీారికీ అంతా సెడిపోయింది.''

అది విని సుందరమ్మ రాజేశ్వరమ్మ లత్యాశ్చర్యముతో నొండొరుల మొగములు చూచుకొని నవ్వుచు నిరువురు నొక్కమారే ''అప్పడూ! నిజఁవే? నిజఁవే? నువ్వు చూశావా? విన్నకబురా?''

''నాను సూసే సెప్తుతున్నాను. పొప్పరేటరు యేటో తిట్టేస్తూ యీాడిపించేసినాడు. నచ్చింపతిబాబు యేడుస్తూ యెలిపో వచ్చినాడు.''

"అయితే యిన్నాళ్ళూ మా కెందుకు చెప్పేవు కావు?"

"అప్పడూ! అప్పడూ! సెప్పకురా సెప్పకురా అని నన్ను బతి మాలుకుంతే నాను సెప్ప నేదు."

ఇంతలో ముత్తయిదువయైన పేరమ్మ ముందు వచ్చుచుండ, నామెవెనుక లక్ష్మీకాంత మానాడు రామావధాని యొసంగిన పంచల చాపు ధరించి తనభావిభాగ్యోదయమును బ్రకటించుచున్న చక్కని ముఖలక్షణములతో నామేడచావడిలోఁ బ్రవేశించి సుందరమ్మ రాజేశ్వరమ్మలకు నయనానందకరుం డయ్యెను. ఆమనోహరాకృతి కంటఁబడినంతనే సుందరమ్మ లజ్జాహాసభాసురముఖియై చప్పున లేచి యచ్చటనే యాతనిం గూర్చుండ నియోగింపుమని తల్లికి సూచించు తెఱంగునఁ దనపాదరజోలేశమంటిన యాసోఫాభాగమును గన్నెరు పూవురంగున రంగారు తనబంగరుజరీచీరకొంగుతోఁ రెండుమూఁడు మాఱులు దులిపి, యాసోఫాకు వెనుకతట్టునన్న గదిగుమ్మముకడకుఁ బోయి, మూసియుండిన యొకరెక్కతలుపు నానుకొని యరచాటుగ నిలిచియుండెను. ఆతల్లి గూఁతుండ్రు సూచుచుండఁ గ్రొత్తసేవకుఁ డైన యచ్చన్న మ్రొక్కిన కృతజ్ఞతాసూచకమగు మ్రొక్కు నందుకొని లక్ష్మీకాంత మచ్చటియాసనములలో నేదే నొకయాసనమున నాసీనుం డగుటకుఁ జూచుచుండ, రాజేశ్వరమ్మ "ఇలా దావోయి బాబూ! ఇలావచ్చీ— యిక్కడ కూర్చో—" అని యాదరాయత్త చిత్తయై పలికెను. ఆసోఫాభాగమున సంతచనవుగఁ గూర్చుండుటకు లక్ష్మీకాంతము కొంత సంశయించెనుగాని రాజేశ్వరమ్మ లేచి తన్నుఁ జేయి పట్టి కూర్చుండఁబెట్టునో యనునంత నిర్బంధము చేయుటవలన వాని కం దాసీనుఁడుగాక తప్పినది కాదు. కట్టెదుట నిదువురు సేవకులును, బ్రక్క నొకకుర్చీ నానుకొని నిలిచియున్న పేరమ్మయు, వెనుకతట్టున గదిగుమ్మముకడ మనోరథరథంబులై యొప్పు వీక్షణ

మాలికలతో సుందరమ్మయుఁ గలయాసౌధాభ్యంతరమున నూతన వస్త్రాలంకృతుండై తనప్రక్కఁ గూర్చుండిన లక్ష్మీకాంతము రాజేశ్వరమ్మకు దర్శనీయుండయ్యెను. ఆసోఫాభాగమునఁ గూర్చుండుటయె తడవుగ నామె తనసవ్వముఖము నతనివంకకుఁ ద్రిప్పి—

'కాంతం! నీవుద్యోగం పోయిందట! చెప్పనేనా చెప్పేవు కావు ?'

'ఔను. చెప్పలేదు. సమయం వచ్చినప్పుడు సావకాశంగా మనవిచేసుకుందాఁవని ఆరహస్యం అలా వుంచుకున్నాను.'

'సమయం దేనికి? ఏఁవిటి మనవిచేసుకుంటావు? ఆరహస్యం యెందుకు మనవి చేసుకోలేదో యిప్పుడే చెప్పదూ! వింటాం. నేనూ సుందరమ్మానూ'

అని లక్ష్మీకాంత ముపయోగించిన మనవి యనుమాటకు నవ్వుకొనుచు రాజేశ్వరమ్మ సుందరమ్మ ముఖమును జూడఁగా నామె—

'ఆమాట దేశిరాజువారి కూతపదం! భ్రమరంకూడా నా దగ్గిర మొదట యిలాగే మాటాడుతూ వుండేది. మెల్లిగా ఆఅల వాటు తప్పించాను.'

అని పలికెను. సమయము కనిపెట్టి తాను సావకాశముగా రాజేశ్వరమ్మతోఁ జెప్పకొనఁ దలఁచినవిషయము నాకస్మికముగాఁ జెప్పవలసివచ్చునని లక్ష్మీకాంత మనుకొనలేదు. అయినను బూర్వమువలె మీరు మీరను బహువచనమును మాని తన్ను నీవు నీవను నేకవచనప్రయోగముతోడనే సంబోధించుచు రాజేశ్వరమ్మ యీనాఁ డెక్కుడు బంధుప్రేమ చూపుచున్నందుకు లక్ష్మీకాంత మెంతయు సంతసించి, తన చెప్పఁదలంచినది వ్యర్థము కాదని యనుకొనుచుండ నామె మఱల నిట్లనియె.

'కాంతం! వూరుకున్నావేం? నీవుద్యోగంమాట యెందుకు చెప్పేవు కావు?'

'అనకాపల్లిలో నోగుమస్తా అవసరంగా వున్నట్టు ఆవేళ ప్రసంగంలో నాకు తెలిసింది.'

'ఔను. అక్కడెలాగా నోగుమస్తా వుండాలి. అయితే?'

'మీ సెలవైతే అక్కడివ్యవహారాలు నేను చూస్తూ వుంటాను. భ్రమరాన్ని తీసుకొని అనకాపల్లి వెళిపోతాను.'

'అంటే? ఆగుమస్తాపని నీకు కావాలంటావా యేఁవిటి? అదేనా నీవుద్దేశం?'

అని నవ్వుచు సుందరమ్మవంక విలోకింప—

'ఔనమ్మా! అదే వుద్దేశం! ఆవుద్యోగం యిమ్మనే'

అని పలుకుటయుఁ దల్లికూఁతుం డ్రిరువురు నొండొరులమొగములు చూచుకొని కొంతసేపు నవ్వుకొనిరి. లక్ష్మీకాంత మానవ్వుల యందలియర్థమును గ్రహింపలేక వెలవెలఁ బోవుచుండ రాజేశ్వరమ్మ 'కాంతం! నువ్వో గుమస్తాలిని వేసుకుందువుగాని ఆగుమస్తాపని నీ కెందుకు?'

అని పలికి, యామాటయందలియర్థమును గ్రహింపలేక లక్ష్మీకాంతము తన్ను వింతగాఁ జూచుచుండ రాజేశ్వరమ్మ యచ్చటి సేవకులను బేరమ్మను వేర్వేరు పనులను నియోగించి పంచి యాతనితో సంభాషింప నుద్యుక్తురాలగుచుండ సుందరమ్మ—

'అమ్మా! భ్రమరం యెందుకు రాలేదో అడుగూ'

అని పలుక లక్ష్మీకాంత మామాటకుఁ బ్రత్యుత్తరముగా రాజేశ్వరమ్మ కిట్లనియె.

'భ్రమరానికీ నాకూ రాత్రి తెల్లవార్లూ నిద్దరలేదు. మావసంతానికి రాత్రిచాలా తొందర చేసింది. తిళ్లూ తిప్పలు లేకుండా అంతా అలా కూచున్నాం. రాత్రి పన్నెండింటికి డాక్టర్ నాయుణ్ణి తీసుకురావలసొచ్చింది. వేరమ్మ వచ్చేముందే వసంతానికి కొంచెం నిద్ర పట్టింది. నిద్రపట్టిందికదా అని యిలా వచ్చాను.'

రాజేశ్వరమ్మయు సుందరమ్మయు నామాటలు విని మిక్కిలి విచారించిరి. భోజనముకాని నిద్రగాని లేనిలక్ష్మీకాంతమునకు రాజేశ్వరమ్మ వెంటనే కాఫీయు నుపాహారములను సిద్ధము చేయించెను. ఆమెతోఁ బ్రసంగించుచు నతఁడు పదిగంటలవఱకు నచ్చటనే యుండి పోయెను.



## 29 వ ప్రకరణము

### జ్వరము - పలవరింతలు.

లక్ష్మీకాంతము భ్రమరము సూరమ్మయు మూఁడుదినముల నుండి రామావధానిగారియింటనే యుండిరి. కామేశ్వరమ్మ కొడుకు మంచముకడఁ గూర్చుండి కరచరణము లాడక, నిరంతరము వగచు చుండుటచే రామావధాని స్వయముగ సూరమ్మను బ్రతిమాలి యామెచేతనే వంట చేయించుకొనుచుండెను. ఆంగ్లవైద్యునికడకుఁ బోయి మందులు గొనివచ్చుటయుఁ గొనివచ్చిన మందులు యథావిధి రోగిచేఁ ద్రావించుటయుఁ ద్రావించినపైఁ గానవచ్చెడు గుణవిశేషములను మఱల వైద్యున కెఱిఁగించుచుండుటయు మున్నగు నవసరముల

యందు లక్ష్మీకాంతము నిమగ్నుఁడై యుండెను. మాటిమాటికి గదిగుమ్మముకడకుఁ బోయి కుమారుని నొకమారు చూచి వచ్చి, రెండుచేతులు వెనుకకుఁ బెట్టి మఱిపోయి రామావధాని చావడిలోఁ బచారు చేయుచుండెను. కామేశ్వరమ్మ కంట నీరు పెట్టుకొనుచుఁ గాళ్లు చాపుకొని కూర్చుండి, లక్ష్మీకాంతము వారించుచున్నను వినక చూడవచ్చిన యమ్మలక్కలనెల్ల గదిలోఁ జొరఁబెట్టి రోగిని జీకాకు పెట్టుచుండుటతప్ప మఱియొకపని లేకుండెను. జావయో కాఫీయో పండ్లరసమో, యెప్పు డెప్పు డెయ్యది రోగి కొసంగవలయునో తన చిన్నన్నవలన శ్రద్ధగా విని, యాయా విధానముల నెల్ల యథావిధి నిర్వహించుచు భ్రమరము స్వారాజ్యముతో వసంతునియొద్దనే ధర్మామీటరుతో గంటగంటకు జ్వరపరిమాణమును జూచుచు స్వారాజ్యము కాగితముపై వ్రాసి పెట్టుచుండెను. ఈమూఁడుదినములనుండియు నామె స్వారాజ్యాశ్రమమునకుఁ బోలేదు. వసంతుని జ్వర మింత యధికము కానంతవఱకు నామె ప్రతిదినమును దల్లితోఁ గలహించియు దండ్రితో వాదించియు నన్నగారిచేఁ జెప్పించియు నేదో యొకవిధమున ఖద్దరుశాలకు బోవుచునే యుండెనుగాని యామూఁడుదినములుమాత్ర మిల్లు కదలలేదు.

ఈవిధముగా నాకుటుంబమువారు రెండుదినములు గడపిరి. ఈరెండుదినములలో రామావధాని తెనుఁగువైద్యులను హూణ వైద్యులనుగూడ రప్పించి వారికిఁ దనకుమారుని జూపించుచువచ్చెను. పైత్యజ్వరమనియు వాతపైత్యజ్వరమనియు మేహవాతజ్వరమనియు, వాత పిత్త మేహ శ్లేష్మ మహాజ్వరమనియు నేవో పేరులతో భిన్నాభిప్రాయు లగుచుండిన తెలుఁగువైద్యులవలెనే 'మలేరియా' యనియు 'టైఫాయిడ్' అనియు 'టైఫాయిడ్ బట్ మైల్డుటైప్'

అనియు 'ఆస్తమెటిక్' ఫీవరనియు నొక్కొక్క రొక్కవిధముగాఁ
హూణవైద్యులుఁగూడ నభిప్రాయభేదమును జెందిరి. ఈ వైద్యులు నావైద్యులనుగూడ వసంతుని చూచినవెంటనే యీతఁ డుబ్బసరోగియాయనిమాత్రము రామావధాని నడుగుచుండిరి. అట్టి రోగము తనకొకనాఁడును లేదని యతఁడు వారికి సమాధానము చెప్పుచుండెను.

ఒకనాడు తగిలియు నొకనాడు తగులకయు వారము పదిదినములనుండి దగ్గు నాయాసముతో బాధపడుచున్న వసంతునకు రెండు దినములక్రిందట నత్యాకస్మికముగా జ్వరమధికమై మాంద్యమును గలిగించినది. రాత్రి తొమ్మిదిగంటలకు వచ్చినజ్వరము క్రమముగా నూటైదుడిగ్రీలవఱకుఁ బెరిగి గ్రీష్మకాలమహాతపమువలెఁ గాచికాచి మఱునాఁ డుదయము నూటరెండింటికి వచ్చి యచ్చట నిలుచుచుండెను. ఆమహాజ్వరమున నతని కమితమైన మాంద్యము కూడ నుదయించుచుండుటచేఁ బిలిచిన పలుకునట్టియు నడిగినది చెప్పునట్టియు జాగ్రదవస్థ వసంతునకు మధ్యాహ్నము మూఁడుగంటలుమొదలు రాత్రి తొమ్మిదిగంటలవఱకుమాత్రమే యగుచుండెను. మూఁడవనాటిరాత్రి పండ్రెండుగంటలప్పు డాతీవ్రజ్వరములో వసంతునియందుఁ బలవరింతలు పుట్టి సన్నిపాతలక్షణములు గానవచ్చెను. అప్పుడు రామావధాని భయకంపితగాత్రుఁ డగుచుండఁ గామేశ్వరమ్మ కంఠ మెత్తుటకు సిద్ధపడుచుండ లక్ష్మీకాంతము వారిని వారించి, వెంటనే పఱువెత్తిపోయి నాయుడు డాక్టరును దీసికొని వచ్చెను. వసంతరావు ప్రొప్రయిటరునకు నోటీయకుండుట తనకు నోటిచ్చినట్టులే సంతసించుచుండిన నాయుఁడు, లక్ష్మీకాంతము తన్ను బిలుచుటయె తడవుగ వచ్చి రోగి నొకయరగంటవఱకుఁ బరీక్షించి వానితో నింగ్లీషున నిది బ్రెయిన్ ఫీవరని చెప్పెను. లక్ష్మీకాంతము

కూడ నింగ్లీషున వాని కే మేమిరెూ చెప్పచుండ నాయిరువురకు జరిగిన సంభాషణ మచ్చటివారి కెవ్వరికిని బోధపడలేదు. లక్ష్మీకాంతముమాటలలో ''మేరేజ్'' అను పదమును, నాయుడు మాటలలో ఫీవ రనుపదమునుమాత్రము వివాహ మనియు- జ్వరమనియు రామావధాని కర్థమైనవి. కాని యీరెండుపదములకుఁగల యర్థసమన్వయముమాత్రము వానికి బోధపడలేదు. డాక్టరు వెంటవెళ్ళి లక్ష్మీకాంతము మందు తెచ్చి యిచ్చినతరవాత రామావధాని

'కాంతం! నాయుడేఁవంటాడు? ఉబ్బసమంటాడా మరోజ్వరఁవంటాడా?'

'ఉబ్బసం కాదంటాడు. ఆపలవరింతలూ అవీ కనిపెట్టిమనస్సు తాలూకు వ్యాకులత్వంచేత వచ్చిన జ్వరఁవంటాడు. అనగా వొకవిధమైన మనోవ్యాధి అని నాయుద్దేశం!'

'పోనీ మరేఁవీ ప్రాణభయం లే దన్నాడా?'

'ఎంతమాత్రిం భయం లేదు. రెండుమూడురోజుల్లోనే సర్దుకుంటుందని చెప్పేడు. ఇతని కేదేనా మనోవ్యాధి వుందా అంటే లేదన్నాను. మేరేజయిందా అంటే కా లేదన్నాను.'

'ఆసంభాషణము విని కామేశ్వరమ్మ భర్తను జూచి—

'బాబు కిది బెంగవుూష్టం! చదువుపోతుందని బెంగ పెట్టుకున్నాడు. చెన్నాపట్టం వెళిపోకుండా యీవుూష్టం యెందుకొచ్చిందని నాలుగైదురోజుల్నుంచీ అంటునే వున్నాడు.'

'వాడికి చదువుబెంగేఁవిటి? నీమొహం! డాక్టరు చెప్పినట్టు బెంగవుూష్టఁవే అయితే వాడికున్న బెంగంతా రాజ్యాన్నిగురించే! నేను బాగా కనిపెట్టేను. రాజ్యం వొక్కపూట మొహం ముణుచుకుని కూచుంటే బాబుచూసి భరించలేడు, బాబు చెప్పేడనే రాజ్యాన్ని

ఖద్దరాడవాళ్ళతో పంపించానుకాని లేకపోతే నా కెంతమాత్రం యిష్టం లేదు.'

'అయితే ఆమాట చెప్పండి డాకటరుతో-చదువుబెంగ కాదూ చెల్లెలిబెంగా అని- ఏమందుకో మం దిచ్చీకండా—'

'తెలివితక్కువ మాట్లాడక వూరుకో!'

నాటిరాత్రి తెల్లవారువఱకు లక్ష్మీకాంత యొక్కక్షణమైనఁ గన్ను మూయ లేదు. 'కాంతం! నువ్వోమారు నడుం చారేసుకో! నేను బాబుదగ్గిర కూచుంటాను.' అని రామావధాని యొకటిరెండు సారులు లక్ష్మీకాంతముతోఁ జెప్పుచు వచ్చెనుగాని, మంచుముక్కలతో నుదుటఁ గట్టుకట్టుటయు, థర్మామీటరుతో జ్వరము కొలుచుటయు, ఔన్సుగ్లాసుతోఁ గొలిచి యౌషధము త్రావించుచుండుటయు మున్నగునుపచారములను యథావిధిగ రామావధాని చేయలేఁడని యతఁడు నిద్రింపక యట్లే కూర్చుండెను. తన చిన్నన్నకుఁ జేదోడు వాదోడుగఁ దోడుపడుచు సూర్యోదయమువఱకు మేలుకొని యుండిన భ్రమరము నెడఁ గూడ రామావధాని యెంతయుఁ గృతజ్ఞత చూపఁదలచినవాఁ డయ్యెను. ఆరెండుమూఁడుదినములు నాబాలిక నిద్రయు నాహారము నెఱుఁగదు. మాటిమాటికిఁ గన్నీరు గార్చుచుఁ దమకన్న నెక్కుడుగ వగచుచు నహర్నిశ లామంచమును విడువక యాగదియందే యంటిపెట్టుకొనియుండిన భ్రమరమును జూచి, 'భ్రమరం నువ్వు సరిసరని బతికావు! నీది సంపూర్ణాయుర్దాయం! నీచెయ్యి పడితే బావకూడా సుఖంగా తేలిపోతా డమ్మా!' అని కామేశ్వరమ్మ యభినందించుచుండ నది రామావధాని వినిఁ భ్రమరమును దగ్గరకుఁ బిలచిఁ తన యరచేయి యామె గడ్డముక్రింద నిడి వేళ్లతోఁ జెక్కులు నొక్కుచు, భ్రమరం! బావఋణం నువ్వు తీర్చుకుంటున్నావు. నీఋణం మేఁవెలాగ తీర్చుకోగలం? బావకి నిమ్మ

ళంగా వుండనీ. ఎంతకష్టపడేనా నీమనస్సుకి నచ్చిన వరుణ్ణి నీకు కుదురుస్తానమ్మా!' అని హెచ్చరించుచుండెను.

మూఁడవనాటి రాత్రి వేకువవేళ మూఁడుగంటలప్పుడు భ్రమరాంబాలక్ష్మీకాంతములు వసంతున కుపచారము లొనర్చుచుండఁ గామేశ్వరమ్మ మంచముపైఁ జేతు లానుకొని కూర్చుండియుండ, నాగదిగుమ్మముకడనే వాలుగుర్చీయందు శరీరమును వాల్చి రామావధాని కుమారుని రోగమునుగూర్చి పరిపరివిధములఁ దలపోయుచుండ, మహాజ్వరనిమగ్నుఁడై యుండిన వసంతరావు 'నాన్నగారూ! వెళ్ళనీయండి! రాజ్యాన్ని వెళ్ళనీయండీ? దా న్నెడిపించకండి!' అని బిగ్గరగాఁ బలవరించెను. అది విని కామేశ్వరమ్మ కంట నీరు పెట్టుకొనుచుండఁ జేరఁబడి కూర్చుండిన రామావధాని ముందున కుబికి యొక్క నిట్టూర్పు విడిచి తదేకదృష్టితో రోగివంక విలోకించుచుండెను. అప్పుడు వసంతరావుఁ 'భ్రమరం! నేను మొంటాడ వెళుతున్నాను. నువ్వు నూతిలోమాత్రం పడకు' అని మఱల బలవరించెను. ఆపలవరింతయందలి యర్థమేమని రామావధాని యూహించుచుండ 'నాన్నగారూ! కాంభుక్త రాలేదేఁవండీ' అనుమఱియొక పలవరింత వానిచెవిలో బడినది. వెంటనే కామేశ్వరమ్మ భర్తను జూచి, 'విన్నారా? కాంభుక్తకోసం బాబు బెంగపెట్టుకొన్నాడు. ఎందుకొచ్చాడుకానో తెలియదు. వోవుత్తరం రాసి పడేస్తురూ?' అని పలికెను. ఆపలవరింత ప్రశ్న జాగ్రదవస్థయందలి ప్రశ్నవలెనే భావించి, వచ్చెదనని చెప్పిన కాంభుక్తయిన్నాళ్ళవఱకు రాకుండుటకుఁ గారణ మేమైయుండునని రామావధాని తనలో నాలోచించుకొన సాగెను.

రాత్రియంతయు నిట్టిపలవరింతలతోడను నాలోచనలతోడను దెల్లవారుటయు, లక్ష్మీకాంతము కాల్యములు నిర్వర్తించుకొని,

నిద్దురలేని కన్నులమంటచే నీటికిఁబోయి స్నానముచేసి, మాఱుబట్ట మఱియొకటి లేనందున, రామావధాని యిచ్చినపంచలచాపు నుత్తరించి ధరించి, వచ్చి పలవరింతలులేక గాఢముగ నిద్రించుచుండిన వసంతమును జూచుచుండ, నింతలోఁ బేరమ్మ వచ్చి కబురు చెప్పుటయు, స్వారాజ్యభ్రమరములను భద్రమని చెప్పియుంచి, మందీయవలసినవిధానము భ్రమర మెఱుంగుటచేఁ దాను రాజేశ్వరమ్మగారియొద్దకుఁ బోయి పదిగంటలవఱకు నచ్చటనే యుండవలసినవాఁడయ్యెను. ఇంతకాలమువఱకుఁ దనయెడ సీలబిగిసియుండిన కాలచక్రమున కానాటియుదయము పదిగంటలతోఁ జలనము గలిగి తిరుగుటచే, ముఖమున నూతనభాగ్యరేఖలు వెలువడి తాండవించుచుండ నాసౌధాభ్యంతరమునుండి బయలుదేరి, నూతనసేవకుఁడైన యచ్చన్న తనవెంటనే వచ్చుచుండ లక్ష్మీకాంతము వసంతునికడకు వచ్చెను. వలసినయవసరములను దీర్చుచుండుటకై యానాఁడంతయు నచ్చన్న యచ్చట నుండుటకే నియోగింపఁబడెను. మఱియు, గంట గంటకు వచ్చి చూచిపోవుచు వసంతుని స్థితిగతులు సుందరమ్మ రాజేశ్వరమ్మలతోఁ జెప్పుచుండుటకుఁ బేరమ్మ నియోగింపఁబడినది. లక్ష్మీకాంత మింటికివచ్చిన మఱియొకగంటకు వసంతునియందు మఱలఁ బలవరింత లుదయించుట యచ్చటివారి కందఱికిని గ్రమ్మఱ భయకారణ మైనది. రాత్రి పుట్టిన పలవరింతలు ప్రొద్దుననుండియు లేకుండుటచే నాయుడిచ్చినమందు గుణమిచ్చినదని యూహించుచుండిన తల్లిదండ్రులు మఱల వ్యాకులచిత్తులైరి. రామావధాని నిట్టూర్పులు విడుచుచుఁ జావడిలోనికి వచ్చి యొకకుర్చీయందుఁ గూలఁబడి లక్ష్మీకాంతమును బిలచి వెలవెలఁబోవుచుండిన ముఖముతో—

'కాంతం! మరోమారు నాయుణ్ణి తీసుకొస్తే?'

'అతనే వస్తాడు. వచ్చే వేళయింది. కొంచెంసేపు చూసి

రాకపోతే వెళ్ళి తీసుకొస్తాను. అదికాక అంత తొందరపడవలసిన యవసరంకూడా కనబడదు.'

'అవసరం లేదంటావా? నాకు శుభ్రంగా మతిపోతుంది. నువ్వే ఆలోచించుకో!'

'మతి పోవడానికేంవుంది? మీరలా బెంగ పెట్టుకోకండి!'

'బాబుకిది బెంగ వ్యాప్తం అనేనా నీవుద్దేశంకూడా?'

'నాయుడు వస్తాడుకదా మళ్ళా కనుక్కుందాం!'

ఈసంభాషణమధ్యమునఁ గామేశ్వరమ్మ గదిలోనుండి వచ్చి 'వింటున్నారా! ఇదిగో! చూడండి! బాబు అస్తమానం 'భ్రమరం' 'భ్రమరం' అంటాడు. ఎందుకలా అంటాడో నాయుణ్ణడగండి మరచిపోక—' అడగడం యెందుకు? పలవరింతల కర్థఁ వేఁమిటి?

అని రామావధాని చెప్పుచుండ నాతనిమాటలలోనే డాక్టరు నాయుడు వచ్చి రోగి నొక్కనిముసముమాత్రమే పరీక్షించి, దోష గుణము లేవియు లేవనియు భయపడ వలదనియుఁ జెప్పి వెంటనే వెడలిపోయెను. అంత వంటింటినుండి సూరమ్మ వచ్చి, వంటయైన దని చెప్ప, వసంతునింగూర్చి యాందోళన మొందుచుండిన రామావధానియుఁ గామేశ్వరమ్మయు లేశమును భోజనాపేక్ష లేకయుండియు, నభోజన ముండుట శుభము గాదని లక్ష్మీకాంతమును సూరమ్మయు నిర్బంధించుటచే స్నానములు చేసి కొంచె మెంగిలిపడి మంజఁల జేరు కొనిరి. లక్ష్మీకాంతాదులగు తక్కినవారును వారిమార్గమునసే యనుసరించిరి.

# ౩౦ వ ప్రకరణము

## 'భ్రమరం - నా కోడలే'

ఆనాటిమధ్యాహ్నము మూడుగంటలగుసరికి యథాప్రకారము జ్వరము తగ్గి వసంతరా వీలోకములోనివాఁ డయ్యెను. తొలినాఁటి రాత్రి యెనిమిదిగంటలనుండియు జ్వరాతిశయమున మైమరచియుండిన వసంతుని కిప్పుడు తెలివి వచ్చుటచే నచ్చటివా రెల్లరు నాతురతతో వాని నొక్కొక్క రొక్కొక్కప్రశ్న యడుగుచుండ లక్ష్మీకాంతము రోగిని మాటాడింప వలదని వారి నందఱను వారించెను. అంతవఱకు నాగదిగుమ్మముకడనే గుర్చీయందు మేనువాల్చి కన్నులుమూసి, వచ్చియురాని నిద్రలోనుండిన రామావధానిని గామేశ్వరమ వచ్చి 'బాబుకి జ్వరం తగ్గింది. ఓమాఱు లేచి చూడండి' అని మేలు కొలిపెను. ఆమాటల కతఁడు త్రుళ్ళిపడిన వానివలెఁ గలఁతనిద్ర నుండ లేచి, భుజముపైనున్న యంగవస్త్రముతోఁ గన్నుల నొత్తుకొని యాగదిలోఁ బ్రవేశించెను. అప్పుడు వసంతుఁడు వెల్లకిలఁ బండుకొనియుండిన యెత్తైనపట్టెమంచముపై నొడ్డుననే యొకకాలు వ్రేలవేసికొని చేతఁ గాఫీపాత్రతో లక్ష్మీకాంతము కూర్చుండి యుండ, వానిచేరువనే భ్రమరము నిలిచి, చేతనున్న చెమ్చాతోఁ గాఫీ తీసి మెల్లమెల్లఁగా వసంతునిచేఁ ద్రావించుచుండెను. ఆమంచము నకుఁ బ్రక్కనే నేల గోడకుఁ జేరఁబడి కూర్చుండి స్వరాజ్యము తన భర్త కుత్తరము వ్రాయుచుండెను. లోనఁ బ్రవేశించినంతనే రామావధాని స్వరాజ్యమును జూచి,

'ఏఁవిటమ్మా రాస్తున్నావు?'

'ఉత్తరం!'

'ఎవరికి?'

'ఇదిగో చూడండి!'

అని లేచి చేతనున్న కాగిత మాతనిచేతి కిచ్చెను. రామావధాని దాని నందుకొని 'మాఅన్నగారికి చాలాజబ్బుగా నున్నదికాబట్టి యీయుత్తరము చూచినతక్షణము మీరు బయలుదేరి రావలయు నని ప్రార్థించుచున్నాను. మిమ్మొక్కమారు చూచినయెడల మా అన్నగారికి వెంటనే జ్వరము నిమ్మళింపఁగలదని మా కందరికిని నమ్మకము కలదు. మీ రెంతమాత్రమును అశ్రద్ధ చేయరని నమ్ముచున్నాను- ఇట్లు విధేయురాలు- రాజ్యాంబ.' అని వ్రాయఁబడిన వాక్యములను బహిరంగముగానే చదివి, నవ్వుకొనుచు—

'ఎందుకమ్మా యీవుత్తరం? నీచాదస్తంకాని-ఇంతమాత్రాన్ని మీఆయన బయలుదేరి వెళిపోవస్తాడనే నీవుద్దేశం?'

'అన్నయ్యకి జబ్బుగా వుందని రాశానుకాబట్టి వస్తేరావచ్చు.'

'బాగానేవుంది నీఅమాయకత్వం! నీజడ్డితనం! ఈనాలుగు మాటలతోటే బయలుదేరి వెళిపోవస్తే యిహనేం కావాలి?'

'పోనీయండి వచ్చినా రాకపోయినా రాయడం నావిధి! అందు చేత రాశాను.'

'సరే! నీయిష్టం! నా కెందుకు? కవరు కావలస్తే నాచేతి పెట్టిలో వుంది తీసుకో!'

అని పలికి కుమారుని సమీపించెను. కాఫీ త్రావించుట పూర్తి యగుటచే లక్ష్మీకాంతము మంచమునుండి దిగుటయు భ్రమరము వానిచేతియందలి కాఫీపాత్ర నందుకొని ప్రక్కకుఁ దొలంగెను. రామావధాని తనకుమారునితలయు నుదురు చెక్కులుఁ జేతితో నిమురుచు—

'వసంతం! జ్వరం తగ్గిందా?

'తగ్గింది.'

'నీవొంట్లో మరేం లేదుకద?'

'నీరసంగామాత్రం వుంది.'

'అంతా నీకిది బెంగవృత్తాంతం అంటున్నారు. నీకు బెంగెందుకు?'

'నాకు దేనికీ బెంగ లేదు.'

'వుంటే దాచకుండా చెప్పు!'

'చెప్పినా మీరు తీర్చలేరు.'

'తీర్చనా? తీర్చలేనా?'

'రెండూనూ.'

'సరే! నాకు బోధపడ్డాది. నీకు నిమ్మళంగా వుండగానే నీతో నేనుకూడా చెన్నపట్టణం వస్తాను. డబ్బుఖర్చైతే అవుతుంది. రాజ్యాన్నీ నీమామగారినికూడా తీసుకువెళదాం, ఇంతమందిం కలిసి బోధపరుస్తే సోమశేఖరం దారిలోకివస్తాడనినానమ్మకం! నువ్వుఅనవసరంగా బెంగపెట్టుకోకు. వీలైనంతవరకూ ప్రయత్నం చేదాం. నేను తీర్చలేనని నువ్వన్నదికూడా నా కర్థం అయింది. రాజ్యానికి ద్వితీయ వివాహం చెయ్యడం నీవుద్దేశం. లోకంలో విధవావివాహాలంటూ యిప్పుడు చేస్తున్నారుకాని, భర్త వుండగా మళ్ళా పెళ్ళిచెయ్యడం యెక్కడా ఆచారం లేదు.—'

అని రామావధాని యింకను నేమేమియో చెప్పుచుండ, లక్ష్మీకాంతము—"మామయ్యగారూ! ఈవిషయంలో మీతో నే నేకీభవిస్తాను. భర్త వుండగా మళ్లా పెళ్లిచెయ్యడం మంచిపని కాదు. మీరన్నట్టు విధవావివాహం సోపక్షంగా వొప్పుకోవచ్చు. మీ వుద్దేశంకూడా అంతేనా?"

"విధవావివాహం అభిప్రాయభేదంతో కూడుకుంది. కూడునన్నవాళ్ళకీ కూడదన్నవాళ్ళకీకూడా శాస్త్రప్రమాణా లున్నాయి. అందుచేత దీని కంతబాధ లేదు."

అని ప్రత్యుత్తరమిచ్చి రామావధాని మఱలఁ గుమారుని జూచి-

"వసంతం! నువ్వు లేనిపోనివన్నీ మనస్సులో తెచ్చిపెట్టుకోకు నీకు నిమ్మళంగా వున్నతరవాత మాట్లాడి ఆలోచించి నీ కేది యిష్టం వైతే అది చేదాం."

అనిపలికి చావడిలోనికివచ్చి కూర్చుండి తనలో నేమో తల పోయసాగెను. వసంతునిమనోవిచారమంతయుఁ దనచెల్లెలినిగూర్చియే యని రామావధాని నమ్మకము. ఆనమ్మకముతోడనే యాచావడిలో వాని కష్టం డాలోచనలు పలుగిడుచున్నవి. స్వరాజ్యమునకు ద్వితీయవివాహము కూడదను తనమతముతో నేకీభవించిన లక్ష్మీకాంతమును దలంచి వానిని మెచ్చుకొని, ఆవిషయమునుగూర్చియే మఱల వానితో సంభాషింపవలయుననికాంక్షతో చావడిలోనుండి రామావధాని వానిని బిలచెను. ఆపిలుపు విని లక్ష్మీకాంతము వచ్చి వానికట్టెదుట నున్నకుర్చీపైఁ గూర్చుండినంత వారి కీవిధముగఁ బ్రసంగము జరిగెను.

"కాంతం! రాజ్యాన్నిగురించి బాబు యెలాంటి తప్పాలోచనలో వున్నాడో చూశావా?"

"నిజంగా మీరుచెప్పిన ట్టది తప్పాలోచనేకాని- యీతప్పాలోచనలో వసంతం మీ రనుకుంటున్నంత పట్టుదలతో లేడు మీరు తప్పభిప్రాయపడుతున్నారు."

"అందుకే ని న్నడుగుతున్నాను. బాబువుద్దేశం నీకు బాగా తెలుస్తుంది. వాడిమనస్సులో వున్నసంకల్పం యేవిటో నాకు చెప్పు"

"ఒకసంకల్పం వుంది. అది నాకు బాగా తెలుసును. నాకే కాదు. మనరాజ్యానికికూడా తెలుసును. మాఅందరికంటే బాగా తెలుసును భగిమరానికి"

'ఇంతమందికి తెలిసినప్పుడు నా కెందుకు తెలియ లేదూ? మీ అత్తయ్యకి తెలుసునా?'

'ఒక్క అత్తయ్యగారికీ మీకూమాత్రం యింతవరకూ తెలియదు, తెలియడాని కవకాశంకూడా గలగలేదు.

'అయితే తప్పకుండా వింటాను చెప్పు! ఏమిటి బాబుసంకల్పం?'

ఆమాటకు లక్ష్మీకాంతము ప్రత్యుత్తర మీయక మొగము వంచుకొని యూరకుండెను. అప్పుడు పేరమ్మ యాచావడిలోఁ బ్రవేశించి, వారికి దూరదూరముగా గోడవారనుండి యెదుచుగు లోనికిఁ బోయి గదిగుమ్మములోఁ గూర్చుండిన కామేశ్వరమ్మకడ నధివసించెను. రామావధాని మఱల లక్ష్మీకాంతమును జూచి—

'కాంతం! దేనికి సంశయం? చెప్పు!'

'చెప్తానుకాని వసంతంసంకల్పానికి మీసంకల్పం విరోధంగా వుంటుందేమో అన్న దొక్కటే సంశయం!

'అలాగా? రాజ్యానికి ద్వితీయవివాహం చేసేసంకల్పం కాకపోతే మరిదేనికేనా నే నంతవిరోధంగా వుండ ననుకుంటాను.'

" అంతవిరోధంగా కాకపోయినా కొంతవిరోధంగానైనా వుంటారుకదూ? "

'కాంతం! ఇంతవుపోద్ఘాతం యెందుకు? అదేదో చెప్పక—'

'చెప్తాను, తప్పకుండా చెప్తాను. కాని నానోటంట చెప్పవలసి వచ్చినందుకుమాత్రం విచారిస్తున్నాను. పరిస్థితులనుబట్టి మీయంత మీకే బోధపడివున్నా— లేక, మరియొకరినోటంట మీరు విన్నా— ఇప్పుడు నేను చెప్పబోయేవిషయంలో మీకు కొంతగౌరవం వుండి వుండును. అలాంటిది లేకుండా నేనే మనవి చేసుకుంటాను. క్షమించి నామాటయందు నమ్మకంవుంచి మరీసమాధానం చెప్పండి! మన

వసంతం— భ్రమరం— యిద్దరూ వొకరి నొకరు వివాహం చేసుకునే వుత్సాహంతో వున్నారు.'

ఆమాట చెవిని బడుటయే తడవుగ రామావధాని నిశ్చేష్టితుడై యత్యాశ్చర్యముతో నో రావలించి యవనతవదనుఁడై లక్ష్మీకాంతము డెస రెప్పవేయక చూడసాగెను. లక్ష్మీకాంతము రెండునిముసములవఱకు నాగి మఱివానిప్రత్యుత్తరమునకు వేచి యుండక—

'మాటలచేత— నవ్వులచేత— ముఖలక్షణములచేతా— వారికీవుద్దేశం వున్నట్టు నే నెన్నోమార్లు కనిపెట్టేను. నేను కాదు. రాజ్యం కూడా కనిపెట్టింది. నామాటమీద మీకు విశ్వాసం లేకపోతే అమ్మాయిని పిలిచి అడగండి! అమ్మాయినే కాదు. వసంతాన్నే అడగవచ్చు. మీరు మెంటాడసంబంధం మాటాడివచ్చినప్పటినుండీ వసంతానికీమనోవ్యథ బాధిస్తూంది. మీతోగాని అత్తయ్యగారితోగాని చెప్పలేక, లోలోపలే కృశించి కృశించి యీవూస్థం తెచ్చిపెట్టుకున్నాడు. మీకు తెలియవలసిన యీరహస్యం మనవి చేశాను. ఇక మీ యిష్టం.'

'కాంతం! స్వప్నంలోకూడా అనుకోనిసంగతి విన్నాను. ఇది త్రికాలములయందు జరగకూడని విషయం. గౌరవంగల మనకుటుంబాల్లో యిలాంటిశాఖాంతరవివాహం నా కెంతమాత్రం యిష్టంలేదు. నీమాటమీద నాకు విశ్వాసం లేకపోలేదు. రాజ్యాన్నికాని, వసంతాన్నికాని నే నడగక్కర్లేదు. వాళ్ళిద్దరికీ ఆవుద్దేశం వుండవచ్చు. అయితే మాలాంటిపెద్దవాళ్ళం యెరిగి మందలించాలికాని ప్రోత్సాహం చెయ్యడం మంచిపద్ధతి కాదు, ఈరహస్యం నాతో చెప్పేవుకాబట్టి తప్పకుండా వసంతాన్ని భ్రమరాన్ని చివాట్లుపెట్టి వాళ్ల

కావుద్దేశం మరిలేకుండా చేస్తాను. అంతేకాని మరోవిధంగా జరగడం నామతం కాదు.'

'మీమతం కాకపోవచ్చు! వాళ్ళని మీరు చివాట్లుపెట్టవచ్చు కాని ఆప్రేమపాశంమాత్రం మీరు తెంచలేరు. అది వాళ్ళయిద్దరి మనస్సులులలో గాఢంగా అల్లుకొనివుంది. నేను వొక్క నాచెల్లెలి మీదిపేమను పురస్కరించుకొనే మీతో మాటాడలేదు. వసంతరావు నాప్రాణం. మీరు మొంటాడసంబంధం తెచ్చినప్పటినుండీ అతని మనోవ్యథ నేను చూడలేక మీతో యింతగా మనవి చేసుకుంటు న్నాను. ఇప్పుడు నేను గదిలోనుండి వస్తున్నప్పుడుకూడా వసంతం నాతో చెప్పేడు- ఈరహస్యం మీతో చెప్పమని– శాఖ వొక్కటి భేదించినంతమాత్రంచేత–బియ్యే చదువుతూ ప్రాజ్ఞుడైన కొడుకునీ– యెంతో అభిమానంగా చూసుకుంటూవున్న భ్రమరాన్నీ మీరింత కఠినత్వంతో మోసపుచ్చడం న్యాయంకాదు. దూరం ఆలోచించండి! మానాన్నగారు భ్రమరాన్ని మీకప్పగించినందుకు–పరలోకంలోవున్న ఆయనకీవిధంగా తృప్తి కలిగించండి!'

'ఇందువల్ల నాన్నగారికి అసంతృప్తేకాని తృప్తి యెన్నడూ కాదు. భ్రమరాన్ని నాకప్పగించడంలో ఆయనఉద్దేశం——'

'మీకు లేశం బోధపడలేదు. బోధపర్చుకోడానికి తగినఅవ కాశంకూడా మీకు కలగలేదు. ఇప్పుడవకాశం కలిగింది బాగా ఆలోచించండి! నేనాలోచించినది మనవిచేస్తాను వినండి. ప్రాణం పోయేదినంకూడా నాన్నగారూ మీరు మాఅన్నయ్యపెళ్ళి కప్పిచ్చిన వైదువండలూ తీర్చలేకపోయినందుకు విచారిస్తూ వుండినసంగతి మీ రెరుగుదురుకదూ?'

'ఔను, ఆసంగతిమాత్రం నిజం. ఆయన పాపం ఆవిచారం తోటే ప్రాణం విడిచిపెట్టేడు.'

'అందుచేత- మీసొంతడబ్బు పెట్టి అన్నవస్త్రాలిచ్చి పోషించవలసిందనికాని, మీసొంతడబ్బు పెట్టి పెళ్ళి చెయ్యవలసిందనికాని మీకు ఋణస్థులై మరణించిన నాన్నగారికి లేశం వుద్దేశం వుండదు. అవసానదశలో భ్రమరాన్ని మీ కప్పగించడంలో ఆయనవుద్దేశం మీకోడలిగా చేసుకోవలసిందనే! ఇప్పుడు నేను కూడా భ్రమరాన్ని మీ కప్పగింత పెడుతున్నాను. మీకోడలుగా అంగీకరించండి! నాన్నగారిమీద మీ కేమాత్రం విశ్వాసమున్నా యీవిషయంలో చూపించండి! భ్రమరానికి మరోనూతిగండం రాకుండా చెయ్యండి? మళ్లా జ్వరం రాకముందే వసంతంచెవిలో మీరు స్వయంగా ఈశుభవార్త వెయ్యండి!'

'కాంతం! నాన్నగారు తనజీవితంలో నేను కూడదన్నపని యెప్పుడూ చెయ్యలేదు. భ్రమరాన్ని గురించి యిటువంటి వుద్దేశం నాన్నగారికి వుండడమే నిజమైతే నాన్నగారే బ్రతికివుంటే నేను కూడదని మందలించివుందును. ఆయన తప్పకుండా నామాట మన్నించి వుండును. కాబట్టి నామాటమీద నాన్నగారికి వుండేగౌరవం నీకు కూడా వుంటే నేను కూడదన్నపని మానివేయడం నీకుకూడా విధి! అన్నయ్యపెళ్ళికి నే నిచ్చిన అయిదువందలూ ఋణంగానేయిచ్చాను. కొంతకాలంవరకూ ఆవుద్దేశంతోటే వుండేవాణ్ణి. కాని క్రమంగా నాన్నగారి అవస్థ బాగా చితికిపోవడంచేత, ఆఋణభావం నేను విడిచిపెట్టుకున్నాను. అందుచేత నాన్నగారివిషయంలో నన్ను నువ్వు విశ్వాసఘాతకుని చెయ్యకు.'

'నాన్నగారు మరణించినప్పుడు- బ్రతికివున్నకొడుకులు తీర్చలేనప్పుడు-ఇహనాఋణం విడిచిపెట్టక మీ రేంచేస్తారు? అదీకాక ఆఋణం విడిచిపెట్టడం నొకగొప్పవిశ్వాసంగా మీ రెన్నడూ భావిం

చవలసిన యవసరం లేదు. ఇదిగో మీసొమ్ము! తీసుకోండి! ఈసొమ్ము తీసుకొని ఇహ మీరు చూపించవలసిన విశ్వాసం వేదో సెల వీయండి!'

అనిపలుకుచు లక్ష్మీకాంతము తనచొక్కాకుఁగల ప్రక్క జేబులోఁ జేయిపెట్టి యారునూఱురూపాయలనోట్లను దీసి రామావ ధానియొడిలోఁ బడవైచి—

'మీరు వడ్డీ లెఖ్ఖ చూడండి! శేషం వుంటే దాఖలు చేస్తాను.'

అని పలుక రామావధాని యానోట్లను జూచి యత్యాశ్చర్య మొంది,

'కాంతం! ఇంతసొమ్ము నీ కెలా వచ్చిఁది?'

'ఈఋణం ఆధారంఁగా చేసుకొని తనవుద్దేశం కనిపెట్టక భ్రమ రంవిషయంలో మీరింత కఠినత్వం వహించినందుకు నాన్నగారు విచారించి మీఋణం మీకు తీర్చివేయవలసిందని స్వర్గలోనుండి నాకు మణియార్డరు చేశారు. ఎలా వస్తే మీకెందుకు?'

'గదిలో బాబుదగ్గిర కూర్చున్నవాణ్ణి కూర్చోనీక, నిన్ను పిల వడం పొరపాటుపనే చేశాను? ఈసొమ్ము భ్రమరం వివాహానికి నే నిచ్చేశాను? తీసుకో.'

'భ్రమరంవివాహానికి మీధనసహాయ్యం మాకవసరం లేదు.

'కాంతం! నువ్వలా కోప్పడితే నేనేం చేస్తాను? నాలుకకోసి సినా నాజన్మలో నే నన్నమాట తప్పను. వెంటాడసంబంధానికి మాట యిచ్చేశాను. అనవసరంగా నామనస్సు చికాకు పెట్టకు.'

ఇంతలోఁ గామేశ్వరమ్మ లోపలినుండి వచ్చి

'ఔనా! ఇదిగో! చూడండీ! విన్నారా? కాంభుక్త పేరమ్మకి బంధువుడే నట? ఆపిల్లకి పెళ్ళిసంబంధం కుదిర్చేసరికి ఆపెళ్ళికొడుక్కి

చచ్చినంత రోగం రావడం ఆచారంవేనట! ఇలా నాలుగైదుసంబంధాలు తప్పిపోయాయట! ఈదిక్కుమాలినసంబంధం మీాకెక్కడ దొరికింది?'

'వీళ్ళు చెప్పేరనీ వాళ్లు చెప్పేరనీ నన్ను చావగొట్టక లోపలికి పో! ఎవళ్లేం చెప్పినా నేను మాట యిచ్చేశాను.'

కామేశ్వరమ్మ లోనికిం బోవక యచ్చటనే నిలిచియుండ లోపలినుండి పేరమ్మ వచ్చి యామెయొద్ద సెలవుపుచ్చుకొని వెడలిపోయెను. లక్ష్మీకాంతము గుమ్మమువఱకు నేగి పేరమ్మతో నేమో మాటాడి పంపివేసి 'అచ్చన్నా! గదిలో మందుసీసా వుంది. తీసుకొని డాక్టరుదగ్గిరికి వెళ్ళి మందు తీసుకొనిరా' అని అచ్చన్నను లోనికి బంపి మఱలం దాను యథాస్థానమునం గూర్చుండెను. లోనికిం బోయిన యచ్చన్న రెండుమూడునిముసములలోం జేతనొక కాగితమును మందుసీసాయుం బట్టుకొని యాచావడిలోనుండి వీధిలోనికి బోయెను. వాలుగుర్చీయందు మేను వాల్చిన రామావధానితన రెండుచేతులతోం దల పట్టుకొని కన్నులు మూసికొని కొంతసేపువఱకు దీర్ఘధ్యానమున మునింగియుండి కన్నులు విచ్చి చూచి, భార్యతో,

'పేరమ్మకి శాంభుక్త యెలాంటిచుట్టం?'

'ఎలాంటిచుట్టమో నే నడగలేదు. శాంభుక్త మొన్న వచ్చాట్ట! మీాతో యెప్పుడు మాటాడేడో యేం మాటాడేడో నాకు తెలియదు.'

'ఇది వట్టిఅబద్ధం! శాంభుక్త రాలేదు. వస్తే నన్ను చూడకుండా వెళ్ళడు.'

'ఏదేనా ఆమెంటాడసంబంధం నా కిష్టంలేదు. కసరండి! కొట్టండి!'

ఆమాటమీాద లక్ష్మీకాంతము రామావధానిని జూచి,

'అత్తయ్యగారి కిష్టంలేదు. మీరుకూడా మొంటాడప్రసంగం విడిచిపెట్టి భ్రమరాన్నిగురిం చాలోచించండి!'

'కాంతం! నా కొక్కడే కొడుకు. ఈవొక్కకొడుక్కీ అపసవ్యమైన వివాహం చెయ్యడం నా కిష్టంలేదు. నన్ను మొహమాట పెట్టకు. ఈసొమ్ము తీసుకో.'

'ఆసొమ్ము నా కవసరం లేదు. ప్రాణత్యాగం చేసుకోకుండా భ్రమరం బ్రతికేవున్నప్పుడు దానిపెళ్ళికి సొమ్ము దొరక్కపోదు. ఈ విషయంలో మీసహాయం నా కవసరం లేదు. నాలుక కోసేసినా అన్నమాట తప్ప లేనన్నారుకదా? భ్రమరంతో అన్నమాట యెలా తప్పిపోతారు?'

'భ్రమరంతో నే నేమి టన్నాను?'

'బావకి నిమ్మళంగా వుండగానే యెంతకష్టపడేనా నీమనస్సుకి నచ్చినవరుణ్ని నీకు కుదురుస్తానని మీ రనలేదూ? భ్రమరానికి నచ్చినవరుడు వసంతం వొక్కడే! అందుచేత అన్నమాట తప్పకుండా ఎంతకష్టపడేనా యీ సంబంధం కుదర్చండి!'

కాంతం! నువ్వు చిన్నప్పుడు నాదగ్గిర సాహిత్యంమాత్రం నేర్చుకున్నావు. కాని యిటీవల నువ్వు తర్కంకూడా చదువుకున్నట్టుంది. నీమాటలకి నేను సమాధానం చెప్పలేకుండా వున్నాను.'

తనకుఁ గట్టెదురుగా వీధివంక విలోకించుచున్న లక్ష్మీకాంత మామమాటలకుఁ బ్రత్యుత్తర మీయక, కుర్చీనుండి తటాలున లేచి

'మామయ్యా! రాజేశ్వరమ్మగారు వచ్చారు.'

'ఏరాజేశ్వరమ్మగారు?'

'యర్రమిల్లి రాజేశ్వరమ్మగారు. లక్ష్మణరావుపంతులుగారిభార్య.

అని పలికినంతనే రామావధాని తటాలున లేచి పెట్టెబండి దిగి వచ్చుచుండిన రాజేశ్వరమ్మను గౌరవించి చావడిలోనికిఁ దీసికొనివచ్చి భార్యచే లోపలినుండి తివాసీ తెప్పించి వేయించి యామెను గూర్చుండఁగోరి తాను లక్ష్మీకాంతముతో నేలనే చాపపైఁ గూర్చుండి—

రామా:-రాజేశ్వరమ్మగారు దయచెయ్యడంవల్ల ఇవాళ బహు సుదినం!'

రాజే:-అవధానిగారిదర్శనం చెయ్యాలని నాలుగైదురోజులనుండీ ప్రయత్నం. ఆభాగ్యం నా కివాళ కలిగింది.'

రామా:-మీరలా సెలవియ్యడం ధర్మం కాదు. మీకుటుంబం జమీందారీకుటుంబం! కాకిచే కబురు పెడితే రావలసిన సేవకుణ్ణి నేను.'

రాజే:-నాయందు మీకలాంటిగౌరవం వుంటే నేను వచ్చినకార్యం జయంచేసి నన్ను సంతోషంగా పంపండి.'

రామా:-తప్పకుండా—మీ సెలవుకి నేనెప్పుడూ బద్ధుణ్ణే సెలవియ్యండి.'

రాజే:-మాకుటుంబంలో అందరికీకూడా భ్రమరం అంటే ప్రాణం. ఆపిల్ల వివాహం గురించి మీతో మాటాడాలని నేను వచ్చాను.'

రామా:-'నాకు చాలసంతోషం! అది తండ్రిలేని పిల్ల! మీలాంటి వారికి దానిమీద అభిమానం వుండడం చాలాగొప్పసంగతి!'

లక్ష్మీ:-ఇంతకాలం ఆలోపం కనబడకపోయినా, ఇవాళమాత్రం మాభ్రమరం తండ్రి లేనిపిల్లయింది.

రాజే:-ఆపిల్లని మీవసంతానికి చేసికొని ఆలోపం మీరే తీర్చాలి. మీఅబ్బాయికూడా చాలా యిష్టపడుతున్నాడు. ఆపిల్లమీద

మెంతయిష్టం లేకపోతే తనప్రాణం తెగించి నూతిలో వురుకు తాడు?'

రామా:-నేనూ కాంతం ఈసంగతే యింతవరకూ మాటాడుకుం టున్నాం. ఈవిషయం నాకేమాత్రం ముందుగా తెలిసివున్నా కొంతేనా ఆలోచించివుందును. ఏసంబంధానికి తీరా మాట యిచ్చేశాను.

కామే:-ఇదుగో! చూడండి! బాబుకి నిమ్మళంగా వున్నదాకా ఆదరిద్ర గొట్టు సంబంధంమాత్రం యెత్తకండి? మీకు పుణ్యం వుంటుంది.

రాజే:-కామేశ్వరమ్మగారూ! మీరుకూడా భ్రమరాన్ని గురించి రామావధానిగారితో గట్టిగా చెప్పండి!

కామే:-ఆమెంటాడసంబంధం వొదిలిపోతే నాకేదేనా యిష్టంవే! ఆపిల్లపేరు చెబితే పెళ్ళికొడుకులు పెడీపెడీ చచ్చిపోతా రట! పేరమ్మ చెప్పింది. అందుకే మాబాబు కింత జబ్బు చేసింది.

రామా:-నీపిచ్చిమాటలు విని రాజేశ్వరమ్మగారు నవ్వుతారు వూరుకో!

రాజే:-రామావధానిగారూ! భ్రమరం గురించి నేను మీతో మనవి చెయ్యవలసింది మీ రొక్కటున్నాది. అదికూడా చెప్పి నేను సెలవు తీసుకుంటాను. అన్నదమ్ములు పేదరికంలో వున్నపిల్లని చేసుకుంటే మీవసంతానికి ముద్దుముచ్చట్లు జరగవనేలోపం మీకవసరం లేదు. భ్రమరం మా యెర్రమిల్లివారిపిల్లేకాని యీవిషయంలో దేశిరాజువారి పిల్ల కాదు. మీరు కోరే ముద్దుముచ్చట్లన్నీ తీర్చే భారం నాది. నాసొంతజవహారీ ఐదు వేలరూపాయలదీ మీయెదుట యిప్పుడే భ్రమరాని

కిచ్చేస్తున్నాను. ఇదికాక మీవసంతానికి వివాహకాలంలో అయిదు వేలరూపాయిల కట్నం యివ్వడానికి మాసుందరమ్మ నిశ్చయించుకుంది.

అని పలుకుచు నంతవఱకు బట్టచాటుగ నుంచిన వెదురుపెట్టె గుడ్డమూటను వెలుపలికిఁ దీసి ప్రక్కనేకూర్చుండిన కామేశ్వరమ్మ చూచుచుండఁగా మూట విప్పి గదిలోపలనున్న భ్రమరమును రప్పించి యాయాభరణములతో నామె నలంకరించెను. ఆభరణ ధారణము పూర్తియైనంతనే పోతపోసిన బంగరుబొమ్మవోలె నిలువున శృంగార మొలుకుచున్న భ్రమరమును జూచి రామావధాని నిశ్చేష్టితుం డయ్యెను. అప్పుడు రాజేశ్వరమ్మ 'రామావధానిగారూ! భ్రమరం నాకోడలనిమీనోటంట సెలవిస్తే విని సంతోషించి సెలవు పుచ్చుకుంటాను 'అని పలికినంతనే యత్యానందమున భ్రమరమును దదేకదృష్టితో వీక్షించుచున్న కామేశ్వరమ్మ తటాలున లేచి, 'రాజేశ్వరమ్మగారూ నేనంటున్నాను భ్రమరం నాకోడలూఅని— మీరు సంశయించకండి ఆడవాళ్లు అణిగివుంటూన్నకొద్దీ మొగవాళ్ళు పెచ్చు పెరిగిపోతారు. నా కిష్టంవైనప్పుడూ మాబాబు కిష్టంవైనప్పుడూ మధ్యఆయనవూ సెందుకు?దిక్కుమాలిన మొంటాడసంబంధం తప్పిపోయి బాబు బతికితే నా కదే పదివేలు.' అని భ్రమరమును జూచి 'భ్రమరం! ఇలారా! బావ ని న్నోమారు చూస్తాడు' అని చేయి పట్టకొని గదిలోనికిఁ దీసికొనిపోయి, మూఁడునాలుగునిముసములలో మఱల భ్రమరముతోడను స్వారాజ్యముతోడను గూడ నాచావడిలోఁ బ్రవేశించెను.

కామే—బా బేవంటున్నాడో విన్నారా? నాన్నగా రిష్టపడ్డారా లేదా యని అడుగుతున్నాడు.

స్వరా—నాన్నగారూ! అమ్మ యెంత చెప్పినా అన్నయ్యకి నమ్మకం లేకుండా వుంది. మీరోమారు వెళ్ళి చెప్పండి.

లక్ష్మి—మామయ్యగారూ! ఇప్పుడేనా నాన్నగారి అప్పగింత సార్థకం చేయించండి. దశమీ లక్ష్మివారం ఇవాళ మంచిరోజు.

స్వరా—అన్నయ్యకి మళ్లా వ్రూష్టం రాకుండానే చెప్పండి నాన్నగారూ.

రాజే—బాబూ! అయిదుగంటలు కావస్తూంది. సెలవు పుచ్చుకుంటాను. ఆముక్క నాచెవిలో పడితే సంతోషంగా సెలవు పుచ్చుకుంటాను.

రామా—(ఒక్కనిట్టూర్పు విడిచి) రాజేశ్వరమ్మగారూ! ఒక్కక్షణంలో మూఢభ్రమరాన్ని కాలచక్రం జమీందార్లపిల్లని చేసింది. ఇది నాకు చాలాసంతోషం! వొఖరెండురోజులు మాత్రం నాకు సై మిప్పిస్తే వోమారు మొంటాడ వెళ్లి కాంభుక్తతో మాటాడి వచ్చి మీకు మాట యిస్తాను.

అని రామావధాని పలుకుటయే తడవుగ

"కాంభుక్తతో మీరు మాటాడ నవసరంలేదు. మీవసంతానికి పుబ్బసరోగం వున్నట్టు తెలిసిందిట. అందుచేత మీసంబంధం చేసుకోరట." అని ఖద్దరుధారుండైన యొకపురుషుండు గుమ్మంలో దనకుం దపాలవాండిచ్చిన పోస్టుకార్డు చదివి పలుకుచు నాచావడిలోం బ్రవేశించి రామావధాని కాయుత్తర మిచ్చెను. ఆయుత్తర మందుకొనుచు రామావధానియుం దక్కినవారును నానూతనవ్యక్తిని వింతగాం జూచుచుండ స్వరాజ్యము తన చెవిలోం జెప్పిన రహస్యవచనము వలనం గామేశ్వరమ్మ మహానందభరితయై కెవ్వునం గేక వేసి 'ఏంవిటరా చూస్తారు? మనసోమశేఖరం వచ్చాడు. సోంవశేఖరం' అని బిగ్గరగాం బలికినంతనే రామావధాని సోమశేఖరుని జూచి యత్యాశ్చర్యముతో ముక్కుపై వ్రేలిడుకొని—

'ఏఁవిటీ? సోమశేఖరఁవా?'

'ఔను మాఁవయ్యా!'

'పోల్చేలేక పోయానోయ్! నీవేషఁవంతా యేఁవైంది! ఈఖద్ద రెప్పటినుంచీ'

'రాజ్యఁ మీఁద బుద్ధి పుట్టినప్పటినుంచీ,'

అల్లుడు వచ్చిన యానందాతిశయమున మైమఱచి వెఱ్ఱివాని వలెనే తోఁచుచుండిన కామేశ్వరమ్మ, అల్లుడుమామల సంభాషణ మును మఱి సాగనీయక 'మీఁరు తర్వాత మాటాడుకుందురుగాని మొట్టమొదట బాబుకంట పడనీయండి' అని అల్లుడు చేయిపట్టుకొని గద్గదస్వరముతో, 'దావోయ్ బాబూ! ఎన్నాళ్ళకి కళ్ళబడ్డావు. అంచరికళ్ళా కాయలు కాచిపోయాయి' అని ప్రక్కకు జూచి, రాజ్యం దా! నువ్వుకూడా దా' అంటూ యిద్దరినీ వెంటనిడుకొని వసంతునికడకుఁ బోయెను. అప్పుడు రాజేశ్వరమ్మ రామావధానిని జూచి,

రాజే—'బాబూ! మరి నాకు సెల విప్పిస్తారా'

రామా—(ఉత్తరము చూచి) రాజేశ్వరమ్మగారూ! మీసంకల్పం మాగొప్పసంకల్పం! మావసంతానికి వబ్బసరోగం వుందని యెవరో చెప్పారట! శాంభుక్త మాసంబంధం చేసుకోడట! అందుచేత మరి సంశయం యెందుకు? మీసెలవుప్రకారం భ్రమరం నాకోడలే.'

## 31 వ ప్రకరణము.

## స మా ప్తి.

కాలము ప్రవాహము వంటిది. దాని వీచికలు పలువిధంబులుగా చక్రంబురీతిని దిరుగుచుండును. ఆకాలవాహినిలో కొందరు సంతోషసాగరమున తెప్పున తేలియాడుచుందురు. మఱికొందరు దుఃఖసాగరమున జొచ్చికొనిపోతారు. అందుకనే కాలచక్రము జీవుల నన్నింటిని తనయిరుసులలో సునాయాసంగా పట్టి త్రిప్పి వేస్తుంది. కాలప్రకృతి సదా యిట్లేయుండుట సహజము.

ఆదిలో తండ్రి పెసరట్లమ్ముకొని యార్జించిన డబ్బుతో కొన్ని గ్రామాలకు ప్రొప్రయిటరయిన గంగాధర రామారావు బహద్దరు కాలవశంచేతనే కానిపోకళ్ళకుపోయి అప్పులపాలై సర్వము పోగొట్టుకొని మఱల పూర్వస్థితికి వచ్చి గంగాధరము అనిపించుకుంటూ తిండికి కూడా మొహం వాచవలసినవా డయ్యాడు.

ఒకనాడు కడుపునిండా ఒకపూటకైనా తిండిలేక నిరుద్యోగిగా జీవితమును నెఱపినను దయార్ద్రహృదయుడు, విశాలసుహృద్భావముతో నిండిన నిర్మలచిత్తుడునైన లక్ష్మీకాంతము కాలము యొక్క మహిమచేతనే తన్ను మనసార ప్రేమించిన అనాఘ్రాతకుసుమమువంటి వితంతువైన సుందరమ్మను దేశకాలపరిస్థితుల ననుసరించి. రాజేశ్వరమ్మగారియనుమతితో పెండ్లాడి లక్షలాదిగ గణింపబడు భాగ్యసంపద కధినాధు డయ్యాడు.

ఈకాలప్రవాహము సుడిగుండములోనే దుష్టహృదయుడైన లక్ష్మీపతి తనఅన్నగారియొక్క ఆస్తికంతకు అధికారి కాదగినవా

యైనా ఆడువాండ్రైన రాజేశ్వరమ్మ సుందరమ్మలపై కుట్రచేసి ప్రొప్రయిటరుతో చేతులు మూతులు కలిపి దురాలోచనచేసి ఆస్తి నంతా ఆపోశనం పట్ట సంకల్పించుకొని, చేయవలసిన దురాగతము లన్నీ చేసి వానిని బయటపెట్టిన లక్ష్మీకాంతానికి ఉద్యోగమును ఊడ గొట్టి, వోట్ల ప్రచారంలో ఖద్దరుప్రచారకుని కొట్టికారాగారబద్ధుడై గండ్ల పాలయ్యాడు.

నవనాగరికపిశాచావేశుడై విద్యాభిలాషతో మహానగర నివాసియై, స్త్రీలోలతకు దాసుడై తన్ను గారాబంగా పెంచిన తలి దండ్రులను, పిల్లనిచ్చిన అత్తమామలను అలోలకుణాయని యేడిపించి కట్టుకున్నభార్యను కన్నెత్తిచూడక తెలిసినంతవఱకు దుర్మార్గు డని పించుకొని తుదకు కాలవశుడై మనస్సు పరిణామమొంది దేశాభి మానము ప్రేరేప ఖద్దరునమ్మువు స్వచ్ఛందసేవకుడై ఖద్దరుప్రచా రము సేయుచు వోట్లప్రచారంలో గాయము తగిలి ప్రచ్ఛన్నంగా భార్యయొక్క సేవలనంది క్రమంగా బుద్ధితిరిగిన సోమశేఖరం తన యర్ధాంగియై తనకై యటమటించి పోవుచున్న స్వరాజ్యాన్ని తిరిగి కలుసుకొని యానందజీవితమును నెఱపుచున్నాడు.

విద్యావంతుడు, గుణవంతుడు పితృవాక్యపరిపాలనాదక్షుడు నైన వసంతము శాఖాభేదమును త్యజించి తన్ను మనస్ఫూర్తిగా ప్రేమించి, తనహృదయపీఠముపై నధివసించిన నిరుపేదరాలగు భ్రమరమును, తలిదండ్రుల నంగీకరింపజేసి వివాహమాడుటయు కాలముయొక్క పరిణామవ్యవస్థయే.

రాజేశ్వరమ్మగారు వధువైన భ్రమరాంబపట్టున దయాల వాలయై ఆమెను భాగ్యోపేతగా చేసి భ్రమరాంబావసంతముల వివాహము మహావైభవముగా జరిగించుట. శాఖాంతరవివాహము

లలో ప్రతికూలాభిప్రాయముగల రామావధానికూడ కాలపరిణామానికి తలయొగ్గి భ్రమరాంబసుగుణసంపత్తికి వశుడై శాఖాంతరవివాహానికడ్డు చెప్పలేక భ్రమరం నాకోడలే యని నొక్కివక్కాణించడంకూడ కాలముయొక్క పరిణామమహిమయే.

చదువరులారా!

భ్రమరాంబావసంతరావులయొక్కయు, సుందరమ్మ, లక్ష్మీకాంతరావులయొక్కయు వివాహము లెట్టివైభవోపేతముగా జరిగినవో, ప్రపంచంలో సుహృదయులకు, దుష్టహృదయులకు భగవాను డెట్టిస్థానములను కల్పిస్తాడో, ఊహించుకొని సంతోషసాగరంలో ఈదవలసిందని మనవి చేస్తూ విరమిస్తున్నాను.



బాక్సు ప్రెస్ : ఇన్నీసుపేట : రాజమండ్రి,